## ఈ సంపుటంలో

# జి.వి. కృష్ణరావు రచనలు

ఒకటో సంపుటం : సాహిత్య విమర్శ (కావ్యజగత్తు, ఇతర వ్యాసాలు)

రెండో సంపుటం : Studies in Kalapurnodayam

మూడో సంపుటం : నవల : పాపికొండలు

నాలుగో సంపుటం : నవలలు : కీలుబొమ్మలు, జఘనసుందరి, రాగరేఖలు,

ఐదో సంపుటం : నాటికలు – నాటకాలు
(ఆదర్శ శిఖరాలు, ప్రతిమ, బొమ్మ ఏడ్చింది.)

ఆరో సంపుటం : పద్యాలు, కథలు, ఇతరాలు

ఏడో సంపుటం : తాత్త్వికం – విగ్రహ వ్యావర్తని, ప్లేటో, కాంట్ ఇతర తాత్త్విక వ్యాసాలు

# వరూథిని

జి.వి. కృష్ణరావు

సంపాదకుడు

అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

A GIFT FROM A DAUGHTER
IN MEMORY OF HER FATHER, THE WRITER

ప్రభాస పబ్లికేషన్స్
బోస్‌రోడ్ - తెనాలి

పద్యాలు
కథలు
ఇతరాలు



పునర్ముద్రణ : జనవరి, 1999

వెల : రూ. 75/-

ప్రతులకు : పల్లవి పబ్లికేషన్స్
దుర్గయ్య వీధి, గవర్నరుపేట,
విజయవాడ - 500 002.

గ్రాఫిక్స్ - ప్రింటర్స్ : కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్,
ఆర్.టి.సి. క్రాస్‌రోడ్స్, ముషీరాబాద్,
హైదరాబాద్ - 500 020.

# సంపాదకుని మాట

ఒక రచయిత తన రచనల ద్వారానే ఎల్లకాలం సజీవంగా జనాళిలో ఉండగలడు. అదెప్పుడు? ఆయన రచనలో గ్రంథరూపంలోనో, మరో రూపంలోనో అందుబాటులో ఉన్నప్పుడే. కాని దురదృష్టవశాత్తు కృష్ణరావుగారి రచనలు చాలా కాలంగా లభ్యంకావడం లేదు. ఆయన సాహిత్యం మీద పరిశోధనలు చేసే వారంతా, నేను ఆయనకు సన్నిహిత మిత్రుణ్ణి కావడంతో, నన్ను కలిసి, ఆయనను గురించి, వారి గ్రంథాలు లభ్యమయ్యే విధం గురించి అడుగుతూ ఉంటారు. గ్రంథాలు లేక పోవడంతో నేనూ వారికి ఏమి చేయలేని వాడినయ్యాను.

కృష్ణరావుగారి కొమరితలిద్దరూ - ఉమాదేవి, శోభాదేవి - ఎప్పుడు అమెరికానుంచి తెనాలి వచ్చినా, వారిదగ్గర వారి తండ్రిగారి గ్రంథాల ప్రచురణ గురించి ఈ అవసరంతో ప్రస్తావిస్తూ ఉండేవాణ్ణి. వారు ఎప్పుడూ సుముఖతనే వ్యక్తం చేశారు. కాని అది కార్యం రూపం అవుధ్య జనవరి **1998**న వారు తెనాలి వచ్చినప్పుడు, వాల్చింది. ప్రచురణ బాధ్యతలు నేను స్వీకరిస్తానంటే వారు 'సరే' అన్నారు. నేను దానికి, కృష్ణరావుగారిమీద నాకున్న ఎనలేని గౌరవాభిమానాలను పురస్కరించుకొని, వెంటనే అంగీకరించాను.

ఈ కార్యంలో నేను చాలా మందికి కృతజ్ఞతలు చెప్పుకోవలసి ఉంది.

తొలుదొల్తగా, తమ అమూల్యమైన సలహాలిచ్చి, జి.వి.కె.ని స్థూలంగా పరిచయంచేసే వ్యాసాన్ని వ్రాసి ఇచ్చిన హితశ్రీ గారికి, కృష్ణరావుగారి గ్రంథాలనూ, వ్యాసాలనూ, అందించిన విజయవాడ సిద్ధార్థ సైన్స్ అండ ఆర్ట్స్ కాలేజి సిద్ధార్థ కళాపీఠం సంచాలకులు నాగళ్ళ గురుప్రసాద రావుగారికి, అలాగే డి.టి.పి. ప్రింటింగ్, ప్రూఫ్ రీడింగ్ విషయాలలో అడుగడుగునా నాకు కుడిభుజమై నిలిచిన సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్న ప్రముఖ సాహితీ విమర్శకులు బి. తిరుపతిరావుగారికి, జి.వి. కృష్ణరావుపై పరిశోధన చేసి. పిహెచ్.డి. పొందిన, తెలుగు అకాడమీ లో పనిచేస్తున్న, మాణిక్య లక్ష్మిగారు కృష్ణరావు గారి వివిధ రచనల కాలాలను తెలియ జేశారు - వారికి, గ్రంధాకృతిని గురించి సలహాలు ఇచ్చిన డా. పి.వి. రమణ గారికి, గ్రంథ సేకరణలో అత్యంతంగా సహాయసహకారాలందించిన డా. వెలగా వెంకటప్పయ్య గారికి, అందంగా ముద్రించి ఇచ్చిన కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్ హైదరాబాద్ వారికి నేను హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

- సంపాదకుడు

# ప్రకాశకుల మాట

మా నాన్నగారు జీవించి ఉన్నప్పుడే ఆయన రచనలకు మలికూర్పు రాక పోవడం వల్ల అవి దొరకడం దుర్లభంగా ఉండేది. ఆయనమీద పరిశోధనలు సాగించేవారు గ్రంథాలు దొరకక చాల ఇబ్బందులకు గురయ్యారు. ఏ హితశ్రీగారో, రెడ్డిగారో తమ వద్ద ఉన్న మానాన్నగారి రచనలను వారికి ఇచ్చి వారి అవసరాలు తీర్చేవారు ఆవిధంగా వారి దగ్గర కూడా గ్రంథాలు లేకుండా పోయాయి.

తరువాత మానాన్నగారు గతించి నప్పటినుంచి, ఆయన రచనలన్నీ ఒకమారు అచ్చొత్తించాలని రెడ్డిగారు మాకు సూచిస్తూనే ఉన్నారు. మాకూ అదే తలంపు ఉంది. చూస్తుండగానే చాలకాలం గడిచింది.

1998 జనవరిలో మేము భారతదేశానికి వచ్చినప్పుడు శ్రీఅన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి గారు మళ్ళీ ఆప్రస్తావన తీసుకొచ్చారు. మేము 'సరే' అన్నాం. రెడ్డిగారిని అచ్చుపని చూడవలసిందిగా అభ్యర్థించాం. వారికి మానాన్నగారితో ఉన్న స్నేహ సంబంధాలను పురస్కరించుకొని, సంతోషంతో 'సరే' అన్నారు. ఎంతో శ్రమించి, ఎక్కడెక్కడో వెతికి, దొరకని రచనలను దొరికించుకొని, ఏడు సంపుటాలలో ముద్రణా నిర్వహణను విజయవంతంగా నిర్వహించినందుకు వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

అలాగే ఈ గ్రంథాలు వెలికి రావడంలో చేయూతనిచ్చిన వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

జి. ఉమాదేవి.
జి. శోభాదేవి.

# జీవితం, రచనలు

- హితశ్రీ

ఒక రచయితను అంచనా వేయడానికి, అతడు నిశ్వసించింది ఉచ్ఛ్వసించింది ఏమిటో తెలియాలి అతడు నిశ్వసించింది - అతడు చదివిన చదువు, పొందిన శిక్షణ. అతడు ఉచ్ఛ్వసించింది అతడు కావించిన సృష్టి, రాసిన రాతలు

ఆయన ఎంతో చదివారు చదవక రాయడం కుదిరేపనికాదు. ప్రాక్పశ్చిమ రససిద్ధాంతాలను, సాహిత్యాన్ని, దర్శనాలను లోతుగా చదివారు

ప్రాక్పశ్చిమ రస సిద్ధాంతాలను ఆస్వాదించారు అంటే అటు అరిస్టటిల్ కావ్యానుశాసనం, ప్లేటో రామణీయకతనుంచి కాంట్ పరతత్వవాదం వరకు, ఇటు భరతుని నాట్య శాస్త్రంతో మొదలెట్టి భామహ, ఉద్భట, బట్టనాయక, భట్టలోల్లట, ఆనందవర్ధన, ఇందు రాజ, అభినవగుప్త, క్షేమేంద్ర, మహిమభట్ట, మమ్మటుల దాకా భారతీయ రస సిద్ధాంతాలను ఔపోశన పట్టారు

అర్ధరాహిత్య రంగస్థలిని (Theatre of the Absurd) అర్థం చేసుకొన్నారు. ''సప్తభంగుల అస్పష్టత'' (Seven Types of Ambignity) లోని స్పష్టతను ఎరిగారు. పాక్పశ్చిమ దర్శనాలను మథించారు. ఆర్య నాగార్జున నిసాపేక్ష వాదంలో జెనో "Flying arrow is at rest" (ఎగురుతున్న బాణం నిశ్చల స్థితిలో ఉంది) ను చూశారు.

మార్క్స్ గతి తర్కం గతిని పరిశీలించి యన్ యమ్ రాయ్ మానవత్వాన్ని (Human-ness) గుర్తించారు.

మార్క్స్, హెగెల్‌ల వ్యవస్థలలో (దర్శనాలలో) వ్యక్తిలుప్తమైనాడని, సార్త్ర్ అస్తిత్వంలోని మనిషి అస్తిత్వ వేదనను పట్టుకొన్నారు. ఫ్రాయిడ్ స్వప్న శిల్పాన్ని భారతీయ ధ్వని సిద్ధాంతంతో ముడిపెట్టారు. ప్రవర్తన వాదాన్ని, గెస్టాల్ట్ సిద్ధాంతాన్ని సాహిత్యానికి అన్వయించారు.

ఇదీ క్లుప్తంగా ఆయన విస్తృత కాన్వాస్. దీని మీద ఆయన ఉలితో ఉల్లేఖించారు

సాహితీ మేరువు డాక్టర్ జీ.వి. కృష్ణరావు పూర్తిపేరు గవిని వెంకటకృష్ణరావు వారి స్వస్థలం తెనాలి తాలూకా కూచిపూడి గ్రామం. నివాసస్థలం తెనాలి. వారు కూచిపూడిలో 1914లో జన్మించారు వ్యవసాయ కుటుంబం తురుమెళ్ళ, కొల్లూరు హైస్కూళ్ళలో పాఠశాల విద్య అభ్యసించారు యస్. యస్ ఎల్. సి నాటికే ఒక చిన్న నవల, ఒక శతకం రచించారు. గుంటూరు. ఏ సి. కాలేజిలో బి. ఏ వరకు చదివారు. కాలేజిలో చదివేరోజుల్లోనే ''వరూధిని''

ఖండకావ్యం రచించారు 1937లో బి. ఏ డిగ్రీ పొందారు గుంటూరులో పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారి దగ్గర సంస్కృతం చదువుకొన్నారు

తెనాలి ఆ రోజుల్లో ఒకసాహితీకేంద్రం చక్రపాణి, కొడవటిగంటి కుటుంబరావు, త్రిపురనేని గోపీచంద్ మొదలైన రచయితలెందరో తెనాలిలో ఉండేవారు వారితో కృష్ణరావుకి పరిచయం ఏర్పడింది సాహిత్యచర్చలు జరుగుతుండేవి గోపీచంద్ సాంగత్యం వల్ల కృష్ణరావుకి పాశ్చాత్య సాహిత్యాభిలాష, ఎం. ఎన్. రాయ్ రచనలపట్ల ఆకర్షణ, మార్క్సిస్ట్ దృక్పథం అలవడ్డాయి కొన్నికథలు, నాటికలు రాశారు.

డిగ్రీ అందిన తరువాత కృష్ణరావుకి నిరుద్యోగం ఎదురైంది. నిరాశా నిస్పృహల అనుభవాలతో ''భిక్షాపాత్ర'' నాటిక రాశారు. ఇతివృత్తం కాశీనుంచి వ్యాస నిష్కాసనం మార్క్సిస్టు దృక్పథంతో రాసిన ఈ నాటిక పదహారు భారతీయ భాషల్లోకి అనువదింపబడి ఆకాశవాణి నుంచి ప్రసారితమైంది. నిరుద్యోగంతో విసుగెత్తి కృష్ణరావు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఎం ఏ. ఇంగ్లీషు లిటరేచర్‌లో చేరారు ఆంగ్ల సాహిత్యాధ్యయనంలో మునిగి తేలారు ఎం ఏ చదువుతున్న రోజుల్లోనే ''కావ్య జగత్తు'' సాహిత్య విమర్శనా గ్రంథం రచించారు దేశ కాల పరిస్థితుల్ని అనుసరించి కావ్యాల్లో వస్తువు రూపం ఎలా మార్పు చెందుతుందో ఇందులో మార్క్సిస్టు దృక్పథంతో వివరించారు. ఇది చాలా ప్రసిద్ధమై విశ్వవిద్యాలయాల్లో పాఠ్యపుస్తకమైంది. పరిస్థితులు అనుకూలించక కృష్ణరావు ఎం. ఏ. పరీక్షలు రాయకుండానే 1941లో తిరిగి వచ్చారు.

కాశీ నుంచి తిరిగి వచ్చింతరువాత కృష్ణరావు జర్నలిజంలోకి అడుగు పెట్టారు కొంతకాలం మిత్రులతో కలిసి ఓప్రెస్, ఓ ఫర్నీచర్ షాపు నడిపారు. అవేవీ విజయవంతం కాలేదు. ఇంతలో ''ఆంధ్రప్రభ''లో సబ్ ఎడిటర్ పదవి లభించింది నార్ల, శ్రీశ్రీలతో పాటు '' ఆంధ్ర ప్రభ'' సంపాదక వర్గంలో పనిచేశారు. ఆ కాలంలో ''జఘనసుందరి'' నవల రాశారు ఇది ఫ్రాయిడ్ సిద్ధాంతాల్ని తార్కికంగా బేరీజు వేసే ప్రసిద్ధ నవల ఆ తరవాత సంపాదకవర్గ నిర్ణయానుసారం కృష్ణరావు ''ఆంధ్రప్రభ'' నుండి వైదొలగారు. దేశాభిమాని, విజయప్రభ పత్రికల్లో కొంత కాలం పని చేసి విరమించుకొన్నారు.

పత్రికారంగానికి ఉద్వాసన పలికి కృష్ణరావు పిహెచ్.డి. డిగ్రీ కోసం మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధనకు పూనుకొన్నారు పింగళి సూరన ''కళాపూర్ణోదయం'' వారి దృష్టిని ఆకట్టుకొంది "Studies in Kalapoornodayam" అనే ఆంగ్ల గ్రంథాన్ని డాక్టరేట్ కోసం రాయాలని సంకల్పించి ఆ పరిశోధనలో నిమగ్నులయ్యారు ఈలోగా వారికి వ్యక్తి స్వాతంత్ర్యం మీద జిజ్ఞాస కలిగి తత్వ శాస్త్ర గ్రంథాల్ని తిరిగేశారు. జేగంటలు-కాంట్ పరతత్వవాదం, ప్లేటో-ప్రచురించారు. తాత్విక చింతన స్వతంత్ర విచారానికి దారి తీసింది.

తత్ఫలితమే 1951లో ''కీలుబొమ్మలు'' నవలా రచన ఇది కృష్ణరావుకి ఎంతో పేరు తెచ్చిపెట్టిన విఖ్యాత నవల ఇటీవల ఇది ఆంగ్లంలోకి అనువదించబడి మాక్మిలన్ కంపెనీచే ప్రచురింపబడింది. వ్యక్తిలో కర్తవ్య జిజ్ఞాసని రేకెత్తించటమే ఈ నవల లక్ష్యం.

అప్పుడప్పుడు రాసిన నాటికల్ని గుదిగుచ్చి ''ఆదర్శ శిఖరాలు'' నాటికల సంపుటి ప్రచురించారు ఇది విలువల కాణాచి

మద్రాసు విశ్వవిద్యాలయం "Studies in Kalapurnodayam" ఆంగ్ల వ్యాసానికి కృష్ణరావుకి 1955లో పిహెచ్. డి డిగ్రీ ప్రధానం చేసింది. ''కళాపూర్ణోదయం''లో కళ ఎలా పూర్ణోదయం చెందిందో ఈ గ్రంధంలో కృష్ణరావు పింగళి సూరనని ప్రపంచ కవుల సరసన నిలబెట్టారు 1952లో కృష్ణరావు తెనాలిలో వి.యస్.ఆర్ కాలేజిలో అధ్యాపకునిగా చేరారు. ఈ రోజుల్లో మాధ్యమిక వాదంలో కుతూహలం కలిగి ఆర్యనాగార్జునుని గ్రంధాలను కొన్నిటిని పద్యాలుగా అనువదించారు. అవి పోయాయి. ''విగ్రహవ్యావర్తని'' నిమాత్రం తిరిగి అనువదించి విపుల భూమికతో ప్రచురించారు కేంద్ర సాహిత్య అకాడమీ తరుపున ప్లేటో 'రిపబ్లిక్' గ్రంధాన్ని ''ఆదర్శరాజ్యం'' పేరుతో తెలుగు చేశారు. ''రాగరేఖలు'' నవలరాశారు.

1962లో పరిస్థితులతో రాజీపడలేక కాలేజి ఉద్యోగానికి తిలోదకమిచ్చారు మళ్ళీ నిరుద్యోగం ఈ సమయంలో ''పాపికొండలు'' నవల ప్రారంభించారు. అది దిన పత్రికలో సీరియల్‌గా వచ్చింది. అధికారం మనుషుల్ని ఎలా మత్తుల్ని చేస్తుందో వివరించటం ఈ నవల ఇతివృత్తం ఇందులో కృష్ణరావు తన ఆలోచనా రీతులను వ్యంగ్య వైభవంతో నిక్షేపించారు. ఇది ఒక రసగంగ. స్వల్ప కాలం పొన్నూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపల్‌గా పనిచేసి, కృష్ణరావు 1963లో ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంలో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసర్‌గా పదవి నధిష్టించారు ఈసారి మాత్రం 1973లో పదవీ విరమణచేసేవరకు ఉద్యోగంలో కొనసాగారు. రేడియో ఉద్యోగంలో ఉన్ననాడే భాస మహాకవి సంస్కృత నాటకం ప్రతిమ నాటకాన్ని తెలుగు చేశారు కొన్ని కవితలు, కథలు, సాహిత్య వ్యాసాలు చేర్చి ''ఉద బిందువులు'' సంపుటి ప్రచురించారు

రేడియో ఉద్యోగంతో కుంటుపడిన ''పాపికొండలు'' రచన కృష్ణరావు అనారోగ్య కారణాలవల్ల అర్ధంతరంగా ఆగిపోయింది. ఇది తెలుగువారి దురదృష్టం. 1979లో ''బొమ్మ ఏడ్చింది'' నాటకం వెలువడింది. ఇది ఆర్యనాగార్జునునికీ, అప్పటి పాలకుడు గౌతమీ పుత్ర శాతకర్ణి, అతని తల్లి గౌతమీ బాలశ్రీకి సంబంధించిన ఇతివృత్తంతో రాసిన నాటకం . రాజ్యపాలకులు మత నిరపేక్షంగా రాజ్యం చేయాలని ఇందులో సందేశం.

తెనాలిలోని శ్రీ అరవింద సాహిత్య సేవా సమితి ఆధ్వర్యంలో డాక్టర్ జి వి కృష్ణరావుకి తెనాలిలో మార్చి 30, 1979 తేదీన అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారి అధ్యక్షతన ఘన సన్మానం కన్నుల పండుపగా జరిగింది తరవాత వారు ఎక్కువ కాలం జీవించలేదు కృష్ణరావు ఆగష్టు 23, 1979 తేదీన తుది శ్వాస విడిచారు

## రచనల వైశిష్ట్యం

కృష్ణరావు సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషల్లో విద్వాంసులు ఆయా భాషా సాహిత్యాల్లో నిష్ణాతులు వ్యాకరణ సూత్రాల్ని, అలంకార శాస్త్రాన్ని లోతుగా తరచి ఆకళింపు చేసుకొన్నవారు. ప్రాచ్య పాశ్చాత్య తత్వ శాస్త్రాల్ని మధించిన వారు. సామాజిక, రాజకీయనైతిక, మనోవైజ్ఞానిక శాస్త్రాల్ని అవలోడించిన వారు. ప్రాక్ పశ్చిమ దేశాల విభిన్న సంస్కృతుల్ని అవగాహన చేసుకొన్నవారు అనన్య ప్రతిభావ్యుత్పత్తులతో, బహుముఖ పరిజ్ఞానంతో, సునిశిత ఆలోచనలతో కృష్ణరావు ఉత్తమ కవితల్ని, నాటక నాటికల్నీ, కథల్నీ, నవలల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్నీ రచించి తమ సాహితీ చైత్ర రథాన్ని 1963 శోభాయమానం చేశారు. ఆ పూదోట సర్వాంగ సుందరం, పరిమళభరితం.

కృష్ణరావు జీవితాన్ని, రచనల్ని పరిశీలిస్తే వారి జీవితంలో, రచనల్లో అంతర్వాహినిగా భారతీయత ప్రవహించటం గోచరిస్తుంది ఎర్రగా, సన్నగా, పొడుగ్గా. గరుడనాసికతో, తీక్షణమయిన కనుదోయితో ఎప్పుడూ తెల్లని లాల్చీ, గ్లాస్కో ధోవతి ధరించి అచ్చం భారతీయుడుగా, ఆంధ్రుడుగా కృష్ణరావు కనపడేవారు. వివిధ సంస్కృతుల్ని పరిశీలించి వారు చివరకి భారతీయ సంస్కృతి వైపే మొగ్గు చూపారు. ఆంగ్లంతో పాటు సంస్కృతాంధ్రాలను చక్కగా చదువుకొన్నారు. ప్రాచీన సంస్కృతాంధ్ర కవుల రచనల్ని సమీకరించారు మన సామాన్య ప్రజానీకం విలువలన్ని రామాయణ భారతాల నుంచి వారసత్వంగా వచ్చినవేనని అభిభాషించారు. అలంకార శాస్త్రంలో భారతీయ ధ్వని సిద్ధాంతమే పరమ శిరోధార్యంగా భావించారు. వారినాటికల్లో అనేకం భారతీయ సాంస్కృతిక ఇతివృత్తంలో కలవే. నాగార్జున మాధ్యమిక వాదాన్ని అభిమానించారు. భాస ప్రతిమ నాటకాన్ని అనువదించారు కళాపూర్ణోదయం మీద థీసిస్ రాశారు. సృజనాత్మకరచన సద్యః పర నిర్వృతి నివ్వాలని భారతీయ లాక్షణికులతో ఏకీభవించారు అయితే భారతీయమంతా ఆమోదయోగ్యమని కృష్ణరావు భావించేవాడు. ఏ విషయాన్నయినా కార్యకారణాలతో తర్కించి నిగ్గు తేల్చే హేతువాది కృష్ణరావు తన పరీక్షకి నిలబడిన వాటినే స్వీకరించారు. మొదట మార్క్సిస్టు ప్రభావానికి లోనయ్యారు. త్వరలోనే ఆ ప్రభావంనుంచి బయట పడ్డారు. ''డమడమాలబండి'' నాటిక వారి కనువిప్పుకి రూపకల్పన. వ్యష్టిలో సమిష్టినీ, సమిష్టిలో వ్యష్టిని గుర్తించినప్పుడే ఏ రాజకీయ

వ్యవస్థ అయినా అభ్యుదయం సాధిస్తుందని కృష్ణరావు భావించారు లేకపోతే అది వట్టి నినాదాల డమడమాలబండే. అలాగే ''కార్యజగత్తు''లోని మార్క్సిస్టు దృష్టిమారి వారి సాహిత్య విమర్శనా ప్రతిభ కళాపూర్ణోదయ సిద్ధాంత గ్రంథంలో వెల్లి విరుస్తుంది.

కృష్ణరావు ఆదర్శం ధర్మం ఆశయం వ్యక్తి స్వాతంత్ర్యం. ''ధర్మం'' ధర్మం కోసమే, ఆధర్మమే మానవ జీవితం అంటారు కృష్ణరావు ''కీలుబొమ్మలు'' నవలలో ధర్మానుష్ఠానంలోనే ఆనందం ఉన్నదనుకొని చేసినప్పుడే వ్యక్తికీ, తద్వారా సమాజానికీ అభ్యుదయం సిద్ధిస్తుందని కృష్ణరావు విశ్వాసం. వ్యక్తులకి స్వతంత్ర విచారం ఉండాలి. వ్యక్తికి అంతఃకరణం ఉంటుంది అది వివేక చోదితం పరిస్థితులు చుట్టు ముట్టినప్పుడు ప్రతి వ్యక్తీ స్వతంత్రాలోచనతో తన అంతఃకరణం సాక్షిగా ప్రవర్తించి తన ధర్మాన్ని తాను నిర్వర్తించాలి. లేనినాడు అధర్మం ప్రవర్తిల్లి సమాజం సంక్షోభం చెందుతుంది. ఇదే ''కీలుబొమ్మలు'' నవల సందేశం. అంతేకాని వ్యక్తులు పరిస్థితుల కీలుబొమ్మలని కాదు. వ్యక్తి ధర్మం లుప్తమైతేనే దేశం శష్టమవుతుంది. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఉద్దీప్తం చేయటం రచయిత బాధ్యత అని కృష్ణరావు తలచారు. ఈ వ్యక్తి స్వాతంత్ర్య చేతనే ''పాపికొండలు'' నవలలో మరింత స్పష్టమవుతుంది. ఇందులోని కొన్ని పాత్రలు పరిస్థితులకు ఎదురునిలచి తాము నమ్మిన ధర్మాన్ని అనుసరించి తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొంటాయి ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో ఆర్య నాగుర్జునల పాత్ర అలాంటిదే.

కృష్ణరావు దృష్టిలో జీవితం, కళా వేరువేరు కావు అవి రెండూ ఒకటే. జీవిత ప్రవాహానికి ఆద్యంతాలు లేవు అది అనంతం. దాన్ని అర్థం చేసుకోటానికి ఉపకరించే ఆద్యంత సహిత జీవిత శకలమే కళ – అంటారు వారు.

కళాత్మకమైన రచన జీవితపు విలువల్ని నిర్దేశించి వెలుగునివ్వాలని కృష్ణరావు తాత్పర్యం విలువ అంటే ఏ వస్తువులో నయినా మన మెప్పుకి పాత్రమైన గుణం జీవితపు విలువలనేకం. వాటిని ఆర్ధిక, నైతిక, సామాజిక, తాత్విక విలువలుగా వర్గీకరించవచ్చు విలువలకి ఆధిక్యతా క్రమం ఉంటుంది తాత్విక విలువలు పై విలువలైతే ఆర్ధిక విలువలు కిందివి. సామాజిక నైతిక విలువలది మధ్యస్థానం భారతీయ సంస్కృతి తాత్విక విలువల్ని జీవిత ధ్యేయాలుగా ఆదరించి జీవితావశ్యకాలైన ఆర్ధిక విలువల్ని విస్మరించింది. ఇది దారిద్ర్యానికి దారితీసిందనే అభియోగం ఉంది ఇది కృష్ణరావుని కలవరపెట్టింది డిగ్రీ పుచ్చుకొన్నతరువాత నిరుద్యోగం కర్కశ నిజమై చికాకు పరచింది వ్యాసుడు గుండెల్లోంచి పైకి వచ్చి శాపజలం అందుకొన్న దృశ్యం తళుక్కుమంది ''భిక్షాపాత్ర'' నాటిక ఆవిర్భవించింది అది ఆకలి పోలికేక మార్క్సిస్టు దృక్పథంతో ఆర్ధిక విలువల్ని హైలైట్ చేసిన రచన కృష్ణరావు నిజ జీవితంలో విలువల్ని అపారంగా గౌరవించారు నమ్మిన విలువల కోసం ఉద్యోగాల్ని తృణప్రాయంగా చూశారు కృష్ణరావు

దృష్టిలో విలువలన్నీ సమాదరణీయాలే. వారి ''ఆదర్శ శిఖరాలు'' నాటికల సంపుటిలో నాటికలన్నీ విలువల దీప్తి రేఖలే. ఈ సంపుటిలో మొదటిది ''భిక్షాపాత్ర'' చివరిది తాత్త్విక విలువల్ని ప్రతిపాదించే ''ఆదర్శ శిఖరాలు''. ఇది మహాశిల్పి జక్కణాచార్యుల కథ. మధ్యలో వన్ని ఇతర విలువల్ని ప్రతిపాదించేవి ఇవన్నీ వ్యక్తి ధర్మాన్ని ప్రబోధించే విలువల వెలుగులు ఆర్థిక, నైతిక, సామాజిక, తాత్త్విక విలువల సమాహారాన్ని అనుభూతిలోకి తెచ్చుకొని మానవ వ్యక్తి సంపూర్ణ సమగ్ర చరితార్థత సంతరించుకోవాలని కృష్ణరావు ధ్యాస.

''బొమ్మ ఏడ్చింది'' నాటకం మతానికి విలువలకి సంబంధించిన కొన్ని మౌలిక దార్శనిక విషయాలను స్పృశిస్తుంది మతం అంతిమ విలువ. అది కొంత వైయక్తికం, కొంత నైతికం నైతిక విలువలూ ఒకవిధంగా సామాజికాలే. అందువల్ల సామాజిక స్పర్శ ఉన్న మేరకు ప్రభుత్వం మతంతో ప్రమేయం కల్పించుకోవచ్చు. ఆ పరిధిని దాటి రాజ్యం వాటి విలువలతో సంబంధం పెట్టుకోరాదు ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో రాజు గౌతమీ పుత్రశాతకర్ణి హిందూ మతానుయాయి. బౌద్ధుల్ని బాధిస్తాడు. ఆర్య నాగార్జునల ఉపదేశం పెడచెవిని పెడతాడు నాగార్జునులకు దేశ బహిష్కరణ శిక్ష విధిస్తాడు ఈ అధర్మానికి బొమ్మ ఏడుస్తుంది ఈ బొమ్మ బౌద్ధుల ఆరాధ్య దేవత షట్పారమితాదేవి. ఓ పాత్ర ద్వారా ''ఆ బొమ్మ మానవుల మనస్సుల్లో మెదిలిన నాడే లోకకళ్యాణం'' అంటారు కృష్ణరావు. ఇది ప్రస్తుత సమాజానికి అన్యాప దేశమైన కర్తవ్య బోధ

కృష్ణరావు కొన్ని సాహిత్య వ్యాసాల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్ని, తాత్త్విక వ్యాసాల్నీ రచించారు. వాటిలో వారి నిశిత మేధాశక్తి, సహేతుకత, అంతర్ దృష్టి అంతర్లీనంగా ద్యోతకమవుతుంది కృష్ణరావు శైలి తెలుగు నుడికారపు ఇంపుసొంపులకి పట్టు కొమ్మ

జీవితం నిరంతర స్రవంతి సమాజం నిత్య పరిణామ శీలం గలది వ్యక్తి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కలవాడు. భావజీవి సంస్కృతి పరంపరా గతమైంది సాహిత్యం సౌందర్య సంబంధి సౌందర్యం వస్తుగతం, హృదయ గతం కూడా. ఇవన్నీ పరస్పర ఆశ్రితాలు కృష్ణరావు సాహిత్యం మానవసంబంధాల్ని పరామర్శించి వాటిలోని అంతరార్థాన్ని వెలుగులోకి తెస్తూ, పాఠకుడిలో సమాధ్యవస్థ కల్పిస్తుంది ఆనందమిస్తుంది ఆలోచన రేకెత్తిస్తుంది. లోకకల్యాణ మార్గం సూచిస్తుంది ఇది సహృదయ హృదయైక వేద్యం

# వరూధిని

దారితప్పి అల్లాడుతున్న ప్రవరుడికి వరూధిని ఎదురౌతుంది. మొగమొక్కసారి
వికసిస్తుంది. బాపడు గంపెడాసతో ఆశీర్వదిస్తూ ''మావూరికి మార్గం చెప్మా'' 1
అంటాడు. ''చిఱుత నవ్వుల ఱెప్పల సిగ్గుదేర్చి''; అనిమిషత్వఫలితంగా అతని
సౌందర్యం గ్రోలుతూ, నర్మ వచనా లాడుతుందాబిడ. చిరాకుతో ఆవిరాగి
చెవిచేర్చకుండా ''పోవాలి. తెలిస్తే దారిచెప్పి పుణ్యం కట్టుకో''మంటాడు.
అంత టాబిడ–

★ ★ ★ ★ ★

పోదును పోదునంచుఁ బలు _
పోకలు పోయెదుగాని, మీదుప
ల్లీదరసస్యభూావృతమ
లీమసవాతకు మారపాలి కీ
మేదుర దేవదారుతరు
మీలితకోమలనవ్యకైసలా
మోదసముత్కటానిలపుఁ
బోఁడుములే సరిరాకపోయెనే?

పిన్నఁదనంబునందుఁ గఱ
పించినయట్టి ని తాంతకత్రయీ
పన్నము లన్ని యేకరువు
వాఱఁగఁజేసెదు ; యాగపుణ్యసం
పన్నతఁ జచ్చి; పైని ముది
వగ్గులఁ బొందుటకంటె కామినీ
సన్నుతసంగమంబది ప్ర
శస్తము గాదొకొ? పాఱఁజూడుమా!

కాంచనకైతకీప్రసవ
గర్భదళోదరసోదరప్రభా
భ్యంచితభామినీదృఢభు
జాంతరదత్తజమోపగూహనో
త్సంచయ మెన్నిజన్మముల
సల్పిన పుణ్యఫలంబుగాఁగఁ బ్రా
ప్తించునొ, యెన్న లేక పరు
వెత్తెద; విట్టి కడంక లాఁపుమా!

తినుటకుఁ గల్గి; ప్రక్క సుద
తీకులభూషణముండి; దాపునం
దున ఘన వైదుషీసుకవి
ధూర్వహజల్పిత కావ్యరత్నముల్

జి.వి. కృష్ణరావు

పానుపడి; స్వర్ణరత్నమణి
భూషితలేఖినియడ్డు లేక ని
స్వనములఁబింపిసల్ గొనుచు
సాగిన, స్వర్గము గిర్గమేటికిన్?

వెలినవకంపునీడగమి
వెన్వనుకం జనుదేర, హంసకాం
తలదె మృణాళనాళమృదు
తంత్రులఁ గైకొని భర్తృకంధరం
బులనిడి సంతసించెడి; న
పూర్వమహో! యిటువంటి దృశ్యముల్
దలఁపఁగ నైన వచ్చునొకొ?
త్వన్నగరాంతరమందుఁ జెప్పుమా!

నగణితసోపవిష్టమృగ
నాభిమదంబులఁ బంకిలంబులై -3
భుగభుగవల్చు పెంజటియ
పుంజముతో గురుగౌరవంబులై
నెగడు తుషారసారధర
ణీధరఖండములం దనర్చు నీ
నగమున ధౌతధామమున
నర్మిలి జోటిని గూడుటొప్పదే?

అలసత నత్తమిల్లిన ని
జాంగనకై వదనాగ్రదర్భసం
చలభిదచామరంబుగొని
చల్లన వీచెడి నమ్మృగంబు, ని
వ్వలనికిఁ జూడు; మేను గరు
పాఱి కనుంగవ దోయిలింప, కొ
మ్మల కొననట్టె గీఁటె మృగ
పుణ్యుఁడు, నెచ్చెలియెంత ధన్యయో!

వరూథిని

శారదచంద్రికావృతని
శాసమయాంతరముర్మ్మరస్వనత్
స్వైరవిహారధీర వరి
చాలితగంధిలశీతమారుతాం
కూరమువూలె చల్లనయి,
కోమలమ్మైన త్వదాస్యము క్షవా
చారుచిరార్ద్రసంపద వి
చారము దూరముగా నొనర్పుమా!

తామరదొన్నెలో నళిక
దంబము లానని వచ్చి తేనియల్
తే ముదలిత్తునో? ఘనమి
ళిందకులప్రతిమానకుంతల
ప్రామితరోచి నొచ్చు, మయిఁ
బ్రామినబూది దలంచి; పూర్ణిమా
కౌముది వోలెనున్న మృదు
కౌసుమధూళుల పూయు దానినో?

బాలరసాలసాలనవ
పల్లవఖాదనమత్తకోకిలా
జాలములెల్లఁ జీరి; యొక
సారి సభాఘటనంబు గూర్తునో?
నీలపయోదమోదితవ
నీచరపుల్లక లావకేకినీ
కేళికిఁ గొల్వు దీర్తునొ? వి
ఖిన్నత నావలఁద్రోసి చెప్పుమా!

చారునదీప్రవాహపరి
సంచితచంచలరత్న వారకి
మ్మీరసువర్ణసై కతస
మీహితకాంతలతాంతసౌరభా

పూరనికుంజపుంజముల
పాల్చి గణింతమె శోభనక్షణా
కారితపుండరీకనిభ
క్రమనిబద్ధబలాకమాలికల్?

ఇమ్మెయి కిచ్చి నిచ్చ జని
యింపద యేని, మదీయవన్యవృ
క్షమ్ముల క్రిందనుండిన శ
శాంకశిలామయ వేదికాగ్రభా
గమ్మున, వాసనాకుసుమ
కల్పితమై యలరారు భవ్యత
ల్పమ్మునఁ బవ్వళించి; యటు
పై గిలిగింతల నాడుకొందమే?

తొలకరిమబ్బుమించు తరి
తున్కల తోఁటలలోన రాయు నం
చల గరుదంతరాళమున,
శాబకగణ్యులు జాళువామెడల్
చలికతముం బొనర్చి సుఖ
సుప్తులయందున గూయుచుండు; నా
మలుపున నున్న కార్మొయిలు
మండపమందున నిల్చి విందమే?

ఈ నగశృంగసంగతమి
హిప్రతిపాదితమైన స్వచ్ఛసో
పానపరంపరాతరణ
పారగతాగతపార్వతీశ్వరో
ద్యానవిహారశస్తసుఖ
దర్శనభాగ్యముచేఁ దరింతమే?
పోని, ఘనంబులెక్కి యటు
పోవుదమే గగనాంతసీమలన్?

అదియును మెచ్చువేని, కల
హంసనిగన్ని గదంచదభ్రసం
ఛాదగరుదగ్రపీరులఁ ఛి
సాళి వహించుచు, నీలరోదసీ
పదమున సంచరింతమె య
వారితభంగుల? నొల్లవేని యీ
మదమధుపానభృంగకస
మాజముపాటల నాలకింతమే?

ఆసలఁజేసి దంతురిత
మైచను యౌవనలక్ష్మి, నీరసా
భాసపుఁ జేఁతలం బనవి
భంగము సేయఁగఁ బోకుమా! జరా
దూషిత ధర్మముం బొరయు
రోజున రాజమరాళగామినీ
వ్యాసద బాహుబంధమున
కారట మొందుఁ జలత్ప్రకోష్ఠముల్.

''రేపును మాపు, హవ్యములఁ
దృప్తి వహించెడువహ్ని సత్కృపా
ప్రాపితచిత్తుఁడై యొసఁగు
ప్రాజ్యసముజ్జ్వలసౌఖ్యమేడ? ఈ
పాపపరీవృతేహసుఖ
వారము లెక్కడ?'' యంచుయాతనా
కూపతలప్రపాతమున
గుందకు మూరకవ్యర్థచర్యలన్.

భావిపురాతనాంతరవి
బంధుర సాదవిషాదమంజరీ
కావలి నీదినాంగన గ
ళాంతరముం దలఁగించి పుచ్చి; భో

గానహమూర్తివై నిలువు
మా! మణిరంజిత మంజుశింజనీ
రావకుడుంగభూముల ని
రంతరదత్తమధూళిపాళివై.

గుంభిత మేఘనాధవిని
గూహితమందిర కంద రావసత్
స్తంభితకిన్నరీతరళ
సారసకాండసదృక్షదోర్ద్వయా
రంభిత కుంకుమాసురుచి
స్త నభూధరయుగ్మకృత్పరీ
రంభణ గౌరవంబున సు
రప్రకరంబులు సంతసించెడిన్.

ఆ సుషమానదీకుచప
యఃప్రభవంబుల, నీ మనోజ్ఞ ని
ర్వాసితసౌనకుంకుమపుఁ
బాంసులపాతము తోడఁజేసి, వ
ల్లీసరసజ్ఞజన్యుఁడు భ
ళీ! రుచిరార్చులఁ దేల్చి, నీ దమా
భ్యాసము లెట్లు చేసితివి
రా? ధరణీసుర వంశభూషణా!

జన్మముచేతవచ్చు ఫల
సంపదలందడియాసఁ జేసి, య
భ్యున్నతిఁ గాలఁ ద్రోచెద వ
హో! నినుమించిన వారుగారె యో
షిన్నుతబాహుబంధముల
చేతఁ దగుల్కొని, యిన్పకచ్చుడా
లన్నిదొలంచి, వారినిల
యంబుల బందెలుగారెయాజ్ఞికుల్?

7

మిసమిసలాడుచున్న నును
మీసపుం బ్రాయము లేద? దుష్క్రియా
ప్రసవితమై నిరంతరదు
రాసదమైన కఠోరవైదిక
వ్యసనము లేద? మానుము; మ
హత్తరభూకుచకుంభకుంకుమ
ప్రసరదురస్థచే బెరవు
వాఅకమున్నె సుఖంబులందుమా!

స్యందమరంద బిందుకణ
సంచయ మీ యరుణారవింద మిం
దిందిరపుణ్యుం డానంగ, ను
దీర్ఘదళాయితచంగచాపకం
బందున నందియిచ్చెం గను
మామధుపప్రవరుండునీతపోఅ -
స్పందిత వర్తనుండగుచు
సాగెనె? యింకను మాట లేటికిన్.

ధర్మము పేరు సెప్పి, వసు
ధాసుర యేమిటి కీ వలంతిదు
ష్కర్మము లాచరించెదవు?
శాస్త్రము లెచ్చటనైన "నిద్ది సా
ధర్మము; కాదు, కూడద"ని
తామనుశాసనం జేసెనే? వ్యథా
శర్మదకానుషంగముల
సాకులు చెప్పి తలంచం బోకుమా!

విచ్చివిచ్చుని పూపగందములతో
వియ్యంబు గావించుచుం,
దచ్చిల్లాడెడు పెంగెరల్లగమిరా
రాపిల్లచేం బుట్టు నీ

షచ్చాలాంచిపృష్ఠ తావసతినా
"స్వాదింపుమా" యంచుఁ, బై
పెచ్చుల్ మీఱ సుధామధుద్రవము లీ
భీష్మించి పోఁబోలునే?

మునుపొకసారి మీకులత
పోధనచంద్రుఁడు సౌరమానినీ
జనమణి సిగ్గులోఁ జిలికి,
చక్కఁదనంబను వెన్నముద్దలం
గొని మిసిమింతుఁడయ్యెఁ; గడు
క్రొత్తలుగావుసుమా? తపోధనా
గ్రణుల దృగంతరాచ్ఛదిత
రాజితమైన సమగ్రశాంబరుల్.

వఱలక యుండునేమి? యొక
పారి కదల్పుము లోనియూహ; తూ 9
ణీర పరినిర్గతద్భుహుళ
నిష్ఠురసాయక సంఘకల్పమై
కెఱలుచు నిర్గమించు దుసి
కింతల చేతము దాఁటి; యింతయే
నెఱుఁగుదు మానసంబు నుతి
యించినఁ గల్గెడు నాప్రమేయముల్.

ఎవ్వని దుర్దమంపుఁదప
యిధ్మజకీల లయాంతకీలయే,
యవ్విధిఁ జిట్టెముం గొనెనొ
యాముని పూవిలుజోదు చేతనో
నెవ్వగ సైఁపలేక తరు
ణీనవయౌవన కార్ముకంబుతోఁ
జివ్వకు సిద్ధమయ్యె; నిఁకఁ
జెప్పెడిదేమి వసుంధరాసురా!

అతిబహుళానురాగమున
నయ్యమునానది యోడరేవులో,
మతిసెడి పోయెనేమి? పృథు
మంద్రసమీరకుమారశీతలో
గ్రతలకు నోహటించుచుఁ బ
రాశరమౌని తపోబలాన నం
ధతమసముల్ ఘటించెః శత
ధా హృదయచ్ఛిద మానుమింతటన్

పాతరలాడు భ్రూకుటిక
వల్లరితో నిబిరీసచిత్తకం
జాతము సంచలింప, సుమ
చాపవినిర్గతశాతబాణసం
ఘాతవినిర్మితోడుపని
కాయముపై, ననురాగవాహినీ
10 నీతవికేళి లభ్యమగు
నే? తలపోయఁగ నెల్లవారికిన్

వలిపెపుఁజెక్కుటద్దముల
పైని మృగీమదసాంకపల్లవాం
గుళిమకరీవిభంగసమ
కుంఠితనిర్మితి చేయువేళ, న
వ్వ్రాలయఁగ నూఁది విఘ్నకర
ణోద్భవమార్చి, మదేభగామినీ
చలకిలికించి తేక్షణర
సంబునఁ దేలఁగ నుల్ల మొల్లదే?

అరమర లేని కూరుముల
నాడుచుఁ బాడుచు గాంగభంగశీ
కరపరసేచనామహిత
గణ్యపుటోవరులందుఁ, బ్రేమ శీ

ధురసపిపాసతారతుల
తోఁ జరియింతముగాక; బ్రుసీ
పరమము డించి దర్భపుల
వంబుల నిమ్మృగి కిచ్చివేయుమా!

బింకములేటికోయి వృథి
వీసురనందన! వ్యాఘ్రచర్మకృ
ద్రాంకవ మేతదుగ్రసము
దగ్రపుటీరముపైని త్రోయు; మీ
సాంకవసత్కురంగమద
సంకులభిన్న వినూత్న శీతచ
ర్చాంకురసంతతుల్ తనువు
నందు నలందుదుఁ, గొంకువీఁగుమా!

చదలు కళాయిదీరి పద
సారసయుగ్మక మంటికందఁగా
మొదలిడె; రమ్ము, పోయి తరు
మూలముపొంతల చాయనిల్చి, యీ
గొదగొను ఘర్మవారికణ
కోరకముల్ దిగఁద్రోతుగాక; ఏ
మది? బిఱుచూపుతోడ నుఱి
యాడుచు నుంటివి భూసురోత్తమా!

క్రియలకు దూరమై వచన
కేవల తాపరమార్థబోధనా
నయముల నాచరించుచు, మ
నస్వివి గాక; యపేతవాంఛతో
నియతముగాఁ దనుం దలఁప
నేర్చి, సదాయనుభూతిలోభివై
యెయిదుదువేమి? లోకమెఱిఁ
యించిన నేమి ఫలంబయా? దమీ!

పరువిడు నింద్రియాశ్వముల
వాగెల యూఁది గుదించి పట్టి, యే
స్ఫురితలసన్మనోరథము
వొందెదొ, యట్టి ఫలంబు నేఁడు నే
వరముగ నిచ్చుచుండ; నిటు
వల్దని కాలను ద్రోచెదేల? నీ
వెరవరిచంద మెల్లఁ గను
పించితిగా, ధరణీసురాగ్రణీ!

ఒక్కరు పూలుదేర, మఱి
యొక్కరు మాల రచించుచుండఁగా,
దృక్కులలోని ముత్తియపు
దీధితిహాసమరీచితోడఁ బెం
పెక్కనివాళిసాళి ఖచి
యించి, ముఖేందువు గారవించు స
మ్యక్కృతి యెల్లవారలకు
నబ్బునె? యూహలఁగాక భూసురా!

కాంచనపద్మినీనికర
గంధిలజాహ్నవి వీచిఁ దోఁగు రా
యంచలఁ బోలె, నందనవ
నాంతర పాదపపాదవేదికా
సంచయమందు వ్రాలు సుర
జంపతులంబలెఁ, జీఁకుచింతలం
ద్రుంచి, సుఖింత మీ తరుణ
రోహవిలాసకిలాసచేష్టలన్.

వాదములేలరా? హృదయ
పార్థివచంద్రమ! విశ్వవల్లకీ
నాదతరంగిణిన్ శ్రుతిఁ బె
నంచి లంగించుచుఁ బాడుకొంచు, ని

ర్వేదసరస్సమత్వపరి
రింఖదభంగతరంగ నిమ్నగా
పాదవిహార కేళిపరి
పాటిఁ జరింతము, చింతలేఁగుమా!

లోఁగని మా(ద్రి నాపలుకు
లోపలి చక్కెరపానకంబులం
(దాగెదొ? లోచనోత్పలచ
రత్కమనీయ కనీనికావిభ్రం
గీగతమందహాసరుచి
కీర్ణసుధారసమందు నొల్కిపైఁ
దోఁగిన యట్టి యావలపుఁ
దోఁటలలోవిహరించుచుంటివో?

(ప్రాయపుటాఁడుదంట; యటు
పైని సువర్ణవ పుర్విలాసికా
మ్మాయమటంట; మీఁద సుమ
నః(ప్రమదామణియంట; దానిపై
నాయతచాతురీగతవ
చోఽభ్యభినందితశీలయంట, తా
నే యనురక్తివచ్చె నఁట
యింక విపర్యయమేల తెల్పుమా!

నెమ్మది కెన్ని చందముల
నీవు గణించినఁగాని "నాదుక
ర్ణమ్ముల కెక్కఁబోవ" ని వ
రాజ్ముఖతం జరియింప నేల? రా
రమ్ము తదీయసంఘటిత
రాజశిలామయవేదిపై శరీ
రమ్ములవాల్చి విందము త
రంగిత వేణుసమీరగానముల్.

అంటూ చేయి తెమల్చటానికి సిద్ధమౌతుంది. మృగీసహచరి చేలాంచలము-పట్టుకొని వారిస్తుంది. అగ్గంగా ఉంకించిన కార్యము కొంచెము చేస్తుందామె.................. ''నీలోత్పలంబులు నీటఁ దేలు''తవి. చేరువ చిగురుజొంపాలలోనున్న కలకంఠి కిలకిలా నవ్వి దూటుకొంటుంది.

(1935 యువ, పుష్యము)



జి.వి. కృష్ణరావు

# అంకితము

## గోపీచందుగారికి:

పసరులు శీతముం జిలుకు బాలరసాలము క్రింద నున్న మీ
రసహృదయమ్ము నెత్తి కృతి వ్రాసిన వాఁడ; గ్రహించుకొంటిరే?
అసలు గ్రహింపలేదని మదాశయమండి; అదెట్టులన్న: ని
శ్వసిత సుగంధమైన ప్రసవమ్ము గ్రహించునె కమ్మ తావులన్?

అవు నన్నావు; రసజ్ఞ లోకమున వేదాంతార్థ సంపజ్జిగీ
షువు లందీకృతి మెల్ల యోగ్య, బహుధాసుశ్లోక యన్నావు; నా
కవకాశమ్ము లభించె; ఇయ్యదిగొ మీ కర్పించు చున్నాఁడ; ఇం
కవుగాముల్ దలపోసి కొంకుటకు లేవయ్యా సమీచీనతల్.

## ప్రథమ యామము

నిద్రాముద్రితమై, దయారసముతో నిండారి, విశ్వంభరా
భద్రాపాదక చింతనాలసత శోభాసంపదల్ దక్కి, య
క్షుద్రేషామయమైన దృగ్ద్వయముఁ బ్రాకోష్ఠాంక వక్షమ్ముగాఁ
జిద్రూపుండగు గౌతముండు శయనించెం బూవుటుయ్యాలలోన్.

శ్రేణీభూతములై, నిసర్గవనితా చేతస్సువర్ణంపుఁ బా
త్రానం బట్టిన రాజ దీప కలికోద్దామాభ్ర ధూమంబులో
నానాభావ నిగుంభ పాత్రలు ప్రపన్నంబై, వహరించె నా
భూనాథాగ్రణి సన్నిధానమున నేవో దృశ్యకావ్యమ్ములన్.

బాహామూలయుగమ్ము పచ్చిపసపుల్ పండింప, దృక్కోణముల్
నీహారాంశులు గాయ, నిర్వచన సుస్నిగ్ధప్రదా శాంత లీ
లాహాసమ్ములు మందమందముగఁ గల్యాణంబు వాసింప, మ
ల్లీహారమ్ము వహించి పట్టె భుజవల్లీద్వంద్వ మస్పందమై 17

ఆ సుమనఃపరీత వలయంబు చరాచరరూపపహౌ నసం
తా సదనానికిం బరిధి తాల్చఁగ. పల్లవ కేతనాంచితా
వాసములున్, సరోహృదయవాటులు, కేళి నికుంజపుంజముల్,
వేసవిపాళెముల్ గలిగి, విందొనరించెను గన్నుదోయికిన్.

ఉదరంబు నొకచేతఁ గదియించి యొకజీవి
హోరన గట్టినిట్టూర్పు విడిచె;
గడ్డంబు మీసాల కవిలకాంతులలోన
నర్తిల్ల నొకప్రాణి నవ్వివైచె;
వ్యవధానమే లేని యారాటములతోడ
జంగమంబొకటి యా చక్కివిడిచె;
ముదిమితోఁ బైకొన్న పుంభావకాంక్షల
నొక్కండు మునికాళ్ల నిక్కిచూచె;

సూరెలన్ని పాఱఁ జూచి లోనికిఁ జేర
గోడదూఁకె నొక్క కోడెగాఁడు;
బొంగరముగ నున్న సింగాణి కోలతోఁ
గన్ను మలపకుండఁ గాచె నొకఁడు.

విరియఁగఁ బూచి యున్న గురువెందపువుంబొద చాటుమాటుగాఁ
దిరుగుచు, విప్రయోగవుఁ గుతిం గుసిరింతలు వాఱుచున్న యొ
క్కరుతుక కీర కోకిల నికాయము మత్తిలి మంజులధ్వనుల్
నెఱపఁగ క్రుద్ధయై తవిలె లీలగఁ బెట్టిన తిట్టుపోఁతలన్.

జీవన కారణంబయి, నశింపని యొక్క రహస్య శక్తికిన్
వావురమై విలాసినులు ప్రాయమునందలి సౌకుమార్యముల్
వావెలఁ జేసి యిచ్చి, మగవారల నీడ్చ్రి తప్పుదారులన్
కేవల తాస్తి నాస్తి విచికిత్సలకుం దడవీయ కుండఁగన్.

ఒక విజ్ఞాన విశేష భాగ్యుఁడు మనీషోర్వీధరోత్తుంగ పా
ళికి విచ్చేసి, యుదంతమెల్లఁగని, విక్లేశార్తచేతమ్ముతో,
వికలంబైన వినీల కేశములుగాఁ, విస్రస్తచేలంబుగాఁ,
శకలంబైన మనోభవాశయముగా, సాగారెఁ బేరెమ్ములన్.

సూనము గోయుచున్న యొక సుందరి దూరమునందె బుద్ధిసూ
క్ష్మాన నెఱింగి, కోయుపువు జారిచి చేతులఁ బాఱఁజాఁచి, "నా
థా! నను దిక్కుమాలిన విహంగినిజేసెదె? నేనుగూడ మీ
తో నరుదెంతు" నంచు వెడ తొందర రా, ద్విగుణించె వేగముల్.

కనుకని యాలతాంగియు పకాపక నవ్వుచు పూవుఁ దీఁగలం
బెనఁగొని యున్న యీరముల వీథులలోపలఁ జెట్టుపుట్టకున్
వెనుకలఁబోవు కోవల, నవీక్షితయై పరుగెత్తి, గంబురా
యనఁటుల క్రిందఁ బట్టుకొనె నాతని మాంసలమైన యంసముల్.

వలదే నీతో సంగతి;
వలదే వలరాచవాని వలపులకాఁకల్;
నిలవే కొంచెమెడమ్ముగ;
ఎలయింపకు నాదుమూఁపు లెంతోనొచ్చెన్.

జి.వి. కృష్ణరావు

కుసిలింపకు నన్నూరక;
విసిగింపకు కన్నుగనని వెంగలి మాటల్;
కొసరింపకు నా నుడువుల;
నిసిరింతలువోయె నెడఁద, యేగుదు నింకన్.

అనఁగాఁ దలిరుంగేలం
బెనచినదై యాతనిమెడ, విజ్జాల యజ్జల్
దొనదొన నూపుర రవములు
చెనయఁగ 'నుఁహూఁహూ' యటంచు సీత్కృతిచేసెన్.

కాంచుచున్న గౌతమదేవు కనులలోన
పిన్ననవ్వులు రేయెండ చెన్ను మెఱసి
పోయి, వెలినున్నవారి వాపోక దోఁచె;
అంత సుమ వేష్టితంబైన దంతమాసె.

ఏది వైవాహిక క్రియలోన కల్హార
కాండంబు చందాన కరము దాఁకె,
ఏది తాంబూల సంపాదక యామినిని
నవ్వుకై దంత సందష్ట మయ్యె,
ఏది మిథ్యాకోప హిండితంబగు వేళ
బాష్ప సుస్నిగ్ధమై పట్టువడియె,
ఏది పయఃక్రీడ కేగెడు సమయాన
స్కంధంబుపై నంశుకత్వమొందె,

ఆ బిసరుహోభమైన కరాగ్రిమంబు
నఖర పుంఖిత రోచిస్సు నాల్గుదెసల
తఱపి వెన్నెలఁ గాయింప, ధవళకుసుమ
వలయమందొక్కటైవచ్చి వలనుచూపె.

కేలంజూపిన చాయలో సురిగి, దిక్కీర్ణోష తామ్రంపు రే
ఖా లాలిత్యము చిమ్మచీఁకటులలో గాజుల్ తుటారింపఁగా,
మాలాలంకృత తారకారుచుల సంభావ్యంబుగాఁ దోఁచెడో
లాలోలార్భక పుణ్యమూర్తియగు తన్వంగీ కరాంభోజముల్.

శివరాత్రి

ఆపాణి యుగ్మకంబున
ద్రోపాడిన నొక్కపైఁడి తూఁగుటుయ్యాలన్
దాపున కేతెంచెను తన
పాపఁడొకఁడు; గౌతముండు పరిపరి దలఁచెన్.

ఎచ్చటనుండి వచ్చినవి యీనిదురించెడి కూనమోవిపై
గచ్చులు? కింవదంతియె యొకానొక టున్నది: శారదమ్ములో
విచ్చెడి వెల్లమబ్బు కొసపింజల వాలు శశాంకబింబపా
దోచ్చయమందు మున్నెపుడొ యుద్భవమయ్యె నటంచుఁ జెప్పఁగన్

అర్థమయ్యెఁగదోయి! నవాంబుదాబ్ధి
పుష్ప సౌవర్ణములలో నమోఘశక్తి
ఎడఁద నీతొక్కుపల్కుల బెడఁగుగాంచి,
యువతళించి క్రీడాచిత్ర మీయ; నపుడు.

క్రొత్త గులాబి మొగ్గసొబగుల్ హసియించెడి పాలబుగ్గపై
మెత్తనినవ్వు మొల్క మిసిమింతల వెల్లువ వింతసొరు రే
కెత్తఁగఁ, గింకిణీ స్వనములీన, జగా పరవళ్లఁ ద్రొక్కుచు
వైవ్యత్తుగ వచ్చి వ్రాలె దరణీశుఁడు నిల్చిన తల్పభూమికిన్.

చివురుల్ మోని కరమ్ముల న్నిగళ మాశ్లేషించి పై ప్రక్కలన్
దివుటల్ దీరఁగ వ్రాలి సోలుచుఁ బ్రమోదింపన్, గుమారాస్యగం
ధ వినోదమ్ముల మత్తుఁడై తడసిఁ యాఘ్రాణించె; మందోక్తిమై
దవుడుల్ దీసెడి కోర్కులొత్తి యడిగెం దానెంచు భావమ్ములన్.

విలయార్ణవ హృదంత వీచీస్వనమ్ములో
సింహగర్జల నెల్ల స్వీకరించి,
కాదంబినీ గర్భ కాల విద్యుల్లతా
నైశిత్యమంతయు రాశిఁజేసి;

మధ్యందిన గ్రీష్మ మార్తాండ మండల
చండాంశువుల నెల్ల సంగ్రహించి,
హరి దంత రాంత కిమ్మిరమైన యైంద్ర కా
ర్ముక మెత్తి చెవిదాఁక మోపువెట్టి,

ఫెళ ఫెళార్భాటములతోడ వృషవాటి
విఱచు జంఝూరు సత్వ మావిర్భవింప,
సర్వ సర్వంసహాస్థలి సంతరించి,
దిక్కుహరములలోఁ గీర్తి దీపముంతు.

పొడవగు దంటవిల్లు ఎగు మూఁపున దాల్చి, బడాయిపిందలై
మిడికెడి రాజలోకము నమేయ పరాక్రమ సంక్రమంబునన్
బొడవఱియించివైచి, యొకమూలకుఁ దెచ్చెద; గాంగనిమ్నగా
జడములఁ బెన్నలోఁ గలిపి సాంద్ర యశఃకృతు లాలపించెదన్.

చికిలీచేసిన విచ్చుకత్తి రుచిలో జీర్ణింప విద్వేష భూ
మికలై నిల్చిన వారి యామెతలు, సౌమేర్వద్రి పర్యంతమై
వికసింపన్ సుఖశాంతసుప్తమయి యుర్వీరాజ్య భాగంబు లా
ర్యకవీంద్రప్రతిభా విశేషములతో నాలింతు హిందోళముల్.

కళ్యాణ తతకీర్తి కాంతల జోడించి
సాలబాహువుల నుయ్యాల లూతు;
మేలి పాటలతోడి మెత్తని కవనంబు
చెప్పంగ కవివరశ్రేణిఁ జేర్తు;
నాగరీకము కల్మి నర్తించు శాస్త్రాల
కోసమై పందిళ్లు కుస్తరింతు;
ఖండాంతరమ్ముల గాలించి గాలించి
విజ్ఞాన నిధులన్ని పెల్లగింతు;

ఇంటనింట భారతతేజ యాద్యకాంతి
ముందు వెల్గగఁ గావించి పుచ్చివైతు;
అంతయేటికి మూఁడు పూలాఱు కాయ
లగుచు నాభూమి, నాజాతి, యలరఁజూతు.

ఇయ్యవి కాగితాల రచియించిన యమ్ములుగావు; జ్యాలతన్
బఁయ్యన లాగిపట్టి విడువం దెగటార్చును నొక్క వ్రేల్మిడిన్
న్యాయ్యముగాని పంథ నడియాడెడి రాజుల మొగ్గరంబులో
తియ్యము లెల్ల; ఏమి నిపతించెద వీతెగ లాగ్వైతు నాః-

అర్థిగాదు పుత్త్రక'' యంచు దిద్దఁబోయి,
చిన్నఁబోనున్న పసికందు చిత్తమెఱిఁగి,
అధర ముద్గమించెడి వాక్య మప్పళించి,
మోము పుణికిరింతలఁ గొంత బుజ్జగించి;

ఇంతయు లేని యీబుడుత కెవ్వరు నేర్పిరి? తాతపాదులే
కాంతమునందు నామరుల కన్గికురించి, పృథూరుదేశ సం
క్రాంతునిఁజేసి నేర్పిరొ వికావికలై తెలిబూజురాల్చు సి
ద్ధాంతములెల్ల; లోన శతాధాపరివృద్ధములయ్యె నక్కటా!

విశ్వమానవ కళ్యాణ వేదులెల్ల
నీ తలంపుల నూఁకొన్న నెట్లుసైఁతు?
రెట్టులు ప్రబోధ గీతంబు లీరువోవు?
భద్రమార్గంబు లేరీతి పాదుకొనును?

22 అనుచు కలగుండు వారిన మనములోన
తరఁగ తరఁగలై సుడివెట్టి పొరలి పొరలి,
భావనాపరంపర లూడఁబాఱి చనఁగ
కన్ను గోన నురలె నశ్రుకంకణంబు.

★ ★ ★ ★

ఆయంకమ్ము గతించిపోయె; నట శ్రవ్యంబై పిసాళించి, యే
దో యవ్యక్త విఘంటికానికురసద్యోజాత రావమ్ము నం
దీయగ్రీవ విలోల ఘంటరుత సాదృశ్యంబు గావించె; పై
హేయంబైన కవాటభాంకృతులు వాహించెఁ మనోజ్ఞసహ్యమై.

కుదురులు నిండుగా నలవు గూరిన మీసలు, ముగ్గుబుట్టలా
ముదిసిన మస్తముం గలిగి, ముందటనిల్చి, జొహారుసేసి, యి
య్యది తెరువంచుఁ జూపి, ప్రతిహారి యొకండు కృపాణపాణియై
గదిమి బరాబరుల్ నలిపి, కైకొనిపోయెను బందిసాలకుఁ.

జి.వి. కృష్ణరావు

కలలోన నొకకాంతఁ గవసిన యట్లైన
సివమెత్తి యొక్కండు చెమ్మరించె;
పట్ట పగ్గము లేని ప్రాయంపుఁ దలపోఁత
పాలుగా నావసోపాలువడియె;
కొండనెత్తమ్ముల కోనల కెగఁబ్రాఁకు
బాగున నొక్కండు పవ్వళించె;
బడినిద్ర వోయెడి బందీని దేహాన
మిట్ట పల్లాలకై మెసలుకొనియె;

ఇంక నొకచోట నొకరుఁడేమేమొ చేసె
చిర వియోగాగ్ని సందగ్ధ చిత్తుఁడగుచు;
ఊరకెట్లుండ నేర్చును యువజనమ్ము
ఏండ్లతరబడిగా కామినీచ్ఛ లేక?

అరనిముసము నిలువంబడి
పొరిపొరి దిగ్భ్రమ గుడుసులు వోవఁగఁ జూడన్
ధరణీశ్వర శేఖరునకు
తఱుఁగుకుపోయిన మనసు యథాయథలయ్యెన్. 23

ముందున కేగి, భూధవుఁడభూత మనీషలు గొల్చియున్న గే
హేందిర సీమకుంజనియె; ఏనినదమ్ములు గాని, యేవచ
స్స్పందముగాని లేక, యతిశాంత నిశాంత విహార వాతముల్
గ్రందుల డిందు వాటెఁ బ్రతి గానము సేయుచు నెల్లచప్పుడుల్.

ఆలోచించుచు నున్న యొక్కనికి నయ్యాకార రేఖా విలా
సాలంబంబగు గౌతముండు తగులన్ సామోద వందారు వై,
పాలం బొల్చిన యాసనంబొసంగి, పై వ్యాసంగ వాక్యాల నా
మూలాగ్రంబుగ నాతనిందెలిసి వాపోయెన్ వ్యథా వృత్తముల్.

రాతిరియుం బవల్ విధివిరామము లేబరమ్మై, గులాములై,
యూఁతలు విచ్చిపో బిఱుసు టోడికలై చిఱు చెమ్మటల్ లలా
టాతత దేశముల్ గమియ నైన శ్రమంపడు కూలివారికిం
జేతులు నోటికిం జనవు చెయ్దము లిట్టివి; యేమి చెప్పుదున్?

మిట మిట గాయుచుండు మిడిమేలపు టెండలు నీరుగొన్నటుల్
గుటగుట ప్రాంత భావములు గ్రోలుచు నున్నవి రక్తమాంసముల్;
అట తనివోక పైని యడియాసల స్వర్గము దెచ్చిపెట్టి, సం
కటమగు నార్షసూక్తపుఁ వికారపుఁబల్కులఁ జావమోఁదెడిన్.

నిండీ నిండని యౌవనంపు టుడుకుల్ నిద్రింపఁగానీక, యు
ద్దండంబై గుమిగూడి రేఁబవలు నుత్సాహంబు రెట్టింపఁ, గో
దండంబుంగొని యా మహామహుఁడు సంస్థా విప్లవాపాదియై
తీంద్రించ, న్నరపాలు శాసనము లాదేశించె నీ వాసముల్.

ఆమొగసాలలోన దిరుగాడు నతండొక తత్త్వవేత్త; ప్రా
బూమెల నొప్పుకోఁడు; ''పరిపూజ్య మనంతము నైనశక్తి యీ
భూమిని, నాకసంబు, జని భూత నికాయము, స్థావరమ్ము ని
ష్కామ కలాకలాపములుగా సవరించు'' నటంచుఁ దెల్పెడిన్.

''ఏదియుఁ జేయలేవు; మఱి యెద్ది కృతంబునుగాదు గాన, క
ర్మాదరణంబు గోరెడి పురావచనంబుల గీటు వుచ్చి, త
న్మేదుర సక్తతల్ విడచి, మేకొని వర్తిలు'' మంచుఁ జెప్పు; నే
నేదియు నందెఱుంగను; గ్రహింపఁగఁ జాలక యుమ్మలించెదన్.

''ఈ జగన్మురళీజ హిందోళ మాలించి,
జీవాబ్ధి మాలికల్ చెదరిపోవు;
ఇసుక పాఁతల లాగు నింకింప రాకుండ
విషమ సమస్య లావిర్భవించు.

తీరిచి దిద్దుకొన్న జగతీతల మెప్పు డఖర్వపూర్ణతాం
కూరము లెత్తఁబోదు; వినిగుంఠసమస్యయె యైన యీధరా
భారము సర్వముం గుములువాఱుట నిక్క'' మటంచు, సాంధ్యవే
ళా రమణీయ మారుతము లాలనఁ దోఁగు చుపన్యసించెడిన్.

''భో కించిజ్జ్ఞశిఖామణీ! ఎవరి రావుల్‌గా విలోకించితో?
సాకల్యంబుగఁ జూడుమా! భవతి భిక్షాం దేహి యన్ వాక్యముల్
నీ కంఠంబున నిల్చెనా యిపుడు? నీ లీలానిశాంతమ్ము కా
దా? కైకొ''మ్మని పాడఁగా నతని నాహ్వానించి రిచ్చోటికిన్.

జి.వి. కృష్ణరావు

ఈ సుమంబు లీరీతి నిల్లిగ్గు లింకి,
పడఁగ నున్నవి రిత్తలై పాంశు లందు
చెరువుకోలేని సంఘమ్ము చేతఁజిక్కి;
వినుఁడి యింక నా చరితమ్ము విన్నవింతు.

చదివిన వాఙ్మయమ్ములు రసప్రతిపాదక మార్గసూచులై
పదరఁగ గీతులెన్నొ ఒరవళ్ళుగఁ బాడితి; నొక్కఁడైన నా
గొదగొద లాలకించి, యనుకూలతఁ జూపఁగలేదు; దానితో
ముదిరి కుటుంబభారము తమోవన వాటిఁ గృశించిపోయితిన్.

జడిగొను బాష్పబిందువుల సందున నీబహుళప్రపంచమే
వెడఁద యేడారియై కలఁచె; వృక్షశిఖాగ్రమునందు డాఁగి కూ
సెడి శుక కోకిలంబులు నిశీథ రహోంధనిబీరసంబులం
దడవు విషాద గీతికల దారిగఁ జీలిచె నాదు గుండియల్.

నైరాశ్యాంకితమైన వీక్షణముతో "నా జీవితం బింత దే
నా? రావో శుభతంతు సంతతులు, కామాంకూరముల్ వాఁడునా?
వే ఱేమేమి దలంచినావు జననీ! విన్పింపుమా" యంచు, పా
టీరాచ్ఛాదిత రోదసీసతిని ధట్టీభూతఁ గావించితిన్.

మొగులు చెక్కిళ్ళపై మించు మొలకరించి,
తివురు నెదకోర్కి మోసు లెత్తింపలేదు;
ప్రళయ గంభీర బృంహితస్వనముతోడ
హృదయ రాగ కందరము మ్రోయింపలేదు.

రస దిగ్ధంబగు కావ్యవాణికి నమో వ్రాతంబు లర్పించి, పిం
పిస గోరాడుచు నున్న భావములకున్ వీడ్కోలు గైసేసి, ని
శ్వసితంబైన మదీయ గీతములకున్ స్వస్త్యంజలుల్ గూర్చి, నే
నసువుల్ వాయఁ గడంగఁగా మెసవె కారాగార మొక్కుమ్మడిన్.

గమికర్మీకృతమైన యాజనుల సాంగత్యంబుతోఁ గ్రొత్త జ
న్మము ప్రాపించె; విచార ఘూర్ణమయినన్ గాకున్న జీవమ్ములో
మమకారంబులు పిచ్చలించె; నవి ప్రామాణ్యంబులై సృష్టిచి
త్రము లెన్నో కనుఁగొంటి; నైకపు మన స్తత్త్వంబు శోధించితిన్.

కారాగార నివాస పుణ్యఫలమై, కళ్యాణ పారంపరా
ధారంబై, హృదయాను రంజక కృతీంద్రశ్రేణి నిర్మింపఁ జే
కూరెన్; ధన్యుఁడనైతి నేను; బహుధాకూతంబు సాఫల్యమై
వారించెన్ జనుషా దరిద్రగతులన్ భద్రానుసంధాయకా!

చెలువము, సౌరభమ్ము, నవ జీవనమందలి భోగభాగ్యముల్,
కలిగెడి లోటుపాటులు, వికారపుఁ జేష్టలు, వాని మాన్పు పం
థలు, జనచిత్తవృత్తములు, నాగరకత్వ విధానమార్గముల్,
పలికితిఁ దేట తెల్లముగ వట్టిపదాల వసందు లీఁగుచున్.

ఏను మనుష్య లోకముల కెల్ల నతీతముగాఁ జరించు నీ
శాన శిరస్తటీ ఘటిత జాహ్నవరాజ మరాళమన్న గీ
ర్వాణము తూలిపోయెను; నిరాదర జీవి నటంచు నేఁడు డెం
దానికి నచ్చివచ్చినది; తత్పరిపక్వత శైలిఁదోఁచెడిన్.

మదువతీ ధమ్మిల్ల మాల్యంబుపైఁ జూపు
26 బీద సాదల మీఁదఁ బాదుకొనియె;
పూవింటి తూపుతోఁ బొగ రెక్క మిట్టాడు
చెయిదమ్ము లోకమ్ము చెంతఁజేరె;
నీలాబ్జ మాలికా నికటాసనపు వాంఛ
నిత్యమాంగల్యాన నెలవుకొనియె;
పూవులో పూవుగా పుట్టనెంచెడు బుద్ధి
మనుజ జన్మమ్ముపై మరులుకొనియె;

తమవులూకంబుఁ జూపెడి దర్పణంబు
జనుల వృత్తాంతముల నెల్లఁ గనులఁ గట్టె;
గగన వీధీ విటంకంబు గడచి రాని
టెక్కు వసుధారజంబులో నిక్కుగొనియె.

చీరుచిక్కుగ నున్న శీలసూత్రాలకల్
దిద్ది తీర్చెడి త్రోవ దెల్పినాఁడ;
కూడు గుడ్డలు లేని కూలీలఁ జూపించి
కన్నీళ్లు దెప్పింపఁ గడఁగినాఁడ;

జి.వి. కృష్ణరావు

పాఱుటాకులలోనఁ బాటాడు శిశుఁజూపి
యిది యేమి యని గదాయించినాఁడ;
సర్వదా సంగరోత్సాహంబు పెంపుతో
మల్లాడు లోకంబు మలపినాఁడ;
సుకములంద మరగి చొక్కెడి ప్రజనెల్ల
ములుకు పలుకు తోడఁ బొడిచి నాఁడ;
కష్టజీవిపైని కర్పూర ధూమమ్ము
మలయ పవనవీచి యెలికినాఁడ.

ఆకర్ణించిన వారై
నాకావ్యంబుల రసపరిణద్ధవు స్రోతో
నీకము, పఠియింపించిరి
లోకులు మూఁగెడి చదుకములోపల వీరల్.

నాగేయంబులు, పూర్వకావ్యములు, కర్ణాకర్ణి వ్యాపించి, జి
హ్వాగేయంబులుగాఁ దనర్చె; కరుణా పారంగులై యెల్లరుఁ
జేగేయప్రతిభా విభాసితునిగాఁ జింతించు చున్నారు; మీ
యాగారమ్ములు చూచు వారి నుడులం దాలింతు నీవార్తలఁ.

మీవదనారంవిందపుఁ బ్రమేయముఁజూడ నశోకమైన మా
ర్గావధి ముట్టి తెల్పఁగ తయారగు త్రోవలు దోఁచె; ముందు నా
పూవు లుపాయనంబులుగఁ బుచ్చుకొనుం''డని, చెప్పికొన్న కా
వ్యావళి తెచ్చి యాతని పదాబ్జముపై నిడె మోదబాష్పుఁడై.

నిండుమనంబు నవ్యనవనీత సమానముగా వసుంధరా
ఖండల నందనుండు కరకంజములఁ కవిరాజు హస్తముల్
రెండును గీలుకొల్పి, నెఱ ప్రేముడి వాఁకలు పుక్కిలింతలై
యుండఁగ గారవించి, తనయూహ నొడం దొడఁ బోయె మాయమై.

ఆ తీరున మాయమగుడు
గౌతమ నరపుంగవుండు కల్లోలవతీ
చేతో గతుఁడై, కనుకని
వాతాయనమందు నిల్చి పఱపెను నూర్పుల్.

## ద్వితీయ యామము

గౌతమదేవు నూరుపుఁ బొగల్ తొలిసంజల కాన్పులైన ప్రా
భాతిక మంద వాయువుల పాటివియై యమృతంపు జల్లులై,
చేతము సోఁకి, నెమ్మదిని జీర్ణములైన గిరీంద్రభారముల్
చేతను దీసివేసి నటుచేయ, నిసర్గలతాంగి పొంగుచుణ్

ఎదురుగఁ బోడ సూపినదై,
గుదివడు డెందంబునందుఁ గోరిక లేలణ్
కదలీ కదలని పెదవుల
పొదవఁగ లేని తలఁపు వెలిఁ బుచ్చెను తుదికిణ్

''దేవా! నే బ్రకృతిణ్; న వేలమగు వ్యాధిం గుంది, కూలారి, దై
న్యావృత్తంబున నుండఁగా తమదు శ్వాసాంకూరముల్ దాఁకి, నా
నోవుల్ గొంత శమించె; మీ వలన తన్మోక్షంబునం దాసలణ్
దైవారించె; నితఃపరంబు లసమర్థంబుల్ విచారింపవే!

ఎందఱెందఱొ వైద్యు లూహించి కనఁగ
వెదకినారు రోగామూల బీజములకు;
అపర పూర్వదిగాదర్శమందుఁ బోలె
అన్ని దృగ్గోచరములు గావయ్యె నధిప!

లగ్నంబైనది నా యు
ద్విగ్నంబైన మనము తమ ధీవిషయమునణ్;
మగ్నులరై దయఁ జూడుఁడు,
నగ్న శరీరంబుతోడ నడచెద''; ననఁగన్:

జలధులు, కొండనెత్తములు, శాద్వల భూములు, కాననంబులుణ్,
గొల కొల యద్రి సానువులకుం దలక్రిందయి చెంగలించు నే
ళులు, పొదరిండ్లలో నిదుర లోఁగిన బెబ్బులి బెట్టిదంపుటా
ర్పులు నెఱిమీఁదికిం దుమికి పోవఁగఁ బొంచిన పోతుసింగముల్;

కలచిన పూరిపోఁచలు మొగమ్ములనుంచి తలంగ పత్రము
ర్మురముల తారుకొంచుఁ గదుపుల్ గొని క్రేళులువాఱు లేళ్ళసం
బరములు, గాలివోసికొని వంశములెల్ల మృదుస్వరంబులన్
నెఱపఁగఁ జుట్టుముట్టు కరిణీకరియూధము తోఁచె గిఱ్ఱునన్.

రంకుల రాటము వోలెన్
సంకుల సమరంబు లాది సంకట వృత్తిన్
పంకిలమగు పల్లీపుర
కంకణ మగు భూవలయము కానఁగనయ్యెన్.

ఘణఘణాయితమైన కాళీయఫణిఫణా
కోటి తాండవ పాద గుంభనంబు,
ధణధణాయితమైన ధర్మరాణ్మహిష కం
ఠాలోల ఘంటికా వ్యాకులంబు,
భుగభుగాయితమైన గగన జటాజూటి
భోగీంద్ర నిర్ముక్త ఫూత్కృతంబు,
భగభగాయితమైన ప్రాచీన కలశాబ్ధి
హాలహలోద్ఘను జ్వాలికంబు,

ఘోరమై కర్ణపుటములఁ దూట్లుఁ వొడిచి,
నాసికా రంధ్రయుగళమ్ము గాసిఁజేసి,
త్వచము భగ్గుభగ్గున విదగ్ధంబుఁ జేసి,
ఊఁచ ముట్టుగా హరియించె నుల్లమెల్ల.

ఒక్కనిమేషము చేష్టలు
దక్కినవాఁడై, మఱి తను దాఁ దెలియంగా
నుక్కిరి బిక్కిరియై, తుది
కిక్కరణింబలికె నన్ను రేంద్రుఁడు పెలుచన్.

ఈ యుద్వేగము వృత్తిఁ బోవునెడ నూహింపన్ సుసాధ్యంబె? త
ల్లీ! యొక్కింత గుదింపఁ బోలును త్వరావృత్తంబు లక్షించెదన్;
ఏయే చోటుల నే వ్రణంబు గలదో? యేరీతి మాన్పంగ నౌ
నో? యాలోచన చేసి చూచెదను; నా నుద్వాంత వేగంబుగాన్:

''ఆయువు తీరెనేమి? కొడుకా! యొక మూఁడును నాలుగేండ్ల లేఁ
బ్రాయము చెల్లలేదు గదా! పాతరలాడెఁ గదోయి యన్న పా
పాయి హృదంతరంగముల బారవు సీసవుఁ గాళ్ళతోడ; లే
వోయి దమానుభావము; లనూహ్యములోయి కరాళదేవికిన్.

ఇంతటి ముందుదాఁక వదనేందువు గాసిన వెన్నె లేడ వి
శ్రాంతము చేందెనోయి? యెల సంజలు గుప్పిన మోవి జేగురుల్
గంతులు మాని యే తొవల కన్నియతేకుల డాఁగెనోయి? యే
కాంత విహారముల్ విడిచి కాతర భావము లూడ లాగరా!

ప్రణయ రహస్య బీజముల పాటుల నారసి విత్తికొంటి మె
త్తని యెదపాదులోన; తఱి దప్పక నీరము వోసి పెంచితిన్;
నెనరులు చిందుచుం దుదికి నీవు సముద్భవమైన సాఁకి కొం
టిని; దయమాలి ప్రేముడుల నిండిన గుండెలు చీల్చిపోయెదే?

పసపస కుత్తుక న్నులిమివైచితయారె! విలాసమేమొ? నా
దొసఁగులు ముగ్గి రాలిన విధూతములయ్యెనొ సృష్టి సూత్రముల్?
కసరినఁ జాలదా? ప్రభువ! కన్నుల చిచ్చులు నా శిరంబునన్
విసరితి వేటి న్యాయము? కనీసము తెల్పఁగదే పరాత్పరా!

30 మ్రింగి మదీయ బాలకుని మిన్నులు చూపెదవేల? కొంటె కో
ణంగి గదోయి! నీదు నయనంబులె యందుల కాన; ముద్దు కు
ఱ్ఱం గొని తెచ్చి పుచ్చుకొనరా గృహిణీ జనతా పునీత కృ
న్మాంగలికంపు దీవెనలు; తత్ఫలసిద్ధిని సాగు లోకముల్.

మెదలుచు నున్నవోయి మిడిమేలువుఁగాళుల జగ్గు నిగ్గు నా
హృదయ విలోల డోలికల నిప్పటికైన సహస్ర భంగులన్;
వదలర ఒక్క యీ యిసువు ప్రాణము మాత్రము; దీనితోన సం
పద లుడివోవు; తండ్రి! పరవా యిసుమంతయు లేదు వేఱుగన్.

కనుపడు జాఫరా మొయిలు కాంతులలోన ''సమస్త విశ్వ మీ
చనవులు గోరదా?'' యనుచుఁ జాటెదవా? యల సందియంబులే
యనవసరమ్ము లోయి·కరుణాలయ! యేనరమాత్రుతోడఁ జె
ప్పను మఱి చెప్పనోయి! యిది బాసగఁ జూడుము; నన్ను బ్రోవుమా!

జి.వి. కృష్ణరావు

నాకీ గుండియ లేటికిచ్చితివి? అన్నా! యిట్లు వర్తించుచో
మూకీభావము నెట్లు దాల్పఁగల నే మూర్ఖంపు జన్మంబునో
సాకూతంబుగ నిచ్చినన్ దొలఁగి యీ వ్యామోహ పాథోధి కా
రాకూరమ్ములు సోఁకకుండును గదా బ్రహ్మాండ నిర్మాపకా!

సాయంకాల సమీర డింభకుఁడు, తన్నా దీయ, మున్నాటలో
నాయాత్మోద్భవు జాల్పముల్ చమిరి, యీ నాఁడిట్లు దుర్మార్గుఁడై
యాయత్తం బొనరించుకొన్న శిశు శయ్యా వస్త్ర నిక్షేపముల్
పాయంజేయుచు నున్నవాఁడు గద! యీలా గయ్యె నా చందముల్.

ఘృతమును గార్చు నన్నములు గిన్నియలోపల నున్నవోయి; యీ
మెతుకుల కేఁడు పాత్రుఁడు? సమీపవు సంగడి కాఁడు లేఁడు; నా
బ్రతుకులు తెల్లవాఱినవిరా తనయా! ప్రతి దానిలోన నీ
గతులును, నంగి మాటలును గానఁగ నయ్యెడు నేమిసేయుదున్?

బోనము నాన్నగారి కిడఁబోయెడు వేళల నీవు పైఁట కొం
గూనిన యట్టులై వెనుక నూరకచూతుఁ గదా! తమాల సం
తాన దురంతదుర్దమ ఘనాఘన వర్షిత ఘోరనీలి మా
పీన తమంబులందు పరిపీడిత ఘూక వికార రోదనల్.

సీ! యటు గూఁడు చూడుము! మషీరసపంకము సారలైన క
న్మాయఁగ లేదురా! కలమునం బొదివించిన మంచి క్రొత్త పా
ళీ యిసుమంత చిట్లదు; నిలీన మహోగ్ర దృగంత మందు కెం
జాయలు లేవు నాన్నకు; హుషారులె చచ్చినవోయి పుత్త్రకా!

కుదురుగ నున్నవోయి మన గుండిగలోని జలమ్ము; మంటి పె
ళ్ల దరక లేమిలేవు; పలలంబులుగావు; తఱుంగఁబోవురా;
చిదురుప లైన క్షారము విశేషము దోఁపదు కూరలందు; మా
మెదుకుల పళ్లగింజ కనమే కనమోయి నిలింప ధూర్తుఁడా!

ఆకుల దూసి పోసితివిగా, యలనాఁటివి బొండు మల్లియల్
నీ కయి పూచి చూచెడిని; నీ మురిపెంబగు చిట్టి చేతితో
పీఁకి మఱొండు చోట నిలఁబెట్టిన బీర–ల దేమి తత్త్వమో!–
ప్రాఁకులు గొన్నవోయి; యొకసారి కనుంగొనుమా విలాసుఁడా!

ఎల్లమొక్కల తల లీవు గిల్లినట్లు,
మిత్తి దేవత నీ తల కత్తిరించె;
అపుడె నెత్తి నోర్వెట్టుక యఱచినాను,
కొంచెమేని విన్నావురా? కొడుకుఁ గుఱ్ఱ!

నిలయ పదార్థ సంచయము నిల్వువ నిల్చెను; చింద్ర వందటై
కలకల లాడవోయి; యివి కాంచినఁ గాసర గూసరై మనం
బులికెడి; తొంటి నీ సుహృదు లూరక పాపలు, పాపలంచు, నిన్
బిలిచెడి యీ రెలుంగులను విన్నను జివ్వున లాగు ప్రాణముల్.

బోరచి పుట్టువయ్యె; మము బోంట్లకు దక్కదె? పుణ్కపుణ్కన్
క్షీరము గ్రోలు చందములు నేఁటికి నాయెద హత్తియుండె న
న్నా! రవయేల రమ్ము; మెడ హాయిగః గౌఁగిట నొత్తు మోమణీ
హారము! నా పురాతన భవార్జిత భాగ్యమ! యేది, నవ్వరా!

సరదాగా మన మంచమందుఁ బొరలన్ శంకింతు; రేలందు నీ
కరముల్ మున్పటి రీతిగా నిమిరి జోకల్ వార్పయత్నింతు; ని
ద్దురలో నైనను పాడుచుంటిఁ గద యోదుశ్చేష్టుఁడా! యింత ని
బ్బర మెట్లైనది? లిప్స నేను గనిపింపంబోనిచో నేడ్తువే!"



అని యల్లడ తల్లడమై
పనవుచు, నానా విధములఁ బరవశ మనమై,
వెనుబడి, తడఁబడి, స్రుక్కెడి
జనినం గని గౌతముండు జార్చెను నశ్రుల్.

పండుటాకుఁ బోలిన ముదుకం డొకండు
తెచ్చికొన్న భైషమ్ము శోధించు కొనుచు,
ఫాలదేశంబుపై స్వేద వారి దొఱఁగ
అట్టె జారె వటానోకహాశ్మమందు.

జిలజిల లాడుచుం దొఱఁగి చీఁదర గొల్పెడి చీము నెత్తురుల్,
పలలమువోయి సంగొఱుకువడ్డ పదాంగుళికంబు, లూరకే
గులగులలాడుచుండు పురుగుల్, ముసురింతలు వాఱు నీఁగలున్
గలిగి నికృష్ట కుష్ఠునకుఁ గంపరమెత్తిన విహ్వలించుచున్:

‘‘ఈ రోగస్థుని నేల చేసితివి తండ్రీ! లోక మాభోగతా
స్ఫారం బొందదొ! నా ప్రయోజనము కాంక్ష్యంబైనదో? లేకన
న్నీ రీతిన్ వగయించుటే తలఁపొ? మున్నేమేని పాపమ్ములన్
కారుణ్యంబునకుం దలంగితినొ? వక్కాణింపు లోకేశ్వరా!

ఆహారించితి వెన్నఁడో కొడుకు, నిల్లాలిన్; జరాభార మం
దోహో యిట్టి మఱుంగు కోఁతల? త్వదీయోద్యాన భూజాత సం
దోహంబందునె భైక్ష సూనమఱుచున్ దోదూయ మానుండనై,
ఆహాకారము చేయుచుంటి; దయ లేదా! నీకు విశ్వేశ్వరా?

అనుచుఁ గన్నీరు మున్నీరు మునుకలెత్తి,
ఊర్జితంపు జీవనశక్తి యూరడింప,
కడుపు సొదయగ్గి మంటలు మిడుకరించి,
తిరిసి తెచ్చిన బోనమ్ము తినఁగఁ బోయె.

టక్కరి కొక్కెర యొక్కటి
యక్కుజ శాఖాదళముల నడఁగుచుఁ దరిగా
నుక్కివతనమున విడిచెను
నక్కరుణాపాత్రు నన్నమందున మలమున్.

కంద గడ్డ లాగయ్యె భూకాంతు ముఖము;
వెల్లఁబాఱెను నాశాంత వితతులెల్ల;
వుల్ల వడియెను సోమేరు భూధరమ్ము;
వణఁకి పోయెను తనువెల్ల ప్రకృతి కపుడు.

వెడలిన విస్ఫులింగములు వేడబమ్మై మయి యెల్లఁ గాల్పఁగా
గడగడ లాడుచుం బ్రకృతి గౌతమదేవుని పాదభూమిపైఁ
బడి, ‘‘యపరాధ్ధనైతి; పొరపాటున జూపితి నిట్టి దృశ్యమున్
మిడుక దయామయా! తమ సమీపమునం’’ దని వేఁడుచుండఁగన్:

చందనమును మైఁబూసిన
చందంబై, చల్లవడిన స్వాంతంబై, యా
కందళి తోత్కంఠంబై,
ముందరిగిన త్రోవ ప్రకృతి పోవం దొడఁగెన్.

వేఁగురు జొక్కలా నుదుట బీరపుఁ గుంకుమ బొట్టువెట్టి, బై
రాగుల రచ్చ రేకుల సరమ్ములఁ దాల్చిన వట్టి కొంగుతో
దాఁగురు మూఁత లాడ శతధా యిసిఱింతలు వోవుచుం, జలం
బీఁగెను వాఁడు దేరిన మహీరుహ కోటికి పుష్పవల్లికిన్.

వనగొను కుంజిని న్నిలిచి, "నల్వురు బిడ్డల తండ్రివైతి; విం
కను గనుపింపవోయి మన కాఁపురమందలి పాటులెల్ల; ఏ
మనఁగలదాన నిన్ను? పవమాన సమాహతిఁజేసి కూలె నీ
వన తరు జాలముల్; మిగులుపాఱులు వాఁడెను వేఁడి గాడ్పులన్.

వడవడఁ బాఱుచున్ వడఁకుఁ బట్టిన యీముదుకంద్ర నిద్దఱిన్,
దొడుకుల నప్పగించితివి; తూఁగకయున్నది కొంచెమేని ఈ
బెడిదపుఁ గాఁపురంపుఁదడి వీసము నీమది కెక్కఁబోదు; మ
న్గడుపుల యల్లుఁడైతిని వినూత్న నృపాలుని గేహసీమలన్.

ఎల్లమదాభిమానముల నీఁదుచు నుండిన షాహుకార్లకుం
34 జెల్లును గాక దేశమని చెప్పి, హళాహళిఁజేసి, పోరికై
విల్లును, నిండు టంపపొది వీఁపున దాలిచి పోవుచుండుటల్;
పిల్లలు జెల్లలుం గలిగి వేసరు బీదల కేల చెప్పుమా!

చదువును సంధ్య లేమిని పచారులు సేయుచు నున్నవారు నా
యదుపులు మీఱి, యిట్టి తనయావళిఁ గాంచుటకన్న ద్రోహము
న్నదె? మన జాతికిం గలుగునా యభివృద్ధులు బాలురీగతిన్
బొదలిన? ఇంట నుండి చదువుల్ గఱపించుట మేలుగాదొకో!

మూఁడు కారులలోన ముప్పందుమీఁగెడి
కేదార ఖండంబు బీదవడియె;
ఆ కాల మీకాల మనకుండ ఫలియించు
శాకాదికంబులు సన్నగిల్లె;
అభ్రంకషంబైన యాముటెద్దులు రెండు
ఉన్న వున్నట్టులే యూడిపోయె;
గుమ్మటమ్ముగనున్న కోడెదూడలతల్లి
గాలికుంటులలోన గడచిపోయె;

ఆఱుమూఁడయ్యె గోమైన యావుపెయ్య;
పంచ బంగాళమయ్యెను పశువులెల్ల;
కవణములఁ దేర మానిరి కమతగాండ్రు;
అదువు పొదుపేదు సంసార మయ్యెనోయి!

తిరిగెడు వారల కీ సం
సరణపు భారంబులేల? సన్యాసివి గా
వలిసిన నేమాయెనొ?'' యని
దురపిల్లఁగ నా విచిత్రతతో యదమేగెన్.

ద్యావాపృథ్వులు రెండునుం బలిసి, రుద్రాత్తత్రయీనేత్ర కీ
లా వారమ్ము లుదగ్రపాదములతో లాస్యంబు గావించి, లీ
ప్సావాగ్రంబు వహించి, సూక్ష్మమయి యుద్దారంభ వీరాగ్రణీ
హేవాకాంకిత తూణము బొదివె సాదృశ్యం బదృశ్యంబుగన్.

ఆదట భీష్మమౌర్వులను నల్లల నుయ్యెల లూఁగి యూఁగి, కా
కోదరసాయకాగ్నులను గుప్పి, మహోత్కట శోణితార్ద్రధా
రోదర మస్త్రముల్ డులిచి యూడిచి, కర్పరముల్ ధరించి, యా
మోదిత ఢాకినీ గణము ముఖ్యుల నాడెను బ్రేంకణమ్ములన్.

ఆయోధన రంగంబును
బాయంగాఁ ద్రోసి, పిదప జ్వాలామాలల్
మాయంబై త్రుటికాలము
వాయించెను ఢక్క రుద్రవాటికలోనన్.

చిక్కురు బొక్కురై, తడిసి చింపిరి తంపరలై, నిశీథముల్
నక్కల కూఁతలం బెరసినన్ నినదించుచు, పిన్నపావలం
బొక్కిన రక్కసల్ విడలిపోయిన వచ్చిరి గుంపులై వయో
భాక్కులు, కింకిణీరణిత పాదులు, బాలపిశాచసైనికుల్.

సహకార భూజాత శాఖా ఘటితఘోటి
చలో చలో యని యొండు చఱచి విడచె;
గోస్తనీ వల్లరీ ప్రస్తుతాందోళిక
నొక్కండు లీలగ నుయ్య లూఁగె;

రాజీవమృదుకాండ రచిత ఖలీనంబు
తగిలించు కొక్కండు దాఁటు దీసె;
వటవృక్షమూలంబు వార్వంబుగా నెంచి
కళతోడ నొక్కండు కసరికొట్టె;
ఒకటి గుజ్జెన గూళ్ళతో సకుల గాలిచె;
బొమ్మ పెండ్లిండ్ల నొకటి శుభమ్ము నెఱపె;
ఇట్లు బహు శైశవక్రీడ లేలుకొనుచు,
నోల లాడె నానంద వయోధిలోన.

గాలి దుమారమందున నెగాదిగలై, చితిలో చటచ్చటం
గాలుచునున్న కట్టియల కావిరి క్రొంబొగ మబ్బుచాడ్పులన్
జీలిచికొంచు, వార్ధక విశీర్ణతనూబలమైన శాకినీ
జాలము వచ్చె బొమ్మ తెఱ జాళుగ నెక్కుచు నుండుదారిగన్

మంతన మాడిన తద్ది
36 మంతులు గొందఱు సుడివడి మఱలిన తెగువన్
సంతన కట్టుగ పైఁబడి
కుంతలములఁ బట్టి కొనిరి కొందఱు జనులన్.

కొంచెపడిన శాకినులెల్లఁ గ్రుద్ధలగుచు,
"కవుల నేడ్పించు జాతికి గౌరవంబు,
నభ్యుదయ సమున్నతియుఁ బూజ్యంబుగాదె?
అరసి కొనుఁడు దుష్కర్తులు చొరక మున్నె."

అనఁగా విని, కవకవ న
వ్వినవారై, "వీరనఘులు, విశ్వవిదూరుల్;
చెనకకుఁడీ! చెనకకుఁడీ!
కనలిన లోకంబు లెల్లఁ గాలకయున్నే?".

అనుచు మేలంబు లాడిన వెనుక వారు,
"కాయ కష్టంబు కంటె మీ కవన మెట్టు
లధికమో వినిపింపుఁడీ! అసలు, కవిత
నాస్తి గాదను వీవాద మందికొనుఁడు.

''హృదయ కుహరాల దివ్య సంపదలు గలవు;
కుత్తుకలలోన మెదలు పుంస్కోకిలంబు;
స్వైర విహరణ సల్పుదు మింతె'' యనుచు
స్వారి తీసినారలు మాభుజమ్ములందు.

దేవునికిడు గుణగణములఁ
బ్రోవులుగాఁ జేర్చి తెచ్చి బూమెలపోకల్
వోవుచు నున్నా రంతియు;
యేవీ కవితాగుణముల నెఱుఁగము చెపుఁడీ!

అనెడు గగ్గోలుతో దృశ్య మాఁగిపోయె;
''బుద్ధ దేవాయ తుభ్యం నమో నమోస్తు;
విశ్వ జీవన రక్షాయ విజయమస్తు;''
అనుచుఁ బ్రకృతి చిటికలోన గనుల దాఁటె.

## తృతీయ యామము

కళకళ పాటుతో హృదయ కందము చేతన భావపూర్ణమై
మొలకలు వాఱి, హర్షజలముల్ గొనఁజాలని జీవభూజమున్
మెలిగొని, నైకధాగతుల మిశ్రితమ్మైన సుగంధిలంపుఁ బూ
వులఁ దొడిగెన్ మహామహిత బుద్ధవదాన్యుని చిత్తభూమిలోన్.

కాఱియ నొందుచున్నవి జగజ్జను లైన సమస్తజీవముల్;
తారొనరించు దుష్కృతములం బ్రసవించుచు నున్న ఘోర శో
కారభటుల్ వరించు ననఁగా నిసుమంత సమంజసంబు గా
నేరదు; పుల్గు కోలమొన నెవ్వగఁ దూలుట కేమిచేసెనో?

పాఱఁగఁ జూచినన్ మన మపారయోధి తరంగ మాలికా
ధారత పోయి పోయి, అతిదారుణ భంగుల నీటిగుండ మం
దూరక సుళ్లువెట్టెడు ననూహ్యము లన్న విధంబునన్; బరి
ష్కార విధాన మందదు; విషాద వికారము లావరించెడిన్.

చెమ్మటఁ దొప్పదోఁగిన కృషీవలు జీవిత పుణ్యకావ్య ప
ద్యమ్ముల నొక్కటొక్కటిగ నా వృషభేంద్రుఁడు తాలుపేన ఖం
డమ్ముల మాపివైచు; గుణటంకృతి చేసిన భూమిపాలు గా
నమ్ములు పోవు నయ్యనుజనమ్ముల యగ్గలికంపు టూర్పులన్.

విడుమర లేని కూరుముల వెల్లి షికారులు పోవువారి సం
గడి మురిపెంపు గీతములు కష్టబిభీషికఁ గ్రాయు నేడ్పులో
సడలి కృశించి కూలినవి; స్వాదు పయస్సులు గ్రోలుచున్న యాఁ
దొడుకు సుఖంబు పోయినది దోర్ద తెమల్చిన పాత్రలోనికిన్.

ఒకని సుఖంబు నాఁచికొని యొక్కఁడు కుల్కఁగ జూచునంతె; యీ
తికమకపాటు సర్వము నధీతముగామి ననేకరీతులం
బెకబెక లాడుచుందురు వివేచన సేయక, బూటకంపు శో
ధక పరిగణ్యులెల్లరు నధఃపతనాధ్వగ హేతుభూతులై.

---
జి.వి. కృష్ణరావు

వచ్చిక పట్టులం దిరుగు బాలశశంబును వాఁడి గిట్టలన్
ముచ్చముడుంగఁ దన్ని మఱిపోవుఁ గురంగక శాబకమ్ముు; పై
నెచ్చటినుండియో యురికి, యీరుటెలుంగుల లెక్కసేయకే
వ్రచ్చును వ్యాఘ్రపోతము; విపాటితఁ జేయును దాని సింగముల్.

బాలరసాల సాల నవపల్లవ ఖాదన మత్తమై, కువూ
కూల మిటారముల్ నెఱపుకోకిల బాలను వాయసమ్ము పె
న్గోళుల రక్కుచున్నది వికుంఠితమైన దయాంతరంగమై
సాళువుడేఁగ దాని శిరసా పరిఖండితఁ జేయుచుండెడిన్.

కెరడులు రాయిడించి కలిగించిన తామర పూలవంటి పె
న్నురువులలో జనించిన వినూతన కీటకజాతి పూగమున్
దొరఁకొని గండు మీనములు నోటి బిలంబులఁ జేర్చుచుండు; నా
వురు మన వానినెల్లఁ గడుపుం దొరయించుచు నుండు నక్రముల్.

అంతటిదాఁక నేమిటికి? ఆఁకటఁ జామ్మలువోయి దువ్వు బా
లెంత దురంత శోక విమిళిందక వోష్ణపుటశ్రుబిందుతో
వంతను గూరి, తుట్టతుద ప్రాణభరమ్మున కోహటించి, ని
శ్చింతగ కూలన్ మెసవు; జీవము నిల్పుకొనంగ పాపమో?

కామ వికారమెత్తి కవగాఁ దిరుగం బనియేమి? గర్భమై
యీ మఱుకాఁక లందుడికి యిట్టులు వందురనేల? కాన్పు మా
లీమసవృత్తి తోడఁ గబళింపఁగ నేల? తదంతరంబులై
యేమి రహస్యముల్ గలవొ? యేమి విధించునొ సృష్టి సూత్రముల్?

యాతాయాతపు జీవలోకమున కాహ్లాదించు న్యాయమ్ములే
దో? తన్న్యాయమెయున్న కూన జననీ దుర్వార హృత్కీలలో
నీ తీరొందఁగ నేల? దీని ఫలితం బేరీతిగా మూడునో?
యాత్రాభారము లెట్లు పోవునొ? దురూహంబుల్ గదా బుద్ధికిన్!

సూనరియైన బెబ్బులి ప్రసూతి వధించుచునుండు రీతి, క్రో
ధానల ఘూర్ణమానస మృగాధిపుఁ డేనుఁగు పిండు కుంభముల్
లూనము చేసి నెత్తురులలో విహరించుచునున్న భంగిగా,
మానవుఁడెల్ల సత్త్వముల మార్కొని త్రుంచెడు స్వార్థచిత్తుఁడై.

అఖిల వాసయోగ్యమ్ముల నంతమయ్యు,
కదలఁ జాలకున్నవి జీవగణము లెల్ల;
పొత్తు లెంతమాత్రము లేవు; పొడలు కంట
గింపు లవుచున్న; వెట్లు వారింప నగును?

ఒకఁడు జీవించుటన్న వేఱొకని జీవి
తంబు మాపుట యన్న తాత్పర్య మగును,
ఎవరు జీవింపఁ బాత్రము; లెందు కొఱకు?
ఎవరు మరణింపఁ బాత్రము, లెందు కొఱకు?

ఈసమస్యా పరిష్కార మింత వఱకు
అంతుపట్టదు; జ్ఞాన భాస్వంతుఁడైన
మనుజుఁ డద్దుపద్దుల దాఁటి, తనకు వాట
మైన మార్గాల మెట్టంగ నర్హమగునె?

భావి పురాతనాద్యతన భావవిదూరులు, చేతయేకులౌ
40 జీవులు సర్వథా సుఖులు, చింతలు, చీఁకులు, చేరరాని యే
దీవుల యందొ నిల్చెదరు; దీని మహార్థము లెల్ల పూవులో
పూవుగ పుట్టఁగోరు కవిపుంగవు గీతిక మారుమ్రోసెడిన్.

జంతు హింసాత్తమౌ నర జాతియైన
సుఖియె యనుట కేమాత్రము చోటు లేదు:
బూరటిల్లుచు నున్నది భూనభమ్ము
దుఃఖ భావుక రోదనోత్తుందిలమ్ము.

విల విల యేడ్చుచుండు విరుపేద భరంబుగనున్న యాలు బి
డ్డల సొద మంట తీర్పఁగఁ గడంగు నుపాయములేక; ప్రొద్దుగ్రుం
కులు శ్రమఁజేసియున్ వలయు కూడును గుడ్డయు లేక యార్తులై
యలమట మందుచుందురు సహాయము చాలక దీనలోకముల్.

ఉస్సురుస్సు రనుచు నుండు నోర్వలేక,
మందు లేని జబ్బున వేపమానుఁడగుచు;
బావురున నేడ్చుచున్నాఁడు పట్టలేక
యొక్కరోగి యగ్గలమైన డొక్కశూల.

జి.వి. కృష్ణరావు

బారలు సాఁచి, డోల దయివారెడి జాళువు లక్కబొమ్మలన్
జీరుచు, బోసి నవ్వు నునుజెల్వముతోఁ దనలోనె పాపఁడే
దోరకమైన కేకిసలతో మురియన్, సహియింపలేక, కే
కేరున నేడ్వ, మృత్యువతికించిన బుద్ధి గళమ్ము నొక్కెడున్.

బిగువు కవుంగిటం బొదివి, పేరుటురమ్మున వ్రాలి, నిద్దురం
దగిలి సుఖించుచున్న వనితామణి నల్లనడించి, శాంబరీ
విగతమనోజ్ఞను రాగమున వెల్వడుచుండు చిరంటికా జనా
నుగమిత మోహవిద్ధుఁడు కనుల్ గికురించు నిశీథ వేళలన్.

కడుపున కైనం దృప్తిగఁ
గుడువక గడియించుకొన్న కూడలి లిబ్బుల్
బెడిదపు టాఁకలి యాఁకల
కడలుచు వెడలించు దొంగ యిటమటికాఁడై.

దబ్బఱలౌ పురాతనపు తత్త్వము విజ్ఞులు త్రోసివేయఁగా
నిబ్బరమేది యీజనము నిక్క మెఱుంగుట కిచ్చలేక, యా
కబ్బములెల్లఁ గాల్చి; వెడకారులఁ బ్రువ్వగఁదిట్టి, జైళ్ళలో
ప్రబ్బఁగఁ ద్రోయుచుందు రనివార్య తమః పతితాంతరంగులై.

అవుగాముల్ దలపోసి చూడక, విభేదారణ్యముల్ ప్రోదిసే
సి, విశేషజ్ఞులు గానివారల కృషి శ్రీలెల్ల వేఁటాడి, యే
భవితవ్యంబు గ్రహింపకుండఁ గబళింపం జూచుచున్నారహో!
దవులం బాఱకయుండునా? ఘనుల కర్థ్యంబైన మాంగల్యముల్.

ఏనిలయంబు దాకొనిన నించుక శాంతి వహించు చిన్నియల్
గానఁగ రావు; బెట్టిదము, కర్ణకఠోరమునైన శోకముల్,
దీనవిలాప వాక్యములు, ధిక్కృతముల్ వినిపించుచుండు; దుః
ఖానక మన్నివైఖరుల గ్వార్థనిబంధిత జీవనావళుల్.

గ్రంథంబుగాఁ జూచు కాంతు నెమ్మోముపై
బుస కొట్టుచున్నది పొలఁతి యొకతె;
భోగ్యపదార్థంబు పోలిక మన్నించు
భర్త నీసడిఁ జూచు పడఁతిఁ యొకతె;

కసిడి కోఁతలతోడ పసువరించుచు నున్న
మగనిపైఁ గోపించు మగువ యొకతె;
తనపాలి స్వర్లోకదయితగా నెంచిన
హృదయేశు నీసించు నింతి యొకతె;
ఉచితభంగులఁ బ్రేమించి యున్నఁ గొన్ని
దినములందె విరక్తించు తెఱవ యొకతె;
అధిపునందనురక్తయే యైనఁగాని
అన్యు నెదలోన లక్షించు నతివ యొకతె.

అంతియ కాని లేవు ప్రణయంబులు నిత్యములై, యభిన్న భా
స్వంతములై, దయా గుణ వివర్ధములై, గృహ జీవితంబు లిం
తింతలు గాక మానవు తదీయ పథమ్ములు సత్యదూరమై
నంత కుటుంబజీవన శతాంగము వేఱొకదిక్కు వోయెడిన్.

ఎటులు పోవలెనో నిర్ణయింపలేదు;
ఎచటి కేగవలెనొ నిర్ణయింపలేదు;
పోవుచున్నది యీ తేరమోఘధాటి;
ఏడ కూలునొ యే మౌనొ యెఱుఁగ రాదు.



ఆధి వ్యాధుల జీవన
శైథిల్యము దాపురించె; చక్కని త్రోవల్
శోధించి కనుంగొని పై
బోధింపఁగఁ బూను పుణ్య బుద్ధులు లేరే?

మమకారమ్ములు లేని ప్రేముడులు నిర్మాలిన్యమై జీవలో
కముఁగాపాడు వలంతి గాఁబలుక నాకర్ణింతు; మత్తేభకుం
భము మేదస్సు భుజించు సింహమునకున్ బాటింప సాధ్యంబె? బో
ధ్యములౌనే? యొకవేళ దీక్షగొనినన్ తజ్జీవముల్ నిల్చునే?

ఉపకారమ్ములు పొందఁగా మనుజుఁ డుద్యోగమ్మునం జిక్కు; న
య్యుపకారప్రతిపత్తిగోరి తలపోయున్ బ్రేమధర్మమ్ములన్
నెపముల్ మాలిన ప్రేమకార్యములు లేనేలేవు; సాగింప జీ
వపుఁగార్పణ్యము ద్రోసిరాజనక దైవారింపఁగాఁ జూచునే?

జి.వి. కృష్ణరావు

ఏవిధినైన పూనిక వహించి ప్రచారము సల్పుచో అహం
భావము పుట్టు; దాన మమ భావము లప్పుడె యంకురించు; నీ
క్రైవడి పిష్ట పేషణముగా నివటిల్లు బెగాని తీరువుల్
గావు రవంతయైనను జగజ్జనితంబగు రోదనధ్వనుల్.

పరమార్థంబులు నిశ్చితంబులయి నిర్వాహ్యంబుగా నున్నచో
జరుపన్ వచ్చును వానికిం దగిలి నిష్క్రమమ్ముగా నన్యముల్;
పరమార్థమ్ములు లేనివేళ మమ భావమ్ముల్ విదారించి, యె
వ్వరువ ర్తిల్లఁగ నెట్టులోపఁగల రల్పంబైన జీవమ్మునన్.

జీవితమం దవశ్యముగఁ జేయఁగనైన విధానమేమి? సౌ
ఖ్యావధి ముట్టి చూచుటొ? నిరంతరమై కమనీయమైన యీ
జీవుల సృష్టి కోసరము చేడ్పుడఁ జూచుటొ? దుర్భరమ్ము, దుః
ఖావిలమైన ప్రాణి భవమాపి వశంవద ముక్తి నొందుటో?

''ఇద మిత్థ''మ్మని చూపి చెప్పనగునా యీ సౌఖ్య భావమ్ములన్?–
మద కుంభీంద్రము ప్రేయసీ యుతముగా మల్లాడు కాసార వా
రుదరంబందు ననేక కేళికల; నయ్యూబిన్ మిటారించి స
మ్ముదితంబైన వరాహముల్ పొదలు నాభోగంపు వ్యాపారులై.

కొంటెతనాన రిత్తయగు కొబ్బరిబొండము మర్కటుండు తాఁ
గుంటెనకత్తె కిచ్చి పలు కోకిసలాడి సుఖించుచుండు; ఆ
తుంటరి భావముల్ సుఖమొ? దుస్సహమో? వచియింపఁబోలునే?
కంటకతుల్యమై యెడఁద కాఁడుచు నుండు పరాయి వారికిన్.

ఒకనికి సుఖమిచ్చిన, వే
ఱొకనికి తలకంట గించు నొకటే యర్థం
బకటా! వంచింపఁ బడితి;
సుకమను భేదమ్ములేదు చొప్పడి యెందున్.

సౌందర్యవికారము, లా
నందము, శీతోష్ణములు మనః ప్రభవ వికా
రాందోళనలోఁ బుట్టువు
లందుచు నున్నవి; తదన్యమైన నశించున్.

భవ విమోచన మర్దించి ప్రాఁకులాడ
పైని యేమున్నదో? యెట్టులౌనొ యేమొ?
ఇంతకన్న భీష్మావస్థఁ గాంతుమేమొ?
కొలఁది మాత్రంపు టాచూకి తెలియరాదు.

తృష్ణా తుందిల జీవకోటులను నుద్వేగంబునం దార్చి యా
విష్టుబై యొక దైవమాడు కొనుచేఁ వేడ్కల సాధించి, నే
నిష్ణాతుండను నౌదు, ప్రాణులకుఁ దన్ని శ్రేయసార్చిస్సుతో
కృష్ణచ్ఛాయలఁ దూల్చి చూపెదను నిఃక్లేశంపు నిర్వాణముల్.

తాపసవృత్తి గైకొని, నిదాఘ మహోగ్రగభస్తి బింబ సం
తాపనఁ దూలిపోక, జలదంబుల ధారల బ్రుంగిపోక, ని
ర్వావణ భూదరాగ్ర తరువక్వఫలంబుల నాహరించి, పా
పోపశమంబు గాంచి, తుద కుజ్జ్వలుఁడౌ పరమేశుఁ జూచెదన్.

ఇంత శ్రమంబుచేసి, పరమేశ్వరు దర్శనమైన బుద్ధి సం
క్రాంతము గాక యాతని ధురంధర రూపమునందు నైక్య మ
ర్థింతునొ లేదొ? సందియము; తేరికి సారధియైన వెన్ను రూ
పంతయుఁ జూచియున్న నరుఁ డార్తుఁడు మూర్ఛితుఁడై చలింపఁడే?

కొనకొని యమ్మహాత్ముఁ గనుగొందు; అపాయములేని భద్రముల్
వినియెద; జీవలోకమున వేడబమంతయు పొల్లువుచ్చి, పా
త్తున మను మార్గముల్ తెలిపి, తుట్టతుదన్ శివమైన గమ్యమున్
నెనసెడి పద్ధతుల్ గఱపి, నేతరియించెద ధన్యజీవినై.

అంధువు నందుఁ గూలిన ప్రజావలి నీవలి కీడ్చి, జ్ఞానసం
బంధములైన సంగతులఁ బల్కి, యశోకపథమ్ముఁ జేర్తు, పా
ణింధమ పూర్ణసంసరణ నీరధితారణ మాచరించి; త
ద్గంధవ మెల్ల మాను వసుధాపతి సంస్థితి యేల కాల్చనే?

అందఱ కోసమైన పరమార్థము నేనె తలంచుపూన్కి గై
కొందున యేని, నేను నవికుంఠితధీమతి నన్నగర్వ మం
దందు ధ్వనింపదో? మొదట నాత్మవిచారము సేయఁగా భయం
బందిన వాఁడనై పరుల యర్థము చూడఁ గడంగినాఁడనో?

ఫా! యది బూటకమ్ము, ప్రతిభాధను లెందఱో యున్నవార; ల
ధ్యేయ కుటుంబ భారముల తీఱిక చాలక యుమ్మలింప, చిం
తాయితు లౌట కోపుదురె? తాదృశ చింతలు లేమిఁజేసి, నే
నీ యవిలంఘ్య తత్త్వము గ్రహించుట కోపుదుఁగాన పూనెదన్.

ఆదల నన్నిటిన్ మఱచి, యాపువుఁబాన్పున నిద్దురించు శా
తోదరి నా వియోగమున నూఱడి చెందక భగ్నచిత్తయై
రోదిలకుండునా? యకట! రూషిత ధర్మ నిరూఢ వృత్తికిన్
వేధితగాక యేమగును? వ్రీలిన రాగము లెంచకుండునే?

నానా! నానా! యనుచుం
బైనికి పరువెత్తివచ్చి పైపక్కలలోఁ
దానై మెలఁగెడి యీ పసి
కూనండేఁక మీఁద నెంత కుములునొ యేమో?

ఐన వీరు లోక శ్రేయ మర్థిఁజేసి
చేడ్పడినఁగాని, కొంత త్యజింపవలయు;
కలవు దీర రాజ్యోప భోగములు గలవు;
కంటిఱెప్పగా జనకుండు కావఁగలఁడు.

అని చింతించిన యాదట
జనపతి కక్ష్యాంతరములు చనిచని, తుదికిన్
తన యశ్వోత్తంసముపైఁ
జనియె వెనుక నంధకార సాగర మెనయన్.

ఈశ్వర, ఆషాఢం

# ప్రణిపాతము

( ఒక కవి రాజాకోపానికి గురిఅయ్యాడు. ఆరాత్రిలోగా రాజధాని విడిచి వెళ్లకపోతే అతని తల అతనిది కాదు. కవి యింటికి వచ్చేటప్పటికే పదిగంటలయింది. పెళ్లాము బిడ్డలతో పద్దానుగామడలపట్నం తెల్లవారులోగా దాటిపోవాలి. ఇంట్లో మూటా ముల్లే సర్దలేదు. పిల్లలు కలవరింతలో ఉన్నారు. భార్య ముసుగు తన్నిపెట్టుకొని పండుకొన్నది. ఆవిడతో కవి-)

గాలమువైచి నా కొరకు కాలము కన్నుల నార్పకుండ ఆ
జీలుగ కాచుకొన్నది; నసీబున గీసిన కొంటె గీతలో
కాలము మూడునో, పురుషకారములే విజయమ్ము లందునో!
జాలము సేయరాదు నిముసమ్మయిన౯, పయనమ్ము గట్టుమా!

భానుడు ప్రాగ్దిశాచలముపై కెగబ్రాకుటె జాగు, కాశ్యపీ
జాని మహోగ్రశాసనపు జాగిలముల్ గొని నాలిలేని నా
ప్రాణము వేటలాడుటకు పంతము పట్టినవాడు; తెల్లమై
దానము లల్గి నారుధిరధారలు గ్రోలి సమాధికట్టునో!

అన్నెము పున్నెముం దెలియనట్టి కుమారులు నిండుకుండలై
కన్నులుమూసి, కోరికలు కట్టిన దివ్యజగమ్ములందు, ఏ
పొన్నల నీడలం దిరుగబోయిరొ! మృత్యువు, కన్నుగుట్టి, ఆ
ప్రన్నని పిల్లవాండ్రకెగబడ్డది, లేపుము, లేపుమా చెలీ!

భూపతి శాసనమ్మునకు బోసిన యుచ్చుల నొక్కటొక్కటే
తేపకు తేపకార్చి తెగద్రెంపుచునున్నవి యీ నిమేషముల్;
తాపము లేదు నీ హృదయతామరసంబున బ్రహ్మగంటివా,
కోపము కొల్వు గైకొనిన గుండెల కత్తులు నూరుచుంటివా?

తాకిన తాకుతో తల బదాబదలైనది, నెత్తురోడె; పెం
జీకటు లేలుచున్న గృహసీమల దీపము పెట్టుకోరె? నీ
వేకడ నుంటివే; పలుకవేమె, పరాకులు పాడుగాను! నా
వ్యాకులజీవితమ్మున దివాంధము కూత కుపక్రమించెనే!

సైఁయని యొంటికాలున, విషాదపదాహతి గుండు నాపయిన్
దాయముగట్టి మృత్యువు క్రుధావివశమ్మయి దూకుచున్న, నీ
కాయమువచ్చునా, పగలు నాద్భుతి దర్పము లారితీరునా,
చీయనకుందురా ప్రజలు, చేష్టలు చేదయి తిట్టకుందురా?

పరపర మిత్తి దేహ మొకప్రక్కను గోయుచునున్న గాని నా
మొర చెవి దూరబోదు; ముసి ముట్టదు; చేసిన పాపమిట్లు మో
చరముచునున్నవా? యకట! జాముల నీపురుషాయుషమ్ము క
త్తెరబడి పోవసాగినది; తిట్టిన తిమ్మిన లాభమేమిటే!

ఎంగిలి మంగలమ్మయిన యీతని దుర్భర జీవితమ్మునన్
క్రుంగుచునున్న జీవములకోసము గోత్రిలుచుండలేదు; పా
న్పుంగుల జంటవోలె శయనమ్మున కన్నులుమూసి, నిద్రలో
బంగరులోకమేలు పసిబాబుల ప్రాణము సంస్మరింపవే!

మదవతి, ఒక్కమాట అభిమానము లిప్పుడు దోయిలించి, నీ
పదముల నంటి మ్రొక్కుచు, "కృపావరిపాకము భిక్షపెట్టుమా!
బదవలుపడ్డగాని పసిపాపల సాకుతెరంగులే" దన్న
పెదవులు విచ్చి; మాతృపదవీన దవీయసి, ఆలకింపవే! 47

ఇంతకు, చిత్రగుప్తుడు లిఖించిన జీవుల జాబితాల నీ
వంతున కాయు వంతమని బఱ్ఱున గీటున బుచ్చినాడొ! ర
వ్వంత విచారమేని హృదయమ్మును సోకక గండరించితే!
ఇంతులగుండెలా, అకట, యియ్యవి దాచిన చట్టుబండలా!

పోరొనరించుచుండి రణభూమిని గూలిన చింతగల్గ; దా
భూరమణుండు నన్విడిచి పొమ్మని చెప్పిన రాజధానికిన్
దూరము వోవలేక నృపదూతల చండకృపాణధార కా
హారముగా శరీరము సమర్పణముం బొనరింపవచ్చునే?

పనివడి దేశరక్షణమొ, పాడియొ కోరిన ఆదధీచినై
పునుకలు రాల్చిపోసెదను పో; యిటు లూరక వచ్చినెత్తురుల్
దొనదొన కార్పుగా దగునె? దోషము, శాస్త్రవిధీయమాన ము
ష్టాన గతియించునొక్కొ? గమనోన్ముఖివై పయనమ్ముగట్టవే!

ప్రణిపాతము

ఇంతగ కాళ్ల ప్రేళ్లబడి యేడ్చిన, కాదని మొత్తుకొన్న, నీ
స్వాంతము చుఁయ్యి చుఁయ్యనదు; జాములగోడిగలెక్కి, రివ్వునన్
కుంతము లార్చుకొంచు, మెరుగుల్ వలె దూకుచునున్న ఘోరకా
లాంతకకోపరేఖలకు నాగుదొ, జంకక నిల్చి క్రాగుదో!

ఓ మొగలాయి రాణి! కరుణోదయ కారణవర్తనమ్ము లే
మేమియు విన్నవించుకొన నెంచుచు ముంగిట మోకరించె; ఈ
మోమయి చూడరాదొ? వినబోలదొ? మేలిముసుంగుటంగుర్ణ
ప్రామితి, వింతలో నడసబారితివేమొ, మరాటి గుజ్జమా!

*భారతి, 1942 నవంబర్*

# కవిరాజు

వాణీనూపుర కింకిణీ మధుర నిక్వాణంబు సంపన్నమై
బోణీ కొట్టిన నీ పురాణ రచనాపూర్వార్థసంపత్తికిన్
బాణాకత్తులు లేచియాడినవి విశ్వంబెల్ల కంపింప; నీ
బాణీ కింకెదురేది లేదు గదరా, ప్రాజ్యాంధ్ర రాజ్యస్థలిన్!

కత్తికి కోరి బాసికము కట్టిన నీ కవితావధూటి నో
రెత్తిన దుష్టభావముల నెల్ల లగాలగి చేసి చెప్పుతో
నెత్తిన మొత్తి పంపి, మరి నేటికి జంకులుచన్న గుండెలో
ఎత్తెను విప్లవధ్వజ మభీప్సిత పద్ధతి సిద్ధహస్తుడా!

కోయని యార్చి నీ కెదురుకొన్న పురాణపు గోలకొండ అ
బ్బాయని యావటిల్లినది; బానిసభావము లొక్కమారె క
ల్లోయని దారిబట్టినవి; ఓకవిరాజ! భవత్కలాద్భుతుల్
కాయునుగాక ద్రావిడజగమ్మున నిచ్చలు పండు వెన్నెలల్!

ఆగవు, డాగవీ సహృదయావళి సత్యము; లెవ్వడెట్టు లూ
రేగిన నేమి? నీదు కృతులెత్తిన సంస్కృతి రక్తలేఖలన్
జేగురువారె నీ తెనుగునేల సమస్త మటన్న, నందులో
మాగెడువారి సంగతుల మాట వచింపగ నేల? వాక్ప్రభూ!

గుండెలు పిండిపోసి తెలుగుం బ్రతికింపగ పాటువడ్డ వీ
రుండవు; దాస్యభావములు ద్రోలగ చేతులు గాల్చుకొన్న ధీ
రుండవు; నీ ప్రబోధముల రూపమె నృత్యసరస్వతీ కలా
ఖండము; నిన్నెరుంగ కిటు కమ్మక రాటము గొడ్డువోయెరా!

పెంకెకు పెంకెవై, నిను శపించుచు నున్నను గానిలోకముల్
క్రుంకి పురాణసంహితలలో మథియించి తదీయగర్భముల్
బొంకులు రంకులున్ వెలికిబుచ్చితి, ధర్మపథమ్ము లిట్లు లీ
వంకని చూపిచెప్పి, మరి ప్రాణమువోసితి తెల్గుజాతికిన్.

మున్నొకనాడు రాజఋషి పొంగినకోపము పట్టలేక; బ్ర
హ్మన్నకు నుజ్జి కాదలచి మారటసృష్టి యొనర్చినాడు; నీ
వన్ననొ, ధాత దన్నిన మహాత్ములనే యుడికింపగా వినూ
త్నోన్నత సృష్టి చేసితి; వహో! యిరువాగుల ధన్యుడెవ్వడో!

మారణహోమముల్ జగము మాడ్చు దినంబుల నీతిమేఘమై
కారుణికత్వముల్ కురిసి కాచితి ప్రాణివితాన; మా దయా
వీరము పొండి నేడును స్రవించుచునున్నది నీ నికేతన
ద్వారమునందు త్రుంపని సుమావళిలోని మరందధారలన్.

ముద్దులు మూటగట్టు పదముల్, రసముగ్గులుగొన్న పద్యముల్
దిద్దిన తీరుతీయములు, తేర్చిన తేట తెనుంగు పోడుముల్,
పద్దులు వ్రాసిపెట్టినవి స్పష్టముగా కృతి సంపుటంబులం;
దెద్దడి లేక యీ తెలుగు లెన్నడు నీ ఋణ మీగువారలో!

ధనములుగాని, యున్నతపదమ్ములుగాని, దిగంతకీర్తిలో
భనములుగాని, మా తెలుగుబాబులు వద్దన సేయు ఘోర శా
50 పనములుగాని, నీ మనసు వంతములార్పగ 'తల్లక్రిందులై'
ప్రణతులు చేసెనోయి కవిరాజా, మహాత్మ, జగత్ప్రియంకరా!

ధర్మము నిర్వహించి కవితావిధి చూపి గతించినావు; మా
కర్మము కాలిపోయె; కవిగాంధ్రుడు దనమ్మునకో, ప్రతిష్ఠకో,
దుర్మతవాదులై చెడుగుత్రోవలు త్రొక్కుచునున్న సంఘమున్
కూర్ములు గ్రుమ్మరించెడిని; కూలునొ దుర్గతి, నింక తేలునో!

రసికత రాజ్ఞియై హృదయరాజ్యము నేలుచు నుండుదన్క, తై
జసగుణభూషితం బయిన సజ్జనధర్మము లోక శాంతికై
కొసరుచు నుండుదన్క, నతికోమలముల్ భవదీయభారతీ
ప్రసవము లాంధ్రదేశమున పంచుచునుండును దివ్యగంధముల్!

నీ తాత్పర్యము, కార్యదీక్ష, కవితానిత్యోత్సవస్ఫూర్తి, నీ
పూతాంతఃకరణమ్ము, తేట తెనుగున్ పొంకమ్ము స్వచ్ఛందతా
స్వీతార్థాచరణమ్ము కార్యఘటనా నిర్మోహభావమ్ము, ఈ
చేతోవీధి ని తాండవించుత సదా శ్రేయోనిధానంబుగాన్

*1943, జూన్*

---
జి.వి. కృష్ణరావు

# ఋగసంధ్య

## ప్రాతస్సంధ్య

“యేషాం కావ్యానుశీలనాభ్యాసవశాత్
విశదీభూతే మనోముకురే
వర్ణనీయతన్మ యీభావ యోగ్యతా,
తే హృదయసంవాదభాజః సహృదయాః॥”

అభినవగుప్తపాదులు

## త్రిపురనేని కవిరాజునకు

వాణీనూపుర కింకిణీ మధుర నిక్వాణంబు సంపన్నమై
బోణీ కొట్టిన నీ పురాణరచనాపూర్వార్థ సంపత్తికిన్
బాణాకత్తులు లేచియాడినవి విశ్వంబెల్ల కంపింప; నీ
బాణీ కింకెదురేదిలేదు గదరా, ప్రాజ్యాంధ్ర రాజ్యస్థలిన్!

కత్తికి కోరి బాసికము కట్టిన నీ కవితావధూటి నో
రెత్తిన దుష్టభావముల నెల్ల లగాలగి చేసి చెప్పుతో
నెత్తినమొత్తి పంపి, మరి నేటికి జంకులుచున్న గుండెలో
ఎత్తెను విప్లవధ్వజ మభీప్సితపద్ధతి సిద్ధహస్తుడా!

కోయని యార్చి నీ కెదురుకొన్న పురాణపు గోలకొండ అ
బ్బాయని అవటిల్లినది; బానిసభావము లొక్కమారె క
ల్లోయని దారిబట్టినవి; ఓ కవిరాజ! భవత్కలాద్భుతుల్
కాయునుగాక ద్రావిడజగమ్మున నిచ్చలు పండువెన్నెలల్!

ఆగవు, డాగవీ సహృదయావళి సత్యము; లెవ్వడెట్టు లూ
రేగిన నేమి? నీదు కృతులెత్తిన సంస్కృతి రక్తరేఖలన్
జేగురువారె నీ తెనుగునేల సమస్త మటన్న, నందులో
మాగెడువారి సంగతుల మాట వచింపగనేల? వాగ్విభూ!

గుండెలు పిండిపోసి తెలుగుం బ్రతికింపగ పాటుపడ్డ వీ
రుండవు; దాస్యభావములు ద్రోలగ చేతులు కాల్చుకొన్నధీ
రుండవు; నీ ప్రబోధముల రూపమె నృత్యసరస్వతీ కలా
ఖండము; నిన్నెరుంగ కిటు కమ్మకరాటము గొడ్డు వోయెరా!

పెంకెకు పెంకవై నిను శపించుచు నున్నను గానిలోకముల్
క్రుంకి పురాణసంహితలలో మథియించి తదీయగర్భముల్
బొంకులు రంకులున్ వెలికిబుచ్చితి, ధర్మపథమ్ము లిట్టు లీ
వంకని చూపిచెప్పి, మరి ప్రాణముపోసితి తెల్గుజాతికిన్.

యుగసంధ్య

మున్నొకనాడు రాజఋషి పొంగినకోపము పట్టలేక, బ్ర
హ్మన్నకు నుజ్జికాదలచి మారటసృష్టి యొనర్చినాడు; నీ
వన్ననొ, ధాత దన్నిన మహాత్ములనే యుడికింపగా వినూ
త్నోన్నత సృష్టిచేసితి; వహో! యిరువాగుల ధన్యుడెవ్వడో!

మారణహోమముల్ జగము మాడ్చు దినంబుల నీతిమేఘమై
కారుణికత్వముల్ కురిసి కాచితి ప్రాణివితాన; మా దయా
వీరము పొంగి నేడును స్రవించుచు నున్నది నీ నికేతన
ద్వారమునందు త్రుంపని సుమావళిలోని మరందధారగాఁ.

ముద్దులు మూటగట్టు పదముల్, రసముగ్గులుగొన్న పద్యముల్
దిద్దిన తీరుతీయములు, తేర్చిన తేటతెనుంగు పోడుముల్,
పద్దులు వ్రాసిపెట్టినవి స్పష్టముగా కృతి సంపుటంబులం;
దెద్దడిలేక యీ తెలుగు లెన్నడు నీ ఋణ మీగువారలో!

ధనములుగాని, యున్నతపదమ్ములుగాని, దిగంతకీర్తిలో
54 భనములుగాని, మా తెలుగుబాబులు వడ్డన సేయు ఘోర శా
పనములుగాని, నీ మనము పంతములార్పగ తల్లక్రిందులై
ప్రణతులు చేసెనోయి కవిరాజా, మహాత్మ, జగత్ప్రియంకరా!

ధర్మము నిర్వహించి కవితావిధి చూపి గతించినావు; మా
కర్మము కాలిపోయె; కవిగాంగ్రడు ధనమ్మునకో, ప్రతిష్ఠకో,
దుర్మతవాదులై చెడుగుత్రోవలు త్రొక్కుచునున్న సంఘముఁ
కూర్ములు గ్రుమ్మరించెడిని; కూలునొ దుర్గతి, నింకతేలునో!

రసికత రాజ్ఞియై హృదయరాజ్యము నేలుచు నుండుదన్క, త్రై
జసగుణభూషితం బయిన సజ్జనధర్మము లోకశాంతికై
కొసరుచు నుండుదన్క, నతికోమలముల్ భవదీయభారతీ
ప్రసవము లాంధ్రదేశమున పంచుచునుండును దివ్యగంధముల్!

నీ తాత్పర్యము, కార్యదీక్ష, కవితానిత్యోత్సవస్ఫూర్తి, నీ
పూతాంతఃకరణమ్ము, తేటతెనుగుఁ పొంకమ్ము స్వచ్ఛందతా
స్వీతార్థాచరణమ్ము, కార్యఘటనా నిర్మోహభావమ్ము, ఈ
చేతోవీధిని తాండవించుత సదా శ్రేయోనిధానంబుగాఁ

---

జి.వి. కృష్ణరావు

# మహోదయము

ఎవనిధర్మ పరాంకోటి కెక్కినంత
గుణము నాల్గుదిక్కుల నొక్క కొలికి జేర్చె
న మ్మహాబాహునకు, త్రిలింగాధి నేత,
కప్రతిమ పరాక్రమశాలి కవుత జయము.

చెడుగుడు లాడి వైరి నృపసింహుల మోముల దన్నివచ్చి నీ
యడిదము రాశివోసినదిరా! తెలుగుంబొలమందు ధైర్యముల్;
పిడికెడులేని యీ తెలుగు పిల్లలు నిన్గనులార జూడగా
నుడుగరదెచ్చి నార; లివిగో నవచారణ మంజుగీతికల్!

జాణలు, సాంధ్యరాగ పరిచారిణు లుత్కల రాజకన్య పా
రాణులు, కుంకుమమ్ములు పరామరిసించి లిఖించవీ తెలం
గాణము బుస్సునం దిగుచు కాలకరాళ కృపాణధార-వి
శ్రాణములైన కాంతులు దిశాతతి నిండిన విహ్వలించుచుః.

నీ తురంగ రింఖలను ఖణేలున ముఖ
రించు శత్రుభూముల విజృంభించి శాంతి
దేవత తదేకనిష్ఠ నర్తించి దశది
శీ విజయ ఘంటికారవ శ్రీల నించు.

నెత్తిన మొత్తి శాత్రవుల నీ రణ దుర్భర శౌండిమమ్ము లు
వ్వెత్తుగ గుంజి తెచ్చి మణు లిచ్చిన నచ్చనగాయ లాడు నీ
మత్తగజేంద్రగామినులు మంగళ గానముతో నివాళి నీ
కెత్తుచునున్న వారిదె గ్రహింపుము చల్లని నిండు చూపులః.

అనుపమముల్ త్వదీయ విజయమ్ములు విశ్వములోన నారగా
సిన పరువంపు వెన్నెలల శీతల సైకత వేదులందు నం
తనపడి యాటలాడు బుడుతల్, ముదితాత్ములు, రాజ! నీదు ద
ర్శనమున కారటంపడుచు సాచుచు నుండిరి మేలిచూపులః.

యుగసంధ్య

అనలు పాను లేదిన పరాంబుధి నీ ఘనపౌరుషమ్ము మం
థానగిరీంద్రమై కలచినన్ ప్రభవించిన యప్సరోంగనల్
నూన నిగుంభితాక్షతల చొక్కపు నర్తనభంగిమమ్ములన్
పూని, నిరీక్షతో నిలిచిపోయిరి, నీ కొలు విమ్ము వారికిన్.

జెట్టీలగు పగతురు నీ
బెట్టిద మగు లక్ష్యశుద్ధి బెంబేల్పడి య
ట్టి ట్టగుచుం బోరాడక
యుట్టీ గొట్టియు నొసంగుచుందురు కరముల్.

కాంతా జనములు, జిత సా
మంతులు, సేనాధిపతులు, మంత్రులు ప్రతిభా
వంతులు నీకై చూపుల
దొంతరలం గట్టినారు తోరణ పంక్తుల్.

అంగము నంగమందు సకలాధిప దుస్సహ శౌర్యరేఖ లు
56 ప్పొంగు తెలుంగు జోదుల యపూర్వపు తేజము లేర్చి నీ సభా
రంగము నెల్ల కుంకుమపు రాగముతోడ నలంకరించె; పా
రంగత చైత్రయాత్ర! యిక రాగదె నిండిన కొల్వు దీర్పగన్.

వాడి యలుంగులొచు పగవారిమగంటిమి పాదు చీల్చి చెం
డాడిన నీ మహత్తర దృగంచల మాలిక సుప్రసన్నమై
యాడిన చోటులం దొలగి యట్టిటు పాయలుపాయలై గుమిన్
గూడి సభాముఖమ్మున జనుల్ పచరింతురు కౌతుకమ్ములన్.

---

జి.వి. కృష్ణరావు

# అధిజ్యధన్వము

మేపిన ద్రవ్యమెల్ల దిగ్రమింగిన నీ యుదరమ్ములోపలన్
కాపురమున్న భూపతి ఋణమ్ములు గట్టున త్రేచునే గదా!
పాప మతండు నిండిన దివాణములో కవిచంద్రులన్ గృతి
వ్యాపృతి కెచ్చరింప దగడా? అధికారము చూప నోచడా?

స్వార్థ మొకండె కోరి నరపాలుడు కొల్వున బిల్చి మీ కవి
త్వార్థము లారతిమ్మనెనె? ఆంధ్ర జనమ్ముల చిత్తవృత్తులన్
దుర్ధర భారముల్ తొలగద్రోయ దలంపడె? ఆంధ్రసాహితీ
వర్ధన మెంచడే? ప్రజల భద్రము లించుక సంస్మరింపడే?

అతని బాహుశౌర్య విజయమ్ములలో మన తెల్గు సంపదల్
మ్రోతలు మ్రోయవే? వలసపోయి యశస్సు కుదుళ్ళుకట్టదే?
ఆ తరుణాంధ్రసింహుల భయానక గర్జలు మారుమ్రోగవే?
నూతన శారదాచరణ నూపుర నాదము బోరుకొల్పదే?

''ఈ జగతీ హితమ్ము, ధరణీశుని చిత్తము నేటి కొక్కటై
రాజికి వచ్చి ముందు ధనరాసులు గల్గున గ్రుమ్మరించి, మీ
పూజలు మ్రొక్కుబళ్ళు ముడుపుల్ తుదికాసున నప్పగించుచున్
'మా జయగర్వ కావ్యకుసుమమ్ముల గూర్పు,' డటన్న కష్టమే?

''ఎరుగునె యీ త్రిలింగ వసుధేశుడు మీ కవితా మహత్వముల్
దొరలెను నేటి కీ యనవలోకిత పద్ధతి భాగ్యచక్రముల్;
మరల లభింపనేరవు సుమా! అవకాశము వీడబోకుడీ!
గరగర పోవనిండు తమ గంటము పోయిన యంతమట్టుకున్.

''ఆ యువ వట్టిదేబె, కవితార్థవిధాన మెరింగి యున్నచో
పాయునె రాజొసంగు ధనభాగ మటంచు జగమ్ము కోడియై
కూయును, కూసితీరుగద; కోరి స్వయమ్ముగ దుర్యశమ్మునన్
బోయెదు, వాని కీర్తిపయి బోసెదవీవె మషీరసమ్ములన్.

యుగసంధ్య

''ఉల్లమునందు నక్కటిక మూని, మహీపతి పొట్టకూటికై-
వెళ్ళగబోయు నిన్ను పిలిపించి, కవీంద్రపదమ్ము గట్టికో
కొల్లలుగా ధన మ్మొసగి కొల్చుచునుండ గణింపవేమయా?
జల్లెడపట్టెనే యెడద జారెను గౌరవభావపూరముల్.

అనుచు యువజాని కవిని నేత్రాంచలముల
జూచుచు కరాబ్జమల్లన సాచి గృహిణి
చంద్రరేఖ; తత్కేశపాశమ్ము దిద్దె,
మసక వెన్నె లొలికె ముఖమండలమ్ము.

''ఎవ్వతె నూరిపోసినది? యే యపవాదము పుట్టలేదుగా?
అవ్విభునానతిన్ గడవనాడితినా? సభలో నరేంద్రుపై
చివ్వకు కాలుద్రవ్వితిన? చెప్పుము, సంగతు లేమి పుట్టెనో?
గవ్వల గుత్తులీ ప్రజలు, కాదన రా,'' దన జంద్రరేఖయున్.

''ఇంతటి బుద్ధిమంతుడు మరెక్కడ కన్పడబోవ, డెన్నడుం
బంతము లాడబోడు, తనమార్గమె మార్గముగాని, యన్య మా
వంత దలంపకబోడు; వహవా మగడయ్యెను నాకు; పూర్వ జ
న్మాంతర పుణ్యరేఖ లిటులయ్యెను పల్కకు మట్టిమాటలన్.

''గారవ మించి ఆ ధరణికాంతుడె ఆదరపూర్వకమ్ముగా
ఆరని యాంధ్ర తేజముల అగ్నికణమ్ముల రేచుకావ్యముల్
కోరుట యేమి? ఆ కవులు లోగి హసా దనుటేమి? అప్పుడే
మీరలు దక్షిణల్ గొనక మిన్నులు చూచుట యేమి చెప్పుడీ?

''అతడు సైచె, వేరొక ధరాధిపుడైన నుదగ్రమూర్తియై
నీ తల కొట్టకుండునె ధణేలున? కోటకు గట్టకుండునే?
ఆతని సొమ్ములన్ మెసవినట్టి ఋణమ్ములు కంచుడక్కలై
మ్రోతలు మ్రోయవే యెడదమూలల మూలల, మాటిమాటికిన్?

''చేసిన తప్పు నొప్పుకొని, చివ్వన రాజును జూచి కావ్యమున్
వ్రాసెదనంచు దక్షిణలు పట్టుము; మేలగు, కానివేళ నీ
దోసిట నీవె నిప్పుకలు దోర్చి శిరమ్మున జల్లుకోవలెన్;
బాసలకోసమై పెనగవద్దురా! సూత్రమొకింత నిల్పరా!''

అనిన నా యువకవి మందహాస మొలుక,
"ఏది యెట్లుపోయినను నీ కేమిగాని
తప్పదింత, దక్షిణలు నీ తాలిబొట్టు
మరచిపోబోవ నేమాత్ర మరువ," ననియె.

"స్థాణువవోయి, మృత్యువు విషమ్ములు గ్రక్కెడువేళ గూడ నీ
బాణపు పోటుల న్విడవు; పాపపు పంటగ అత్తగారు పా
షాణము గాంచి నా కొరకు జార్చెను గుండెలు గ్రుమ్మిపోయగా;
జాణతనమ్ము చాలు, నిక జాలును, మానుమ యుల్లకుట్టులఁ."

అనుచు చెమ్మగిల్లిన నయనాంచలములు
పైటతో నద్దుకొనెడి వధూటి జూచి
కరగి జావయై యామెను కౌగిలించి
కవివతంసుడు నిముసమ్ము కన్ను మోడ్చె.

"ఈవె రణాంగణాన విహరించిన నిట్టులు తీర్పులిత్తువే?
యీ వసుధాధినేత జరిపించిన కోతకు మారుతమ్ములే
ఆవురుమంచు నేడ్చెను; లతాంతములెల్ల వసుంధరా పరా
గావళి రాలి దొర్లెను; దయాలవమేని జనింపలేదుగా!



"కోతల నాపు మాపు," మని గుండెలు గుండెలు బాదుకొన్న ది
క్ష్మాతలు గుండియల్ పగిలి భ్రుగ్గిరికాని అపారమేదినీ
నేతకు నశ్రుకంకణము నేత్రమునం గనుపింపలేదు; తా
పాతిన కత్తిగా నిలిచి వ్రక్కలుగా తరిగించె నా ప్రజన్.

"అంతటి పుణ్యవంతుడు గదా నరపాలుడు! తచ్చరిత్రలో
గంతులు పెట్టగావలెనె కావ్యవిలాసిని? ఆ దురంతకా
లాంతక మూర్తికే కృతి సమర్పణమా? ఇక ముందువారి కాం
క్షింతలు నేలమీద పడునే? యొకసారి తలంచిచూడుమా!

"ఉన్నను లేకయున్న, నెటులో పడిపంచలలోన పండి భి
క్షాన్నములేనియుం గుడిచి అందరిలో ముఖమెత్తి చూతు; మీ
తెన్నునబోక భూపతి విధించినరీతి చరింతుమేని ఇం
కెన్నెడిదేమి? బందుగుల యిండ్లకు బోయిన నీళ్ళు పుట్టునే?

''ఆ పసికుంక కాలెదిగి ఆటలకోసము రేగి వీధిలో
పాపల జేరి యేమగునో భావన సేయుము; రాలు దూకునో,
లోపలి ప్రేవులం గొరుకు లుచ్చుపు కారులు ప్రేలిపోవునో
తాపుల వీపుపై కనకతప్పెట మ్రోగునో; నిర్ణయింపుమా!''

ఇట్లు హెచ్చరించిన జీవితేశు జూచి
రిత్తవోయి మ్రాన్పడి చంద్రరేఖ పలుక
దయ్యె; దుస్సహ లిప్సా సహస్ర మరిగె
గొంతు సవరించుకొనుచు నా యింతి పలికె:-

''ఐనను భూతలేశ్వరుని ఆదరభావము కాలదన్ని ఆ
స్థానిపదమ్ము దుల్పుకొని, సాజ దరిద్రత కట్టుకొన్న సో
పాన పరంపరల్ గడచి, వాయువు దూరని చీకటింట దుః
ఖానక జీవికాయుగము ఖైదొనరింపగ నిశ్చయింతురే?

''తేలిన యింద్రబోగముల దీ నయిపోయిన నెత్తి మొత్తెకా
బోలు! వివిక్తదేశమున, పువ్వుల తోటను, పర్ణశాలలో,
ఓలిదివమ్ములం గడప నువ్విళు లూరెదె? పద్యరాశి బ
స్తాలకు పట్టి సీమలకు దార్పగ వేవిళులయ్యెనా కవీ!

''వీరలు తాళపత్రముల వేదనతోడుత గట్టుకొన్న బం
గారవు మేడలందుననె కాపుర ముందురు; సర్వలోక సం
చారము సేయు శబ్దము హజారమునందు సుధారసమ్ము లా
హారముగా నొనర్చు; బళిరా! కవిపత్నికి లోటు గల్గనే?

''క్ష్మాపతి సేయు మన్ననల కన్నులకుం బొరగ్రమ్మెనేమిరా!
రేపును మాపు అప్పులకు ద్రిమ్మరి యిల్లిలు దేవురింప, 'మా
కాపుర మింతపాటి,' దని కారులు ప్రేలుచు పుట్టనీని ఆ
పాపపు జీవితమ్మునకు బాల్పడి పట్టము గట్టుకొందువా?

''నేటికిగూడ కట్టెదుట నిల్చును; శ్రావణ శుక్రవార మా
పూట, పయోదమాలికలు భోమ్మని శంఖమ్ము లొత్తె; చంచలల్
దాటె నభమ్ము చేటకు చెలామణి తప్పెను; కాలుపొట్టలన్
గాటపు చిచ్చులే యెగసి కాల్చెను కట్టున ప్రేవు లార్వగన్.

60

జి.వి. కృష్ణరావు

''కుతకుతలాడు నాయెడద గుప్టికి వచ్చిన నాటి ఘట్టముల్;
కుతికయె ఆరకున్న పసికూన తదర్ధ నిశీథవేళ ఏ
గతి కడుపుబ్బ నేడ్చె? సొదకాకల నార్పగ వంటపాత్ర లే
గతిబడి గంటలై మొరసె? కాలము కప్పిన విస్మరించితే?

''పంచి దరిద్రదేవతకు స్వాగత మిచ్చిగృహాన గజ్జె గ
ట్టించి యహర్నిశమ్ము బురిడీలకు దోయిలి యొగ్గి మోడి వే
యించి కులాసచూచుకొను; మీ పసికూనకు నోట దుమ్ము కొ
ట్టించుము; దిల్ఖుషీగొనుమ, యింతకు దక్క మరేమి లేదురా!

''చేతులు పుండ్లుగా నలికి చేసినచేతులు వమ్ముసేయు నా
తాతలనాటి కొంపకెగదా కల సత్తువ ధారవోసితిఁ;
నా తరమారె; రా నటకు; నాకిక కూడిడకున్న మానె; నా
చేతులు కాయగాచినవి; చెప్పకు దయ్యపు కొంపగోడులన్.

''భూపులు ఖడ్గజీవులని పూర్వులు చెప్పరొ? నాడు పిల్చి నీ
కీ పద మిచ్చినంతన గ్రహింపక యేల తిరస్కరింపలే?
దీపని కిప్పుడే దిగుట కేమి నిమిత్తము? నేటి ధర్మ చ
ర్చాపరమావధిం గదియజాలవొ? నాటికి చిన్న కుఱ్ఱవే?

''టక్కున నొక్కసారిగ గుడారము లెత్తగ తొందరించుచో
నెక్కడ నెట్లు వీలుపడు? నిప్పటి దన్కను రాజభోగముల్
బొక్కిన నోట లేవడుల బొక్కుమటన్నను సాధ్యమే? మన
మ్మెక్కడ యే శ్మశానముల నేలుట కేగినదో వచింపరా!

''నరపతి మిమ్ములన్ విడచినన్ విడచున్; మరి నేనె యైనచో,
కరకర కత్తులం దరిగి కాయము గ్రద్దలపాలు చేయనా?
పరమపథమ్ము లేవొ యెటుప్రక్కన నున్నవో చూపకుందునా?
దొరలదు భాగ్య మా విధి విదూషకు డయ్యెను నా సభాస్థలిన్.

''ఈ కొరమాలు నాకడుపు కేడువబోవ మరేమి వచ్చినన్,
ఆకట దూలి చిక్కి సగమై పడి, దేవురుగొట్టు మూకలై,
వాకిట వాకిటన్ సుతులు పట్టెడు కూటికి జోలె పట్టగా
ఈ కనులార చూడను; సహింప, వధించెద అంత వచ్చినన్.

''ఏలినవారి చిత్త; మిక నేమి వచింతు? కవిత్వరాజ్యమే
యేలుదురో, త్రిలింగ ధరణీశు నుదగ్ర దృగంత రౌద్రమే
క్రోలుదు మందురో, అతని కోరిక దీరగ కావ్య మిచ్చి ని
ర్వేల సుఖాంబురాశి విహరింతురొ మీరలె తేల్చుకోవలెన్.''

అనుచు తెగతెంపు చేసి యిల్లాలు పలికె;
ఎన్ని యగ్నిపర్వతములు హృదయసీమ
నొదిగి యొదిగి యెన్ని శరత్తు లున్న వేమొ
మేరుగిరియైన కవియు స్తంభించిపోయె.

అతలకుతలమైన మనమ్ము నాచిపట్టి
నిశ్చలత్వమ్ము చూపుల నెలవుకొనగ
మందమందమ్ముగా కంఠమార్దవమ్ము
తొలుక నా యువభారతి పలికె తుదకు.

''నా కవితాసురక్తిని జనమ్ములు బ్రహ్మరథమ్ము పట్టి పూ
జా కుసుమమ్ము నిచ్చిరి: యశమ్మొనగూర్చిరి, వారి కంఠముల్
బాకలు పట్టె నాకు; జనవల్లభు డంతట పిల్వబంచి, ' ఓ
యీ కవిరాజ! ఆదృతి భరింపుమ; మా సభపేరు నిల్పుమా!'



''అని నను జేరబట్టె, సరె యంటిని; కేవల రాజ్యకాంక్షతో
జనహృదయాంబుజమ్ముల విశాంపతి యింతటి పచ్చిబూతుగా
ధనధన ఘోరవిక్రమ రథమ్మును ద్రోలునె? శాంతిదేవతా
తనువును నాల్గునిల్వులకు దాటినలోతున పాతిపెట్టునే?

''పచ్చి కసాయి చేసిన కవాతును కొండలు చేసి చెప్పినన్
వచ్చిన గుండెలందు రుధిరమ్ములు గ్రక్కు ప్రజావ్రణమ్ములన్
తెచ్చి తదంతరాళముల దారుణ దావశిఖోగ్రశస్త్రికల్
గ్రుచ్చుటగాక యేమగును? కోమలకావ్యమె ఆర్తనాదముల్!

''జనుల హృదయమ్ము కించిత్తు ననుపలేని
వాక్కులు ప్రబంధములో, పచ్చిబద్దలొ యె
వండు నిర్ణయింపగలడు? పార్థివుండు
నేడు వానికే పొంగి మన్నించు గాక!

''ఏమి తలంచినాడొ, సెలవిచ్చెడు వేళను వీరవైష్ణవ
స్వామి, కలా గురూత్తముడు, చల్లని చేతులు నా బుజమ్ములన్
గోమున వైచి, 'నీ కవితకుం బరమార్థము వింటివే గదా!
యేమరబోకుమా తనయ! యీ ప్రజసేమము సంస్మరింపుమా!'

''అని తిరుమంత్ర మిచ్చి మరి యంపెను; నేడు తదాజ్ఞ దాటగా
జనునె? జనాంత్రమాలికల జాజులు కట్టిన రాజ్య తంత్రముల్
పనవి రచించి తీర్చిన ప్రబంధము నాతని కంకితమ్ముగా
పొనరుప నేర్తునా? సుకృతిపూజ్య మహాశయ మార్చివైతునా?

కా దని నేడు నా కడువు కక్కు రితిం దలయొగ్గి, పార్థివా
మోదములం గడించుటకు పూనిన నా జనతాకళేబరా
లూదిన రక్తవాహినులు హోరని యేడువకుండునా? మహా
వేదన గూరి క్రుంగుచు భవిష్య యుగమ్ము శపింపకుండునా?

ప్రజలెల్ల నీవంక, ప్రభువె యావంక
సాహిత్య మీవంక, స్వార్థ మావంక
ధర్మమ్ము లీవంక, దర్ప మావంక
మాంగల్య మీవంక, మరణ మావంక
తొలిదాన నభివృద్ధి త్రుళ్ళింతలాడు
మలిదాన పతనమ్ము మల్లాడునుండు.

కనలి రాజా శిరసు ఖండింప బంచునో!
'తప్పు కాచినాము తరలు' మనునొ!
తేల్చలేనుగాని తెగబడి వాదమ్ము
పెట్టునేని నాకె విజయ మగును.''

పొంగి భావవీచిక పోటు పొడిచెనేమొ,
కలగి నిట్టూర్చె చంద్రరేఖావధూటి;
కోటలోని నగారాలు గొంతు లెత్తి
వరుస గోష్ఠికై పిల్చె విద్వజ్జనమ్ము.

# ఆహతవ్యూహము

''మెరికలవంటి పండితులు మీ కనుసన్నుల నేడు కొల్వు దీ
ర్చిరి; కవితాభిలాషమున చేరిన యీ పరిషన్ముఖమ్మునన్
పురపుర పొంగిపోయినవిపో రససింధువు లన్ని యేకమై
కరగకయుండునా కరుడుకట్టిన కావ్య సమస్య లిచ్చుటన్?

''దేవరవారితో నిపుడు తెల్పెద నొక్కటి చూడు, డీ తగా
దా వివరమ్ములందు వసుధాపతి భావన మూచముట్టుగా
నావల డించివైచి రసికాగ్రణులై మరి తీర్పు లిత్తురా?
కేవల భూపతిత్వమునకే ములుసూపగ నిశ్చయింతురా?''

అనుచు కవిరాజు పల్క ధరాధినేత
''కావ్యగోష్ఠిలో రాచరికాల కేటి
పేరటమ్ము? కా దని వచ్చి కూర్చున్న
ఆగ్రతాంబూల మెటులిత్తు?' రనుచు బలికె.

అంతట నా యువకవి గ
ల్లంతుగ మదిలోన లాయిలాసాపడు దు
ర్దాంతపు భావము లాచి ప్ర
శాంతుండై పలికె నిట్లు జనపతితోడన్:-

''రసికవరు లౌట కావ్యమ్ము వ్రాయు మనిరి,
దానితో నెవ్వరికిని వాదమ్ము లేదు;
కాని కావ్య మెవ్వరికోస మేను వ్రాయ
వలయు సెలవిండు నాశంక తొలగిపోవు.''

అనుచు ప్రశ్నింపగా సదస్యవరులందు
చిత్రచిత్ర సంభాషణల్ చెలగి మోము
లందు నానా వికారమ్ము లంకురించె;
ఎవ్వరికి వారుగా జవా బిత్తు మనిరి.

---

జి.వి. కృష్ణరావు

''ఆంధ్రభూమీజాని ఆదరించె నటంట
ఈపాటిదా యేమి యితనిశక్తి?
గళమెత్తి శిలలనే కరగించినాడంట
పలికిన పలుకుతో పలుచనయ్యె.

జైత్రయాత్రారంభ సమయమ్ము లందుండి
స్వయముగా చూచి యీ ప్రతిభ చాటె
సార్వభౌముని మహా సంస్థాన గౌరవ
మ్మారెనా వట్టి సన్యాసి దొరకె

నోరు కదపకున్న లేరుగా నావంటి
పండితవరు లీ ప్రపంచమందు
సమయ మింతవరకు సమకూరకున్నది
నేడు పట్టి యితని నిగ్గు దేల్తు.''

ఇట్లు తమలోన తాముగా జట్లు తీరి
గుసగుసలు వోవు పండిత కుంజరులను
పారజూచిన ధారుణీపాలుదృష్టి
పండువంటి లాక్షణికుపై పాదుకొనియె.

పాతికయేండ్ల దన్క చలపట్టున లక్షణ మెల్ల తర్క ని
ష్ణాతత దున్నిదున్ని వ్యవసాయము చేసి గడించి పంటలం
బాతరవోసి కొన్న కృషిమంతుడు నిస్తుల భాగ్యశాలి ఆ
భూతలనాథు చూపులకు పొంగి మరింతయి మచ్చుచూపుచున్.

''సంత సాగించి ప్రౌఢ వసంతమూర్తి
యెవరి కమ్ము నూతనశోభ లింతవరకు
చీడబట్టిన ముదితీవచెంత జేరి
ముల్లె విప్పునేమి యుబుసుపోకకైన.

''ఆదికావ్యకర్త, వ్యాసర్షి చంద్రుండు,
భాసు డాదియైన ప్రముఖ కవులు
ఎవరి కొరకు కంఠమెత్తి పాడిరి, వారి
కొరకు మధుర కృతుల గూర్పవన్న!

''విఘ్నములకునెల్ల వెలియైన ప్రతిభాన
భాసికొరకు కృతుల బాడవన్న!
బ్రహ్మసవిధమైన పరమామృతమ్మును
వంచిపెట్టుమా ప్రపంచమునకు.''

అని లక్షణములు జల్లిం
చిన తేలిన రత్నములకు చిరనవ్వులు మో
మున తొలకిరంపనీయక
వినయానతి నతడు విన్నవించెను సభలోన్:-

''మీరు చెప్పుట లెస్స, యెవ్వారు రసిక
గణ్యులో మరి యెవ్వారు కారొ చెపుడు-
బ్రాహ్మణ క్షత్రియులు మీద వైశ్యకులము
పైని విద్యాధికులు శూద్రవరులు గలరు.

''గంద్రగోళమై కన్పించుగాన కావ్య
మిపుడు పేర్కొన్నవారిలో నెవరికొరకు,
ఎవరి బ్రహ్మైక్య సంధాన మెన్ను వేద
నాను భూతికొరకు వ్రాయ నగును? చెపుడు.''

''ముగ్గులోన నిలిచె పూర్తిగా మొనగాడు
పట్టిచూతు నెంత పలుకు గలదొ;
నిల్చి గెల్తునేని విల్చికొందును రాజా.''
ననుచు దలచి పండితాగ్రగామి-

''నవరస ఖండమండల సనాథ కవిత్వములోన నిట్టి వా
స్తవిక నికృష్టతల్ కొనలుసాచవు, పుట్టవు; ద్వంద్వభావముల్
చివురులు తొల్చబో వచట, చిన్మయరూపమె చర్వ్యమాణమై
తవులుచునుండు బుద్ధికి సదాశివమై అతివేలసత్యమై.

''అచ్చట తావులేదుగ సుఖాదిక భౌతిక వేదనాప్తికిన్,
బిచ్చము తెచ్చుకొన్న నిరుపేదలు, రాజ్యము గెల్చుకొన్న వి
వ్వచ్చులు నొక్కరీతి రసపాన వశంవదులై తరింతు రా
యచ్చపుబుద్ధి నిచ్చెనల నల్లిన బ్రహ్మము చేరి లీనమై.''

జి. వి. కృష్ణరావు

అని వాదించిన నా ప్రా
క్తన సిద్ధాంత ప్రవీణతా ధన్యుం డా
తని వాదార్థమ్ములనే
కొనసాగించుచు వివాద గోష్ఠిం దవిలెన్.

''కా దనరాదు మిమ్ము నిటుగా వచియింపడె భట్టనాయకుం
డాదినె? యీ రసస్థితికి నాద్యనిదానములేకదా విభా
వాదికముల్ నిసర్గ హృదయాంతర దేహవికారజన్యముల్;
వాదములేదుగా భరతువాక్యము లిచ్చుట మా ప్రమాణముల్.

''జీవనమందు భావములచే జనియించు వికారవీచు లె
ట్లే విధి వచ్చుచుండు నటులే కృతివాహిని నుద్భవించు ఈ
జీవనమెట్లు మారుపులు చెందునొ కావ్యము నట్లె మార్పులన్
బోవును కాని రెంటికి నపూర్వ విశేషము కానుపించెడిన్.

''కావ్య మన్న నిత్యానంద భావ్య మగును
జీవనమ్ము నిత్యానంద భావమగునె?
ఈ విభేదమ్ము జీవన వృత్తి నెరిగి
గారడి చేయుచున్నాడు కవివరుండు.

''అతడు నిర్లిప్తతా వర్ణమందు, కుంచె
ముంచి కావ్యరచనమందు ఎంచి కుంచి
పాఠక హృదయమ్ము కొరకు వ్రాయుచుండు
వ్రాతలోనె నిత్యానంద పదవి గలదు

''ఆ విచిత్ర వర్ణమ్ములో నద్భుతమ్ము
కేవల మ్మొక ద్రవ్య, మిం కేవి యేవి
కలవొ మీవంటి ప్రాజ్ఞులు కాంచవయు;
ఇంతవర కొప్పుకొనబోవ రేని వినుడు:-

''నచ్చదు జీవితమ్ము పరిణామము చెందు నటన్న మీకు; ఇం
దచ్చెరు వేమిలేదుగ; దృగంతము లొత్తి చరిత్రగర్భముల్
విచ్చితిరేని మీకు గనుపింపకయున్నె పరశ్శతమ్ములై
మచ్చులు, పూర్వకావ్యములు మాన్పునుపో తమసంశయమ్ములన్.''

అనిన లాక్షణికుడు మందహాస మొలుక,
''మీరు చెప్పినట్లుగ జూడ భారతమ్ము,
నాది కావ్యమ్ము నేడు కావ్యమ్ము లగునె?
దీని కెవ్వ రొప్పుదు''రన్న? దీక్షితుండు:-

''సంప్రదాయమ్ము మనకు ఆచార్యకమ్ము,
డానసే పూర్వకృతులు స్వాద్యములు నేడు;
సంప్రదాయమ్ము విడనాడి చదువుకొన్న
వానిచేత గలుగునా రసానుభూతి?''

అని సమాధాన మిచ్చిన యంత లాక్ష
ణికుడు తలవ్రాల్చె; అచటి పండితులు నాక
వీశ్వరుని భావమిసుమంత యెరుగలేక
విసిగి నిట్టూర్పు గాడ్పులు విడిచినారు.

''ఏమయ్యా యువభారతి!
ఏమని సారాంశ మింతకేనియు రాదే,
యీమాపున తెమలింపగ
లేమా?'' యని పార్థివుండు లీలగ నవ్వెన్.

తలపు తననోట బలికింప దలచు రాజా
భావమెరిగి కవీంద్రుండు ప్రజ్వలించి
కొలువునంతయు నొకసారి కలయజూచి
కక్కస మ్మెల్ల నట వెళ్ళగ్రక్క దొడగె.

''శారదవేళ నీ బురుజుచంకల నున్న పిరంగిబారులే
మోరలు మీది కెత్తుకొని పో రని హోరున పోరువెట్టినన్
గ్రూరతరమ్ముగా భటులు గుండెలు గ్రుమ్మరి, దాన ప్రాతపం
చారపుభేరి గుండె దిగజారి రణమ్ము రణమ్ము రండనెన్.

''అత్తరి నీ యనుజ్ఞలు లతాంగులపావడ లొల్చి బావుటా
లెత్తిన మానభంగముల కేడ్చుచు క్రుంగుచు వ్రాయువీచికల్
నెత్తులె మోదుకొన్న, వవినీతికి భానుడు జంకి మేఘపుం
బొత్తులలో నడంగె, వలపోసెను దిక్కులు గోడుగోడునన్.

''పుటపుట నెమ్ములర్ విరిచి పోసి గడించిన రోజుబత్తెముల్
గుటగుట త్రావి, నీ విపులకోశము మోసల కెక్కి గర్వముల్
పుటుకున ప్రీల్చుచుర్ కరగబోసె ఫిరంగులు వేనవేలుగా,
కటకము నిండి మా కడుపు కాలి సహస్రపుటమ్ము లెత్తెగా.

''ఓడక జైత్రయాత్ర మన సువ్వీళు లూరిన ఊర నాట బొ
డ్డూడని పిల్లసింగముల కుచ్చులు వోసి తరల్చి రక్తపుం
బాడవలందునర్ వదలి బారులు బారులు తీరిపించి, 'మీ
మాడు వగుల్చుకొం' డని యమాంతముగా ఉసికొల్పి చూడవా?

''గెలుపున కాస జేసి వెలిగించిన నీ భుజశౌర్యదీప్తిలో
గలగల కోడి పోసిన దకాలపు మృత్యువు లేతపుచ్చెలన్;
కిలకిల నవ్వి ప్రేతములు నృత్య మదేపని నొల్కబోసె, ప
ల్లెల ననివార్య వైఖరుల లేవడి తీర్చిన నిండుకొల్వునన్.

''ఎందరి మాతృ గర్భముల నెర్రని నిప్పులు వోసి కాల్చెనో
ఎందరి గుండెలన్ వగపు లెప్పటికప్పుడు దంచిపోసెనో
బందుగు లాప్తులన్ గురుల బాపుచు తాపక వాహినీబల
మ్మెందరిడెందముల్ గలచి యీసున నాయువు క్రుంగదీసెనో!

''మూపుల నూది హుమ్మనుచు మూరెడు మీదికి లేవనెత్తినన్
బాపురె! ఒక్కబార దిగబారును కర్షని తేరుపోలికన్
కాపుర, మిట్లు దిక్కు దెస గానని బీదలమీదికేగదా
గూపులు వేసి త్రోలితివి, క్రూరతరమ్ములు బాహుశౌర్యముల్.

''కొల్లలు పండు చేల నలుగొంగుల పల్లెరు లల్లిబిల్లిగా
పల్లిక లల్లుకొన్నవి, సిపాయిల రీతిగ తుంగగడ్డలుర్
పిల్లలు పెట్టి కాపురము పెళ్ళున దీర్చెను, రెల్లుదుబ్బు లం
దుల్లన మాడు మందపవనోర్ముల రైతుల వేడియూర్పులర్.

''పొంగి స్రవంతులై రుధిరపూరము గ్రమ్మిన రొంపి యయ్యె, ఆ
ప్రాంగణ మందు జీవితశతాంగము జందెపుగాళ్ళు వైచినర్
టంగున టంగువాళ్ళు తెగటారుటె గాని కదల్పరాక రై
తాంగము ఘోష పెట్టునుగదా జనవల్లభ! ఆలకింపవా?

''ఇంతలు చేసినావు సరె, యీ ప్రజ కేమి లభించె నయ్యా? దు
ర్దాంత తనూజ శోకములు తల్లులగర్భములందు రేగి పా
ర్లింతలు పెట్టి యేడ్చును, పొరింబొరి ఊరక కల్వరించు, ఏ
శాంతియు లేక మూల్గు తమ చల్వలు నిచ్చలు నెత్తిపోయుచున్.

''ఎండి ఇల కరుచుకొని పోయిన బికారి
పొట్టలందు నీ శౌర్య సంస్ఫూర్తికీల
త్రాగి తందనా లాడు కిరాతకన్య
వోలె దయకు గుండె గరగి జాలువార.

''స్వాములచిత్త మింతటి విషాదకథాకథనమ్ములో కవి
త్వామృత మానునా? జనహృ దంతరరక్తము వుక్కిలించునా?
ఏ మని వ్రాయగావలయు? ఎట్టులు చేతులు వచ్చు? ఇందులో
పాముకు తింద మన్న వస వల్చెడు నెత్తురు ముద్దయే గదా?

''నమలుదునా మ్రింగుదునా
యెముకలతో నన్నయట్టు లీ నిరుపేదల్
ధుమధుమ చూచెద రేటికి?
తమకుం గనుపింపబోవె దారుణభంగుల్?

''తీర మీ పేరు నోటను జారెనేని
కబురులను చెప్పుకొనువారు కలగుచుంద్రు;
పెటుకు పెటుకున నిల్లాలు మెటికె విరుచు;
నవ్వుచుండెడి పసికందు కెవ్వు మనును.

''ప్రాయపు వేడినెత్తురులు వాకలు గట్టిన వీరభూసతీ
స్నాయువులందు బత్తెములు చాలని శూరుల ప్రాణఘోషముల్
పాయక తీవరించి పరిపంథుల నెత్తుటితర్పణమ్ముకై
హో యని యార్చుచున్నవి మహోచ్చలి తానిల రోదనమ్ములన్.

''కాదనియన్నచో నుడువ గల్గుదుమా నృప! కాంద్రుకాంద్రునన్
మీదికి దూక నున్న మిడిమేలపు బెబ్బులి విక్రమమ్ములు
న్మాదకరమ్ములో? మధుర నవ్య సుధారస కారకమ్ములో?
వాదము చేయగా వలెనె పండితు లిందరు తేల్చి చెప్పగన్?

''క్రిందును మీ దెరుంగక చరించిన మీకు భవత్ప్రతాప మా
నందము గూర్పవచ్చును, ధనమ్మును మీకడ పుష్కలమ్ముగా
పొంది కుదింపరాని పెనుబొజ్జలు పెట్టిన యయ్యలెల్ల రా
నందము పొందవచ్చును, జనమ్ముల కియ్యది నచ్చివచ్చునే?

''తెగబడి మీ ప్రతాపము నుతించిన నేర్పున కావ్య మల్లినన్
భుగభుగ మండిపోయెడిని పో జనతాహృదయాంతరాళముల్,
సెగపొగ లొక్కసారి జనసీమలు గ్రక్కును నాల్గుప్రక్కలన్,
పగ లెగద్రోయు భావనము మాన్యతమ మ్మగు కావ్యవస్తువే?

''వేదన లార్చి పేర్చి నడివీపున గ్రుద్దుచు నున్న త్రోచి ఆ
స్వాదన ధర్మముల్ దుడిచివైచి సమాజ శుభక్రమాభి సం
పాదన విస్మరించి మహివల్లభు డిచ్చు పసిండికోసమై
మై దొనరింతురా కవు? లమానుషముల్ గద యీ ప్రవర్తనల్!

''స్వార్థపరాయణత్వ మెటు లాడిన నట్టులె యాడి యీ సమా
జార్థము పొంగి వచ్చు కవితామృతవాహిని కట్టివైచి నీ
మూర్ధమునందు నిల్పుకొన బోలునె? పూర్వయుగమ్ములందు
ఏ పార్థివు డైనగాని యిటువంటి దురంతము లాచరించెనే?

''కలిగిన నింత పూయుదురు, కట్టుదు; రంతియెకాని, యీప్రజా
పలి జపియించి పొందిన తపఃఫలసాహితి మ్రింగవచ్చునే?
వలదు, మహాపరాధ మొకపట్టున బోవదు, నీ చరిత్రకున్
పెళపెళ దిట్టిపోయును భవిష్యయుగమ్ములు క్రోధవిద్ధముల్.

''ఓ రాజ! ఓ రాజ! హుంకరికంపకుము,
ప్రజపట్ల ద్రోహమ్ము పాడియే కాదు,
సంఘమ్ముతోడిదే సాహిత్యలక్ష్మి,
దీనిపై నేహక్కు దీపింప బోదు,
కడగి కోపమ్ముతో గారించియైన
పడయంగ రాదయ్య ప్రభువుల కెట్లు,
జనుల జీవితములే సామగ్రి కవికి,
ప్రజలాదరింపగా బరగు కావ్యమ్ము
ఇట్లున్న ధర్మమ్ము నీసడింపకుము.''

ఉరుమని పిడుగుల నీ గతి
గురియించిన నా కవీంద్రు కోపమునకు ది
మ్మరపడి వెడచూపులు చూ
చిరి తద్గోష్ఠి గల సూరి శేఖరు లెల్లన్.

ఆ కల్లాడదు తత్సభా సముపకంఠారామ వృక్షమ్ములన్;
మూకీభావము నొందె విహ్వలములై పుంస్కోకిలవ్రాతముల్,
చీకాకై వెడలింప జంకె లతికల్ నిశ్వాస సౌగంధ్యముల్,
ప్రాకెన్ వీచులు వీచులై యట భయభ్రాంతుల్ వికీర్ణమ్ములై.

నమల లేక, మ్రింగను లేక, నరవరుండు
'గోష్ఠియందు నీవా, నీవ, కొమ్ము లొడ్డి
గెలుతు' వన్నట్లు వీక్షించె; కిక్కురు మన
రైరి పండితులం దొక్కరైనగాని.

అంత పారిషదులు లోన వ్యాకులపడ
ఆంధ్రధారుణీజాని నేత్రాంబుజాల
గౌరవ మరందములు జాలువార జూచి
గుండెలు గుదించి తీర్పు వాక్రుచ్చె నిట్లు:–

''ఓ కవిరాజ! పూర్వ మెదు రొడ్డి ధరాభృదుదగ్రు నీవలెన్
డీకొని యేకవీంద్రుడు పెట్టిల్లన ప్రక్కలు సేయనేర్చెనా?
ఈ కరణిన్ కృతీశు లడ లెత్తిన కాడిని పారవైచిరా?
కైకొన వన్న! నిన్నె జయకాంత వరించెను కావ్యగోష్ఠిలోన్.

''వాదమునందు నోడితిరి పండితమండనులార! వీరి శ్రీ
పాదవిభూతి గోరి అభివాదము సేయు, డనుగ్రహ మ్మపా
సాదిత మైన మీకృతులు శాస్త్రహితమ్ములు, మంజులమ్ములై
చాదు సుధారస మ్మొదల సానల; సందియ మంద నేటికిన్?

''చిత్తయినారు వాదమున శీర్షము వంపగ చిన్నవోదురే?
మెత్తురె యీప్రవర్తనము? మే లగునే? యిక, కాదు మ్రొక్కుడీ,
బొత్తుగ పిన్నపెద్దలను పూజనభావము వీటబుత్తురే?
గత్తరపాటు లేమిటికి? కాల్గదలింతురె మ్రొక్కండినన్?''



జి.వి. కృష్ణరావు

అని శాసించిన నృపుగా
దన జాలక కవులు పండితాగ్రేసరులా
తని పాదమ్ములకుఁ బ్ర వం
దన మొనరించుచు నిలిచిరి ధాత్రీవరుడుఁ-

హాం డని వారలం బనిచి, పూర్వ మహీధరమందు బొల్చు మా
ర్తండుడువోలె నున్న కవిరాట్టును కన్నుల గప్పుకొంచు, ''బ్ర
హ్మాండము బ్రద్దలైనదిసుమా తమశాస్త్ర వివాదఘోషతో,
పండెను హామ్మ మేము తొలిబాముున జేసిన నిండుపున్నెముల్.

''ఇంతటి సాహసిక్యముల నెందును గంటిమ వింటిమా? మహో
దంతము ముందుముందు జనతా హృదయాంబురుహంబులందునన్
గంతులు పెట్టు, కావ్య మయి గానము నించు దిశాసతీసభా
భ్యంతరమందు, జన్మము కృతార్థము హామ్మ, జగత్ప్రియంకరా!

''దుస్సహముల్ వివాదములతో కుపితమ్ములు రాజ్యతంత్రముల్
బుస్సున తోకపై నిలిచి పూత్కృతి సేయుచునున్న, వింక, నా
యుస్సును బట్టి పీలువక యుండునె? హాండని సాగనంపునే?
కస్సున కాటు వేయు; నటు గావున నూపిరిదారి చూడుమా! 73

''కా దన కున్న నొక్క యుపకారము సేయగ సాహసింతు, సూ
ర్యోదయరాగముల్ దెసల నోడిక గట్టక మున్పురమ్మునం
దేదరిదావునఁ నిలువ కేగిన ప్రాణము దక్కు; లేనిచో,
నాదట వచ్చు మృత్యువున కాదుకొనం దరమౌనె బ్రహ్మకుఁ?''

ఇట్లు కరుణారసమ్ము చిందించు నృపుని
చిత్తపరిణతి మెచ్చి యాశీర్వదించి,
కావ్యధర్మ రక్షార్థియై కంఠ మెుడ్డి
న యువభారతి సెల వొంది నడువ సాగె.

# విలక్షశిలీముఖము

''ఆదృతి కాలకూట విషమై తల కెక్కిన నోలగమ్ములో
నేదియొ కూసెనంట కవి; యెట్టులు వింటివి, సైచి తయ్య? ఆ
చీదర నాల్క నేమిటికి చీల్పవు నీ కరవాలధార? ఆ
మోదము చూపితే? విసము పోసిన మ్రింగుట కామతించితే?

''పూటకు దారి లేక వలపోయు నొకానొక ముష్టివాడె ఈ
నాటికి రాజ్యభోగుల ఫణాఫలకమ్ముల దన్ని మేనితో
బైటికి బోవ జాలునట, ప్రాణము లుండవ రాచబొందిలో?
గోటను గిల్లివైతు మిదిగో, కవిమస్తక; మూరకుందుమా?

''తూరుపుకోటపై విజయ దుందుభి మేల్కని మా నృపాలకా
గారములో ప్రభాత రవికాంతుల బొంగుచు మంద్రనాదమై
సారపుబల్కులం బలుక సాగక మున్నె పురాగ్రగోపుర
ద్వారమునందె ఆ కవికపాలము గట్టెద దోరణమ్ముగా.

''ఆ రాజద్రోహాత్ముని
ఈ రాజ్యము దాటి వెడల నిల్చినచో నీ
గౌరవము ప్రజాశాంతియు
సారెకు నశ్రువులు నించ సాగక యున్నే?

''అతడు కేవల మల్పుడే యగునుగాక,
తంత్రగమనమ్ముల దయకు దావు లేదు;
రాచసింగపు గొదమపై రాలు రువ్వి
ప్రాణములతోడ కవిగాడు బయట పడునె?''

అనుచు కత్తి నూరెడి యమాత్యవరు జూచి
నృపుడు నిముసమ్ము యోచించి నిశ్వసించి,
''చెప్పకుందురా మీకు విశేష మెల్ల,
ధర్మ మేరీతి దిగద్రావ దగును? చెపుడు.

---

జి.వి. కృష్ణరావు

''ఆ వివాదమ్ములో నేను కేవల ప్ర
మాత నై తీర్పు చెప్ప ప్రమాణ మూని
పిదప రాజునై యెట్లు జృంభింప నగును?
ధరణిధవుడె వాగ్దానమ్ము తప్పినేమి?

''ఒలి ఒలిగ పండితుల నెల్ల నోడ్చె నతడు
దానికి దల గొట్టింప సత్కార మగునె?
ఇంత నిష్ఠురమ్ములె రాజ్య తంత్రవిధులు?
చాలు జాలు నెత్తకు డా ప్రసంగ మిచట.

''విభుడె తానుగా వాదమ్ముల వేడెనంట,
కా దనగ లేక కవిరాజు కడగెనంట,
ప్రాణములు దానికై తీయ వలయునంట,
కటకటా యిట్టి ఘోరమ్ము కలదటయ్య.''

అనిన భూపాలు గని మంత్రి హసరేఖ
తెల్లమీసాలలో నత్తమిల్ల బలికె–
''రసికు లెవరయ్య? ఆంధ్రసమ్రాట్టు లెవరు?
ఇరువురున్నారు గాబోలు హృదయసీమ!

''కుడిప్రక్క హృదయమ్ము కువలయేశుండు,
బడిప్రక్క హృదయమ్ము ప్రతిభానశాలి,
ఓహో! విశేషమ్ము లూకొన నయ్యె,
ఈమాత్ర మెరుగవే ఈనీతి నీవు?

రాజ్యచక్రము నింక రక్షింతు వేని,
కవిని పోనిచ్చుట కర్జమ్ము కాదు,
ఈపైని రాగల వెద్దడుల్ వినుము;
రక్తపాతము నిన్ను రంజింప దేని,
కవికంఠ లుంఠన కావింప నాకు
వేవేగ ముద లిమ్ము, వెడలి తేల్చెదను.

''కవి యని సంకోచమ? మా
నవుడే కాడా? అతండు నరికిన తెగడా?
మివులునె కొమ్ములతో? కా
లవిలంబన మేమిటికి తలం దెగజూతుఁ.''

అనిన వారించి సర్వంసహాధినేత
''ధారుణీపతి వాక్యమ్ము తప్పి చనదు,
రేపు పురి నున్నచో పెడరెక్క గట్టి
అతని గొని ర,''మ్మనుచు మంత్రి నంపివైచె.

# ప్రసక్తప్రస్థానము

''గాలముపైచి నాకొఱకు కాలము కన్నుల నార్పకుండ ఆ
జీలుగ కాచుకొన్నది; నసీబున గీసిన కుంటి గీతలో
కాలము మూడునో, పురుషకారములే విజయమ్ము లందునో!
జాలము సేయరాదు నిముసమ్మయినన్ పయనమ్ము గట్టుమా?

''భానుడు ప్రాగ్దిశాచలముపై కెగబ్రాకుటె జాగు, కాశ్యపీ
జాని మహాగ్రశాసనపు జాగిలముల్ గొని నాలిలేని నా
ప్రాణము వేటలాడుటకు పంతము పట్టినవాడు; తెల్లమై
దానము లల్గి నా రుధిరధారలు గ్రోలి సమాధి కట్టునో!

''అన్నెము పున్నెముం దెలియనట్టి కుమారులు నిండుకుండలై
కన్నులుమూసి, కోరికలు కట్టిన దివ్యజగమ్ములందు, ఏ
పొన్నల నీడలం దిరుగబోయిరొ! మృత్యువు, కన్నుగుట్టి, ఆ
ప్రన్నని పిల్లవాండ్ర కెగబడ్డది, లేపుము, లేపుమా చెలీ!

''భూపతి శాసనమ్మునకు బోసిన యుచ్చుల నొక్కటొక్కటే
తేపకు తేప కార్చి తెగత్రెంపుచునున్నవి యీ నిమేషముల్;
తాపములేదు నీ హృదయతామరసంబున బ్రహ్మగంటివా?
కోపము కొల్వు గైకొనిన గుండెల కత్తులు నూరుచుంటివా?

''తాకిన తాకుతో తల బదాబద లైనది, నెత్తు రోడె; పెం
జీకటు లేలుచున్న గృహసీమల దీపము పెట్టుకోరె? నీ
వేకడ నుంటివే, పలుకవేమె, పరాకులు పాడుగాను! నా
వ్యాకులజీవితమ్మున దివాంధము కూత కుపక్రమించెనే!

''సైఁ యని యొంటికాలువ, విషాదపదాహతి గుందు నాపయిన్
దాయము గట్టి మృత్యువు క్రుధావివశమ్మయి దూకుచున్న, నీ
కాయమువచ్చునా? పగలు నా ధృతిదర్పము లారితీరునా?
ఛీ యనకుందురా ప్రజలు? చేష్టలు చేదయి తిట్టకుందురా?

యుగసంధ్య

''పరపర మిత్తి దేహ మొకప్రక్కను గోయుచునున్న గాని నా
మొర చెవి దూరబోదు; ముసి ముట్టదు; చేసినపాపమిట్లు మో
చరచుచునున్నదా? యకట! జాముల నాపురుషాయుషమ్ము క
త్తెరబడి పోవసాగినది; తిట్టిన తిమ్మిన లాభమేమిటే!

''ఎంగిలి మంగలమ్మయిన యీతని దుర్భరజీవితమ్మునన్
క్రుంగుచునున్న జీవములకోసము గోడ్రిలుచుండలేదు; పొ
న్నంగుల జంటవోలె శయనమ్మున కన్నులు మూసి, నిద్రలో
బంగరులోకమేలు పసిబాబుల ప్రాణము సంస్మరింపవే!

''మదవతి, ఒక్కమాట! అభిమానము లిప్పుడు దోయిలించి, నీ
పదముల నంటి మ్రొక్కుచు, ''కృపాపరిపాకము భిక్షపెట్టుమా!
బదవలుపడ్డగాని పసిపాపల సాకుతెరంగులే'' దనెన్
పెదవులు విచ్చి; మాతృపదవీ నదవీయసి, ఆలకింపవే!

''ఇంతకు, చిత్రగుప్తుడు లిఖించిన జీవుల జాబితాల నా
వంతున కాయు వంతమని బఱ్ఱున గీటున బుచ్చినాడొ! ర
వ్వంత విచారమేని హృదయమ్మును సోకక గండరించితే!
ఇంతకులగుండెలా, అకట, యియ్యవి దాచిన చట్టుబండలా!

''పోరొనరించుచుండి రణభూమిని గూలిన చింత గల్గ; దా
ఘోరమణుండు నన్విడిచి పొమ్మని చెప్పిన రాజధానికిన్
దూరము వోవలేక నృపదూతల చండకృపాణధార కా
హారముగా శరీరము సమర్పణముం బొనరింపవచ్చునే?

''పనివడి దేశరక్షణమొ, పాడియొ కోరిన నే దధీచినై
తనువును గోసి యిచ్చెదగదా; యిటు లూరక పచ్చినెత్తురుల్
దొనదొన కార్పగా దగునె? దోషము, శాస్త్రవిధీయమానము
ష్టాన గతియించునొక్కొ? గమనోన్ముఖివై పయనమ్ముగట్టవే!

''ఇంతగ కాళ్ళ వ్రేళ్ళబడి యేడ్చిన, కాదని మొత్తుకొన్న, నీ
స్వాంతము చయ్యిచుయ్యనదు, జాములగోడిగ లెక్క, రివ్వునన్
కుంతము లార్చుకొంచు, మెరుగుల్వలె దూకుచునున్న ఘోరకా
లాంతకకోపరేఖలకు నాగుదొ, జంకక నిల్చి క్రాగుదో!

''ఓ మొగలాయిరాణి! కరుణోదయకారణవర్తనమ్ములే
మేమియొ విన్నవించుకొన నెంచుచు ముంగిట మోకరించె; ఈ
మోమయి చూడరాదొ? వినబోలదొ? మేలిముసుంగు టంగునఁ
ప్రామితి, వింతలో గడసబారితివేమె, మరాటి గుఱ్ఱమా!''

''ఎవ రయ్యా లోపల? మా
యువభారతి కవివరేణ్యులున్నారా? ఓ
యువభారతీ! యువభారతీ!
వివరము రాదేమి యెంత పిలిచిన నిచటఁ?''

''అమ్మా, అమ్మా యిక లే
వమ్మా! మన యూరు పోద మంటివిగాదా,
తమ్ముని గొనిపోదము, కను
దమ్ములు విప్పగదె చిట్టితల్లి యింకఁ.

''గిలిగిలి చక్కిలిగిలిగిలి
తొలగెను మాతల్లినిదుర దొంతర లెల్లఁ;
కిలకిల మా బంగారపు
చిలుకే నవ్విన దిగంత సీమలు గులుకుఁ.

''కన్నులు నులుముటలోనే
యున్నది వ్యాపార మింక, ఉష్షాబలె బలే,
తన్నున బోయెను మత్తులు,
వెన్నుడు మాయమ్మ యగుచు వెలసెను లెమ్మా!''

''ఎవ రయ్యా లోపల? మా
యువభారతి కవివరేణ్యులున్నారా? ఓ
యువభారతీ! యువభారతీ!
వివరము రాదేమి యెంత పిలిచిన నిచటఁ?''

''నాన్నా! నాన్నా! నీవా?
కన్నులు కనరాని యందకారము క్రమ్మెన్;
వన్నుండి కలలు కంటిన?
ఎన్నో కనుపించె బూచు లింతకు మున్నే.''

‘‘ఎవ రయ్యా లోపల? మా
యువభారతి కవివరేణ్యు లున్నారా? ఓ
యువభారతి! యువభారతి!
వివరము రా దేమి యెంత పిలిచిన నిచటన్?’’

‘‘తలుపు తట్టి యెవ్వరె నిన్ను బిలుచువారు?
దద్దరిలి పోవుచున్నది ద్వార మెల్ల;
వారు సాయమ్ము వత్తురా యూరిదనుక?
నాన్న! పోబోకు వచ్చుచున్నాను నేను.’’

అనుచు ముద్దుకూతురు పల్కినంత జంద్ర
రేఖ మంచమ్మునందుండి రిక్కవోలె
దుమికి జీవితేశ్వరుని పాదములపైని
వ్రాలి చుట్టుకొనియెను బాష్పమ్ము లురల.

‘‘వలదు కదల వలదు వాకిట నిలబడి
పిలుచుచుండె మిత్తి తలుపు తట్టి,
బాస యిచ్చి యిటుల భటుల బంపించునా?
రాజా గుండె వట్టి రాతిబండ.



‘‘నిజము తెలియ లేక నీల్గు వోయితి గాని,
ప్రాణ మారగింప పాలుపడియె
ధారుణీశు డంచు తలపగా లేనైతి,
గేలిమాట లంచు బేలుపోతి.

‘‘నేటితోన నీకు నిండెనా నూరేండ్లు?
బ్రహ్మవ్రాత యిట్లు పండెనేమి?
ఇంత నిష్ఠురంబె? యీ యయ్యహృదయమ్ము?
జాలి నమ్ముకొన్న చంపునేమి?

‘‘కునుకు పులుగుజంట గుండేలుబ్రద్దతో
కొట్టి కూల్చునొక్క క్రూర మనక!
ఓయి కాలపురుష! న్యాయమా యీయది?
కంట నిప్పు బోసికొంట కాదె?

''రాచపగలు కోడె(త్రాచులై కాపలా
కాయుచున్నవి తలకాయ లొగ్గి;
కదలితేని నిన్ను కా టంది తీరురా,
గడప దాటి యిపుడు కదల వలదు.''

అనుచు దీనయై పలుకు నిల్లాలి జూచి
పలికె కవిరాజు గుండెనిబ్బరము మెరయ;
''చంప దలచిన రాజు న న్నంప నేల?
వెనుక భటులచే నిట్లు (క్రవ్వింప నేల?

''పిచ్చిదాన! కేవలము నీ వెఱ్ఱి గాని,
అతడు చంపింప దలచిన ట్లైన నీకు,
నాకు నీ రాజ్యమున శరణ్యమ్ము గలదె?
దిగులు పొచ్చినంతగ కడతేర లేము.

''ఇంక దీపమ్ము వెలిగింపు, మిపుడె పోయి
దేనికై పిల్పుచున్నారొ తెలిసి వత్తు;
గడచి పోవుచున్నది పుణ్యకాల మెల్ల;
నిలువ రా దిట మన నొక్క నిముస మైన.''

ఇట్లు భార్య నోదార్చి కవీశ్వరుండు
చేయ వలసిన కార్యమ్ము చెప్పి కదలి,
ద్వారభూమికి నేతెంచి తలుపు తెరచి
ఏమి వీక్షించినాడొ స్తంభించిపోయె.

బందము (తెంచుకొన్న నరపాలుని శాసన మప్పుడే జమా
బందికి వచ్చెనేమొ, కృ కవాకుముఖమ్ముల కాలధూర్తుడే
చిందము నొత్తగా పెదవి జేర్చెనొ, తూరుపుకాంత అయ్యుష
స్స్యందరికోసరమ్ము తిరుచూర్ణపు లత్తుక రంగరించెనో.

''భిక్షాం దేహి జనావన
దీక్షా మహితాంతరంగ దివ్యత్కవితా
నిక్షేపా!'' యను తీవ్రబు
భుక్షాకృత యాచనమ్ము (మోసెం జెవులన్.

వెడలి వచ్చిన ఆ శబ్దవీచితోన
క్రమ కర్పూర వీటికా గంధ మపుడు
బుగులు గొన్నంత కవిరాజు పోల్చుకొనుచు
"ఆంధ్రధారుణీవల్లభా! స్వాగతమ్ము.

"నిలువ నేల యిచ్చోట? లోపలికి రండు,
పావనం బయ్యె నేడు నా జీవనంబు,
కల్పశాఖికి దప్పి పోకార్చ జాలు
నంట, కంటిమే యిట్టి మర్యాద లెందు!"

అనుచు నా రాజుతో గృహాభ్యంతరమున
కేగి యుచిత సత్కృతుల గావించి ఉన్న
తాసనాసీను జేసి చూపంత యతని
యాస్యమున నిల్పె; నయ్యుదారాశయుండు:-

"ఈ తరుణేందుదీప్తి నిదురింపగ నీయక నామనమ్ము ను
ద్రూతల నూచి తెచ్చె రస ముగ్గగ ద్రావిన నీ మనోజ్ఞ వా
ణీతరలార్ద్రగీతిక, పునీత పురాతన గాఢ సౌహృదం
బీతరి సంస్మరింపుమ కవీశ్వర! కావ్య మనుగ్రహింపుమా!

"రత్న గర్భాధిపత్యమ్ము రాపు సేయ
నిటకు వేంచేయ లేదు, వీక్షింపవన్న!
పూర్వ సుస్నేహము లిపుడు మోకరించి
వేడుచున్నవి మీ కావ్యభిక్ష కోరి."

అని రసతృష్ణామతి బ
ల్కిన విని యయ్యాంధ్ర రాజ కేసరి కాతం
డనియెన్, "సాహిత్యారా
ధన మిప్పుడు పండి వచ్చె, ధన్యుడ నైతిన్.

"కావలె మీ కావ్యము, మా
కీవలె నని రసికవర్యు డిగతి వేడం
గా వచ్చె, నింక కవితా
జీవులమది యేమి కాంక్ష సేయును జెపుమా?

''హృదయ కేదార ఖండమ్ము నెల్ల ఆత్మ
వాక్య నిర్గళిత సుధాప్రవాహమందు
ముంచి యెత్తెడు కాంక్ష లుప్పొంగి కాదె
చేయుచున్నారు సుకవు లమేయతపము?

''వెదుక బోకుండ నతియోగ్యు డెదురుపడియె,
కూతులున్న తండ్రుల కేమి కోర్కె లుండు?
ఐన నోచుకోలేదు కన్యాప్రదాన
మున కొౕకతె కల దర్పించు టనుచితమ్ము.''

అనుచు పల్కనంతన కవీంద్రునితనూజ
ఒక్కగంతున భూమీశు నొడికి దుమికి,
''అప్ప! ఈ బుగ్గపుస్తీల అయ్యకేన
ఇచ్చి నను పెండ్లి గావింప నెంచినావు?

''ఎక్కడైన కన్పించెనా ఇంత ముక్కు?
ఎవతె పెండ్లాడునయ్య! మోమెల్ల కనులు?
వలదు వల దప్ప! ఈ రాజు వలదు నాకు,
కలలలో గూడ ఈ రూపె కానుపించు.

''పెండ్లి గావింపకున్నను పీడ వోయె,
ఎగుబుజాలందె చేటలంతేసి చెవులు;
కోరమీసాలు నా గొంతు గోయునేమొ,
వలదు వల దప్ప! ఈ రాజు వలదు నాకు.''

అనిన నవ్వుచు కవుగిట నదిమిపట్టి,
''నిన్నె పెండ్లియాడెదను సందియము లేదు,
ఎపుడొ మీ యప్ప వాగ్దాన మిచ్చె నాకు;
ఎట్లు తప్పు?'' ననియె ధారుణీశ్వరుండు.

''తల్లీ! పెద్దల గలబడ
జెల్లదు నాదరికి రమ్ము చిట్టి! ఏదో
అల్లరిచేసెడి తమ్మని
చల్లగ దోడ్తె,''మ్మని కవిచంద్రుడు పంపె.

ఆ రసపిపాసి కవితోడ ననియె నిట్లు:-
''కలద టంచు బల్కిరిగదా కావ్య మొకటి,
దాని నైన గటాక్షింప దగదె నాకు?
ఏల యింతగా తటపటాయించతు రయ్య?

''ఎన్ని యబ్దమ్ములో గతియించె గాని,
ఇచట మీ సుధాసూక్తి వర్షింపలేదు,
ఈ మరంద మహోలుబ్ధ హృదయ మొక్క
వేళగూడ క్రొందేనియల్ క్రోలలేదు.''

అన్న నిట్టూర్చి కవిరాజు విన్నవించె,
''ఈ రసార్ద్రతల్ కలకాల మేలుగాక;
ఈ సమాశ్రయమ్మున నన లెత్తి తెనుగు
పూర్ణ సౌరభ్యముల నెగబోయుగాక.

''భర్త కవ్వయం బైన శోభనము కోరి
స్వీయ కవిత నంకితము గావింపవలయు,
కృతిని దమను సమర్పింతుమేని నీదు
ప్రాణములకును భీకరోత్పాత మొదవు.

''సార్వభౌమ! ఇందుల కర్రు సాచవలదు,
వేరె యర్థమ్ము నిందు భావింపకయ్య!''
అన్న కావ్యార్థ జిజ్ఞాసు వంత బలికె,
''పోని, కృతి నేను పరియింప బోల దొక్కొ?''

ఇంతగా గ్రుచ్చి గ్రుచ్చి యర్థించు రాజా
గా దనగ లేక యాతడు కడకు బలికె-
''ఈ కృతిని ద్వదన్యులకు జూపింప ననుచు
మాట యిం''డన్న, నటు లిచ్చె క్ష్మాధవుండు.

అప్పుడే కవినందనుం డరుగుదెంచి,
''నాన్నగారు పాత్తము నిచ్చినారె? నేను
మంచి బొమ్మ యొక్కటి దాచి యుంచినాను,
దానికోసమై మా యక్క తగవులాడు.

''ఇత్తు నాబొమ్మ, మా యక్క కీయగూడ
దండి, ఇత్తురా, నే నొప్పనండి!'' అనుచు
కొయ్యబొమ్మ యొక్కటి తెచ్చి క్షోణిపతికి
నొసగ కేరింత గొట్టుచు నొక్కవగిది.

అంతలో పుత్రికానీతమైన గ్రంథ
మందుకొని ధారుణీనాథు హస్తయుగళి
బెట్టి, ''పోయి రావయ్య పృథ్వీప!'' యనుచు
ఆ కవీంద్రు డాతని సాగనంపి వచ్చె.

*1944*

# మాధ్యమకవింశతి

మూలము : నాగార్జునులు

పలుకునకు నందకున్నఁ దత్త్వంబు పరమ
కరుణతోఁ జూపినట్టి ప్రజ్ఞాననిధికి
ధూతరాగోత్తమునకు బుద్ధున కచింత్య
శక్తి కర్పింతు నిదె నమస్కారశతము.

పారమార్థిక దృష్టి నుత్పత్తి లేదు,
లేదు విలయమ్ము, గగనమ్ము లీలవాఁడు
బుద్ధదేవుండు, మఱి యట్టిపోల్కి నొప్పు
సత్వములు గూడ నేకలక్షణము లగుచు.

ఉభయతటమందు జాతి యయుక్త మగును,
ప్రత్యయోద్భూతి సంస్కృతార్థనికరమ్ము,
సర్వ మెఱిఁగికొనినవాని జ్ఞానదృష్టి
యందుఁదత్త్వమ్ము శూన్యమ్ము యగుచుఁ దోఁచు.

భావములు సర్వమును స్వభావమ్ము చేతఁ
బ్రతిమ లట్టివ యంచుఁ జెప్పంగఁబడియె,
అమలములును శాంతస్వభావాద్వయములు
అల తథాతయు నొప్పు తుల్యంబు లగుచు.

తత్త్వజిజ్ఞాస చేతఁ బృథగ్జనుం డ
నాత్మయం దాత్మ కల్పించె నట్టి కల్ప
నముల సుమ్ము సౌఖ్యమ్ము దుఃఖము నుపేక్ష
క్లేశ మపవర్గ మనఁగ నిష్కృష్టదృష్టి.

చటులసంసారగతమైన షడ్గతులును,
సుగతియందలి నిర్వేలసుఖము, ఘోర
నరకమందలి భయదదుర్భరశుచమ్ము
తత్త్వదృష్టికి నెచ్చోటఁ దారసిలవు.

అశుభకర్మాళిచే జరావ్యాధి మరణ
శోకము లనివార్యమ్ములు సోఁకు, శుభము
లైనకర్మతతులచే శుభార్థసిద్ధి
కలుగు నని నిశ్చితంబుగాఁ దెలుపఁబడియె.

ప్రబలభయదమ్ము యక్షరూపమ్ము వ్రాసి
యరసి చిత్రకారుఁడు తానె యడలునట్లు
ఆత్మకల్పితసంసారమందు బోధ
విరహితుండు సమ్మోహియై విహ్వలించు.

తప్పటడుగుల నడయాడు దారకుండు
కడచి కుటిలకూపగతవంకమునఁ గూలు
నట్లు సత్త్వవార మ్మొర్థమాక్షమమ్ము
కల్పనాపంకమున నిమగ్నత్వ మందు.

భావదర్శనంబువలన నభావమ్ము
నందు దుఃఖ మొదవు, నట్టిజ్ఞాన
విషయకల్పనోగ్రవిషవహ్ని పీడ్యమా
నమ్ము సర్వసత్త్వసముదయమ్ము.

శరణరహితమ్ము నద్దాని నరసి యతిద
యార్ద్ర చేతస్కుఁ డగుచు సత్త్వావళి కుప
కార మర్థించి విజ్ఞానఘనవిశిష్టుఁ
డెపుడు బోధిచర్య సమాచరింప వలయు.

దానసంభారములు కూర్చి జ్ఞానఘన మ
నుత్తరము పొంది కాల్పనికోగ్రబంధ
నమ్మునుండి పూర్ణవిమోచనమ్ము వడసి
యిద్ధలోక బాంధవుఁడైన బుద్ధుఁ డగును.

ఈ ప్రతీత్యసముత్పాదదృష్టితోడ
నెవఁడు భూతార్థ మెల్ల దర్శించు వాఁడు
కాంచుచున్నాఁడు సుమ్మీజగమ్ము శూన్య
మనుచు నాదిమధ్యాంతసంత్యక్త మనుచు.

87

చకితసంసార నిర్వాణచక్రయుగము-
దృష్టిమాత్రాన సిద్ధ మైతిరుగు నంతె,
తత్త్వ మెన్నంగ నాది శాంతమ్ము, నిర్వి
కారము, నిరంజనము, సుప్రకాశ మగును.

తనదు కలయందుఁ గన్నయర్థమ్ము మేలు
కాంచియున్నట్టి దశయందుఁ గానఁబడని
పోల్కి మోహాంధకార ప్రబుద్ధమతికిఁ
దోఁచఁబోవ దీ సంసారగోచరమ్ము.

సంస్కృతం బెల్ల మాయానుజాత మగుట
కేవలమ్ము మాయావలోకితమ యగును,
అంతె కాని భావమ్ము రవ్వంత లేదు
ధర్మత యిదియెగా యెల్ల ధర్మములకు.

జాతిమంతమ్ము స్వయముగా జనన మంద
౪౪ లేదు, జాతి లోకవికల్పనోదయంబు,
సత్వజాలమ్మును వికల్పజాత మగును,
కాన ద్వైత భావమ్ము యుక్తమ్ము గాదు.

మాయ గల్గిన ద్వై చిత్రమాత్ర మగుచు
నీ సమస్తప్రపంచమ్ము నెసఁగుచుండు,
దానిచే వుభాశుభకర్మతతియుఁ బొడము,
దానిచే శుభాశుభము లుద్భవము పొందు.

చిత్తచక్రనిరోధంబు చేత సర్వ
ధర్మసంఘాతములు నిరుద్ధంబు లగును,
దానిచే ధర్మములు ననాత్మంబు లగును,
దానిచేతనే యవ్వి శుద్ధంబు లగును.

నిఃస్వభావమ్ము యగు భావనికరమందు
శ్లిష్టనిత్యాత్మ సుఖసంజ్ఞ చేత రాగ
మోహతామిస్రసంఛన్న మూఢజనుని
వీచి ఘోరభవాంభోధి భీతి గుడువు.

జి.వి. కృష్ణరావు

కల్పనాజలపూర్ణసాగరవ మగాధ
మౌర సంసార మిది; మహాయానసమధి
రోహణక్రియ కా దని త్రోచి పైచి
యెవఁడు దీని పారము గమియింపఁ గలఁడు?

నవంబరు, 1956

# నివేదనము

(వండిత గోపదేవ్‌కు)

మును పాకనాఁడు కొండొకవిబోధము విత్తితి వీ హృదంతర
మ్మున; నది కాలకంధర సముద్ధతి గర్జిలినన్ విషోగ్ర వ
ర్షణ మొనరించిన న్నిలిచి చల్లఁగ సారము సంగ్రహించి యీ
దినమున కిట్లు పొల్చినది దృష్టి మరల్చును బోధి వృక్షమై.

''అంతేవాసి మదీయుఁ డిప్పటికి నింతైనాఁడుగా!'' యంచు నీ
స్వాంతంబందునఁ బొంగిపోయెదవొ? ఛీ! చార్వాక హేవాకినీ
సంతా నాంతర చారణుం డితఁడు సంశాసింప దుర్దాంత వే
దాంతుం డైనను నెవ్వఁ డోపఁ''డని చింతాక్రాంతిఁ దాపింతువో?

తెలియను గొంచె మేని గురుదేవుల చిత్తము; చిత్తశుద్ధితోఁ
దెలిపెద నొక్క మాట: నలుదిక్కులు నింపి తలంపుఁ గాగడా
వెలుఁగులు, గానిపించిన నవీన శివార్థము, భద్ర ముద్రణా
కలిత, మిదంత నార్దన విఘాతము దెచ్చితిఁ గాన్క వెట్టఁగన్

''ఏరా, కారులు ప్రేలె దేమిటికి? మున్నీ వాద మేనాఁడొ తూ
ర్పారం బట్టరొ యక్షపాద మునులున్, వాత్స్యాయనుల్, వార్తిక
ప్రారంభుల్, మఱి బాదరాయణులు, భాష్యార్థ ప్రణేతల్, త్రయీ
సారగ్రాహులు జైమినీయులు, మహా శైవాగమ స్థాపకుల్.

''ప్రాప్త సమాధి యైన యొక వాదము నాస్తిక మిట్లు తెచ్చి సం
తప్తము భూత ధాత్రికి ఘనాఘన మియ్యది యందువే? మహా
గోప్తవు వత్తవున్, సుజన కోటి తపః ఫల సంభవుండ, విం
కాప్తులు వేఱుగాఁ గలరె? యాగమముల్ మఱి వ్యర్థ బోధముల్!''

అనుచుం జివ్వున మీర లవ్వలి మొగంబై నిల్చు రూపంబు భా
వనలోనం గనుఁగొందు; ఱిచ్చ వడి లిప్తల్గొన్ని యెట్లో గమిం
తు; నహో స్వప్న జగ ద్విలోకిత మహా దుష్టార్థ సంజాత కం
పన మాత్రం బని నాకు నేనుగ సమాశ్వాసంబు ప్రాపించెదన్.

వాద శంఖము నొత్తి వాత్స్యాయనుఁడు శూన్య
వాదమ్ము నేరీతి నూఁదివైచె?
యుక్తి వాగుర లొడ్డి యుద్యోత కారుం డ
జాత వాదము నెట్లు జజ్జరించె?
చండ వాగ్దండంబు జళిపించి భట్టార
కుం డెట్లు శూన్యమ్ము కొమ్ముడులిచె?
గిరిలోన దుముక శంకించి శంకరుఁడెట్లు
మాధ్యమకమ్ము సంభ్రాంత పఱిచె?

ప్రాప్త సర్వ సమగ్ర శాస్త్రార్థ రాశి
తాను గ్రహియింపఁడేమి సత్యమ్ము నింత?
విశ్వ కల్యాణ విరచనా విహిత బుద్ధి
మూఢ వాద లోభమునఁ దా మునుఁగు నేమి?

ఏవం విధ సంభావన
గావింపఁగ నైన హృదయకర్దిక శాంతి
శ్రీ వాసించును; గ్రమ్మఱ
వ్యావర్తన మందు నర్త కాంగన పోలెన్.

తాదృ క్కల్ప వికల్పనా కలిత సంత్రా సోద్ధ రోషంబులన్
యోధారంభుల మూదలించి, విపు లోద్యోగంబుతో శాంతికిం
బాదుల్వెట్టి, యధీ త శాస్త్ర నిధి , కామ్నా యోక్తి పంచారికిన్,
వేధో మూర్తికి విన్నవింతు నతినై నృత్యన్ని జార్ధుండనై.



వ్యాసుల పేరు సెప్పి గురుపాదులుగా వినుతించి యున్న స
న్న్యాసులు భాష్య కారులు యథామతి తత్త్వముఁ జిత్రచిత్ర వి
న్యాసము సేయరేమి? మహితాత్ములు వారికి శిష్యతా విని
ష్కాసన మాచరించెనొకొ సాత్యవతేయుఁడు సన్మహాత్ముఁడై?

ఇది రమ్య, మిది యరమ్యం,
బిది ధర్మ్యం, బిది యధర్మ్య మిది యుచ్చం, బీ
యది నీచం బను తలఁపునఁ
బదరక గ్రహియించు లోక బాంధవుఁ డర్థిన్

అది యటు లుండనిండు, భవ జార్తి విధూనన జీవ రోదన
ప్రదర విబోధితుల్ వర కృపాపరతంత్రులు నిత్య సత్య స
త్పద హిత బుద్ధులై బుధులు వ్రాసిరి చూపిరి శాస్త్ర మర్థమున్;
సదయత వాని నెల్ల వెదఁజల్లిరి లోకములం గృతార్థులై.

తాదృశ శేముషీ ఘనుల ధన్యతముండు గలండు శూన్యతా
వాదన బోధ పుష్కలుఁడు, భ్రాంత జగ జ్జన జాల జీవన
శ్రీదుఁడు తత్త్వ విత్తరుణ శీత మయూఖుఁడు, భేద వాద ని
ర్భేదన భద్ర కుంజరుఁడు విస్మయ కారణ కార్య ధుర్యుఁడై.

దుర్జయ దర్శన గ్రథన ధూర్వహన ప్రథితుండు వాఁడు నా
గార్జున నామధేయుఁడు, ప్రకంపిత రూఢ విమూఢ శాస్త్ర చిం
తార్జునుఁ, డాంధ్ర దేశ సుకృ తార్జిత నిర్జర నిర్ఝరమ్ము; త
త్తర్జన భర్జనల్ మొరసె తద్ధిమిత ధ్వని కాల భూములన్.

చెదరన్ మూఢ విపక్ష పక్షములు, విచ్చెం జాత్యహంకార దు
ర్మద మోహమ్ములు, వ్రస్సెఁ బ్రాక్తన విచార ప్రక్రియా సేతువుల్,
ప్రిదిలెన్ శాశ్వత వాద బోధన మరాళీ స్వైర సంచార స
మ్మదముల్, భేదిలెఁ బూర్వ దర్శనసమామ్నా తార్థ హృత్రోక్కడముల్.

సత్యము సూపి చెప్పి భవ జాతము ప్రోవఁగఁ గొన్న వైదికా
దిత్యులు శోచ్యులై యపవదించిరి గర్వపుఁ బిల్క లొత్తు పాం
డిత్యముతోడ నాస్తికపు డిండిమ భట్టని వాని; నాత్మ సా
హిత్యము లంత కోరి హరియించిరి తత్కృతి కర్మ భూమిలోన్.

తీవ్ర కిరణమౌఁ గాక యాదిత్య తేజ
మడరి హరియించు నేమి నీహార గిరుల?
పూజ్య తన్నగ భాగమ్ము భోట భూమి,
అందు నిల్చె నాగార్జు నాహ్వయుని కృతులు.

అట్లధివసించి నాకు సంప్రాప్తమైన
వానిలో నొక్క కృతి నాంధ్ర భాష వ్రాసి
నాఁడ నా బుద్ధి కెక్కు చందంబు నెఱపి
విశ్వ కళ్యాణ పథము రూపించుకొఱకు.

ఈ విధమైన సచ్చింత మీకృతి; దీనిని స్వీకరింపఁగా
నీవె మహార్హణుండ; వది యెట్లన దర్శన షట్క మాంధ్ర భా
షా వినిస్సృష్ట మయ్యె విలసద్భవదీయ నిరాగ శేముషీ
ప్రావృష లక్ష్మి; దేవ, కవి బాంధవ, దీనిఁ బరిగ్రహింపవే!

*నవంబరు, 1958*

జీ.వి. కృష్ణరావు

# బాల మేఘుడు

మింటి మేడలోపలివారు కంటగూర్కి
నట్లు కనరాదు రేయి రేయంత ఒకటె
మూల్గొకటె యేడ్పొకటె పెదబొబ్బ వారి
పాప కేదొ కడుపునొప్పి వచ్చెనోటు.

బల్లిదవు గొండ తెలి నీలిపాగ జుట్టు
కొనియె పెనుమోపు తలకెత్తుకొనునొ కాక
గరువమై జెట్టితో చేయి కలుపునేమొ
ఈ దురుసుచేత తగునె? వారింపవమ్మ!

ఆకతాయయ్యె మొయిలు పారాడిపోయి
యేదియో మ్రింగె లేకున్న నిట్టులేల
బొళుకు బొళుకున తావెళ్ళ బోసికొనును?
వచ్చె కాలుసేతులు దీని వదలరాదు.

కట్టివైచిరి కాబోలు పట్టికొండ
కొమ్ములకు మత్తదంతావళమ్ము లవిగొ
ఘీంకరించుచున్నవి చెవుల్ గింగురనగ
కడుపులో చుఱ్ఱుమనెనేమొ విడిచిపుత్తు.

విచ్చుకత్తులాడును వినువీధిలోన
మొదలు పెట్టిరి కాబోలు బొమ్మలాట
రామ రావణ యుద్ధమ్మొ కామితమ్మొ
భారత రణమ్మొ నేత్రపర్వముగ గాంతు.

కాపురులు గ్రమ్మె దిక్కులేకమ్ముగాగ
చిచ్చు పెట్టిరి గగనాన మ్రుచ్చు లెవరొ
నీటి బిందియ లందిమ్మ నెగడు లెగసి
యగడు సేయకమున్న చల్లార్పవలయు.

కొదమపొట్టేళ్ళ రేచి డీకొల్పి రెవరొ
పెటిలు పెటిలున తాకులు వినగనయ్యె
తలలు వ్రస్సె కాబోలు రక్తమ్ము పడియ
గట్టె చూడుమా పడమటి కనుమలందు.

కడగి యెటగన్న ఒక్కరిక్కయును గాన
బడదు సుడిగాలి వానకు జడిసిపోయి
తల్లి వెనుకమాటున కేగి దాగికొనెనో
ఇంత పిరికివారెట్లు మిన్నెక్కినారు?

వేనితోగాలి పందెమ్ము వేసెనొక్క
వ్రేళ్ళతో గూడ మ్రాకులు పెళ్ళగించు
కొనుచు దూకె అంధనృపతి కొడుకు తొడలు
నురుము గొట్టిన భీముండు చుట్టమేమొ?

వింతవిల్లెవ్వడే యెక్కు వెట్టినాడు
లక్ష్యమేమొ తాగోరు ఫలమ్ము లేమొ
వన్య వేదండ తండ మవధ్యమనుచు
చదువడా యేమి యీపాటి చక్కనయ్య!

గుండె లీ వెంతగ నవియగొట్టుకొన్న
మండి చావదు మన ప్రాయ్యి మొండికెత్తి
ముమ్మరమ్ము లీ క్రొంబొగల్ పుడమిగ్రమ్మి
యుద్గమింప ఏ రాకాసి యూదెనమ్మ?



ధరణీ ధరములు తమ బాహు దండములను
పైచుకొన్న జరీకండువాలు గనుము
వెదకి వెదకి యే యంగళ్ల విలిచికొనెనో
అట్టి దొకటున్న తలపాగ చుట్టుకొననె?

మింటగోరాడు నవనీల మేఘములకు
పుడమిపై నెట్లో కాలమ్ము పుచ్చునీకు
ఏటి సంగాత మిదివట్టి నీటిబ్రాత
వారి గర్జలు నీకేల బ్రహ్మరాజ!

క్రూర ముష్టి మూర్ధమ్మున గ్రుద్దినట్లు
కొంప లెన్నియో గాలికి కూలబడియె
చెక్కుచెదరలే దీతాకు చివర పిచ్చు
కమ్మ గట్టిన తూగు టుయ్యాలమేడ.

– అక్టోబరు, 1963

# ప్రౌఢ మేఘము

శబర సీమంతినీ కబరికా గండూష
రసముల దేహ విభ్రమము లెనసి
ప్రౌఢాంగనా రోష లీఢారుణాపాంగ
రోచిస్సమూహమ్ము దోచి దాచి
రంభోపగూహన ప్రారంభదశముఖో
ద్భూత మారుత సముద్యోగమంది
దాక్షాయణీ తనుత్యాగ వార్తాతప్త
కాకోలకంఠ హుంకార మొరసి

దారుణ నిదాఘ దైత్యదందహ్యమాన
దశదిశీ దైన్య తీవ్రతా దర్శనమున
క్రోధ ఘూర్ణిత కాయమై క్రూరగతుల
పంబి యంభోద మెత్తె గ్రీష్మంబుపైని.

నవ నీలోత్పల కాంతులన్ మెసవి, వింధ్యప్రాంత మత్తేభ గా
రవముల్ దూలిచి, యంజనాద్రిగత గర్వమ్ముల్ విదారించి, గ
ర్భవతీ పీన కుచాగ్ర నీలిమల సంపత్తిన్ విభాషించి, వ
ర్వె వియద్భాగమునన్ ఘనాఘనము లుద్వేగోగ్ర ఘోషంబులై.

ఆశాభాల విశీర్ణ కుంతలములై యద్రీంద్రసీమన్ హృషీ
కేశస్వామి కరమ్ములై పుడమికోర్కెల్ దీర్చు దైవమ్ములై
వ్యాశోషీకృత నిమ్నగావళికి నవ్యశ్రీనిధానమ్ములై
వేశంతోపశమమ్ములై వెలసె ప్రావృట్కాల శీలాబ్దముల్.

ఆత్మాగమామోదులౌ మయూరములకు
నాట్యక్రియావర్తనమ్ము నేర్పి
స్వాగత వ్యాహార పంక్తి వేమరుజెప్పు
భేకలోకము గృపావృష్టి మనిచి
నిశ్శేష శోషిత నిర్ఝరీ కన్యకు
జీవదానమ్ముతో చిందుగరపి
తపనపీడిత భూతధాత్రీ మహాదేవి
కంతః పరీతాప మపనయించి.

ప్రార్థ్య పాలనమ్మున గూర్చి ప్రభుత నెరపి
గ్రీష్మగర్వ నిర్వాపణ క్రీడ నాత్త
కఠిన హుంకార ముఖర దిక్కందరుండు
కాలకంఠ కంఠశ్యామ కంధరుండు.

తప్తకాంచన సంచలద్దండ విహత
మైన దర్ప దర్పిత పటహమ్మువోలె
ప్రబల నీరంధ్ర నవవారివాహచయము
మ్రోసె తరుణాద్రి హృదయముల్ బూరటిలగ.

కాలవిభేదబోధ కళికా పరిగూహన కర్బురాంబరా
వేలములై సముచ్ఛ్వసన వీచివికంపిత గండమండలో
త్క్రాల నవోద బిందులయి ఘూర్ణముఖాంతరలీన తారకా
జాలములై వికుంధన విసర్పములై పొలిచెన్ దిశావళుల్.

గగన మత్త కాశిని నిజకైశ్యమందు
చెరువుకొన్నట్టి సంపెంగ చెండ్లువోలె
కాలికెత్తిన మణిదీప గణములట్లు
96 వలయితాకృతి శంపలు పరిఢవిల్లె.

ఉభయతటమ్ములం గెడపి యుద్ధత రాగ ఝురీవిలంఘన
ప్రభవములై యుదగ్ర వినిపాతములై యఘజీవనమ్ములై
రభస పరీత వక్రగతిరాజిత సంగతులై తరంగణీ
విభుగలయంగ నిమ్నగలు వేతరలెన్ గులటాపథమ్ములన్.

వారిధరము ధారా పరిష్వంగ మొసగి
గారవించిన గాబోలు గండశిలలు
పులకరింతల హరిత శైవలము దాల్చి
ప్రణయ మొలికించె స్వాధీనపతికలట్లు.

పరువమ్ము గడచన్న బసవన్న కంఠాన
పెనురంకె పొంకమ్ము బిగువు దోచె
పాథోధరము మాడ్కి యూథమ్ము చేపిన
మొదవు చన్నుల పయఃపూర మురలె
పాలాశరుచిర శాద్వలము గన్గొన్న యా
లేగ కాళుల జౌకళింత లెసగె
సలిల ధారాపాత సరళమ్ములై కర్ష
కుని చూపులొరసి దుక్కులను వ్రాలె

లోక మెరుగని కన్యకాలోకనముల
చిలిపి లేనవ్వు దళుకులు తొలకరించె
ప్రచుర జీవానుగతికమ్ము వర్ష ఋతువు
నేల నాల్గుదిక్కులలమి యేలునపుడు.

అద్వైత రసభావ విద్వాంసుడగు మన్మ
ధుని ధనుఃఖండమ్ము కనుపు దేలె
కరకు టీదరగాలి వరువుతో దరుణకో
టరముల ఫూత్కారభరము రేగె
పార్వతీ పరమేశ భావమ్ము భజియించి
రాత్రిందివము లేక గాత్రమయ్యె
ఆకాశ పర్యంకమటు వర్షధర కేళి
సలిలాశయమ్ము లావిలములయ్యె.

శ్వాసరోగికింబోలె శార్వరులు విప్ర
యుక్తహృదికి దుర్వార దుర్భుక్తులయ్యె
కర్దమ విదూషితమ్మగు గ్రామములకు
స్వైరసంచార కేళికి వైరమయ్యె.



ఆసారంబుల దోగి కేతకి పరాగా లేపముల్ పూసినా
నాసూనానన చుంబన క్రియల నానందించి గోవత్స లీ
లా సాదృశ్యవిలంఘమై పవనముల్ సయ్యాటలం దేలగా
సాసూయంబుగ జూచె యౌవత మదీ జ్యానంగ కోదండమై.

ఉత్పల నీలమున్నత పయోధరమాలిక యత్తరిం బుర
స్త్రాత్పురిపుష్యమాణ హరిచాప నిరూపిత రక్షతో సవి
ద్యుత్పరిదీపనాధ్వమున యుక్తసమీర సహాయయై, స్పృహా
తత్పరచిత్తయై కదలె దర్పకఘోషము వెంబడింపగన్.

హరితసూచికా గ్రియము ముత్యమ్మువోలె
నవతృణాగ్రస్థితమ్మై తనర్చు వార్షి
కాంబుకణము సేవించె నొయ్యార మొలుక
గళము సారించుచున్ నీలకంఠవిభుడు.

కాదాచిత్కముగా మే
ఘోదరములు వాసి తోచు నుడుపతిదరబిం
బోదయములు యువజన లో
కాదరములు వొందె భావనాస్పదమగుచున్

అపుడె తాన మాడిన తరుణాంగి కేశ
పాశముననుండి దిగజారుపగిది సాంద్ర
నీలమేఘ జాలమునుండి నీటిబొట్లు
తరలె పృథ్వీధరమ్ము నితంబసీమ.

అరిమెడి యురుములు తరిమెడి
మెరపులునై వానకారుమిన్నులు దొనగా
గురియం గడు దత్తరమున
బరచెన్ వాగులు సముద్రబాహుల జేరన్.

జగములతాపముల్ దొలప చల్లని దైవము వచ్చెనంచు నెం
తగ గొనియాడి మ్రొక్కిరి జనమ్ములు దాని ఫలమ్ము లేమి దుం
డగములు? వృక్షపాత వికటమ్ముగ దోటలు నిర్గతచ్ఛద
మ్ముగ గుటులున్, బరిప్లవన పూరముగా బొలముల్ శపించెడిన్.

అదలించి యెంత గదిమిన కదలని బసవన్న తెరగుగన్గొని నీకుం
బొదవెనె బాడవ దమ్ముల చదువులు చెపుమంచు కాపుజవరాలడిగెన్.

98 అవిరళ జలధారా ర
జ్జువులం బిగియంగబట్టి క్షోణీవలయం
బు విహాయసమున జేర్పగ
ప్రవిహితమతియార్చె నంబువాహము పెలుచన్.

శక్రచాపకోటీ భిన్న జఠర మగుచు
క్రూర కాలాభ్ర మహిషమ్ము ఘోషవెట్టె
ప్రీలి వ్రేలాడు నద్దాని ప్రేవులట్లు
వెలసె సౌదామినులు హరిద్వీథులందు

అక్టోబరు, 1963

# స్వేచ్ఛా ప్రణయి

''మీరు బయటికి వెళ్ళిం తరువాత రమణరావు వచ్చాడు.''

''వస్తే?'' అన్నాడు పుస్తకం తిప్పుతూ కృష్ణరావు.

''అడిగాను.''

''ఏమిటీ?''

''మొన్న రహస్యంగా నాచేతికిచ్చిన చీటీనిగురించి.''

''ఇప్పుడావిషయం దేనికి వచ్చింది?''

''అవును, వింటానికి ధైర్యంలేకపోతే అంతే, నే నేమో అనుకున్నాను. ఏదో గొప్పతనం నీలో వుందనుకున్నాను. అదే నీ కథల్లో కనిపిస్తుందనుకున్నాను. నేటికి బండారం బయట పడింది. నీవూ అందరిలాంటి వాడివే''

''నాకు ధైర్యం లేదూ?''

''ఉంటే నేను చెప్పేది వినేవాడివే.''

''అవ్యక్త స్థితిలో వుంటం గొప్పతనం కాదూ?''

''అది నాకు తెలీదు, నీకు స్థైర్యముంటే విను.''

''సరే చెప్పు.''

''నేనంటే అతనికిష్టమట. చీటి చూపించి అతన్ని నీ భావమేమిటి అని అడిగాను.''

''ఏమి చెప్పాడు?''

''నేనంటే అతనికెంతో యిష్టమట. నేను చాలా అందంగా ఉన్నానట.''

''ఎప్పటినుంచో?''

''మొదటే నుంచీ, అన్నాడు. ఈ నీలి చీరలో నేను చంద్రబింబంలాగా ఉన్నానట. నీ చేయి తాకవచ్చునా అని అడిగాడు.'' వసంత కోక కొంగునుంచి ఒకటి రెండు దారాలు లాగుతూవుంది.

''నీ వేమన్నావు?''

''నా చేయి అతని కందించాను.... అతడు ముద్దు పెట్టుకున్నాడు... ఒక్కసారి అయినా నిన్ను కౌగిలించుకోవచ్చునా అని అడిగాడు. నేను తల వూపాను. తరువాత....''

''తరువాత?''

''అతని రెండు చేతులు నా బుజాన వేశాడు. నా కన్నులు చాల అందంగా ఉన్నాయట. చూచే వారి హృదయాల్లో కవితాబీజాల్ని రేకెత్తిస్తాయట, నా కన్నులే నిన్ను అలాంటి మధుర గేయాల్ని పాడిస్తున్నాయట! నీ కధలకి ఆవేశాన్ని యిచ్చినవి అవేనట!''

''ఇడియట్!''

''అదిగో అసూయ, ఎక్కడికి పోతుంది?''

''అసూయ కాదు. అతడంటే జాలి.''

''కాదు, ఆత్మ వంచన.''

''ఆఁ......?''

''ఆఁ లేదు, ఊఁ లేదు. నేను చెప్పింది వినపడ్డది. వ్యవధి కోసం ప్రాకులాడుతున్నావు. నీ హృదయంలోని చీకాకు తెలుస్తూనేవుంది.''

''నాకు చీకాకా?''

''అయితే విను.''

''చెప్పు.'' 101

''నీ కన్నుల్ని ముద్దెట్టుకో వచ్చా అన్నాడు. తల వూపాను. ఇదిగో నా వంకకు చూడండీ! ఇదంతా మిమ్మల్ని కలవర పెట్టటంలేదూ? ఊరికే నటించకండి.''

''నీకలా కనిపిస్తున్నానా?''

''మీ హృదయం పుస్తకమైతేగా చదవటానికి? మొదటినుంచీ చెబుతూ ఉంటే ఊఁ కొడుతున్నారు.'' దానిని బట్టి జరిగిందంతా వాగుతున్నాను.''

''తరువాత ఏం జరిగింది?''

''పెదవుల్ని ముద్దెట్టుకుంటానన్నాడు. తల వూపాను.''

''ఊఁ''

''ముద్దెట్టుకున్నాడు.''

''కొంచెం సేపేనా?''

''లేదు, చాలసేపు,''

''నిన్ను అతడు ముద్దుపెట్టుకోమని అడగలేదా?''

''ఆ, అడిగాడు.''

''ముద్దెట్టుకున్నావా?''

''ఆ, ముద్దెట్టుకున్నాను.'' అతని కళ్ళల్లోకి చూచింది. కాసేపైన తరువాత కృష్ణరావు మెడ కౌగిలించుకొని, ''నేను ముద్దిస్తే థ్యాంక్సు అనలేదేమండి?''

ప్రశాంతంగా నవ్వుతూ, ''ఆసంగతి అతన్నే అడగకపోయావా?''

''అడగలేదు అనుకున్నారా ఏమిటి? అడిగాను; అతడూ మీలాగే నవ్వాడు.''

''అలాగా, సరే, ఎలా ముద్దెట్టుకున్నావు?''

''ఏముంది – ఇదిగో ఇలాగే.''

''నీకు ఉద్రేకం కలగలా?''

''మీరే ఊహించుకోవచ్చు.'' అకస్మికంగా బొమముడితో ''లేదు, అంత ఉద్రేకం కలగలేదు. అతని పెదవులు మీ పెదవులంత అందమైనవి కావు. అయినా ఉద్రేకం కలిగింది. మీ వల్ల కలిగినంత ఉద్రేకం కలగలేదు.''

''అతడికో?''

'' ఉద్రేకం సంగతేనా? కలిగిందనుకుంటాను. ఒక్క నిశ్వాసం విడిచాడు. ఒక్కసారి కంపించి పోయాడు.''



''అలాగా?'' అన్నాడు. అరచేత్తో లలాటాన్ని గట్టిగా అదుముకుంటూ.

''అసూయ పడుతున్నారా?''

''లేదు.''

''లేదేంటి, నిజంగా అసూయ పడుతుంటే.''

''లేదు. ఎందుకసూయ పడాలి?''

''అతడు నన్ను ముద్దెట్టుకున్నాడు గనుక.''

''అందుకేనా?''

''అవును. నన్నతన్ని కలుసుకోమని కోరాడు.''

''ఏమి సమాధానం చెప్పావు?''

''నే నేమీ చెప్పలేదు. నాకోసం ఎదురుచూస్తూ వుంటానన్నాడు.''

''ఈ రాత్రేనా?''

''ప్రతి రోజూ నట, రాత్రి ఎనిమిదీ తొమ్మిదింటి మధ్యనట.''

''అయితే నేను ఎనిమిదింటికి సరిగ్గా ఉద్యోగం యాచించటానికి హనుమంతరావుగారిని కలిసికోటానికి వెళ్ళాలన్నమాట!''

''చాల విచిత్రంగా వుంది.''

''నేను అనుమాన పడుతున్నానని అడిగాడా?''

''లేదు.''

''నా ప్రసక్తివచ్చిందా?''

''లేదు.''

''ఒక్క తడవ కూడా?''

''రాలేదని నా జ్ఞాపకం.''

''అంతా స్పష్టం'' అని కృష్ణరావు కుర్చీలోనుంచి లేచాడు.''

''స్పష్టమైంది ఏంటి?''

''అబద్ధాలకోరు, దొంగ, శుంఠ! అంతకన్నా ఏముంది?''

''ఏం చేయదలచారు?''

''చేయదలచే దేమిటి? అతని మొఖాన అనేశా - దొంగవని, అబద్ధాలకోరని, ఆ రెండు మాటలుచాలు.''

''ఆఁ ఇప్పుడు....?'' 

''ఏంటి ఇప్పుడు?''

''దయ్యమని.''

''అతడేనా''

''కాదు, నీవ్వే! అతణ్ణి నామీద విరుచుకుపడేట్లు చేయటానికి యత్నిస్తున్నావు. నీవు బాగుండాలి. ప్రతివాడు నన్ను దయ్యంలాగా చూడాలి. నీవు లోకానికి ఉదార హృదయుడిలాగా కనిపించాలి. నేను ప్రతివాణ్ణీ మోసగించేదానిలాగా, ప్రేమనీ, ప్రణయ హృదయాన్నీ మలినీభూతం చేసే దానిలాగా కనిపించాలి. నీవు స్వేచ్ఛా ప్రణయివి లాగా, నేను ప్రణయ కుంభంలో విషధారలాగా కనిపించాలి. అంతేకాదూ? అంతేకాదూ? నా అమాయకత్వాన్ని నీ గొప్పతనాన్ని, పోషించుకోటానికి వినియోగించుకుంటూన్నావు. అంతకంటే నా హృదయం నీకెందుకూ పనికిరాదు. ఎందుకూ పనికిరాదు''

''అలాగా! ఎన్ని గుండెలతో చెబుతున్నావు!''

''అవును, నాకాదమ్ములున్నాయి. ఇదివరకు ఉన్నాయి; ఇప్పుడూ వున్నాయి. నే నమాయకురాల్ని కాబట్టి నన్నెలాగైనా వినియోగించుకోవచ్చు ననుకుంటున్నావు.

వెళ్లు. త్వరగా అతనివెంటపడు. అతన్నీ నలుగురిలో తలవంచుకునేటట్టు చెయ్యి. పో, వెంటనే పో.''

''నీకు పరిపూర్ణమైన స్వాతంత్ర్యమిచ్చాను. ఇంకా వుందికూడాను.''

''స్వాతంత్ర్యం!''

''అవును. పరిపూర్ణ స్వాతంత్రమిచ్చాను. కాని నాకీ విషయమంతా తెలుసునని అతనికి తెలియాలి. అతనికి చెబుతాను. వసంతా! నేను చెప్పేది నమ్ముతావా? నాకసూయ అనేది ఏకోశానాలేదు. మీ యిద్దరూ మీ యిష్టానుసారం ప్రవర్తించవచ్చును. నన్నతడు అసహ్యించుకోడు. నన్ను మోసగించవు కాదూ?''

''లేదు మనలో మోసగాళ్ళెవరు?''

''అంటే నీనా మధ్యేనా?''

''ఆ, నాకు తెలుసు. నీవు చెప్పే సంపూర్ణ స్వాతంత్ర్య మెందుకిచ్చావో నా కర్థమైంది.''

''ఎందుకిచ్చానంటా?''

''ఆ అమ్మాయితో స్వేచ్ఛగా మెలగటానికి.''



''వసంతా!.... నీ కిదివరకే చెప్పాను. మేమిద్దరం బాల్య స్నేహితులము. దీన్ని నీనుండి దాయలేదే?''

''ఆ స్నేహమెలాంటిదో యిప్పుడు తెలిసింది. అందుకనే ఆ స్వేచ్ఛను నాకు ప్రసాదించావు. అహోరాత్రాలు ఆగదిలో కూర్చుని ఆమెనుగూర్చి గీతాలు వ్రాస్తావు. దాన్ని నీవు స్నేహమంటావు. నన్ను ఒప్పుకోమంటావు!''

''వసంతా. వసంతా! నేను నిన్ను నమ్మినట్లుగానే నన్నూ నమ్మాలి''

''నాకు తెలుసు, నాహృదయం అనుభవిస్తూవుంది. ప్రేమకాక ఏముంది మీమధ్య?''

''ఆ భావాన్ని నాతలలో కెక్కించాలని చూస్తున్నావు. ఇతరుల భావాలు ఎప్పుడూ గ్రహించను, తెలిసిందా!''

''ప్రేమకన్నా ఏమీలేదు? అందుకనే అతడు నాతో అలా ప్రవర్తించినా వూరుకుంటున్నావు నీకు బాధగా లేదు. నీ హృదయం ఆమెమీది ప్రేమతో కొట్టుకులాడుతూ వుంది.''

''వసంతా! నీతో వాదించలేను. నేను చెప్పేది నమ్ము.''

''ఎలా వాదించగలుగుతావు. నేను చెప్పేదంతా నిజమైనప్పుడు?......''

''అతని అర్థం ఏంటో తెలుసుకోవాలి. నేనీ రాత్రికే అతడు రమ్మన్నచోటికి పోవలసిందేనా?''

''నన్నెందుకడుగుతావ్? నీవే నిర్ణయించుకో!''

''పొమ్మంటారా?''

''లేదు.''

''పోవద్దంటారా?''

''నేను నిషేధించను.''

''పోవద్దనండి, ఒక్కమాట చాలు. నేను వెళ్ళను.''

''నీవే నిర్ణయించుకో.''

''నింద నామీద వేస్తారా?''

''లేదు, నీవు స్వతంత్రురాలివి! నిన్ను నిందించలేను''

''మిమ్ము మోసగించలేదు.''

''మోసగించ లేదు ముమ్మాటికీ మోసగించలేదు.''

కృష్ణరావు బయటికి వెళ్లాడు



★ ★ ★ ★

"A thing of beauty is a joy for ever." "The aim of life is to seek beauty, to be on sensations." అన్నారు మహాకవులు. అవును, అంతకన్నా పరమార్థ మేముంది?..... ఎవరది? వసంతా?'' అన్నాడు. మెల్లగా రమణరావు.

''నేనే.''

''నివ్వేనా, కృష్ణరావు? మంచి సమయానికి వచ్చావు. కాసేపున్నట్లైతే నేను ఉండేవాణ్ణికాదు. నాతో వస్తానని ముందుగా ఎందుకు చెప్పలేదు? ఎప్పుడూ యిలాగే వూడిపడుతుంటావు. ఇదిగో నాగది చూచావుగా, ఎంత అందంగా వుందో! ఇప్పుడే కాలంగడవక, కీట్సు వీల్డు వాక్యాలను స్మరిస్తూ వున్నాను. మీరూ, హనుమంతరావుగారూ మాట్లాడుతూ వుంటారని ఆలోచిస్తున్నా. వారి దగ్గరకు వెళ్లుతావా! టైము ఎంత అయింది?''

''ఎవ్వరినన్నా కలిసికోవాలా?'' నవ్వుతూ.

''ఎప్పుడూ అనుమానమే నీకు!''

''అయితే కాసేపు కూర్చోవచ్చునన్న మాట''.

''ఆఁ, కొంచెం సేపు కూర్చోవచ్చు. తరువాత మనమిద్దరం అక్కడకు వెళ్లాలి. ఇంతకూ టైమ్ ఎంతైంది? ఓ, ఎనిమిదింబావుగాదూ?''

''ఇప్పుడే కలుసుకోవాలన్నమాట!''

''ఎవరిని?''

''వసంతని.''

''నీ కేమన్నా మతిపోయిందా!'' అన్నాడు రమణరావు కృష్ణరావు వంక ఆశ్చర్యంగా చూస్తూ.

''నీకే కొంచెం.''

''........ ఎవరు చెప్పారు?''

''ఆమే.''

''అవును, నిజంగా మతిపోయింది. కృష్ణరావు, నీవు రావటంతోనే నా హృదయం తేలి కిచ్చింది. అప్పటి నుంచీ నాహృదయం పరితపిస్తూ వుంది. రావద్దని ఉత్తరం

పంపుదామనుకుంటున్నాను. నీవేవచ్చావు. ఆబరువంతా తగ్గింది. ఆఁ, ఉన్నదంతా చెప్పివేస్తాను.''

''నాకంతా తెలుసు. మొదటినుంచీ వింటూనే వున్నాను.''

''ఎప్పటినుంచి?''

''మీలో ఈ అంకురాలు మొలకెత్తినప్పటి నుంచి.''

''నాకు నిజంగా పిచ్చెత్తింది. ఆమెను ఇక్కడికి రమ్మనటం పొరపాటు అంతా చెబుతా విను. నిజంగా చెప్పివేస్తాను.''

''నీవు ఆమెతో చెప్పలేని మాట ఏంటి?''

''ఆ, చెబుతాను, నీ భార్య అంటే నా కెంతో యిష్టము. అంటే, రహస్యం ఏమీ లేదు.''

''అయితే యీ ప్రేమను ఎందుకు దాచావూ?''

''ప్రేమంటే?''

''నేను లేనప్పుడు రావటం, పువ్వులు పంపటం, మా అమ్మాయిని కాఫీ హోటలుకు తీసికెళ్ళటం, ఆ చీటీ రహస్యంగా యివ్వటం, – ఇవన్నీ?

''ఇవన్నీ మీ కెలా తెలిసినై?''

''వసంత చెప్పింది.''

''ఇవాళ సాయంత్రమేనా?''

''లేదు, ఏ రోజుకారోజునే.''

''ఆమెనుంచి తెలుసుకున్నావన్న మాట. అప్పటినుంచి మమ్మల్ని ఒక కంట చూస్తూనే ఉన్నావన్నమాట.''

''నిన్నుమాత్రం చూస్తూనే ఉన్నా?''

''అదే, నన్ను ముఖాముఖంగా ఇంతకాలంనుంచి పరీక్షిస్తున్నావన్నమాట. గతించిందేంటో గతించింది. నా జీవితానికంతకూ ఇదొక పాఠం! నీవు నన్ను అసహ్యించుకొంటున్నావు కదూ?''

''నేనలా చెప్పానా?''

''అసహ్యించుకోవటం లేదా!''

''ఆమె చెప్పక పోయినా నాకు తెలిసేది.''

''నీవు వచ్చి నా ముఖాన చెప్పివేసి మంచి పాఠం నేర్పావు. విపత్తునుంచి రక్షించావు. నీకుకూడ ఓవిధంగా మేలైంది. లేకపోతే–'' 

''ఏం జరిగేది?''

''ఆమెను అపహరించే వాణ్ణి.''

''పిచ్చివాడా, అపహరించ గలిగితే అపహరించు. నా తలుపులు మూసిలేవు. నేను కావలి కాయటం లేదు. అదిగో తలుపులు నెట్టిన చప్పుడు వినిపిస్తూవుంది. వసంత వచ్చినట్లుంది. నేను వెళ్ళిపోతాను.''

''కృష్ణరావు, కృష్ణరావు! నీ వుండు, నేను వెళ్లిపోతాను.''

''మీ సమావేశాన్ని నేను భగ్నం చేయను. వెళ్లుతాను.''

''కాదు, ఉండాలి. నావిషమస్థితి చూచి అయినా–''

''లేదు, వెళుతున్నా,'' అని కృష్ణరావు వెళ్ళిపోయాడు.

''దుర్భరం, దుర్భరం. ఈ ఆలుమగళ్ళని అర్థం చేసికోలేకుండా ఉన్నాను.'' అని రమణరావు నిట్టూర్పు విడిచాడు.

★ ★ ★ ★

''అమ్మా, అమ్మా! నాన్న ఏడీ?''

''ఎందుకూ?''

''పొద్దుటినుంచీ కనిపించలేదే.''

''బయటికి వెళ్ళి ఉంటారు.''

''అమ్మా!''

''ఏం?''

''మా నాన్న గొప్పవాడటగా?''

''ఎవరన్నారు?''

''మా పంతులుగారు ఎవరితోనో మాట్లాడుతూ చెబుతున్నారు.''

''అలాగా?''

''మరి– నీ వెప్పుడూ చెప్పలేదేం?''

''చెబితే?''



''మా పంతులుగారికన్న నేనే ముందు చెప్పేదాన్ని.''

''నాకాసంగతి తెలియదు.''

''అమ్మా! దొంగవి. నీకు తెలియకపోవడమేంటి, తెలుసు. నాన్న నీకంటె గొప్పవాడని నీకసూయ.''

''అసూయ అంటే ఎలా వుంటుంది?''

''నంగనాచివే, అసూయ అంటే తెలీదు?''

''తెలియకనే అడగటం''

''నాకంటె ఇంకో అబ్బాయికి ఎక్కువ మార్కులు వస్తాయనుకో. నాలో కలుగుతుందే అది, అదే అసూయ.''

''అయితే నాన్నకు ఎక్కువ మార్కులు వచ్చాయన్నమాట?''

''ఆఁ!'' వసంత నెమ్మదిగా నవ్వింది.

ఇంట్లోనించి కృష్ణరావు వచ్చాడు. కళ్ళు ఎర్రగా వున్నాయి. కోపంగూడ అతనిలో గోచరిస్తూవుంది. ఒక్కసారిగా, ''వసంతా, వసంతా! నా ఉత్తరాలు,'' అన్నాడు.

''ఏమి ఉత్తరాలు?''

''ఉత్తరాల కేమి ఉత్తరాలు?''

''నాకు తెలీదే!''

''నీకు తెలీదు?'' అని కృష్ణారావు తీవ్రంగా చూస్తూ అన్నాడు.

కూతురు బిత్తరపోయి తల్లి పైటచెంగు ముఖానికి అడ్డం వేసుకొంది.

''అసూయా, అసూయ!'' అన్నాడు.

''అవును, అసూయతో ఎవరికి నిద్రపట్టక రాత్రంతా జాగరణచేసి కళ్ళెర్రబడ్డాయో తెలుస్తూనే వుంది.''

''నా కళ్ళెర్రబడితే నీకేం–నాకు రాత్రి నిద్రపట్టక పోతే నీకేం? నీకు మాత్రం రాత్రి సుఖంగా గడిచింది. అది చాలదూ?'' అన్నాడు కోపాన్ని అణచుకొంటూ.

''నాన్నా! ఉత్తరాలు నా దగ్గరున్నాయి. కాగితాలు అందంగావుంటే తీశాను. ఆ కాగితాల మీద పువ్వులున్నాయి కాదూ?'' అన్నది.

''ఆఁ,'' అన్నాడు ఆలోచిస్తూ కృష్ణరావు.

''నేటికి బయటపడింది. ఇంత నీచుడవని నేననుకోలేదు. నన్నింత చుల్కనచేస్తావని అనుకోలేదు. ఇంత స్వార్థ పరుడవని, పేరుకోసం ఆశించే వాడివని తెలీదు.'' 

''నే నేంచేశాను.'' అన్నాడు కృష్ణారావు.

''ఏం చేశావా! రమణరావు దగ్గరకెళ్ళి నేను చెప్పిందంతా చెప్పావు. నన్ను అతడు ఎలా అర్థం చేసుకొన్నాడో తెలుసా?.... అతడుకూడ మూర్ఖుడే. లేకుంటే అతని కర్థమయ్యేది. నీ ఉబలాటం, నీ ఉదారత్వం చూపుకోటానికి పడేపాట్లు అర్థం చేసికొనేవాడు. నీకన్నా అసూయ ప్రపంచంలో ఎవరికీ లేదు. అసూయతో అతని ముందు నన్నిలా అవమానపరచావు. రాత్రంతా నిద్రలేక అవస్థపడ్డావు. ఆ అసూయగూడ నా కంటగట్టి యిలా దబాయించావు. నీ పేరుకోసం, నీ ఉదారత్వం కోసం, నన్ను, నాశీలాన్ని బలియ్యటానికి సిద్ధమయ్యావు. హృదయ సంస్కారంలేని పరుగులు దేనికో?'' అని వసంత పెడముఖం పెట్టింది.

*జూన్, 1939*

# అమాయకుడు

''అయ్యో కూతురా! తండ్రి లేకపోయినా తల్లి చాటున బ్రతుకుతావనుకొంటినే, కూతురా! దేవుడింత అన్యాయం చేసేది ఎరగక పోతినే!'' అని రాజరత్తమ్మచావు బ్రతుకుల్తో ఉన్న గోవిందమ్మ మంచంపక్కన కూర్చుని ఏడుస్తూ ఉంది. ''దేవుడనేవాడికి కనికరంలేదు. సుఖంగా తిని ఒకమూల కూర్చోవలసిన ముసలిదానినడుంమీద తాటికాయ వేశాడు. గంపెడు దిగులువచ్చి పడ్డది,'' అన్నారు. ముక్కులు చీదుకుంటూ చూట్టానికి వచ్చిన ఇరుగు పొరుగు అమ్మలక్కలు. గోవిందమ్మ అన్న చీనయ్య, రోగిమంచానికి దగ్గర్లో కుర్చీలో దిగులుగా కూర్చున్నాడు. గోవిందమ్మ కొడుకు మాధవరావు మేనమామ కొడుకైన కిష్టావుతో, వేరుసెనక్కాయల కోసం కవర్లాడుతూ యేడుస్తూ వున్నాడు.

''వీడెట్టా బతుకుతాడే కూతురా! దిక్కుమాలిన పక్షినిచేసి పోతావంటే కూతురా! వట్టి మేదకుడే కూతురా!'' అని రాజరత్తమ్మ మళ్లీయేడుపు సాగించింది.

వచ్చిన అమ్మలక్కల్లో ఒకావిడ మాధవరావు రెక్క పట్టుకొని చెవిలో, ''మీ అమ్మ చచ్చిపోతూ వుందిరా! దగ్గిరికిపో,'' అంది. ''చస్తూవుందీ! చావనీ, నాకు సరిగా నెయ్యేసి ఎంతకాలమైంది?'' అని వేరుసెనక్కాయల తగువుల్లో మళ్ళీ నిమగ్నుడయ్యాడు. ఆవిడ కోపంతో, ఏడుస్తున్న మాధవరావుని లాక్కెళ్ళి, తల్లిమంచం దగ్గర నిలబెట్టింది. వేరుసెనక్కాయల భాగం పోయిందని మాధవరావు బావురున ఏడుపు మొదలెట్టాడు. ఇంకొక ఆవిడ ''అక్కయ్యా! ఒకసారి కళ్లుతెరువు. ఆ యేడుస్తుంది ఎవరు?'' అని అడిగింది. రాజరత్తమ్మ మనుమణ్ణి కావులించుకొని. పెద్దపెట్టున ఏడ్చింది. చీనయ్య కుర్చీలో కూర్చోలేకపోయాడు. అతనికి కూడా కళ్లలో నీళ్లు తిరిగాయి.

గోవిందమ్మ యీ యేడ్పునంతా సహించలేనన్నట్టుగా కళ్లువిప్పి దీనంగా అన్న చీనయ్యవేపు చూసింది. అతడు కుర్చీలోనుంచి లేచి చెల్లెలిదగ్గరకు వెళ్లాడు. ముసలమ్మ కూతురుబిడ్డను తల్లిదగ్గర్లోకి ఎవ్వరూ చూడకుండా నెట్టింది. గోవిందమ్మ కొడుకుచెయ్యి అన్నచేతిలోపెట్టి మెల్లిగా ఓపికచేసుకొని, ''అన్నయ్యా! వీడువట్టి పిచ్చి బాగులవాడు. ఏమీ తెలీదు... ఇది ఉంటుంది. ఇది పోతుంది అనేదిలేదు. ఏమో.... నీ మేనల్లుడు. ఏమి జరిగినా ఆపేరు నీకే ఉంటుంది – నీ కాళ్ళకుచుట్టి పోతున్నా.....'' ఇక మాట్లాడలేక పోయింది.

ఆ సాయంకాలమే మూట ముల్లే సర్దుకొని తయారైన దూర ప్రయాణికురాలులాగ గోవిందమ్మ మహాప్రస్థానం చేసింది.

అంత్యకర్మలు చీనయ్య చెల్లిలికి యథావిధిగా జరిపించాడు. ఆవిడ ఆస్తి వ్యవహారాలు సింహావలోకనం చేశాడు. అతనిబావ బ్రతికి ఉన్నంతకాలం వాళ్లవ్యవహారాల సంగతే తెలియదు. బావ చనిపోయిన ఆరునెల్లకే చెల్లెలు మంచం ఎక్కడంవల్ల ఆవిషయాలు తెలుసుకోవటానికి అట్టే వీలులేకపోయింది. మంచంలో ఉండగా చెల్లెలు తనకు తెలిసినంతవరకు కొన్ని విషయాలు చెప్పింది.

రాజయ్య – అంటే చీనయ్యబావ – మొదట్లో స్థితిమంతుడు. అందువల్ల తక్కువలో ఉన్న బావమరిదిని ఒకమనిషిగానన్నా చూచేవాడుకాదు. చీనయ్య తన బావమరిది అని చెప్పుకోవటానికి కూడ సిగ్గుపడేవాడు. ఆ రోజుల్లో పసుపుకి విపరీతంగా ధర పలుకుతుండేది. రాజయ్యకు ఒక యాభై పుట్లు పండేది. పైగా ఊళ్ళో కొంత కొనికూడ నిలవచేసేవాడు. అందువల్ల బాగా సంపాయించాడు. కొంత తినివున్నరుచితో ఎక్కువ లాభాలకోసం ఆసపడ్డాడు. బ్రహ్మాండంగా పసుపు ఎచ్చిదీ పచ్చిదీ అనకుండా కొని, నిలవబోశాడు. పుట్టి 120 రూపాయలు అమ్మింది, ఆసాంతానికి 70కి దిగి కూర్చుంది, రాజయ్య ఆస్తి అంతా పోయేస్థితికి వచ్చింది. తనకు ఆప్తులు, బంధువులు అనుకున్నవాళ్ళ యిద్దరిపేర 13 ఎకరాలు రెండు అయిటంలుగా తనఖా వ్రాసి దాగాడు. పెండ్లినాటి కట్నంబాపతు కొంత రాకపోవటం వల్ల, చీనయ్యపేర ఏమీ వ్రాయలేదు. అతడు మంచంలో వుండగానే తనఖా ఆస్తిని తప్ప, తతివమ్మాదంతా అప్పులవాళ్ళ ఎగతన్నుకపోయారు. ఏదో ఉన్నవాడుగదా అని బీదవాళ్లు రాజయ్యదగ్గర పత్రాలు లేకుండా దాచుకుంది అంతా పోయింది. అందువల్ల రాజయ్య అన్నా, అతని కుటుంబమన్నా, ఊళ్లోవాళ్లు మండిపోతూ వుండేవాళ్లు.

మొదట్లో చీనయ్య ఇంకా భుక్తంలో ఉన్న తన బావ పొలాన్ని తానే దున్నించి మొక్క వేయించేవాడు. ఇది వరకున్న కోపంవల్లనూ, దిక్కూదివాణం లేకపోవటం వల్లనూ, ఊళ్లోనివాళ్ళు పైరూ పచ్చ కోసుకెళ్లుతుండేవాళ్లు. మాధవరావు ఆటల్లోపడి చేనువేపు వెళ్లేవాడుకాడు తన వ్యవసాయం, మేనల్లుడివ్యవసాయం చూచుకోవలసి వచ్చేటప్పటికి ఒంటిగాడైన చీనయ్యకు తలప్రాణం తోకకొచ్చింది. ఏదో అవస్థపడి ఋతువు వచ్చేటప్పటికి నాలుగు మొక్కలు నాటించి కోయించగలడుగాని, రెండూళ్ళల్లో వ్యవసాయం చూచుకోవాలంటే చీనయ్యకుగాని, మరొకరికి గాని సాధ్యపడుతుందా?

ఒకరోజాన చీనయ్య మేనల్లుణ్ణి పిలిచి, ''కంది విరగ్గాసిందిగదా! పాడిబఱ్ఱెను చేనుగట్టున మేపుకుంటూ చూస్తూవుండరాదూ? దారిన పోయేవాళ్ళు దూసుకుపోతున్నారు,'' అన్నాడు.

''కట్టేసిన గేదె కట్టేసినట్టే ఉంటుంన్నది. కాసేపు అటు తిప్పుకురారా. లేకపోతే పాలు, పెరుగూ తాగటానికెలా వస్తాయి?'' అంది రాజరత్తమ్మ.

''నీతల ఒక్కేటుకు పగుల్తుంది. నేనుపోను,'' అన్నాడు మాధవరావు శౌర్యం ప్రకటిస్తూ.

''ఎవ్వరిపొలంరా అది? నీ పొలాన్ని నువ్వుచూచుకోవలసింది పోయింది, ఎవరన్నా చేసిపెడతామన్నా, చూచుకోలేవన్నమాట. ఆవసాన వచ్చేవాళ్లు పోయేవాళ్లు కాసిని కాసిని కందికాయలు దూసుకుపోతూవుంటే, ఏ కుఱ్ఱాడన్నా వూరుకుంటాడా ఈవూళ్లో!''

''ఎవడు పోతాడు ఈ అగ్గిలో? కావలిస్తే బఱ్ఱెను తోలుకెళ్లి చెట్టుకింద కూచుని చూస్తూవుండు.''

''నిన్ను ఊరిమీదికి విడిచిపెడతాను. రేగడిచేలో పని ఎవరు చేయిస్తారనుకున్నా?
112 నీ బాబుగాడున్నాడా అక్కడ!''

''వూనాన్నే వుంటే యీవూరిగడ్డ తొక్కేవాడివి కావూలు!'' చీనయ్యకు పట్టరానికోపం వచ్చింది. చేతి కొందికీ ఒక లెంపకాయ యిచ్చేవాడే. ఇంతలోనే తల్లి ఏడుస్తూ, అయ్యో కూతురా! ఇట్లాంటివాణ్ణి పెట్టుకుని ఎలా యీదేదే? ఎవరేది చెప్పినా నమ్ముతాడే కూతురా! వట్టి అమాయకుడే! ఉంటుంది పోతుందని తెలియదే కూతురా! అయ్యో కూతురా!'' అని యేడ్చింది.

చీనయ్యకు కోపం జారిపోయి జాలికలిగింది. జేబులో నుంచి ఒక అణా తీసి మాధవరావు చేతిలో పెట్టి, ''మా నాన్నగా, పో, గేదెను తోలుకెళ్ళి, కందిచేనుగట్టున మేపు. చేలోకి తోలి ఊరుకునేవ్,'' అని హెచ్చరించాడు. అణాతో తాను చూడకపోతే చేను పోతుంది. గేదె పాలివ్వదని మాధవరావుకు అర్థమైంది. వెంటనే గేదెను విప్పుకెళ్లాడు.

ఆ సాయంత్రం రేగడిచేనునుంచి వస్తూ చీనయ్య కందిచెను ఎవు వెళ్ళాడు. చేలో ఒక ప్రక్కంతా కందిచెట్లు విరిగున్నాయి. గొడ్లు విరగదొక్కిన చేను చూచేటప్పటికి అతనికి ప్రాణం ఉసూరుమంది. మేనల్లుడిమీద పట్టరాని కోపం వచ్చింది. దగ్గర్లో ఉంటే రక్తం కళ్ళజూసేవాడే. ఆ దూరప్పొలాన్నుంచి ఇంటికి వచ్చేలప్పటికి కొంతకోపం జారిపోయింది. పైగా తనఖావాళ్ళ నోటీసు ఒకటి వచ్చింది. విప్పి చూచుకున్నాడు.

ఒక తనఖాదారు తన తనఖాను లాల్‌చంద్ అనే మార్వాడీకి పురమాయించాడు. ఆ తనఖా లిమిటేషన్ పట్టటానికి సిద్ధంగా ఉంటంవల్ల కోర్టులో వ్యవహారం నడుపుతానని నోటీసిచ్చాడు. చీనయ్యకున్న కొంచెంకోపం తనఖాదారుమీదికి మళ్లింది.

ఆరాత్రి ఆలోచించుకుని, తల్లిని పిల్చి, ''అవమ్మా! తనఖాదారు కోర్టు కెక్కబోతున్నాడు. నాస్థితిగతులు ఎలా ఉన్నాయో నీకు తెలుసు. అయిదెకరాల మాగాని, కుటుంబంఖర్చు పెద్దది. పెద్దవాడి చదువుకి బోలెడంత పంపాలిసి వస్తున్నది. ఇక్కడ పొలంలో దమ్మిడీ రావటం లేదు,'' అన్నాడు.

''వాడేమైపోవాలిరా నాయనా! నీవే దిక్కు. వట్టి అమాయకుడు. ఎవ్వరేమాటలు చెబితే అదే నిజమని నమ్ముతాడు, అలాంటివాణ్ణి వదలి పెడుతావా?''

''కోర్టుకెక్కే తాహతు నాదగ్గర లేదు. ఒక వ్యవహారం కాదు, రెండు. నావల్లకాదు. అంతగా కాదంటే ఒక ఎకరం నాదాంట్లోది రాసిస్తాను,'' అన్నాడు.

రాజరత్తమ్మ మనుమడి గతికి ఏడ్చింది. వాడినోట్లో దుమ్ముకొట్టి పరులు ఆస్తిని ఎగనెత్తుకపోతూంటే చూస్తూ వూరుకుంటావా?'' అని కొడుకును నిష్ఠురాలాడింది అంతగా అయితే అయ్యే ఖర్చు మాధవరావుపేర వ్రాసుకొని డబ్బు పెడమంది. 113

చీనయ్య తల్లిని కాదనలేకపోయాడు. చెల్లెలు చనిపోతూ అతనికి చెప్పినమాటల్ని తల్లి జ్ఞప్తికి తెచ్చింది. పైగా ఇన్నిరోజుల్నుంచి మేనల్లుడి కోసం పనిచేసి, తీరా డబ్బువాడాలిసి వచ్చినప్పుడు జారుకుంటే, లోక మేమనుకుంటుంది! లోకం తన్ను ఆడిపోసుకోవటానికి ఇష్టపడలేదు.

అందువల్ల చీనయ్య మేనల్లుడితరఫున కోర్టులో వ్యవహరించటానికి నిశ్చయించుకున్నాడు. వాణ్ణి ఆవూళ్లోనే వుంచితే చెప్పుడుమాటల్తో చెడిపోతాడని, తన యింటికి తీసుకుపోయాడు. తన పొలంకూడ చేసుకుంటూవుంటే కోర్టుకు వెళ్ళటానికి వీలుండదని మగతాకిచ్చాడు.

ఇల్లూవాకిలీ, పొలంపుట్రా అనేవికూడ తలవకుండ చీనయ్య మాధవరావు వ్యవహారంలో కోర్టుచుట్టూ తిరగ మొదలెట్టాడు. నకళ్ళకనీ సాక్షులకనీ, కోర్టు ఫీజుకనీ, వకీలుకనీ, ఇంకా కాగితాలకనీ, గుమాస్తాలకనీ డబ్బు జిమ్మందాడిగా ఖర్చవుతూవుంది. నోట్లు రాసి తెచ్చి చీనయ్య డబ్బు వాడుతూ వచ్చాడు. బియ్యే చదువుతూ వున్న పెద్దకొడుకు అప్పారావు మాత్రం, తండ్రిని ఖర్చుపెడుతున్నదంతా లెక్కవ్రాయమని హెచ్చరిస్తూ వుండేవాడు. చీనయ్య అట్టే చదువుకున్నవాడు కాకపోవటంవల్ల లెక్క

రాసుకోలేడు. పెద్దకొడుకుచేత రాయించాలి. ఇంతడబ్బు మంచినీళ్ల ప్రాయంగా వాడుతున్నాడని తెలిస్తే వాడు ఆటకాయిస్తాడు. అయినా, మాధవరావు అమాయకుడు. తాను ఎలాచెబితే అలా వినుకుంటాడు.

మాధవరావు, కృష్ణారావూ కలసి చదువు మానేశారు. తినటం తిరగటం తప్ప అతనికి మరొక పనిలేదు. సోమరిపోతుకు కావలసిన గుణాలన్నీ పట్టుపడ్డాయి. బీడీలు కూడ అలవాటుపడ్డాయి. గూళ్లల్లోను, కుండల్లోనూ, పెట్టెల్లోనూ డబ్బులు దొరకనప్పుడు గంపలోని గింజలు, పెట్టెలోని బియ్యం కోమటింట్లో పోస్తుండేవాడు. చీనయ్య భార్య ఒకరోజు గింజలు పోసికెళ్లుతుంటే పట్టుకుని,

''నువ్వు కాపరంచెయ్యవూ? ఇల్లుమీద ఎలుగేసుకుపోతావా?'' అంది.

ఏమిటే, ఏమిటే,'' అంటూ వచ్చింది వంగిన నడుంమీద చెయ్యిపెట్టుకుని రాజరత్తమ్మ.

''మాధవాయ్ ఏంచేస్తున్నాడో చూడు! అంటే కోపాలు. ఎన్నిగింజలు! ఎన్నిగింజలు!''



''అసలు కిష్టాయి చచ్చినాడే నేర్పాడు,'' అంది మనమణ్ణి వెనకవేసుకొంటూ. ''మాధవాయే వాడికి నేర్పాడు, వీడు రాకముందు వాడెన్నడన్నా గింజ మొఖం ఎరుగూ?''

''నీ కొడుకు ఏమీ ఎరుగడు, నంగనాచి. వాడు పరాయిబిడ్డ కాబట్టి యిలా అల్లరి చేస్తున్నావు. అసలు వీణ్ణి వడ్లు తెమ్మని కిష్టాయే పంపి ఏసందులోనో, ఏకోమటింట్లోనో కూర్చుని వుంటాడు. వాడి అమ్మే బ్రతికి ఉంటే యిలా అల్లరిపడతాడా?'' అని గొంతు జీరపుచ్చుకొంది. ''ఏరా. కిష్టాయ్ తెమ్మన్నాడు? నిజం చెప్పు'' అని బుగ్గపట్టుకుంది.

''వాడే తెమ్మంది,'' అన్నాడు అమ్మమ్మను అందుకొని మాధవరావు.

''ఏడీ, చూపించు: చంపి పోగులెడతాను.''

''ఇందాక కూర్చుంటాడా?'' అంది రాజరత్తమ్మ.

''పారిపోయాడు,'' అన్నాడు మాధవరావు.

''ఒకళ్ల మాటలు విని ఎంతకాలం బ్రతుకుతావురా! ఇన్నేళ్లు ముడ్డికింద కొచ్చాయి! అయినవనీ, కానివనీ తెలియదేమిరా? ఇంకా ఎన్నాళ్ల కొస్తుందిరా జ్ఞానం?'' అంది రాజరత్తమ్మ.

ఒళ్లో గింజలు లాక్కొని చీనయ్యభార్య లోపలికెళ్లింది.

'' ఓసే ముసిల్దానా? ఒక్కదెబ్బతో యమలోకం ఎక్కడుందో చూసిరావాలి,'' అన్నాడు అత్తపోయిన ధైర్యం చూచుకొని.

''చంపరా, చంపు. ఈగోల పడలేకుండా వున్నాను. ఆ పుణ్యమే కట్టుకో!''

''అమ్మా! నువ్వుచస్తావూ? నీ శాపనార్థాలకి హడలిపోయి యముడు, ' ఈ మునలిపీడ నాకెందు' కని పంపెయ్యడూ?''

''నీజిమ్మడ, నాబ్రతుకే నీకు కష్టంగా వుంది! ఏదో నేనుంటేనే నీముఖాన యింత కూడేస్తున్నారు.''

''తాతయ్య నీతో ఎలా వేగాడో! నీ శాపనార్థాలకి కుళ్లికుళ్లి చచ్చివుంటాడు కాని, దేవుడిచ్చిన ఆయువు మూడి మాత్రంకాదు.''

''ఉండరా దొంగవెధవ!'' అని లేవబోయింది కొట్టగల నన్నట్టుగా, ఉడికించటానికి మాధవరావు పారిపోయాడు. అతనికి అమ్మమ్మ కొట్టలేదని తెలుసు.

మాధవరావుకు డబ్బుతో అవసరాలు ఎక్కువయ్యాయి. బీడీలకు, చిరుతిండ్లకు, డబ్బు కావలసి వచ్చింది. ఒకటి రెండురూపాయల దాక ఊళ్లోని కోమటిళ్లల్లో బాకీలు చేశాడు, కానీ దొరకటం లేదు. ఒక బీడి ముక్కన్నా కోమటివాళ్లు అప్పియ్యటంలేదు. అవశ్యకతను పట్టి ఏదైనా వస్తుందని పెద్దలు చెప్పినట్టుగా, అమాయకుడైన మాధవరావుకి తరుణోపాయాలు లభించేవి. ఇంట్లో మేనమామ మాటల సందర్భంలో ఆ మగతావాడు ఇంతియ్యాలి, వీడింతియ్యాలి, అని చెబుతూవుంటే విని, ఇంట్లో ఎవ్వరికీ చెప్పకుండా తనగ్రామానికి పారిపోయేవాడు. కోడలు తన మనుమణ్ణి రాచి రంపానపెడితే, ఉండలేక పారిపోయాడని రత్తమ్మ లగ్గల కెక్కేది. కోడలు కన్నీళ్ళ పర్యంతమయ్యేది. మాధవరావు ఇంటికి తిరిగి వచ్చిన పదిరోజాలకు తేలేది. మగతావాడు 20 రూపాయలు ఇయ్యవలసి ఉంటే 10 రూపాయలు పుచ్చుకుని బాకీరద్దుచేసి, తనబాకీలు తీర్చుకుని, మిగతాది ఏ తిరునాళ్ళ ఖర్చుతో వాడుకునేవాడు. అత్తాకోడళ్ల మధ్య కురుక్షేత్ర సంగ్రామం.

''నీ మనుమడెక్కడికో సన్యాసం పుచ్చుకు పోయాడంటివే?''

''కిష్టాలు వీణ్ణి పాడుచేస్తున్నాడు. లేకపోతేనా....''

''కిష్టాయిని నీమనుమడేం పాడుచేయలా! చదువు, సంధ్యా మాధవాయివచ్చి పాడుచేశాడు, వాడురాకముందు చక్కగా బళ్లోకివెళ్లి చదువుకునేవాడు. దొంగతనం నేర్పింది, సిగరెట్లు, బీడీలు అలవాటుచేసింది మాధవాయే.''

''అబ్బే! నీకొడుకు ఏమీ ఎరుగడు.''

''వాడే మావాణ్ణి పాడుచేశాడు. వాడి మూలాన్నే మానిండు సంసారం గుల్లగుల్ల అవుతూవుంది.''

''రేపు లెక్కగట్టి పుచ్చుకోక వదిలిపెడతావా యేమిటి? చీటికి మాటికి ఇల్లుగుల్ల, ఇల్లుగుల్ల అంటావు'' అంది.

ఆరోజల్లా కొడుకూ, కోడలూ ఎన్నివిధాల బ్రతిమాలినా తిండి తినకుండా మునగదీసుకొని రాజరత్తమ్మ పండుకొంది.

మాధవరావుకి మైనారిటీ వెళ్లిపోయింది. అందువల్ల చీనయ్య మేనల్లుణ్ణికూడ కోర్టుకు వెంటబెట్టుకుని వెళ్లాలిసి వచ్చింది. అప్పుడప్పుడు మేనల్లుడి గ్రామంనుంచి తాను, తన గ్రామంనుంచి మేనల్లుడూ దూరంగావున్న గుంటూరికి కోర్టువ్యవహారం కోసం వెళ్లవలసి వచ్చేది. ఇంకొకప్పుడు తాను గృహ వ్యవహారాల్లో ఉంటంవల్ల చీనయ్య మేనల్లుణ్ణి ఒక్కణ్ణే పంపాలసి వచ్చేది. ఆ సమయాల్లో ఖర్చుకు కావలసింది అర్ధరూపాయైతే మాధవరావు రూపాయి తెమ్మని మారాం చేసేవాడు. చీనయ్య.



''ఇది ఎవరి వ్యవహారంరా? నీ తరహాచూస్తే 'నా పెళ్లికి నేనూ పోవాలీ?' అన్నట్టుగా వుంది. పో, తొందరగా పో, లేకపోతే కోర్టువేళ కందుకోలేవు.''

''రూపాయితే వెళ్లుతా.''

''ప్రతితడవా రూపాయ నేనెక్కడ తెచ్చేది? పాడైపోతావని బరువుభారం నెత్తినేసుకుంటే, నామీద స్వారి చెయ్యాలంటావు. పోకపోతే నీ ఆస్తే పోతుంది. నా దేమిపోతుంది?''

''పోతే పోయిందిలే, ఎవడు నడచిపోతాడు? రూపాయిస్తే గుఱ్ఱబ్బండి ఎక్కిపోతాను.''

''సరే రూపాయిచ్చేదాక కూర్చో.''

''నీముఖాన గుడ్డుమొలవ! పోరా, ఆస్తి ఉండేదీ పోయేది ఎరగవేమిరా!'' అంది ముత్తవ.

''నిన్ను పంపితే బాగుండేట్టుంది. చక్కగా దిద్ది తీర్చుకొస్తావుట,'' అన్నాడు మనుమడు.

ముసలమ్మ ఏడవనీ, తిట్టనీ, రూపాయి చేతులో పడ్డాకనే మాధవరావు వాయిదాకు వెళ్లేవాడు.

కాలం గడిచింది. కన్ను లొట్టపోయి చీనయ్యమారువాడి వ్యవహారంలో కొంత నెగ్గాడు. ఆరువేల వ్యాజ్యం వెయ్యిరూపాయలకు కొట్టివేశారు. రెండో తనఖాదారుకూడ రంగంలోకి దిగాడు. వ్యవహారం జరపాలంటే చీనయ్యచేతిలో చిల్లిగవ్వలేదు. తనఖాలో వుంటంవల్ల మేనల్లుడి పొలమమ్మటానికి వీల్లేకపోయింది, ఓడిపోయిన మారువాడీ కూడ హైకోర్టుకు పోతాడని తెలిసింది.

చీనయ్యను డబ్బుసమస్య ఎదుర్కొంది. కొడుకు లిద్దరూ మేజర్లయ్యారు. బి.యే. పరీక్షకు కట్టవలసిన 45 రూపాయలు పంపలేదని తండ్రిమీద పెద్దవాడు మండి పడుతున్నాడు. చీనయ్యకే ఆశ్చర్యం వేసింది. పెద్ద కొడుకునీ, అతని విద్యనీ పోషించుకుంటూ వస్తున్న అతనికి ఉదాసీనభావం ఎందుకేర్పడింది? చీనయ్యకు మమకారాలు నశించాయా? అతని భూమిని తనఖా పెడితే డబ్బిస్తారు. కాని, కొడుకులు రచ్చకీడుస్తారు.

ఇంతకాలం వ్యవహారం నడుపుతున్నందుకు మేనల్లుడికి లాభించింది. తనఖాలో ఉన్న అతని 13 ఎకరాలూ మాగాని అయింది. వెనకటి రోజుల్లో 500 అమ్మే ఎకరం ఇప్పుడు 1200 దాక వచ్చింది. తాను ఊరుకున్నట్లైతే? 500 చొప్పున బాకీదార్లు పొలం తన్నుకెళ్లి ఉండేవాళ్లు ఈ లాభం ప్రత్యక్షంగా తాను వ్యవహారం నడవటంవల్ల జరిగినప్పుడు ఎలా ఊరుకుంటాడు?

ఎలాగైతేనేమి చీనయ్య అవస్థపడి మారువాడి తనఖాకు లోబడి మేనల్లుడి పొలం కొనేవాణ్ని సంపాయించాడు. కాని, చేవ్రుత్తరం మీద మాధవరావు సంతకం చేయకొచ్చాడు. బెదరించాడుచీనయ్య. ప్రాధేయపడ్డాడు, రెండుమూడు రూపాయలు వాడుకోటానికి ఇస్తానన్నాడు కూడ. కాని ఫలం లేకపోయింది.

మనమడి మంకుకి కారణం ఏమిటోచూచాయగా రాజరత్తమ్మకు తెలిసింది. నెత్తేనోరు కొట్టుకుంది. వాడి వ్యవహారం చెడిపోతుందని కాదు తన్ను కన్నుకోకుండా అమాయకుణ్ణి చేసి తన మనుమడికి ముక్కు ముఖం లేని అబ్బనాకారి పిల్లను కట్టడమేనా? ఎటు లేదన్నా పదివేల ఆస్తి ఉన్నవాడికి – అప్పులవాళ్లు తన్నుకపోకుండా వుంటే – వెయ్యిరూపాయలేనా కట్నం? మనుమడిదగ్గర ఏడ్చింది. మేనమామ యింట్లోనుంచి తరిమి వేస్తాడని బెదరించింది. మనుమడు వట్టి అమాయకుడు. చెప్పుడు

మాటల్తోపాడై పోతున్నాడు. తను చూస్తూ చూస్తూ, పాడైపోతూవుంటే ఏలా ఊరుకుంటుంది? కొడుకు చీనయ్య దగ్గర మాధవరావు చెప్పుడుమాటల్తో చెడిపోతున్నాడనీ, అదివాడి పుర్రెలోనే పుట్టిన బుద్ధికాదనీ, ఏడ్చింది. మీరన్నా చెప్పండని ఊళ్లో పలుకుబడి గలవాళ్లందరి దగ్గరికీ పోయి కంటతడిపెట్టింది. ఎన్నడూ బయటికిరాని రాజరత్తమ్మా, ఆవేళ బయటికి వచ్చిందంటే, అందరికీ జాలివేసింది. అందరూ మాధవరావుకు చెప్పిచూచారు.

మేనల్లుడు ఫలోన్ముఖమై ఉన్నదాన్ని పాడుచేస్తున్నాడని చీనయ్య విచారపడ్డాడు. తన్ను అలక్ష్యం చేసినా ఫరవాలేదు. తేలిపోయి లాభించనున్న వ్యవహారాన్ని చెడగొడుతున్నాడేమా అని దిగులు కలిగింది.

ఊళ్ళో పెద్దలు చెప్పటంవల్ల గాని, రాజరత్తమ్మ ఏడవటంవల్ల గాని, మాధవరావు పెండ్లి ఆగిపోయింది. చే ఉత్తరం ఇచ్చి డబ్బుతీసుకొని కోర్టువ్యవహారం నడుపుదామంటే, మాధవరావు మూగనోము పట్టాడు. ఇంట్లో, అంటే మేనమామ యింట్లో, తిని ముఖం తప్పించుకు తిరుగుతున్నాడు. చేతిలోడబ్బులేక చీనయ్య ఇంట్లోనే దిగడిపోయాడు.

118 బి.యే.పూర్తి చేసుకొని వచ్చిన సోషలిస్టు అప్పారావు, మాధవరావు సంగతి పసికట్టి, తన తండ్రి కియ్యవలసిందేమిటో యిచ్చివేయమన్నాడు. మాధవరావు జవాబు చెప్పకుండా తిరిగాడు, ఊళ్ళో పెద్దమనుషులు వాడికైన లెఖ్ఖ చూపించమన్నారు. అప్పారావుకి తండ్రి లెక్క్రాయలేదని తెలిసింది. ముచ్చట్లే వుండి అల్లుడు కొంప గుణ్ణం చేశాడని చీనయ్యభార్య యేడ్చింది. ''లోకుల మాటలు విని మనమడు పాడైపోతున్నాడు. వాడెలా బతుకుతాడా,'' అని రాజరత్తమ్మ అంగలార్చింది.

రెండునెల్లు గడిచేటప్పటికి బాకీదార్లు చీనయ్య పొలం వేలం వేశారు. ఇల్లుతప్ప ఏమీ మిగిలేట్టు కనిపించలా. చీనయ్యభార్య మాధవరావుమీద దుమ్మెత్తి పోసింది. అయినా అతనికి అన్నంపెట్టక తప్పలా. ''ఇన్నాళ్లు పెట్టి పోషించి యివ్వాళ తరిమేస్తే, లోకమేమంటుంది!'' అన్నాడు చీనయ్య.

చీనయ్యపొలం వేలంలో కొట్టేయించుకుంది మాధవరావేనని తేలింది. రాజరత్తమ్మ తన మనమడు మేనమామని అన్యాయం చెయ్యడు, వట్టి అమాయకుడు అంది. అప్పారావు, మాధవరావు సంగతి ఆరాతీసి, తండ్రితో వాడు తనఖాదార్ల యిద్దరికీ చెరి రెండువేలు ఇచ్చి రాజీపడి పొలమంతా అమ్మి తనపొలం కొన్నాడని చెప్పాడు.

---

జి.వి. కృష్ణరావు

ఋతువులో మేనల్లునిచేను, అంటే పూర్వం తనచేను, వాడు సాగుచేయించుకోలేని అమాయకుడని చీనయ్య దున్నించబోయాడు. మాధవరావు, ''నేను దున్నించు కోగలను, నీవు చేలోకి దిగనవసరం లేదు'' అన్నాడు.

చీనయ్యభార్య మళ్లీ తిట్టింది. ''వాడు వట్టి అమాయకుడు, లోకులు వాడికి చెప్పి పాడుచేస్తున్నారు. వాడు ఇక ఎలా బ్రతుకుతాడా దేవుడా!'' అని రాజరత్తమ్మ యేడ్చింది. ''13 ఎకరాలు పాడుచేసి 5 ఎకరాలే నిలబెట్టుకున్నాడే!'' అని చీనయ్య కించపడ్డాడు. సోషలిస్టు అయిన అప్పారావు, దీని కంతకూ బ్రిటిష్ సామ్రాజ్యవాదమే కారణమని కారాలు మిరియాలు నూరాడు.

*ఏప్రిల్, 1941*

# బొమ్మరిల్లు

అమ్మా, అమ్మా! నేనేఁ, చాత్రం చెబుతానే!

మీ నాన్నకి చెప్పు, పో, తీరిగ్గా కూర్చున్నాడు.

నాన్నగారు ఊఁ కొట్టరే!

నాకు చాల పనుంది. మీ నాన్నకు చెప్పు.

నాన్నగారికి చెప్పను, నీకే చెబుతానే.

ఐతే వినను. నేనేనా తీరిగ్గావుంది?

నువ్వే వినాలి.

నేను విననూ.

అయితే ఏడుస్తా,

మీ నాన్నదగ్గరే ఏడవరాదూ?

ఉత్తుత్తి ఏడుపు నిజమౌతుందే.

నాదగ్గరకూడా అంతే జరుగుతుంది.

నన్నెందుకు కొడతావమ్మా? మంచినీళ్ళ బానలో చెంబు వెయ్యలేదు. కాగులోనీళ్ళు కెలకలేదు. నాన్నగారి కలం నేను చూడలేదు. సిరా పారబొయ్యలేదు. బళ్ళోకి ముద్దులమ్మల్లే వెళ్ళివచ్చాను. ఇంక నన్నెందుకు కొడతావు?

ఇలా మారాంచేస్తే కొడతానామరి....

నిజంగా కొట్టేట్టున్నావే?

తప్పకుండాను.

మా అమ్మ చాల మంచిది. ఎప్పుడూ కొట్టదు. చిలిపి పన్లు చేసినా చూచి నవ్వి ఊరుకుంటుంది. అడిగిందల్లా యిస్తుంది.

మీ అమ్మ యెవరు!

పాపం. ఎంత ఆసపడ్డావు! నువ్వు కాదులే. చీటికిమాటికి సివాలేసే చిట్టితల్లివి! మా బంగారు తల్లివి! నిన్నే చెప్పాలి?

మాకూ ఓఅబ్బాయి ఉన్నాడు. మారామే తెలీదు. ఎప్పుడూ నవ్వుతూ పేలుతూ వుంటాడు. ఎప్పుడన్నా కోపంవచ్చి కొట్టినా ఇల్లెగిరిపోయేటట్లు యాడవడు.

ఏబ్బేబ్బె జిల్లాయిలే! వాడే మబ్బాయి? మారాంచెయ్యకా, యాడవకా, ఏంచేస్తాడు! మాబళ్లోకివస్తేనా, పప్పులు బెల్లాలు పెడతాము, తెలిసిందా!

మా అబ్బాయిని మీకొంటెకోణంగులతో ఆడుకోటానికి పంపుతామనుకున్నావా?

అయితే మీ అబ్బాయిని కుంకంలో పెట్టి పూజించు.

మీ అమ్మనుగూడా అలాగేచెయ్యి.

అమ్మా, పాపం!

నీవూ, మీ అమ్మా తప్ప లోకంలో మంచివాళ్లేలేరు.

అమ్మా, వట్టిదొంగదానివే!

ఎందుకని!

తీరికలేదు, పనుంది, పనుంది అన్నావే, ఇంతసేపు నాతో వాగుతుంది ఎవరే!

ఇంకా జ్ఞాపకముందీ?

నేను మరచిపోకేం.

అందుకనేనా, రెండో తరగతిలో రెండేళ్లు కూర్చున్నావు?

అమ్మా. ఆ అబ్బాయి జుత్తు అలా వుంటుందేమే?

ఏ అబ్బాయి?

అదేం, ఎంకన్నగారి అబ్బాయే.

నీక్కూడా ఎంకన్న అయ్యాడూ?

నేనేమి తప్పనలేదే, పిల్లలంతా అలాగే పిలుస్తారు.

అలా పిలవగూడదు నాన్నా. వెంకయ్యబావా అనాలి.

వాళ్ళంతా ఎందుకలా పిలుస్తారు?

పాపం, వాళ్ళూ మనలాంటివాళ్లే. ఈమధ్యే చితికిపోయారు. అందుకని అందరికీ తేలిక.

ఏం చితికిపోయారే? వెంకయ్యబావ, పున్నమ్మక్కయ్య బాగున్నారు కాదుటే?

కాదునాన్నా, అప్పులవాళ్లు డబ్బూదస్కం పొలం పుట్ర ఎత్తుకుపోయారు.

ఎత్తుకు పోతూవుంటే వెంకయ్యబావ చూస్తూ వూరుకున్నాడూ? వాళ్ళబ్బాయి యాడవలా? నేనైతేనా?

ఏం చేస్తావు!

నాన్నతో చెప్పి తన్నించక పోయాను?

వాళ్ళనాన్న, తన్నలేక పోయాడు.

పంతులుగారితో చెప్పలా? పేము బెత్తంతో వాళ్ళ వీపులు బద్దలు చేసేవాడు.

మీ పంతుల్నే కొడతారు.

పాపం! అయితే వెంకయ్యబావగారి అబ్బాయిజుత్తు తాటిజీబల్లే వుంటుందే, వాళ్ళమ్మ దువ్వదూ?

వాళ్ళకు డబ్బులేదుగా, అందుకని వాళ్ళమ్మ వడ్లదంపుకిపోతుంది. తల ఎవ్వరూ దువ్వుతారు?

అదేనే, వాళ్ళబ్బాయి ఎండలో తిరుగుతాడు. మొఖం చూడు, ఎలా మాడుచెక్కలాగా వుంటుందో. కాసేపు ఆడుకోవటానికి పోతే కొట్టొస్తావే. వాడిని ఎందుకు కొట్టవూ మరి?



కొడితే వూరుకుంటారా వాళ్ళు?

అయితే తేరగావుంది నేనేనమ్మా?

వాడుగొడ్లుకాసి డబ్బు తెచ్చుకుంటాడు. ఎండలో తిరిగి నువ్వేం తెస్తావ్?

పక్కవాళ్ళను గిల్లి కజ్జాలు తెస్తాను.

అలాగే వుంది.

సరేకాని, ఆ అబ్బాయికి తింటానికి ఏమీ పెట్టదు. ఆడుకోమందు. బళ్లోకి పంపదు పున్నమ్మక్కయ్య మంచిది కాదూ?

మంచిదేరా. కాని డబ్బులేదుగా, డబ్బులేనప్పుడవన్నీ ఎక్కణ్ణుంచి వస్తాయి?

డబ్బులేకపోతే యివన్ని రావన్నమాట.

రావు నాన్నా. అందుకనే నాన్న కాణీలిస్తే, పారెయ్యకుండా భద్రంగా దాచుకోవాలి.

డబ్బు ఎలా వస్తుందే?

ఒళ్లొంచి పనిచెయ్యాలి.

వెంకయ్యబావా, పున్నమ్మక్కయ్య, వాళ్లబ్బాయీ పనిచేస్తున్నారుకదా? వాళ్ళకు డబ్బులేదేం?

లేదు.

అయితే నాన్న పనిచెయ్యటం లేదుగా? డబ్బు ఎలా వస్తుంది?

నాన్న డబ్బు వడ్డీకిచ్చాడుగా.

పని చెయ్యకుండా తింటూవుంటే అయిపోలా?

వడ్డీకిస్తే డబ్బు పెరుగుతుంది.

ఎలా పెరుగుతుందే?

ఏమో, మీ నాన్న నడుగు.

అసలు డబ్బనేది లేకపోతేనేం?

నీకు చాక్లెట్లు, కాఫీ , తిండి, చదువు ఎలా వస్తాయి?

తిండి అంటే బియ్యం వండితేసరి. బియ్యానికి వడ్లుకావాలి. పొలం దున్ని నాటేసి పెరిగింతరువాత కోస్తే వడ్లు వస్తాయి. కాబట్టి వడ్లకు డబ్బక్కర్లేదు. పంతులు చెబితే చదువొస్తుంది. ఇంక డబ్బెందుకు కావాలి? 123

అయితే ప్రజలకు డబ్బుందిగా.

డబ్బు అక్కర్లేదు చెల్లదంటాను.

చెల్లదంటే వూరుకుంటారూ? పడేసి తంతారు.

పెద్దవాణ్ణయిం తరువాత చెల్లదంటాను. నన్నెవరు కొడతారు? పెద్దవాడిని గనుక నేనే వాళ్ళను తంతాను.

మీ నాన్నతో చెబుతారు. అప్పుడో?

నిజమే, ఆలోచించాలిసిందే...... మరే అమ్మా, ఒకటి చెయ్యి. వాడే చక్కగా చదువుకునే ఆడుకుంటున్నాడు, ఎందుకు కొట్టడం అన్నెశై. నీవు చెబితే ఊరుకుంటారు.

నాన్న నీ చేష్టచూడకపోతే చెప్పొచ్చు. చూస్తూనేవుంటే ఎలాచెప్పేది?

ఇన్ని చెబుతావే! అక్కయ్యనీ నన్నూ మాయజేస్తావే, కాసేపు నాన్నకు దాకలమూసి దండాకోరు పెట్టలేవు?

..........

ఎందుకు నవ్వుతావు?

మీ పంతులుబెత్తాన్ని ఏం చేస్తావు?

ముందుగానే బళ్ళోకి పోయి ఎవరూ చూడకుండా విరిచేసి వస్తాను.

డబ్బు అనేదాన్ని లేకుండాచేస్తే అంతా పని చెయ్యాలిగా?

ఆఁహాఁ.

నువ్వుకూడ?

నేనూ, పైగా అందరికి చాక్లెట్లు, కాఫీ , బొమ్మలూ అన్ని రకాల బొమ్మల్లే! ఆడేవి, ఊగేవి, నడిచేవి, పరిగెత్తేవి, అరిచేవి – ప్రతివాడికి కావలసినవన్ని యిస్తాను.

మరి అమ్మలూ, నాన్నలూ ఏం కావాలి

వాళ్ళను తరమేస్తాను. ఉంటే పిల్లల్ని కొడతారు. ఏడిపిస్తారు. ఆడుకోనీరు, బొమ్మల్ని దాస్తారు. అందుకని వాళ్ళని ఉండనీను మరచిపోయాను, పంతుళ్లనీ, వాళ్ళబెత్తాలనీ సాగనంపుతాను.

మీలో మీకు పోట్లాటవస్తే?



ఎందుకు వస్తుంది? చాక్లెట్లు బొమ్మలు అందరికీ సమానంగా ఇస్తాను. ఒకళ్ళకి పెద్దబొమ్మాలేదు, వేరొకళ్లకి చిన్నబొమ్మాలేదు అందరూ సమానమే.

అదిగో, మీ బడిగంట.

పాడుగంట, రెండోదల్లే వుంది. తొందరగా వెళ్ళాలి.

.........

అదేమిట్రా?

ఏముంది, పలకేగా!

పెద్దపలక తీసికెళ్లుతావేఁ? మీ అక్కయ్యకో?

అక్కయ్యలేదు, చెక్కయ్యలేదు.

ఇప్పటి దాకా ఏం చెప్పావు? పెద్దపలక అక్కడపెట్టి చిన్నపలక తీసికెళ్ళు.

నేనేం చెప్పాను? అంతా ఒకటేనని చెప్పలా?

ఒరేయ్, ఒరేయ్!

*ఏప్రిల్, 1941*

---

జి.వి. కృష్ణరావు

# షష్ఠి పూర్తి

ఈ సంగతీ వింటే, సనాతను లేమంటారు? దేవుడు, దైవం అనేది లేకపోబట్టే జీవితం నిస్సారంగా నిరర్ధకంగా కనిపిస్తుంది. అందువల్ల ప్రజలంతా ఆత్మహత్యలు చేసికొంటున్నారు. ఇది దుర్భరమంటూ, తీవ్రంగా మతప్రచారానికి పూనుకొంటాడు.

సోషలిస్టులు ఏమంటారు?

ఈ రోగం అచ్చంగా కుళ్ళే బూర్జువా వర్గానిది. సోషలిస్టు విప్లవానికి ఇదే సమయమని చెలరేగుతారు.

ఈ రెండు శాఖలవారి ప్రచారాలవల్ల ప్రజల్లో సంధిగ్ధావస్థ తప్ప జీవితంలో మార్పు ఏమీ రాదు. అలాంటప్పుడు నేను ఆత్మహత్య చేసుకోవడంవల్ల ప్రయోజనం?

అయితే మానుకోవలసిందేనా? ఇలా మొట్టికాయలు తింటూ; సౌఖ్యం, సౌందర్యం, ఆనందం అనేవి యెలావుంటాయో యెరుగకుండా, చివరికి ఒక్కసారన్నా పేపర్లోకి ఎక్కకుండా జీవించడమంటే...... ఎలాంటి అవకాశాలు లేకుండా వెధవ బ్రతుకు బ్రతకటం! పుణ్యాత్మురాలు కాబట్టి యిదంతా చూడకుండా ముసలిది దాటిపోయింది.

ఏమి చూచుకొని బ్రతకాలి? ఒకవేళ నేను చచ్చిపోయినా, సూర్యుడు తూర్పునే పొడుస్తాడు. పడమటనే అస్తమిస్తాడు. మా అల్లరి చిట్టికి నా మీసాలు లేకపోయినా నా కర్రా చెప్పులూ, ఆడుకోటానికి వుండనే వుంటవి. అప్పుడప్పుడు ఉప్పుప్పుగోను మోయటానికి పెద్దది ఉండనే ఉంది. కాకపోతే, కోడలికి మధ్యాన్నం చుట్టనిప్పుకోసం విసుగుకునే బాధ తప్పుతుంది.

నేను చస్తే తప్పేది చుట్టనిప్పు బాధే నన్నమాట! ఉఁ...... మరచిపోయాను. అంత్యకర్మల కర్చో? అసలే సంసారం ఈదలేక అవస్థ బడుతున్నాడు. నేను చచ్చానంటే, ''ఇప్పుడే చావాలీ? వాడికి ఏం పోయేరోగం వచ్చింది! హాయిగా తిని కూర్చోగూడదూ? కరువులో అధికమాసం.'' అని వాడు చెడామడా తిడతాడు.

పోనీ, యీ అవస్థ అంతా ఎందుకు? సత్యాగ్రహం చేసి జైలుకుపోతేనో? పేరుకు పేరూ వస్తుంది, లోకం మీద ఉన్న కసికి కసీతీరుతుంది. ఈ అవస్థా తప్పుతుంది. సత్యాగ్రహం బాగానే ఉంది. కాని రాయ్ చెప్పినట్టు దేశానికి ప్రయోజనకారి కాదేమో? సత్యాగ్రహ ఫలితంగా ఫాసిజం వస్తే? మరీ దుర్భరం.

ఆలోచించాడు. ఆరిపోయినదనుకొని చుట్ట అవలపారెసి ఉమ్మేశాడు.

తన హయాములో శేషయ్య అధికారం నిరాటంకంగా సాగించుకొన్నాడు. ఇంట్లో వాళ్ళంతా పసిపిల్లలతో సహా, తాను కూర్చోమంటే కూర్చునేవాళ్ళు, నిల్చోమంటే నిల్చునేవాళ్లు. ఒంటేలుకూడ పోసుకునేవాళ్ళు. చేసేపాకందగ్గర నుంచి సర్వం అతని యిష్టప్రకారమే జరిగేది. తన భార్యా, కొడుకూ రెండు వలసరాజ్యాలుగాను, తానొక సామ్రాజ్యంగాను ఉండేవాడు. కాని, పరిస్థితులు పదేళ్ళక్రితంనుంచి మారాయి. ఒక్కడే కొడుకు. పెండ్లైన ఆరేళ్ళకు కోడలు కాపురానికి వచ్చింది. అప్పటినుంచి అతని అధికారం పడిపోయింది. ఇది ఎంతమాత్రం గిట్టలేదు. కొడుకునుంచి వేరువడదామనుకొన్నాడు. లేక లేక ఒక్కడు! వాడితో విభాగాలు పడితే లోకమేమనుకుంటుంది? కడుపుమండి శేషయ్య హిందూసంఘాన్ని తిట్టిపోశాడు. పాశ్చాత్య సంఘాన్ని పొగడాడు. అందుకనే హిందూదేశాన్ని ఏలుతూవున్నదన్నాడు.

అసలు ఇంకో రహస్యముంది. కాస్తో కూస్తో ఆ రోజుల్లో ఇంగ్లీషు చదువుకొన్న శేషయ్య లోకాన్ని ఎదిరించైనా కొడుకుతో విభాగాలయ్యేవాడే. వేరుపడటానికి పిత్రార్జితం మిగిలింది ఏమీలేదు. కాకపోతే ఒక కడవ, చేంతాడు పంచుకోవలసిందే. ఈ ముసలి
 తనంలో సంపాదించేశక్తి ఏమీలేదు. ఇదివరకున్న పిత్రార్జితం, తన సంపాదనా కొడుకు విద్యకోసం, ఉద్యోగంకోసం ఖర్చుపెట్టాడు. అదంతా అతని ఆత్మ సంతృప్తికోసమే ననుకోండి.

రోజురోజుకీ ఇంట్లో, అంటే అతని కొడుకింట్లో, జీవితం దుర్భరమనిపిస్తోంది. పూర్వంలాగ అతని ఆజ్ఞ చెల్లకపోతే చెల్లకపోయింది. అతని సలహాలుకూడ ఎవ్వరికీ అక్కరలేకుండా ఉన్నాయి. ముసలిది ఉన్నంతకాలం, అతన్ని అడిగి కూరలు చెయ్యకపోయినా, వేళకు అన్నం పెట్టేది. అలిగితే సాగదీసేది. ఇప్పుడేముంది? ఆకలి లేదని పడుకుంటే, మళ్లా అడిగేవారన్నా లేరు. సాగదీసేవాళ్లు ఉంటేగా అలగటానికి?

వార్ధక్యంతో ఒకవేళ తనకు చిరాకు ఎక్కువై జీవితం అలా కనిపిస్తున్న దేమోనని శేషయ్య ఒకసారి ఆలోచించాడు. నిజంగా తన కొడుకుకి తాను ఇంకా చాలకాలం బ్రతకాలని కోరుకుంటున్నాడేమో? అయినా తేల్చుకుందామని ఒకరోజున కొడుకు పంక్తిని భోజనం చేస్తూ వున్నప్పుడు. ''పెద్దవాళ్లంతా రాలిపోతున్నారు. నావంతు కూడా వచ్చేటట్లుంది.'' అన్నాడు. కొడుకుగాని, కోడలు గాని, ''అయ్యో, అయ్యో! అలా అంటారేమిటి? మీ మీద గంపెడంత ఆసపెట్టుకున్నాము. అని మాటవరసకన్నా, అనలేదు. అనకపోతే అనకపోయారు, నవ్వనన్నా నవ్వలేదు. కాబట్టి తేలిపోయింది. తాను బ్రతికినా ఊడినా ఒకటే.

---

జి.వి. కృష్ణరావు

ఎవరికి కొరగాని యీ బ్రతుకు బ్రతకకపోతే నేమీ? అతని గుండె గొంతుకలో కొట్లాడింది. నాలుగు పద్యాలు వ్రాయాలనిపించింది. కాయితాలకోసం తడుపుల్లాడాడు. కొడుకు బల్లమీద ఒకప్రక్కన తెల్లకాగితాల పొత్తి కనిపించింది. శేషయ్య కంటుకోటానికి బుద్ధిపుట్టలా. కొడుకు సంపాదించుకున్న కాగితాలను ముట్టుకోవటానికి తనకేమి అధికారముంది? కాగితం తియ్యబోయిన చెయ్యిలాక్కొని, వేస్టు పేపరుబుట్ట వెదికాడు. అన్నీ ముక్కలుగాచింపిన కాగితాలే. ఎంతమంచి కాగితాలు! తనకొక్క ముక్క దొరకరాదు? వెతగ్గా వెతగ్గా ఒక తెల్లని ఉండకనిపించింది. దాన్ని విప్పి సాఫీ చేశాడు. శ్రమకుదగ్గ ఫలితం దక్కింది. అరటావు, ఒక ప్రక్కనే వ్రాసివుంది.

పరమానందంతో దాన్ని పట్టుకెళ్లి కవితా సమాధిలో పడ్డాడు. జిలుగక్షరాల్లో ఏదో వ్రాస్తూ, మధ్యమధ్య చుట్ట పీకుతూ ఆలోచిస్తూ కూర్చున్నాడు. చిన్నమనుమరాలు వచ్చి వెనక నుంచుని. ''నీజుత్తు తెల్లగా బాగావుంది. ఎందుకు దువ్వుకోవు? నేను దువ్వేదీ? బాగుంటావు. వెనకోజడ, ముందోజడ వేస్తాను. ఆఁ?'' అంది. ఆలోచనలో ఉన్న శేషయ్య తల ఊపాడు. ఆ పిల్ల పరుగెత్తికెళ్లి, అమ్మను ఏడిపించి, దువ్వెనతెచ్చి, దువ్వి తాతకు తనకు మల్లేనే ముందోజడ, వెనకోజడవేసింది. అతడు కవిత్వధోరణిలోనే ఉన్నాడు. అమ్మాయి తాతతల అటూ ఇటూ తిప్పి చూచి, ''భలే, భలే! ఎంత చక్కనాగ్గావుంది!'' అంటూ గంతులేయ మొదలెట్టింది. ''ఫో! అల్లరిపిల్లా,'' అని కవితాసమాధిలోవున్న శేషయ్య మనుమరాల్ని కసిరాడు. ఆ అమ్మాయి అక్కడినుంచి గెంతింది. చరణంలో యతికోసం ఆలోచించే శేషయ్య తలగోకాడు. చేతికేదో తగిలింది. తడివి చూచుకొని, ''ఓసి నీ సిగగొయ్యా, ఎప్పుడేశావే జడ? ఒకటికాదే, రెండు,'' అంటూ విప్పుకుని మళ్ళీ రాతలో పడ్డాడు. పెన్సిలు శరపరంపరగా పోతూ వుంది. పొడుంపీల్చాలనిపించి బొడ్లో చూచుకున్నాడు. కనిపించలా. 'ప్రక్కన పెట్టానేమో' నని వెతికాడు. కనపడలా. ''ఆ కొంటెకోణంగే తీసివుంటుంది, అందుకే నవ్వింది,'' అని తేల్చుకుని వంటయింట్లోకి వెళ్ళి, తల్లి ప్రక్కన ఉన్న చిన్న మనుమరాల్ని, ''ఏదే నా పొడుంకాయ!'' అని అడిగాడు ''నాకేం తెలుసు?'' అంది పిల్ల. 

''అదే, నవ్వుతున్నావులే. ఇలాతే.'' ''నిజంగా నేను తియ్యలేదు తాతయ్యా! దాని సంగతి నాకేం తెలుసు!'' అంది. తల్లి ఎందుకో చిఱ్ఱుబుఱ్ఱాడుతూ పిల్లను వీపుమీద నాలుగు చరచింది.

శేషయ్య హృదయం చివుక్కుమంది. గిరుక్కున మళ్లి హాల్లోకివచ్చి సోఫాలో కూలబడ్డాడు. ఇదంతా ఏమిటి, తన మీద కోపం కాకపోతే? తాను ఎందుకు బ్రతకాలి! తన యింట్లో తాను సంపాదించి తింటూవుంటే కోడలు యిలా ప్రవర్తించగలుగుతుందా? ఇలా అవమానం పొందేకంటే చావటం మేలు. ఆరు నూరయ్యేది తప్పక చచ్చిపోవలసిందే.

ఆరాత్రి మామూలుకంటె శేషయ్య పెందలాడె భోజనం చేశాడు. తన సామానంతా సద్దాడు. అంతా నిద్రపోయిం తరువాత ఉరిపెట్టుకోడానికి చేంతాడు, ముక్కాలిపీట తెచ్చాడు. ఎందుకో ఆ సమయానికి కొడుకు గుర్తుకువచ్చాడు. ఉరిపెట్టుకు చచ్చిపోతే కొడుకు గొంతుక్కు వస్తుందని స్పృహకు వచ్చింది. అయితే యేమి చెయ్యాలా అని ఆలోచనలో పడ్డాడు. చివరికి ఎలాగైతేనేం, ఉత్తరం వ్రాసిపెట్టి చచ్చిపోదామనుకున్నాడు.

కాని, చిన్న మనుమరాలు జ్ఞప్తికి వచ్చింది. దాని మూలాన్నే తాను చనిపోయానని దాని ఒళ్లు ఊనం చేస్తారు కామాలే? అసలు తాతయ్య కనిపించకుండా క్షణంసేపు బ్రతుకుతుందీ? ఇక మీద ఎవరితో ఆడుకుంటుంది? ఎవరితో మారాం చేస్తుంది? బెంగతో మంచంపడుతుంది.

అలా నవ్వుతూ త్రేలుతూ వుండే ముఖం వాడిపోయి వ్రాలిపోతే.... శేషయ్యకు ఇది దుర్భరమైపోయింది. కోడలిమీద కోపం కొందికీ చచ్చిపోవాలనిపించినా, పసిదాని కోసం బ్రతకక తప్పదు. మళ్ళీ ఎక్కడ తాడక్కడ, ఎక్కడ పీటక్కడ చప్పుడులేకుండా పెట్టి నిద్రపోయాడు.

ఒకరోజు సాయంత్రం, ''తాతోయ్! అక్కయ్య పెళ్ళి,'' అన్నది చిన్నపిల్ల.

''ఎవరన్నారు!''

''అమ్మే చెప్పింది.''

''పెద్దనాపసానివి బయల్దేరావని నీ చెవిలో ఊదిందిలే.''

''కాకపోతే, నాలుగు సిల్కుగౌన్లు ఎందుకు కుట్టిస్తుందమ్మా మరి,'' అని తాతయ్య మెడ కావులించుకొంది.

''అక్కయ్యకంటె నువ్వేముందు పెళ్ళికూతురు వయ్యేట్టున్నావే!''

''ఏమమ్మా!''

''సరే, నీకు నాల్గుగౌన్లు, నాకో మరి!''

''వెండిపొడుం కాయ.''

ఆలోచనలో పడ్డ శేషయ్య వినిపించుకోలేదు. రెండు నిమిషాలు గడిచిం తరువాత ''పెళ్లి ఎన్నిరోజులుందట?'' అన్నాడు.

''పదిరోజులు, అరిసెలు వండుతున్నారు. నేనొకటి తెచ్చుకుంటా; నీకు పెట్టనులే,'' అంటూ పరుగెత్తుకెళ్లింది.

''మాటమాత్రం నాతో అనగూడదూ! పరాయివాణ్ణయి పోయాను. ఎలాంటి సంబంధమో, ఏమిటో? నాయిష్టప్రకారం కాకపోతేమానె. ఊరికే మాటవరసకన్నా అనగూడదా? అయినా నేనెవర్ని? పెట్టేవాణ్ణా, పోషించేవాణ్ణా? నాతో ఎందుకు చెప్పాలి? పిల్లకు తెలిసినంతమాత్రం నేను తెలుసుకోవటానికి నోచుకోలేదు.

ఛీ , వెధవబ్రతుకు! ఇలా అందరికీ పరాయివాణ్ణయి బ్రతకకపోతే, ఏదేవుడేడ్చాడు? నేను మోయరాని బరువైపోయాను. ఇలాంటి అవమానం సహించేకన్నా ముక్కు మూసుకుంటే మూడు గడియలు పట్టదు.

ఆరాత్రి అందర్నీ పండుకోనిచ్చి. శేషయ్య బయలుదేరాడు. తప్పకుండా చచ్చిపోవాలనే దృఢనిశ్చయంతో కఱ్ఱమాత్రం వెంట తెచ్చుకున్నాడు, లేకపోతే దారిలోనే పడిపోడూ?

నడుస్తూ ఆలోచనలో పడ్డాడు.

చచ్చిపోవలసిందే. ఇంకా ఎందుకు బ్రతకాలి? సాధించేదేముంది పురుషార్థాలు నాలుగూ చెల్లాయి. ఇప్పుడే చచ్చిపోతే పిల్లదానిపెళ్ళి ఆగిపోతుందేమో? నాయెదానబడి ఏడుస్తుందే! కొడుకు ''చచ్చేవెధవ ఈ పదిహేను రోజులూ గడిచిం తరువాత చస్తే ఏమిపోయింది?'' అంటాడు కామాలె!

నడక కొంచెం మందగించింది దీర్ఘాలోచనలో పడ్డాడు. 129

ప్రతితడవా ఇలాగే పోతున్నది. ఈలగ్నం కాకపోతే ఇంకోలగ్నం పెట్టుకుంటారు. పెళ్లి ఆగుతుందా ఏమిటి?....... ఊరంతకూ ఈమంచినీళ్ళ బావి ఒక్కటేనే. ఇందులో పడిచస్తే మంచినీళ్ళు పనికిరాక తిడతారు. చస్తూచస్తూ, వీళ్ళందరిచేత తిట్టించుకోవటం ఏమీ బాగాలేదు. నేను చస్తే ఉపకారం లేకపోగా ఊరంతకూ అపకారం జరుగుతూవుంది.

శేషయ్యనిలబడిపోయాడు.

మరచాను. నేను వ్రాస్తూవున్న ''ముదిజోదు'' అనే కావ్యం ఏంకావాలి? పూర్తికాకుండా లోకానికివ్వకుండా చావటం బాగుంటుందీ? తప్పక ముగించి, అచ్చు వేయించాలిసిందే! ఈ కావ్యంతోనన్నా నాకు లోకం షష్టిపూర్తి చెయ్యవచ్చును. నేనేం చేశామని షష్టిపూర్తి? కనీసం ఏమీ చెయ్యలేదనైనా షష్టిపూర్తి జరపవచ్చును. ఈలోగా పిల్లదాని పెళ్లి వగైరాలు జరిగి పోతాయి. తరువాత తీరిగ్గా చావొచ్చును.

శేషయ్య ఇంటివేపు మళ్లాడు.

అవును, ఒకటికాదు, రెండు కాదు, పిడుగుల్లాంటి నాలుగు కారణాలుంటే, శేషయ్య ఎలా ఆత్మహత్య చేసికొంటాడు?

*మార్చి, 1942*

షష్టిపూర్తి

# చేసుకొన్న కర్మ

'' ఏమే, నిన్నే, దొడ్లోకి ఎవరో వచ్చినట్టుంది. కాస్త అటుపోయి చూడు.''

'' ఇపుడు ఎవరొస్తారు? రాగవులు గడ్డిమోపు తెచ్చాడేమో,'' అంది రాజేసిన చెత్తముట్ట కాస్త తగలబడి పోతుందేమో నని గబగబ వంట పిడకలు విరిచి దాలివేస్తూ.

''నీ తెలివి తెల్లారింది. రాగవులైతే పాడావు ఒక్కటే అలా ఎందు కరుస్తుంది? పోయిచూడు.'' భర్త మరికొంచం గట్టిగా కూకలేశాడు.

పాలచెంబు అక్కడేవుంది. తాను దొడ్లోకి వెళ్ళితే పిల్లిముండ ఆ కాసిని పాలు గుమ్మరిస్తేనో, లక్షువమ్మ తన కొంగుపట్టుకొని అన్నం కోసం మారంచేసే కొడుకుతో, ''అరే చిట్టాడా! కాస్త దొడ్లోకి పోయి చూడమ్మా ఎవరొచ్చారో,'' అంది.

చిట్టాడు మొండాడైపోయాడు. పంచె కట్టుకొన్న వెంకయ్య భార్యవేపు చూశాడు. ఆమె దాలివేసి పాలు పిడతలో పోస్తున్నది. చేతిలో పనున్న మనిషిని యేమంటాడు? తానే విసుక్కొంటూ నీరు కావి ఉత్తరీయం మీద వేసుకొని దొడ్లోకి వచ్చాడు.

అప్పుడు కరకర పొద్దుపొడుస్తున్నది. ఎదురు ప్రొద్దుకు చెయ్యడ్డం పెట్టుకొని, ''ఎవరారు?'' అని వెంకయ్య గట్టిగా కేకేశాడు.

''నేనండి.''

పెద్ద తలగుడ్డ ఎదురుగా వస్తున్నది. తేరిపారజూచిన వెంకయ్య, ''నువ్వట్రా పుల్లాయ్, ఎప్పుడొచ్చా వేవిఁటి?'' అని పరామర్శించాడు.

'' ఇప్పుడే వస్తున్నా నండి.'' అన్నాడు వెంకయ్యను చూడగానే తలగుడ్డతీసి బుజాన వేసుకొంటూ పుల్లయ్య.

''పిల్లామేకా బాగున్నారా?''

'' ఏదో మీదయెుల్ల అట్టట్టుండాము.''

''మాదయ కావలిసొచ్చినాడివైతే, ఇన్నాళ్ళు ఇటుకేసి చూడకుండా వుంటావా? మాకోసం కాకపోతే మానె, కొడుకుని ఇక్కడుంచావుగా, ఈ రెండేళ్ళలో ఒకసారన్నా చూచెళ్ళావట్రా? తొత్తు కొడకా! కని బూమిమీద పారెయ్యంగానే సరా? పశువులూ కంటున్నాయీ, నువ్వూకంటున్నావు.'' వెంకయ్య తిడుతున్నా, అందులో ఒలికే వాత్సాల్యానికి పుల్లయ్య మురిసిపోయాడే కాని ఏమాత్రం నొచ్చుకోలా.

''ఏం చెయ్యమంటారు దొరగారూ? ఇక్కడ కొద్దామని ఎన్నిసార్లు బయలు దేరినా పడకొచ్చింది. ఒకసారి మా యింటోది పడకేసింది. ఇంకోసారి చంటోడికి బాగుండలా. మరోసారిగల్తే నాకు జెరమొచ్చింది. ఏమిచేసేది చెప్పండి? అదీ యిదీ లేకుంటే పనిరోజు లొచ్చిపడేయి.''

''ఇయ్యన్నీ ఎవళ్ళకి చెప్పాలో వాళ్ళకిచెప్పు. నాకు చెబుతావా? కొడుకును చూద్దామన్న బెమతవుంటే ఈ రెండేళ్ళల్లో వీలు చిక్కకపోయిందీ?'' అన్నాడు వెంకయ్య.

అవును. నిజంగా కొడుకుమీద భ్రమవుంటే, ఒకసారి కాకపోతే ఒకసారన్నా పుల్లయ్యకు చూడటానికి పడకపోయిందా? వాస్తవం చెప్పాలంటే అతని మనస్సు పెద్దకొడుకు రాఘవులమీదలేదు. దానికి కారణముంది. రాఘవులకు అయిదేళ్ళు నిండి నిండకముందే వెంకయ్య దొడ్లో పడేశాడు. పిల్లలుగల పల్లెటూరి పేదవాళ్ళకు అంతకన్నా దారేవుంది? రాఘవుల మంచి చెడ్డలన్నీ ఈ పదిహేను ఏళ్ళనుంచి ఆ ఆసామేచూస్తున్నాడు. ఆయనే, వాడికి పనినేర్పి చేయించుకొంటున్నాడు. దొరసాని వాణ్ణి ఎలా చూస్తున్నదోయేమో కాని, యీ పదమూడేళ్ళనుంచి మాత్రం ఆదొడ్డి వదలనంటున్నాడు. పుల్లయ్య ఆ వూరినుంచి దూరంగా వెళ్ళిపోతున్నప్పుడుకూడా రాఘవులు అక్కడ నుంచి కదలనన్నాడు. అందువల్ల వెంకయ్యకు కూడా వాడంటే మమత ఏర్పడింది. పుల్లయ్యమాత్రం ప్రతి బావాయి పున్నానికి ఒకసారివచ్చి రావలసిన జీతం పుచ్చుకెళ్ళుతుండేవాడు. 

ఇలాంటి పరిస్థితులలో తలిదండ్రులమీద రాఘవులకు బ్రమత లేదంటే ఆశ్చర్యపడవలసింది ఏమున్నది? లక్షువమ్మే పిల్లలుగన్న తల్లి కాబట్టి సంవత్సరాని కొకసారి బలవంతాన రాఘవుల్ని ఇంటికిపోయి చూచిరమ్మని నెట్టేది.

''ఏవేవ్, రాగవుల తండ్రి వచ్చాడే. ఆ పెద్దచెంబు తెచ్చియ్యి. మొగం కడుక్కుంటాడు,'' అని వెంకయ్య కేకవేసి చెప్పాడు.

''ఏమండి దొరగారు, చిక్కిపోయారేం? కాయిలాపడ్డారా ఏమిటి?'' అన్నాడు పుల్లయ్య.

''లేదురా, పోయినకొద్దీ ఏళ్ళు వస్తున్నాయి కాని పోతున్నాయా?'' అంటూ వెంకయ్య దొడ్డి అరుగుమీద చతికిలబడ్డాడు.

లక్షువమ్మ కుంభకోణపు చెంబు తెచ్చి వాడిదగ్గర పెట్టి, '' ఏమిరా, ఇన్నాళ్ళకా వచ్చేది? సరే, చాంతాడు బాయిదగ్గరేవుంది, తోడుకో,'' అన్నది.

రైతు కుటుంబాలతో సంబంధం లేనివాళ్ళకు ఆమె వట్టిచెంబు తెచ్చినందుకు కష్టం కలగవచ్చును. కాని ఆ వట్టిచెంబుకే పుల్లయ్య మురిసిపోయాడు. తనంటే దొరసానికి ఎంత చనువు!

''కొడుకు కనపడ్డాడా?'' లక్షుమమ్మ అడిగింది.

''ఆ కనిపిచ్చాడమ్మా, కనిపిచ్చాడు. వస్తా వస్తా వావులందగ్గరకు వెళ్లొచ్చా అప్పుడే వాడు గడ్డి దూస్తుండాడు.''

''అయితే యింకేం, దారిలోనే వాడిచెవి కొరికొచ్చావన్న మాట!'' అన్నాడు ఆసామి.

''చాల్లెద్దురూ, మీకుగాగ తగిపోయింది. ఎన్నాళ్ళ కెన్నాళ్లకో చూస్తున్నప్పుడు మాటాడుకోవద్దా ఏమిటి?'' అని లక్షుమమ్మ పుల్లయ్యను వెనకేసుకొచ్చింది.

''మేకారిపిచ్చి పోనికపోతివి. పుల్లాయ్ ఎందుకొచ్చా డనుకొంటున్నా? నిన్ను చూద్దామనీ కాదు. కొడుకును చూద్దామనీకాదు.''

''అయితే ఎందుకొచ్చాడంటారు?''

''అలా అడగండమ్మా దొరసానిగారు.'' పుల్లయ్య నవ్వాడు.

132 ''ఉండరా వెదవల కొడకాంటె వెదవల కొడకా అని. ఊరికే చూచివెళ్ళటానికి వచ్చేవాడివైతే బావాయి పున్నమవెళ్ళిన నాలుగు రోజులకే రావాలి?''

''ఇప్పుడే కాస్త తీరిక చిక్కిందేమో లెండి,'' అన్నది భార్య.

''నీకూ యిప్పుడే తీరిక, అంతేకాదూ? అందుకనే అన్నారు మేకారిపిచ్చి అని. మరి వూరికే అంటారూ?'' వెంకయ్య ఎత్తిపొడిచాడు.

'' ఎవరి తెలివితేటలు వారికుంటాయిలెండి. పోరా, పోయి కాళ్ళు కడుక్కురా,'' లక్షుమమ్మ పుల్లయ్యను హెచ్చరించి యింట్లోకెళ్ళింది.

ఇంతలోనే దొడ్లోని ఆవులు అరిచాయి. కర్రిగిత్త కట్టకొయ్య దగ్గర ముంగాలి గిట్టతో గీరుతూ ఖణేలున రంకెవేసింది. ఆరుకారుల యెద్దు పండుకొన్నదల్లా లేచి దొడ్డివాకిలివైపు చూస్తూ నిలబడ్డది. కోడెదూడ చెంగనాలు తీసుకొంటూ వస్తున్న ముందు మోపుదగ్గరకు వెళ్ళి మూచాచి అక్కడనుంచి మరొక గంతు ముందుకువేసింది. ఆ రెండోమోపు రాఘవులది.

ముఖం కడుక్కొంటున్న పుల్లయ్య యిదంతాచూస్తూనే వున్నాడు. లేగదూడ లగాయతు ఆయింటి ఆసామిదాకా అంతా తన కొడుకును ప్రేమించేవారే. అలాంటి జీతగాణ్ణి ఆసామి పోగొట్టుకొంటాడా అని పుల్లయ్య లోలోన ఆసపడ్డాడు.

''ఓసి నీ దుంపతెగ ఉండవే, పంచెలాగుతావు,'' అని రాఘవులు లేగదూడను అదలించాడు. అయినా అది అతనిచుట్టూ తిరుగుతూ ముందడుగు వేయనీయటం లేదు. అదిచూచి, '' ఒరే చిట్టాడా! నీ బుజ్జాయి పారిపోతున్నదిరా?'' అని వెంకయ్య కేకవేశాడు. తల్లిచెంగు వదలి చిట్టాడు ఒక్క గంతులో దొడ్లోకి వచ్చిపడ్డాడు.

''బుజ్జాయి ఎటెల్లింది నానా?''

''అదిగో రాగవుల యెనకాల. లాక్కెళ్ళి కట్టెయ్యి.''

చిట్టాడు దూడ మెడలోని వెంట్రుకలతాడు పట్టుకొని లాగినా, అది రాఘవుల గోచిచెంగు నమలుతూ కదల్లేదు. రాఘవులు కసిరాడు. చిట్టాడు మళ్ళీ గట్టిగా లాగాడు. లేగదూడకు పంచెకొంగు వదలక తప్పలేదు.

మోపులు చావడిమూరువద్ద పడేసి చిన్నదొర, రాఘవులు లోపలికి లాగారు. జనపకట్టెలు మచ్చుమీద వెయ్యమని చిన్నదొరకు చెప్పి రాఘువులు వెంకయ్య దగ్గరకు వచ్చాడు.

'' ఆవేళ కాడ పోయి యిప్పుడా వచ్చేది?'' ఆసామి కూర్చునే కూకలేశాడు.

'' ఏమి చెయ్యమంటారు, గడ్డివస్తేనా? ఎన్నుగాడి తెగ్గొడతానంటే మీరేగా వద్దన్నది.''

''నిజమే నాన్న, ఒక్క పరక్కూడా రావటంలేదు. ఏం రాగవాయి, రేపు తెగ్గొడదాం?'' అన్నాడు చిన్నదొర. 

''రేపుకాదులే, మసుపులు చేస్తుండాయి. ఈ రెండురోజాలూ పోనీ,'' అన్నాడు రాఘవులు.

ఆమాత్రం తెలివితేటలు తనకొడుకుకు లేనందుకు వెంకయ్య చింతపడ్డాడు.

''అరే రాగవాయి మీబాబు వచ్చాడురా,'' అంది అప్పుడే బయటికి వచ్చిన లక్షువమ్మ.

''వస్తే వచ్చాడులెండి. అన్నం పెట్టండి. తొందరగా అరక్కుపోవాలి. ఊళ్ళో నాగళ్ళు అప్పుడే చేలల్లోకి దిగాయికూడా,'' అన్నాడు రాఘవులు.

''రెండేళ్ళగ్గాను ఇవాళవస్తే అలా అంటావేమిరా!'' అన్నాడు చిన్నదొర.

''వస్తేవచ్చాడు, వచ్చినవాడు చూస్తాడు, చూచినవాడు చక్కాపోతాడు. నువ్వు తొందరగా గొడ్లువిప్పు,'' అని చిన్నదొరను హెచ్చరించి పంపాడు.

''అరే అబ్బాయి! ఒకమాటరా,'' తండ్రి పుల్లయ్య పిలిచాడు. రాఘవులు మాట్లాడకుండా యింట్లోకి వెళ్ళుతున్నాడు.

'' ఒరే నిన్నేరా, మీ బాబు పిలుస్తున్నాడు.'' అని వెంకయ్య కూడా హెచ్చరించాడు.

రాఘవులు ఆసామి కెదురుగావచ్చి నిలుచున్నాడు. పుల్లయ్య కూడా అరుగుదగ్గరకు వచ్చాడు.

''మీ బాబు నీతో ఏమన్నా మాట్లాడుతాడు కామాలురా, వెళ్ళు,'' అన్నాడు దొర.

''నాతో మాట్లాడేదేముంది? మీతోనే మాట్లాడటానికి వచ్చాడు. ఆరు నువ్వు మాట్లాడుకోండి.''

''వాడితిక్క ఎలావుందో చూడండి దొరగారు. వెనకటికి నా పెళ్ళికి నేనూ పోవాలీ, అన్నాట్ట యిలాంటివాడె.''

''నేను మాట్లాడేదేముంది? పెద్దోడివి నువ్వు, న్యాయం తెలిసిన దొర ఆయన; మధ్య నేనుదేనికి? నేను అరక్కుపోవాలి,'' అని తండ్రి పిలుస్తున్నకొొందకి రాఘవులు ఇంట్లోకి వెళ్ళుతున్నాడు.

'' ఒరే రాఘవులు! ఉండకపోతే వుండకపోయావు. కాని, అర్కకాస్త కనిపెట్టిపోనీ. లేకపోతే గిత్తచెడుతుంది.'' అన్నాడు ఆసామి.

''అవ్వా కావాలి, బువ్వాకావాలి అంటే ఎలా? నీళ్ల వచ్చిపడుతున్నాయి. యింకా
134 ఏడెకరాల మెట్టసాలు అలానేవుంది. ఒక జతతో సాగాలి సంత అంటె?'' రాఘవులు వెళ్ళుతూ అన్నాడు.

''దాని సిగ తరిగిరి. అయినప్పుడే అవుతుంది లేరా!'' అని గట్టిగా చెప్పాడు ఆసామి.

'' ఈ వరసవాణ్ణి పెట్టుకొని ఎలా వేగేదండిదొరగారు,'' అన్నాడు పుల్లయ్య కొడుకు లోపలికి వెళ్ళింతరువాత.

''సరే, నువ్వుకూడా తిండితిను. తరువాత మాటాడొొచ్చు.''

అన్నాలయ్యాక ఎవరిపనిమీద వాళ్ళు వెళ్ళారు. వెంకయ్య తూర్పింట్లో తగతాబల్లమీద పడుకొని తాపీగా చుట్ట కాలుస్తున్నాడు. ఆసామి కింద పారేసిన పొగాకు కాడను పుల్లయ్య తుంపి నోట్లోవేసుకొంటున్నాడు.

''అదేమిటేరా, అడిగితే ఒకకాడ యివ్వకపోయాను?''

''వద్దులెండి దొరగారు. నోట్లోకి యీకాడలే బాగుంటాయి.''

అంతలో లకువమ్మకూడా యింట్లోపని ముగించుకొనివచ్చి కూర్చున్నది.

''ఇదిగో దొరగారు!'' అన్నాడు పుల్లయ్య.

''ఏమిటిరా?'' అన్నాడు ఆలోచనలనుంచి బయటపడి ఆసామి. పుల్లయ్య కాసేపు నీళ్ళునమిలాడు.

''ఆ నత్తులు దేనికి పుల్లయ్యా! అడగదలచిం దేదో అడగరాదా?'' అన్నది యిల్లాలు.

''అదికాదండి దొరగారు, ఈ యేడు వాడికి పెళ్ళిచెద్దామని వుంది.''

''పిల్లకుదిరిందటరా!'' లక్షువమ్మ అడిగింది.

''ఇంకా లేదండి దొరసానిగారు.''

''అయితే మరీ నీ గోడేమిటి? అన్నాడు ఆసామి.

''అదికాదు దొరగారు, నాలుగురాళ్ళు సంపాయించుకొంటుంటేగా ఓరన్నా పిల్లనిత్తామనేది.''

''సంపాయించు కొంటుండెగదరా, గోవాయికోడెలా తిరుగుతున్న దెక్కడ?''

''యాబైరాళ్ళు వాడికీ, వాడి పెళ్లానికీ ఎక్కడ చాల్తాయండి? అందుకనే యెక్కడన్నా పిల్లనడగమోతే జీతం ఏమి తెస్తుండాడేమిటి అంటుండారు.''

'' ఇంతకూ జీతం పెంచందే ఈయేడు నాదగ్గర వుంచేది లేదంటావు. అంతేనా?'' అన్నాడు ఆసామి. 135

''అన్నీ తెలిసి మీరు అలా అంటే ఏమిచెప్పేది? కట్టసుకాలు మీకు తెలీనీయి కనకనా?''

''నీ కొడుక్కు పెళ్ళిచేయటమేగా నీకు కావలసింది?''

''అంతకన్నా యీ ముసలి ముండాకొడుక్కేమి కావాలి?''

''అయితే యీ పదేనేళ్ళనుంచి యిస్తున్న జీతం ఇచ్చిపో. రేపీవరటాలికి వాడికెలా పెళ్ళికాదో చూదాము.''

''అంతగీతండీ మాకు? పిల్ల బీరకాయ, రోగాలు, నొప్పులు, గుడ్డా గోసీ, ఎప్పటికప్పుడు ఎతుక్కునేగతి తప్పటంలేదు, మీరు కాస్త చల్లనిచూపు చూడాలి. మాలాంటోళ్ళు బతకాలి.

వెంకయ్య కాస్త ఆలోచించి, ''ఇంతకూ యామంటావేమిటి?'' అన్నాడు.

''వూమ్మూరు షావుకారు రెండు జతల గుడ్డలిచ్చి డెబ్బై అయిదు రూపాయలిస్తానంటుండాడండి.''

''అయితే నీ కొడుకును అక్కడే జీతానికి పెట్రా,'' అని వెంకయ్య గోడవైపుకు తిరిగి పండుకొన్నాడు.

''దాని దుంపతెగ, ఒక్కసారే పాతిక పెంచుతారట్రా ఎవరైనా!'' అంది లక్షువమ్మ.

''నీతోడండి దొరసానిగారు 75రూపాయలు రొక్కంతెచ్చి నాచేతిలో పొయ్యొచ్చాడండీ. నలుగురు కట్టిన యింటి కిందుండి చెబుతుండా.''

లక్షువమ్మ మాట్లాడలేక పోయింది.

''ఒరే పుల్లాయ్, వచ్చేడబ్బు చెడగొట్టుకోవడం దేనికిరా? నిక్షేపంలా నీ కొడుకును తీసుకెళ్లి ఆయనదగ్గర పెట్టు. మాకూ కొంచెం బరువు తగ్గుతుంది. ఈయేడు నాగాలుకూడా లేవు. రావలసినదేమిటో రేపు పొద్దున యిచ్చివేస్తాను.''

''మీరల్లా దయతప్పితే మా పేదోళ్ళేమికావాలి?''

''నేనేమీ నిష్ఠూరా లెయ్యటం లేదు. సాయంత్రం రాగవులు రాగానే చెప్పి తీసుకెళ్ళు.''

కాసేపు ఎవరూ మాట్లాడలేదు. రాఘవులను తీసుకొని వెళ్ళుతానంటే, లక్షువమ్మకు కన్నీళ్ల పర్యంతమైంది, ఇన్నేళ్ళు తమదొడ్లో ఉన్నాడు. చెప్పించుకొనకుండానే అన్నీ
136 చేసుకొని పోతుంటాడు, ''పనిమంతులు'' దొరికినా నమ్మకమైన మనుషులు దొరకొద్దా? పదో పరకో పెంచి రాఘవుల్ని అట్టేపెట్టమని భర్తకు చెబుతామనుకొన్నది. ఆయనకు తాను ప్రత్యేకంగా చెప్పవలసింది ఏమున్నది? తాను ఇంటి వద్దవున్నా లేకపోయినా ఎలా జరిగిపోయేదీ ఆయనకు తెలియదా? సంసారమంతా యీదుకుపోయే ఆయనే యిలా అన్నాడంటే యేదో వుండివుంటుంది. ఈభావం కలగటంవల్ల లక్షువమ్మ జీతగాణ్ణి అట్టిపెట్టవలసిందే నని పట్టుబట్టలేక పోయింది.

''అయితే దొరగారు!''

''ఏమిట్రా, గంగలో దూకమంటావా ఏమిటి?''

''అయ్యయ్యొ అంతమాట దేనికండి? మీరుకాస్త విడమరిచి చెబితే.''

''నువ్వు చెప్పలా?''

''చెప్పాను. ఇందాక వాడన్నమాటలు విన్నారుగా. మీరు వెళ్ళమంటేకాని మీ దొడ్డి వదలడండి దొరగారు.''

''అలాంటప్పుడు నేను చెబితే వింటాడా?''

''తప్పకుండా వింటాడండి. మీమీన మావాడికి మా పెద్దగురి.''

''సరే యీ రాత్రి నీముందే చెబుతాను,'' అంటూ చటుక్కున లేచి చెప్పులు తొడుక్కొని వెంకయ్య పొలం వెళ్ళాడు.

ఆ రాత్రి యింటిల్లిపాది భోజనాలు అయిన తరువాత వెంకయ్య గొడ్లకు మేతవేస్తున్న రాఘవుల్ని, వాకిట్లోకూర్చున్న పుల్లయ్యను కేకేసి దొడ్లో అరుగుమీద రడ్డిగం వేసుకుని కూర్చుని తీరిగ్గా చుట్టముట్టించాడు. తండ్రి కొడుకు లిద్దరువచ్చి ఆసామి కెదురుగా కింద కూర్చున్నారు.

''అయితే రాగవులూ, మీబాబు ఎందుకొచ్చాడో కనుక్కున్నావా?'' అడిగాడు ఆసామి.

రాఘవులు తలవూపాడు. ఇంతలో చిన్నదొర, చిట్టాడు వచ్చి తండ్రిపక్కనే అరుగుమీద కూర్చున్నారు.

''మరి మీ బాబుకు ఏమిచెప్పా?'' మళ్ళీ అడిగాడు ఆసామి.

''నేనేమి చెప్పేదండి. అన్నీ తెలిసినోరు మీరుండారుగా,'' అంటూ జీతగాడు నవ్వాడు.

''అయితే నేను చెప్పినట్టు మీ అబ్బా కొడుకులు వినుకుంటారా?'' 

''మీ మాటకు ఎదురుచెప్పే దేముంది?'' అన్నాడు రాఘవులు.

''న్యాయం సెలవిత్తే కాదనేదోడు దొరా?'' అన్నాడు పుల్లయ్య.

''అరే రాగవులూ మీవూళ్ళో షావుకారు నువ్వు తనవద్ద జీతానికి కుదిరితే రొక్కం 75 రూపాయ లిస్తానంటున్నాడట.'' వెంకయ్య ఆరిపోయిన చుట్టను అవతల పారేశాడు.

''మీరేమంటారు?'' రాఘవులు ఆసామివేపు చూచాడు.

''నేను చెప్పేదేముందిరా? నువ్వు నాలుగురాళ్ళు సంపాయించుకొంటే నేనెలా కాదంటాను? నేను కాదంటే మాత్రం నీకెలావుంటుంది? నలుగురూ అవుననొద్దా? రేప్పొద్దున్నే మీబాబు వెంటవెళ్ళు. ఏదో యింతకాలం నన్ను నమ్ముకొన్నా వనుకో. ఈ చిట్టాడొకటి కాదు, నువ్వొకటికాదు. మీ బాబు ఎంతచెప్పినా ససేమిరా అంటున్నావని తెలిసింది. అందుకని అంటున్నా, నిన్ను అట్టి పెట్టుకొందామని లేకపోలేదు. మరేం చెయ్యను? కాలం బాగుండలేదు. ధరలు వముండవెూసి కూర్చున్నాయి. భరాయించొద్దా? చీకటితో లేచి మీబాబు వెంట వెళ్ళిపో.''

వెంకయ్య పక్కవాటుగా తిరిగి చిట్టాడిని దగ్గరకు లాక్కొనాడు.

''రాగవాయి యాడకే ఎల్లేది?'' చిట్టాడు తండ్రిని అడిగాడు.

''వాళ్ళింటికి?''

''వాళ్ళిల్లెక్కడ? ఇదికాదూ?''

''కాదు నాన్నా, చాలదూరాన వుంది.''

''ఎందుకెళ్ళుతున్నావు రాగవాయి? నాన్న కొట్టాడా?''

ఆసామి తప్ప మిగతావాళ్ళంతా నవ్వారు.

''వాళ్ళ అమ్మదగ్గరికి వాడు వెళ్ళుతున్నాడు.'' అన్నాడు తండ్రి.

''మల్లా ఎపుడొత్తాడు'' ''ఇకరాడురా,'' అన్నాడు చిన్నదొర.

''అయితే ఎల్లొద్దు రాగవాయి. మనిద్దరం సావాసం కాదు?'' అంటూ చిట్టాడుపోయి రాఘవుల మెడ వాటేసుకొన్నాడు.

''ఎల్లనుగా నువ్వుపోయి పడుకో.'' అన్నాడు రాఘవులు.

''అమ్మదొంగా! నన్ను మరిపిచ్చి పోదామనుకుంటున్నావులే? ఇవ్వాళ నీదగ్గిరే



పండుకొంటాను.'' చిట్టాడు మారానికి దిగాడు.

''పోడు నాన్నా. నువ్వుపోయి యింట్లో పడుకో,'' అన్నాడు తండ్రి.

''నాకు తెలుసులే. ఇవ్వాళ నేను రాగవాయిదగ్గిరే పండుకొంటాను.''

రాఘవులు చిట్టాడిని బుజానవేసుకొని చావట్లొకి వెళ్ళాడు.

''అరే పెద్దాడా. మీ అమ్మనుపోయి చిట్టాణ్ణి తీసుకుపొమ్మను.'' అని వెంకయ్య పెద్ద కొడుకును పంపాడు.

''ఏమండి దొరగారు?'' పుల్లయ్య తన సంగతి జ్ఞాపకం చేశాడు.

''చెప్పానుగా. చీకటితోలేచి తీసికెళ్ళు. రావలసిన డబ్బు మీ దొరసానికిచ్చాను. అడిగిపుచ్చుకో. ఇంకాదేనికి. పొద్దుపోలా? చాపతీసికెళ్ళి తలాకిలి అరుగుమీద వేసుకొని పండుకో.''

వెంకయ్య యింట్లోకివెళ్ళి పండుకొన్నాడు. లక్షుమమ్మ పాలు తోడుపెట్టి వంటయిల్లు చక్కదిద్దుకొన్నది. తరువాత చిన్న లాంతరు తీసుకెళ్ళి దొడ్డి గేటు వేసి రాఘవుల పక్కలో నిద్రపోయిన చిట్టాణ్ణి ఎత్తుకొచ్చి తన పక్కలో పండుకోబెట్టింది. గంటలాగా దీపం వెలుగుతుంటే దాన్ని కాస్త తగ్గించింది. పెద్దకొడుకు కిందకు నెట్టివేసుకొన్న దిండు

మళ్లా వాడి తలకిందపెట్టి మోకాళ్ళకు పైకిపోయిన ధోవతి సరిగా లాగి వచ్చి తన మంచంమీద కూర్చున్నది. ఆసామి యింకా పసిపిల్లవాడిలాగా మెసికట్లాడుతున్నాడు.

''యావండీ! అప్పుడే నిద్రపోయారా?'' లక్షువమ్మ నవ్వింది.

''నిద్రపోయానే'' అన్నాడు వెంకయ్య.

''నిద్రపోయినవాళ్ళు, మాట్లాడుతారు కామాలు, నాకు తెలీదులెండి. సరేకాని రాగవాయి ఏడుస్తున్నాడు. ఏమన్నారేమిటి?''

''నే నేమనలేదే. వాడి బాబువెంట పొమ్మన్నాను. మరేం చేసేది, భరించే శక్తి లేనప్పుడు?''

''వాడి చాకిరికి 75 రూపాయలివ్వటం కష్టమా.''

''అయితే మీ బాబేమన్నా యిచ్చాడేమో తెచ్చియివ్వు.''

''మీకు చాకిరీచేయటమే? మా బాబు డబ్బివ్వటమేఁ?''

''నాకిచ్చే శక్తి లేదనేగా చెబుతున్నది?''

''నా దెగ్గిరికీ, వాడి దెగ్గిరికీ వచ్చేటప్పటికే మీకు చెయ్యిరాదు.'' లక్షువమ్మ నిష్ఠూరమాడింది.

''నీకు కిందుమీదలు తెలియటంలా, ఇంకా ఎన్నాళ్ళకొస్తుంది గ్నానం? నీ అల్లుడికేమో అయిదేలకు నోటురాయించి యిచ్చేదాక నిద్రపట్టకపోయె. చావడికేమో వెయ్యిరూపాయలయ్యె. ఈ అప్పులన్నీ తీరి ఎలా బయటపడతామురా భగవంతుడా అనుకొంటుంటే ఈ బండకూడా నా నెత్తికే ఎత్తాలంటే? నేను మనిషినే.'' వెంకయ్య కస్సుమన్నాడు.

ఆ మాటలతో మానవురాలు మళ్ళీ నోరెత్తలా. రామనామస్మరణ చేస్తూ లక్షువమ్మ నడుం వాల్చింది. ఆసామికి మాత్రం నిద్ర పట్టలా. ''మాఖం, ఫాల్గుణం-ఫాల్గుణంతో నోటువాయిదా వెళ్లిపోబోతూవుంది.'' అంటూ వెండి సులోచనాలతో వియ్యంకుడు, 'డబ్బు అవసరంగావుందిరా అబ్బాయి,' అంటూ తనవూరి షావుకారు వెంకయ్య ప్రత్యక్షమయ్యారు. అతనికి చీమలు పారుకాడినట్లయింది. అతడు ఇంకా ముడుచుకు పండుకొన్నాడు. ముడుచుకొన్నకొందికి చాలా చీమలు చుట్టూ బ్రహ్మాండంగా కోటలు పెట్టుకొస్తున్నాయి. గాభరాపుట్టింది. అతడు ఉలిక్కిపడి కూర్చుని కళ్ళు తెరిచాడు. దీపకాంతి కొంత ఊరట కలిగించింది.

అయినా అతని హృదయం దడదడ కొట్టుకుంటూనే వుంది. తాను అందనివాటికి అఱ్ఱులు చాచిందెక్కడ? తీయరాని పరుగులు తీసిందెక్కడ? వియ్యంకుడికి అయిదువేలకు నోటువ్రాసి యిమ్మన్నదెవరు? రైతన్నవాడు ఎవడు చేలోచేను తెగనరికి ఇస్తాడు? ఆ పని చేయక పోబట్టే యివ్వాళ ముడ్డికిందికి నీళ్ళొచ్చి కూర్చున్నాయి.

నిజంగా ధరలు అలా నిలబడివుంటే ఇలాంటి అప్పులు తన్ను ఏమిచేసేవి? నాలుగైదేళ్ళలో తీరిపోయేవికావా? అసలు ఈ ధరలు ఎందుకు పడిపోయాయి? తాను ప్రతి సంవత్సరం పంచాంగశ్రవణం చేస్తూనే ఉండె. ధరలు తగ్గుతాయని ఒక సిద్ధాంతి అయినా ఎందుకు వ్రాయలేదు? వాళ్ళకు మాత్రం కర్మ ఎలా తెలుస్తుంది?

అయితే తాను చేసిన కర్మ ఏమిటి? తను ఎవడి కడుపూ కొట్టలేదు. తన వర్ణధర్మం తప్పింది లేదు. తనకీ దుర్గతేమిటి? తనవూరి షావుకారికి ఆ ఐశ్వర్యమేమిటి? అతడు చేసిన పుణ్యమేమిటి? ఎందరి కొంపలు నిలువున తీశాడు? ఎన్ని దీపాలు ఆర్పివేశాడు?

వెనక జన్మంలో పున్నెం చేసుకొన్నాడేమో, అయితే దేవుడి మీదకూడ పెత్తనం చేసేది కర్మే కాబోలు. ఆ లెక్కలో దేవుడు దేనికి?


తన తెలివితేటలకు తాను దేవుణ్ణి వెక్కిరించేవాడా? వెంకయ్య భయంతో వణకిపోయాడు. క్షమించమని తనకుతానే చెంపలు వాయించుకొన్నాడు.

ఇంతకూ తాను చెయ్యవసిందేమిటి? నిలువుగా ఉన్న పొలం, గొడ్డుగోదా తెగబరికి అప్పులు తీర్చటమే. మాట దక్కించుకొని అప్పులనుంచి బయట పడాలంటే అంతే. సరే. అమ్మతాడు. అమ్మింతరువాత చెయ్యవలసిన పని? ఇద్దరు పిల్లలూ, తాను, తనభార్య. ఎలా పోషించటం! ఏ ఆసామివద్దో జీతానికి కుదరాలి. పొలంచాకిరి తప్ప తాను చేయగలిగింది ఏముంది? పొలం లేనప్పుడు మరొక రైతువద్ద తల తాకట్టు పెట్టుకోవలసిందేగా!

ఇంతబతుకు బతికి తాను తోటి రైతువద్ద జీతం ఉంటాడా? తాత ముత్తాతలనుంచి వస్తున్న పొలం అమ్మి బిడ్డలను బికారులను చేస్తాడా? తనతండ్రి అంత పొలం అప్పజెప్పింది అందుకేనా? అంతకాన్నా ముక్కుమూసుకొంటే మూడుగడియలు పట్టదే.

వెంకయ్యకు అటు పొలమమ్మటానికికాని, ఇటు ముక్కుమూసుకోటానికి కాని సాహసించలేకపోయాడు. భగవంతుడనేవాడు వుంటే, వాడికి కనికరం లేకపోయిందా?

ఆ తెల్ల వారుజామున పుల్లయ్యకు రాఘవులు కనిపించలేదన్న ఆతురతతో దొరను లెగ్గొట్టాడు. ఎక్కడికెళ్ళాడంటే ఎక్కడి కెళ్ళాడని యింటెలపాది విస్తుపోయారు. చిట్టాడు

ఆ హడావుడికి లేచి శోకాలు మొదలెట్టాడు. వాణ్ణి సముదాయించేటప్పటికి లక్షువమ్మకు పెద్దలు దిగొచ్చారు. పుల్లయ్య కళ్ళారచూస్తూ దొరను ఏమనలేక పోయాడు. లక్షువమ్మ భర్త సందకాడ తనకిచ్చిన యాభైరూపాయలు పుల్లయ్య దోసిట్లోపోసి, ''రాగవాయికి వచ్చిన వరవా ఏమిలేదులే,'' అని ఒకటికి రెండుసార్లు నమ్మకంచెప్పి సాగనంపింది.

ఆనాడు రెండుబారలు పొద్దెక్కిన తరువాత లాంతరు పట్టుకొని రాఘవులు ఇంటికివచ్చాడు.

''వచ్చాడమ్మా వచ్చాడే, రాఘవాయివచ్చాడు. నాకు కాయకూడ తెచ్చిపెట్టాడు,'' అని చిట్టాడు గంతులుపెడుతూవచ్చి తల్లి చేతికి తాటికాయ అందించాడు.

ఆమె దొడ్లోకివెళ్ళి చూచేతలికి రాఘవులు కడవలో నీళ్ళు తోడుకొని ముఖం కడుక్కొంటున్నాడు. ''నీ మొగాన గుడ్డుమొలవ! యాడకెళ్ళావురా!''

''వడమటి పొలాన నారుమడి ఎండిపోతుంటే, నీళ్లుపెట్టటానికెళ్ళాను. మరి లాంతరు యెందుకు తీసుకెళ్ళాననుకొన్నారు?''

''బాబు వుండాకొడుకు నీకోసమని దుంపలు దంపలు చేసుకొస్తే మొగం తప్పిస్తావ(ట్రా తప్పుడుగాడిదా?''



'' ఏమన్నా అనండమ్మా, మీరనావచ్చు, నేను వడావచ్చు. చిన్న దొరను అనటంలా? మా బాబంటారా? ఈ పదేళ్ళనుంచి యీ బాబు ఏమయ్యాడు? రోగంవచ్చినా, నొప్పివచ్చినా మీరు చూస్తూండారుకాని, ఆయనొచ్చి చూస్తుండాడా? చెప్పవేవమ్మా అలాచూస్తావు?''

''పుల్లయ్యమాత్రం ఏమన్నాడురా? నీబాగుకోసమేగా చెప్పింది?''

''చాలు చాల్లెండి, మాబాగచెప్పారు. వాళ్ళకు కావలసింది నా బాగా? నాజీతం. నిజంగా నా బాగు కోరేవాళ్ళయితే ప్రతేడు నాజీతం తీసుకెళ్ళుతున్నారుగా. ఇప్పుడు నా సొమ్మెంతుందో చూపించమనండి? అంతా తినేశారు. ఈరోజున ఒక దమ్మిడీకూడా లేదు.''

''పిల్లల్ని కని పెంచటం దేనికిరా? ఏడుగడ అవుతారనేగా?''

''నిజమే, మీరు చెప్పినట్లు పెంచి పెద్దవాణ్ణిచేస్తే అలాగే. నా మంచి సెబ్బర మీరుచూశారు కాని, మావాళ్లేమన్నా చూశారా?''

లక్షువమ్మ వాదించలేకపోయింది. ''అదికాదురా అలా మొగం తప్పిస్తే మీ బాబు ఏమనుకుంటాడు? మేమేదో చెప్పి చేయించామనుకోడా?''

''ఇందులో మీరు చెప్పిందేముంది? నిన్నపొద్దునే, ''నేను రావటంలే''దని మా బాబు ముఖానే చెప్పేశాను. మిమ్మల్ని అనటానికి పనేముంది?''

''సరే ఎలాకావాలో అలాగే అవుతుందిలే. పొద్దెక్కింది. తొందరగా కాని, రెండుముద్దలు తిందుగానీ.''

రాఘవులు అన్నం తిని అప్పుడే మళ్ళా అరక్కు వెళ్ళాడు.

అతని ప్రవర్తనకు ఊళ్ళోవాళ్ళేకాదు, వెంకయ్య లక్షువమ్మలు కూడా విస్తుపోయారు. నాటినుంచి జీతగాళ్ళ సంగతివస్తే రాఘవుల ప్రస్తావన రాకుండా వుండటంలేదు. ఆ ఆసామి మీద వాడికి అంత మమకారం దేనికి? అందరు జీతగాళ్ళు అలావుండరేం? అందరూ అలా ఒళ్ళువంచి పనిచేయరేం? ఇదే వూళ్ళో రైతులకు తీరని అంతర్జాతీయ సమస్యలు.

ఊళ్ళో ఆసాములు తమ జీతగాళ్ళను కూక లేసినప్పుడల్లా రాఘవుల సంగతి యెత్తేవాళ్ళు. వాళ్ళుకూడా పుటికి పుటికి నాలుగు అడిగేవాళ్ళు. షరతులన్నీ గుదిగుచ్చి పెట్టేవాళ్ళు. వడ్లు దంపమనగూడదు. చద్దన్నం పెట్టగూడదు. చీటికి మాటికి తమపెద్దల్ని తడవగూడదు. ఏడాదికి జత కట్టుపంచెలు, జత పై పంచెలు ఇవ్వాలి. నెలకు సవాసేరు పొగాకు ఇవ్వాలి. అయినంతపని చేయించుకోవాలి కాని, అయిన దానికి కానిదానికి చివాట్లేస్తే లాభం లేదు. ఇలాంటివే యింకా ఒకటి రెండు షరతులుండేవి. రైతులు వాటిని పాటించిందీ లేదు. జీతగాళ్ళు రాఘవుల్లా పనిచేసిందీ లేదు.

అయినా కాలవాహిని ఒక్కక్షణంకూడా ఆగలా. వర్షాకాలం వచ్చింది. మాగానివూళ్ళు మొలబంటి బాడవలయ్యాయి, రాఘవులు చావట్లోనుంచి కదిలేవాడు కాడు. ఎప్పుడూ కట్టుపట్లు రొచ్చుకాకుండా పశువుల వుచ్చ కుండలోపట్టి బయటపారబోస్తూనో మేతవేస్తూనో వుండేవాడు. అన్నం తిన్నదగ్గరనుంచి నారపిడి, ఏగర్రా చావట్లోకి పట్టుకెళ్ళి పగ్గాలకు, ఎడ్ల సిగమోర్లకు చొప్పు పేనేవాడు. ఆ చొప్పు సవరగా వెండితీగలాగా వుండాలి. అందులో ఏమాత్రం వంక వచ్చినా సహించేవాడుకాదు. మళ్ళా మొదలెత్తుకోవలసి వచ్చినా బద్ధకించేవాడుకాదు.

అతనికే అప్పుడప్పుడు అనిపించేది. తనకంతమోజు దేనికి? తాడు అందంగా లేకపోతే ఏమిపోయింది? పనిగడవటమేకదా ప్రధానం. కాని అతని మనస్సు ఒప్పుకొనేదికాదు.

ఆ గొడ్లు, వ్యవసాయం తనవి కాకపోయినా తానున్నంత కాలం సలక్షణంగా వుండాలి. అన్నట్లు ఆసామితన్ను భరించలేనంటున్నాడుగా. ఎందుకన్నాడు? తన్ను గట్టిగా పొమ్మనిచెబితే? ఆఁ ఏందుకంటాడు? ఆయనకుమాత్రం న్యాయం తెలీదా?

ఇన్నాళ్ళు దొడ్లో వున్న మనిషిని ఎలా పొమ్మంటాడు? తాను ఒక్కడే ఆయనకు బరువవుతాడా? తనపిచ్చికాని ఎందుకు పొమ్మంటాడు?

వాస్తవం గుర్తించడానికి ఒప్పుకోని ఆ అమాయిక హృదయం ఎన్నెన్నో మధురలోకాలు నిర్మించుకొంటున్నది. తనదొడ్డి కలకలలాడుతుండాలి. తన యెడ్లకు పోటీవచ్చేవి ఆవూళ్లోనే కాదు చుట్టుపక్కల వూళ్ళలోకూడా వుండరాదు. తాను సేద్యంచేసిన పొలం ముప్పందుం చొప్పున రావాలి. ఈయేడు ఒకటికి రెండుసార్లు దమ్ము చేసి మొక్కవేశాడు. దుబ్బుకూడా బాగానే చేస్తున్నది. జాయగా వుంటే ముప్పందుం రాలుతుంది. అందులో ఢోకాలేదు. అయినా విశాఖ చూడొద్దూ? అది కొంపతియ్యకుండా వుంటేగదా?

కాలం సవ్యంగా సాగాలనీ, తానుచేస్తున్న చేలు ( ఆసామివే అయినా) బాగా పండాలనీ లోలోన వేయిదేవుళ్ళకు రాఘువులు మొక్కుకొంటున్నాడు. అంత మమత ఆతనికెలా ఏర్పడింది? దీనివల్ల అతనికివచ్చే లాభమేమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం శాస్త్రవేత్తలు చెప్పుకోవలసిందే.

వర్షాలతోపాటు వెంకయ్య కుటుంబానికి మంచిరోజాలుకూడా వెనకబట్టాయి. వియ్యంకుడు తనకొడుకు కట్నం తాలుకూ రావలసిన 68 వందలకు రిజిస్టరు నోటిసిచ్చాడు. ఉళ్ళోషావుకారు 1608 రూపాయలు ఆ నెలలో కడితేగాని వీలులేదని నిలవేశాడు. గొల్లది తనకు రావలసిన 75 రూపాయలకు లక్షువమ్మ చుట్టూ తిరిగి పోతున్నది. నాటినుంచి లక్షువమ్మకు సూర్యచంద్రులగతి సక్రమంగా లేదనిపించసాగింది.



వెంకయ్యకూడా ఉబ్బసపు రోగినీ, శ్లేష్మంలోపడ్డ ఈగనుచూచి కూడా ఈర్ష్యపడవలసి వచ్చింది. పొరపాటున రాత్రి యేరెండు జాములకో ఒక కునుకుపట్టినా, ఋణదాతలు ప్రత్యక్షమై మాసంగతి ఏమిచేశావంటే మాసంగతి ఏమిచేశావని యమదూతల్లాగా పొడిచేవాళ్లు. వాళ్ళపోటు తప్పించుకొన్నా గొల్లదుర్గి వూరుకొనేదికాదు. ''ఇదికూడా నీ నెత్తినే కొట్టుకో,'' అని పెరుగుదుత్త అతనిమాడున ఎత్తికొట్టినట్లయ్యేది.

ఈబాధ భరించలేక వెంకయ్య నిక్షేపంవంటి ఎనిమిదెకరాల రేగడ డెబ్బై అయిదు వందలకు రెండోవాడు వినకుండా సూరయ్యకు అంటగట్టాడు. నిలవున్న 11 పుట్ల ధాన్యం నాలుగువందలకు తెగబరికాడు. అయినా ఆరువందలదాక చిల్లరబాకి ఇంకా అలాగే మిగిలింది. వెంకయ్యకు ఇంక చెరవదలలా, ఒకనాడు రాత్రి ఆవుల్ని, ఎడ్లను అమ్మితానని భార్యతో చూచాయగా అన్నాడు.

'' ఇంకా నయం, రేపు బిడ్డల్నికూడా అమ్ముతామంటారు. అమ్మరూమరి!'' అంది లక్షువమ్మ.

''బాకీల తొందర యెక్కువైతే యేమిచెయ్యను?''

'' ఏమన్నా చెయ్యండి కాని గొడ్లనుమాత్రం అమ్మొద్దు... అంతగా అయితే ముందు పంటకల్లాల్లో తీర్చుకోగూడదా?''

''రేగడచేను అమ్మేస్తే యింకా యెన్నివందల పుట్లొస్తాయనుకొంటున్నా?''

లక్షువమ్మ వెంటనే మాట్లాడలేకపోయింది.

'' ఈనాడు అమ్మినపొలం మూడేళ్ళనాడే అమ్మితే ఇంత బొందన పడేవాళ్ళం కాదుగా.'' భార్య ముక్కు చీదుకొన్నది.

''కర్మ యిలా నెట్టుకొస్తుందని ఎవరనుకొన్నారు? పంటమీద బాకీలు తీరుతాయనుకొన్నాను.''

'' ఇంతకూ మాకర్మ అలావుంటే మివ్మల్నేనే పనేవుంది?'' లక్షువమ్మ పైటకొంగుతో కళ్లొత్తుకొన్నది.

144 వెంకయ్య ఈ దుస్థితికి కారణం తన కర్మే ననుకొని, నెపం అంతా దానిమీదనే పారేసి నిశ్చింతుడయ్యాడు. కాని లోకం అంతటితో వదులుతుందా?

ఓడంటే అంతా ఓడే నంటారు. పొలమమ్మిన సంగతి పొక్కగానే బాకీదారులు మరీ తొందర పెట్టసాగారు. ఎన్ని అప్పులు లేనిదే ఎనిమిదెకరాల పొలమమ్ముతాడు? అప్పులు తీరిపోయేటట్లుంటే అంత చాటుగా అమ్మవలసిన పనేమి వచ్చింది? తప్పకుండా ఎంతో అప్పు ఉండివుండాలి. ఈ వూహ తట్టగానే ఋణదాలు మరీ రేగారు.

దానితో ఆసామికి నిప్పులమీద పొర్లాడుతున్నట్లయింది. ఒక రోజున ఎడ్ల బేరగాళ్లు వస్తే 350 రూపాయలు పుచ్చుకొని ఎద్దునూ, గిత్తనూ, తలతాళ్ళతోనే తోలిపెట్టాడు. చొప్పు తేవటానికి ఇంట్లోకి వెళ్ళితే లక్షువమ్మ పడనిస్తుందీ? అందువల్ల దొడ్లోవాళ్ళను దొడ్లో నుంచి గుప్పుడు చప్పుడు కాకుండా పంపించివేశాడు.

పచ్చిగడ్డి తేవటానికి వెళ్ళిన రాఘవులు ఆనాడు మోయరాని మోపు వేసుకొని చెమటోడ్చుకొంటూ ఆలస్యంగా వచ్చాడు. వచ్చిమేత వేదామనిపోతే యెడ్లులేవు. అతనిగుండె గుభేలుమంది. అవి ఎప్పుడన్నా ఊడదీసుకొన్నా దొడ్డి వదలిపోయే మచ్చుకాదు. ఇక ఆసామికి యెక్కడన్నా మొగమోటం ఉంటుందేమోకాని ఎడ్ల దగ్గరమాత్రం ఉండదు. ఒకవేళ అంతగా కాదనటానికి వీలులేకపోతే రాఘవుల్ని యిచ్చి తోలిపెట్టేవాడు.

---

ఎడ్లు నేడేమైనట్లు? తొందరపనివుండి దొరే బండికట్టుకు వెళ్ళాడేమోనని రాఘవులుచూచాడు. బండి, చిరతలు చావట్లోనేవున్నాయి. నాగలి, వట్టెళ్ళు వారెణకూడా ఎప్పటి చోటనే వున్నాయి. గొడ్లు పచ్చిమేతకోసం తాళ్లు లాక్కొంటూ గందరగోళం చేస్తున్నా, అతడు గబగబా లక్షువమ్మ దగ్గరకు పరుగెత్తుకెళ్ళి, ''ఎడ్లు ఎవరుతోలికెళ్లారు?'' అని అడిగాడు.

''చావిట్లో లేవురా?''

''లేవే.''

''మీ దొర బండి కట్టుకెళ్ళాడేమో.''

''బండి చావిట్లోనేవుంది.'' రాఘవులు కాళ్ళీడ్చుకొంటూ వెళ్ళి దొడ్లో నడిమధ్య చతికిలబడ్డాడు.

లక్షువమ్మకూడా చేతిలోని పాలచెంబు దాయతాడు నట్టింటపడేసి, ''ఎడ్లున్నాయటరా?'' అంటూ ఆదరాబాదరా దొడ్లోకి వచ్చింది. సూర్దైతేగా ఉన్నా కనిపించకపోవటానికి?

''ఎడ్లు ఎక్కడికో తప్పించుకు పోయాయని మీ నాన్నను పిల్చుకురారా.'' అని అప్పుడే వచ్చిన పెద్దకొడుకును పంపించింది.

''నాన్న లైబ్రరీ అరుగువద్ద లే''డని కొడుకు వెళ్ళివచ్చి చెప్పాడు.

అంతలో బాగా చీకటిపడ్డది. లక్షువమ్మ తిల్లికపెట్టి చిట్టాడికి పాలచెంబు, దాయతాడు ఇచ్చి రాఘవుల్ని దూడ నిడవమని చెప్పి పంపింది. జీతగాడు చావట్లో బండికింద గడ్డి పనమీద పండుకొని మాట్లాడలేదు. లక్షువమ్మకూడా వచ్చి బ్రతిమాలింది. కోపపడ్డది. లాభం లేకపోయింది. పెద్దకొడుకు..ు విడవమన్నది. వాడు తనవల్లకాదన్నాడు. ఆడుది తానెలా ఆవుపాలు తీస్తుంది? భర్తకోసం ఎదురు చూచింది. ఎంత సేపటికీ రాలేదు. ఆవు, కోడెదూడ దొడ్డి దద్దరిల్లేట్టు అరుస్తున్నాయి.

లక్షువమ్మ మనస్సు కటకటపడ్డది. చివరికి తెంపు చేసుకొని తానే దూడపలుపు తప్పించి రాఘవుల్ని అన్నానికి పిలిచింది. వాడు కదల్లా, మెదల్లా, పెద్దకొడుకును పిలిచింది. వాడు మొదట్లో బెట్టుసరి పోయినా, చివరికి ఎలాగైతేనేం రెండు ముద్దలు తిన్నాడు. నిద్రవస్తున్నదని చిట్టాడు తొందరించాడు. పక్కగుడ్డలకోసం గదిలోకి వెళ్ళితే మంచంమీద భర్త ముసుగు పెట్టుకొని మూలుగుతున్నాడు.

పక్కగుడ్డలు పట్టుకెళ్ళి యిద్దరి కొడుకులకు పక్కవేసి పండుకోమని లాంతరుతో గదిలోకివెళ్ళి ''సుస్తిగావుందా ఏమిటి?'' అని భర్త కణతలమీద చెయ్యివేసింది. ఆమె వేళ్ళమీద వెచ్చని నీళ్లుపడసాగాయి. ఆమె వులిక్కిపడింది.

''జ్వరం వచ్చినట్లుందే!''

''లేదని వెంకయ్య మూలిగాడు.''

''సరే, అన్నీ బాగానే కుదిరాయి. ఎడ్లుకూడా ఎక్కడికో తప్పించుకుపోయాయి.''

ఉండి వుండి, ''నేనే అమ్మివేశాను,'' అని వెంకయ్య నిట్టూర్పు విడిచాడు.

లక్షువమ్మ కొయ్యబారి కాసేపు అలాగే నిలుచున్నది. ఆమె నోటినుంచి పల్లెత్తుమాట రాలా. తరువాత ఆ లాంతరుతో చావట్లోకి వెళ్ళి రాఘవులకు దూరంగా చతికిలబడి, ''ఎడ్లను మీదొరే అమ్మాడట,'' అని చెప్పింది.

రాఘవులు ఉలకలా, పలకలా, అతనిచూపులు వాసాలు చూస్తున్నాయి. లక్షువమ్మ ముక్కుచీదుకొంటూ కుటుంబ స్థితిగతులు, బాకీలసంగతి అంతా పూసగ్రుచ్చినట్లు చెప్పింది.

'' ఆయనమాత్రం ఏమిచేస్తాడురా. మాకర్మ అలావుంటే? మాపాపం బద్దలైంది. నువ్వుమాత్రం ఎలా అడ్డుపడుతా? లే, మా నాన్నగా, లే; రెండుముద్దలు తింధుగాని; పగలల్లా రెక్కలిరుచుకొన్నావా, ఎంగిలిపడకపోతే తెల్లారిపాటికి శోషవొస్తుంది. లే అమ్మా



లే?''

''నా కర్మకుమాత్రం మీరేమి చేస్తారులెండి,'' అన్నాడు రాఘవులు.

లక్షువమ్మ ఎన్నిచెప్పి రాఘవుల్ని తిండికి పిల్చుకెళ్ళలేక పోయింది. ఆమెకూడా తిండి సయించక దిగులుతో చిట్టాణ్ణి ఎదురుబార కదుముకొని పండుకొన్నది.

ఆ రాత్రి రాఘవులకు శివరాత్రి అయింది. గత జీవితమంతా అతని కళ్ళముందు సినిమా ఆడింది. ఇంతకాలం తాను ఎంకయ్యదగ్గర ఎందుకుంటున్నాడు? ఇన్నేళ్ళనుంచి చెమటోడ్చి పోస్తున్నాడే? దాని వల్ల ఏమివచ్చింది? ఆసామన్నా బాగుపడ్డాడా అంటే అదీలేదు. తనకేమన్నా మిగిలిందా? లోపలి ప్రేవులమాత్రం బేవు బేవుమంటున్నాయి. అయితే యీచాకిరి దేనికి? మరొక రైతుదగ్గరచేస్తేనో? ఇంతకన్నా వచ్చేదేముంది? అయినప్పుడు యీచేటెరుగనిపాటు దేనికి? కడుపుకోసం కేవలం పొట్టకోసమేనా? అందుకోసమేనా తానిన్నాళ్ళ బ్రతికింది? ఇలాంటి బ్రతుకు బ్రతకకపోతేనేమి? ఏదేవుడేడ్చాడు?

ఇంతకూ తానుకోరుతున్న దేమిటి? ఎడ్లూ వ్యవసాయమేగా? అందులో సందేహంలేదు. తానింత కాలం మేపి పనికలవార్చిన గిత్త పోయిందనేగా యింత కటకటపడుతున్నది? కాబట్టి తనకు ఎడ్లు, చేతినిండా వ్యవసాయం సలక్షణంగా

వుంటేచాలు. దానితో తాను సంతృప్తి పడగలడు. తనజీవితం సుఖంగా వెళ్ళమారిపోతుంది. తన రెక్కలు, స్వాతంత్ర్యం అమ్ముకొన్నా యివి ఎందుకు దక్కటంలేదు?

రాఘవులుకూడా దీని బాధ్యత కర్మమీదనే వేశాడు? కాని ఇంత కాలంనించీ అతన్ని బంధించి ఉంచిన బంధనాలు అతనికి తెలియకుండానే కోసివేయబడ్డాయి. పోతే ఇక వాడు ఇక్కడే ఎందుకు ఉండాలి?

ఆ రాత్రి అతనికి కనుకుపట్టలా. ఆలోచనతోనే తెల్లవారింది. లేచికాలకృత్యాలు తీర్చుకొని, ఉదికిన గుడ్డలు కట్టుకొని, విడిచినవి మూటకట్టి ములుగర్రకు తగిలించుకొన్నాడు. నేరుగా వెళ్ళి లక్షువమ్మను పిలిచాడు. ఆమె వెంట పెద్దదొర, చిన్నదొర, చిట్టాడు దొడ్లోకివచ్చి రాఘవుల వాలకంచూచి కొయ్యబొమ్మల్లాగా నిలబడ్డారు.

''వెళ్ళుతున్నానమ్మా!'' అని రాఘవులు తలవంచుకొన్నాడు.

''యాడకిరా?'' లక్షువమ్మ విస్తుపోయి అడిగింది.

'' ఇంతవరకు ఫలానిచోటికని అనుకోలేదు.''

''మీ బాబుదగ్గరకు వెళ్లతావా?'' అన్నాడు వెంకయ్య.

''పోను.''

అతని ధోరణిచూచి ఎవరూ మాట్లాడలేకపోయారు.

''అయితే అన్నంతిని పోరా, రాత్రికూడా తినలేదు.'' లక్షువమ్మ అడ్డుతగిలింది.

అంతలో కోడెదూడ చెంగనాలు తీసుకొంటూవచ్చి రాఘవుల గోచిచెంగు పట్టుకొన్నది.

''వద్దులేండి, ఆమాటే చాలు.''

''బాబూ నామాటవినరా.'' లక్షువమ్మ రాఘవుల గడ్డం పట్టుకొన్నది.

''కాదులేండి, వస్తాను.'' రాఘవులు దూడ నోట్లోనుంచి పంచెకొంగు లాక్కొన్నాడు.

చిట్టాడు బావురుమన్నాడు. కోడెదూడ అరిచింది. దానితో దొడ్లో ఆవులన్నీ ఒక్కసారిగా అంబా అన్నాయి.

అయినా రాఘవుల కాళ్ళకు పశువులు అరుపులు నాడు బందాలు వేయలేకపోయాయి.

మార్చి, 1947

# అతడంటే

అతడంటే గౌరవం – అతడంటే భక్తి.

గోపాల్‌చూపులు సామాన్యమైనవికావు. చూచిన దాని హృదయం చీల్చి చదువుతాడు. నా కాశక్తిలేదు. నాకు అన్నీ మామూలుగానే కనిపిస్తాయి. వాటిహృదయం నాకు తెలీదు. తెలిసినా సమన్వయించుకోలేను. గోపాల్‌కు ఆశక్తి వుంది. అన్నిటి హృదయాలను విప్పిచూస్తాడు. చూచి సమస్వయిస్తాడు.

ఎలా చేస్తున్నాడు? కూర్చున్నా, పండుకొన్నా ఇదే ఆలోచన. తన వ్యక్తిత్వాన్ని అధిగమిస్తేనే, నిర్లిప్తత ఏర్పడితేనే చూచేవాటి హృదయాలు అర్థమవుతాయి. అప్పుడే సమన్వయశక్తి అలవడుతుంది. తప్పుకానీండి, ఒప్పుకానీండి ఈ అభిప్రాయానికి వచ్చాను.

ఇదీ నా అభిప్రాయమేనా? మళ్ళీ ఆలోచించాలి... గోపాల్ ఎప్పుడన్నా నాతో అన్నాడేమో... అన్నాడో లేదో ఇప్పుడ నిర్ధారణగా చెప్పలేను.

ఏది ఎలా జరిగినా వ్యక్తిత్వాన్ని అధిగమించి నిర్లిప్తతపొంది చూస్తే తప్ప లోకం అర్థం కాదు. సమన్వయశక్తి ఏర్పడదు. అయితే వ్యక్తిత్వం అధిగమించటం, నిర్లిప్తత సాధించటం నావంటివాడికి ఎలా సాధ్యమౌతుంది? ఎంత చదువుకొన్నా ఏ మూలనో ఒకమూల, కాస్తో కూస్తో కుయ్యోం కయ్యో అనకమానదు. అయినా ప్రయత్నించాను. ఊహుఁ! సాధ్యం కాలా.

· గోపాల్ సాధించాడు, లేకపోతే లోకం అతనికి ఎలా అర్థమౌతుంది? దాన్ని ఎలా సమన్వయిస్తున్నాడు? కాబట్టి అతడు వ్యక్తిత్వాన్ని అధిగమించి కేవల నిర్లిప్తత ఎప్పటి కప్పుడు సాధిస్తున్నాడు. నేను సాధించలేనిపని, నేను ప్రేమిస్తున్నపని అతడు చేయగలుగుతున్నాడు. అందుకే అతడంటే గౌరవం – అతడంటే భక్తి.

అలాంటి నిర్లిప్తునిద్వారా లోకాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించటం నాకు అవసరమనిపించేది. అందువల్ల నాకు అర్థం కానివీ, విచిత్రమైనవీ, నాహృదయానికి సంబంధించినవే అయినా, నా ఆప్తుల విషయాలే అయినా అతనికి చెప్పేవాణ్ణి. నిర్లిప్తుడికి చెబితేమాత్రం నష్టమేముంది? పైగా లోక తత్త్వాన్ని తెలుసుకోవటానికి వీలవుతుంది. అందుకోసమని అతనిముందు నాకు దాపరికం లేదు. అతనికి సంబంధించిన విషయమైనా అడిగేవాణ్ణి, అతడు వివరించేవాడు.

గోపాల్ ఎంత నిర్లిప్తుడో ఈ సంగతి చెబితే తెలుస్తుంది. నేను డాక్టరు రావుగారిదగ్గర మందు తీసుకొంటున్నాను. ఆయన గోపాల్‌కు ఆప్తమిత్రుడు. ఫామిలీ డాక్టరు. ఆ డాక్టరు విచిత్రవ్యక్తి అనాలి. ఎవరన్నా తల నొప్పితోనో, ఒళ్ళు వేడిచేసో మందుకువస్తే, ఏదో మందు ఇచ్చో యియ్యకో పంపించవచ్చునా? అలాచేసేవాడు కాదు. పుటిక్కిన అడిగేవాడు. 'నీ కేమిరోగం? డాక్టర్లు ఇలాంటివాటికేనా కూర్చున్నది? పోవయ్యా పో, ఒకపూట తిండిమానుకో' అనేవాడు. అలాఅంటే నయమే. రోగి తాను చెప్పినట్లు చేయటంలేదని తెలిసిందా, డబ్బుకూడా పుచ్చుకోకుండా బయటికి నెట్టేవాడు. ఇలాంటివాణ్ణి చూస్తే ఎవరికి ఆశ్చర్యం కలుగదు?

''ఏమిటి, ఆ డాక్టరు అలా చేస్తాడు.''

గోపాల్‌ను అడిగాను. అతడు గది దద్దరిల్లేటట్టు నవ్వాడు. ''అతడు ఎలాచేస్తే నీదేం పోయింది? ఆదంతా నీకెందుకు?'' అన్నాడు.

''విచిత్రంగా కనిపిస్తేఅడుగుతున్నాను. మానవుడికి జిజ్ఞాసఅనేది ఉండదా? కాదు తప్పు అంటేమాత్రం, అడగబోవటంలేదు.'' అన్నా సీరియస్‌గా.



''అదికాదోయ్, ఎందుకంతకోపం? నీ ఉద్దేశమేమిటో, విశేషాలేమన్నా ఉన్నాయేమో తెలుసుకుందామని అన్నా. నీవూ నావంటి వాడివే నన్నమాట. ఇంతమంది డాక్టరును చూస్తున్నారుకదా? ఒక్కడుగూడ ఈ ప్రశ్న అడగలేదేమా, అనుకొంటున్నా, నావంటి వాడు మరొకడున్నాడని యిన్నాళ్ళకు తేలింది,'' అన్నాడు.

''అయితే ఈ ప్రశ్న మీకూకలిగిందన్నమాట?''

''ఆఁ! అదే ఆలోచిస్తున్నా.''

''ఈ డాక్టరు ఎందుకు అలా చేస్తున్నాడంటారు?''

''తీరా ఆలోచించిచూస్తే, అది అంత బ్రహ్మవిద్య కాదనిపిస్తుంది.''

''ఎలా?''

''మనుచరిత్ర చదువు, తెలుస్తుంది.''

''ఎప్పుడో వ్రాసిపోయిన చాదస్తపు వాడి రాతలతో ప్రయోజన మేముందిలెండి. ఇంతకూ డాక్టరు తత్త్వమేమిటంటారు?''

అతడంటే

''టౌన్లో డాక్టర్లంతా లేనిరోగాలు కలిపించి డబ్బు యిష్టం వచ్చినట్టు గుంజుకొంటున్నారు. అలాంటి ఆటలు ఒక సంవత్సరం సాగేను, రెండు సంవత్సరాలు సాగేను. కలకాలం సాగుతాయా? లేని రోగాలు ఉన్నాయనిచెప్పి తనదగ్గర డాక్టర్లు డబ్బుగుంజుతున్నారని ప్రతివాడు తెలుసుకొంటున్నడు. అలాంటప్పుడు రోగాలను చేర బట్టాలంటే మార్గమేమిటి?''

''మీరు చెబుతున్నదేమిటో ఈ మట్టిబుర్ర కెక్కటంలేదు,'' అన్నా.

''ఈ రోజుల్లో ఉన్నది ఉన్నట్టు, లేనిది లేనట్టు చెబుతున్నట్టుగా నటించాలి. అప్పుడే మనిషిమీద గురి ఏర్పడుతుంది. డాక్టరు రావుగారు చిన్న కేసులు పట్టరు. ఎంతో గట్టి కేసులైతేనే పుచ్చుకొని నయం చేస్తారు. అంతేకాని ఆయనకు డబ్బుమీద ప్రీతిలేదురా అనిపిస్తుంది. అందువల్ల ఎక్కువమంది రోగాలు డాక్టరు రావుగారి దగ్గరకు వెళ్ళటానికి వీలవుతుంది.''

''ఇంతకూ డాక్టరు రావుగారు ఎక్కువకేసులు రాబట్టటానికి యిలా చేస్తున్నాడంటారు?''

150 ''ఖచ్చితంగా అలా చేస్తున్నాడని చెప్పలేను కాని, చూడగా చూడగా నాకుమాత్రం అలాగే అనిపిస్తున్నది.''

అవును గోపాల్ చెప్పింది నిజమేకావాలి. అన్నికేసులు ఆయన దగ్గరకు ఎందుకు వస్తున్నాయి? అంత నిర్మొగమాటంగా మాటాడే వ్యక్తి దగ్గరకు అంతమంది ఎందుకు వస్తున్నారు? అంత అసహ్యంగా ప్రవర్తిస్తున్నా ఎందుకు సహిస్తున్నారు?

పైగా డాక్టర్ రావు గోపాల్‌కు మిత్రుడు. అలాంటప్పుడు అనుకూలంగా చెప్పాలేకాని యిలా ఎందుకు చెబుతాడు? నిజమే కనిపిస్తుంటే.

గోపాల్‌కు ఎంత నిర్లిప్తత! ఎంత నిశితదృష్టి! అతనికి అప్తుడు లేడు, పరుడులేడు. కేవలం నగ్నసత్యం తప్ప మరొక దానిమీద అతని దృష్టిలేదు.

అందుకే అతడంటే గౌరవం–అతడంటే భక్తి.

దానితో గురు శుశ్రూష ఎక్కువైంది. ఎక్కువైన కొందికీ మామూలు లోకంలో విచిత్రాలు ఎక్కువగా కనిపించసాగాయి. విచిత్రాలు కనిపించినకొందికీ స్నేహం ఎక్కువైంది. స్నేహం పెరిగిన కొందికీ అతని నిర్లిప్తత, నిశితదృష్టి అంతకంతకు బాగా అర్థమౌతూ వచ్చింది.

ఎలాగంటే ఇంతకుముందే చెప్పానుకాదు, డాక్టరురావు దగ్గర మందు తీసుకొంటున్నానని. రోజులు గడిచినకొందికీ ఆయనతో పరిచయం అధికమైంది. ఒకరోజున ఆయన నన్ను భోజనానికి పిలిచాడు.

డాక్టరు నన్నెందుకు భోజనానికి పిలుస్తున్నట్టు? నావల్ల ఆయనకు కావలసిన ప్రయోజనమేముంది? ఏవో రెండు ముక్కలు వ్రాసుకొనే వాడివల్ల అయ్యేపనేముంది?

నాకు ఎందుకు ఇలాంటి ఆలోచన బయలుదేరింది? ఇష్టముంటే భోజనానికి వెళ్ళరాదా? లేకపోతే మానరాదా? పోక మానెయ్యి దలచుకొంటే ఏ కాస్త వంకైనా చాలే.

నేనుమాత్రం ఆహ్వానాన్ని త్రోసివేయలేదు. డాక్టరు ఇంటికి వెళ్ళాను ఆయన నన్ను తీసుకెళ్ళి తను చదువుకొనే గదిలో కూర్చోబెట్టాడు. యాదృచ్ఛికంగా ఒక అమ్మాయి తడువుకొంటూ తడువుకొంటూ లోపలికి వచ్చింది. డాక్టరు లేచివెళ్ళి ఆమెను లోపలికి పంపించి వచ్చాడు. రాగానే అడిగాను:–

''ఎవరండీ వారు, కళ్ళు కనపడనట్లుండే?'' అన్నాను.

డాక్టరు రావు ఆమె తన భార్యేనని చెప్పాడు. నాకు నోటివెంట మాటరానిస్థితి ఏర్పడింది. కాని ఆ పెద్దమనిషిముందు అలాకావటం ఎంత అసభ్యంగా ఉంటుంది? 151

భోజనానంతరం సెలవుతీసుకొని ఇంటివచ్చి భోగట్టా చేశాను. డాక్టరు రావు ప్రాక్టీసు పెట్టుకొన్న తరువాతనే గుడ్డమ్మాయిని పెళ్ళి చేసుకొన్నాడని తెలిసింది. ఇంకా వాకబుచేస్తే ఆ అమ్మాయి లేని వాళ్ళ పిల్లనికూడ తెలిసింది.

నాకు ఈసంగతంతా దేనికి? ఈశ్రమంతా ఎందుకు తీసుకోవాలి? నాకు అర్థం కాలా.

గోపాల్ దగ్గరకు మళ్ళా వెళ్ళాను. లోకాన్ని అర్థం చేసుకోవాలిగా. అతన్ని అడిగా. అతడు గది దద్దరిల్లేట్టు నవ్వాడు. నాకు నవ్వాలో ఏడవాలో తెలియలా.

''నాకు ఎందుకు ఈ కుతూహలం కలిగింది గోపాల్?''

''తిక్కన్న భారతం తిరగెయ్యి,'' అన్నాడు గోపాల్.

నేనులేచి బయలుదేరా.

''ఎక్కడి''కన్నాడు గోపాల్.

''తిక్కన భారతం తిరగెయ్యటాని''కన్నాను.

అతడంటే

'' ఏమో అనుకొన్నా, వట్టి పసిపిల్లవాడివి, పసిపిల్లవాడే నీకన్నా నయమేమో!'' అన్నాడు గోపాల్.

''ఎందుకని?'' కుతూహలంతో అడిగా.

''నీకు, నాకు ఇతరుల వ్యవహారాలెందుకు? విచిత్రంగా కనిపిస్తే తెలుసుకోవటం, తెలుసుకోవటానికి ప్రయత్నించటం స్వభావం,'' అన్నాడు గోపాల్.

నేను తిరిగివెళ్ళి కూర్చున్నా.

''నిజంగా డాక్టరు రావు విచిత్రంగా కనిపిస్తున్నాడు. డబ్బులేని గ్రుడ్డిపిల్లను ప్రాక్టీసు ప్రారంభించిన తరువాత పెండ్లి చేసుకోవటమేమిటి?'' అన్నాడు గోపాల్.

''అదే నేనూ అడుగుతున్నది.''

గోపాల్ చేతిలోని పెన్సిలు మొనతో గడ్డంక్రింద గీకుకొన్నాడు. పెదవులు రెండు జోడించి ముక్కుకు ఆనించాడు.

''ఎంత జాలి ఉన్నా, ఎంత ఉదారుడైనా చూస్తూ చూస్తూ గ్రుడ్డిపిల్లను పెండ్లి చేసుకొంటాడా? ఆస్తి వస్తుందాఅంటే సెంటుభూమైనారాదే. అందంలో తిలోత్తమా అంటే, అదీకాదే. ఎందుకు చేసుకొన్నాడు?''

''నిజంగా విచిత్రంగా ఉంది. ఆలోచించాలిసిందే. నాకు ఏమీ పాలుపోవటంలేదు,'' అన్నాడు గోపాల్.

మళ్ళీ మరుసటిరోజున వెళ్ళా. గోపాలే కదిలించాడు.

''డాక్టరు సంగతి ఆలోచించావా?'' అన్నాడు.

''నాకేమి తోచలా. మీకేమైనా తోచిందా?''

''అతని తత్త్వం ఎలావుంటే నీదేంపోయింది?'' అన్నాడు.

''అతనిదగ్గర మందు తీసుకొంటున్నాను. అతని తత్త్వం తెలిసి నడుచుకోవాలిగా, అందువల్ల నాకు అవసరం. స్వార్థంకోసం అడుగుతున్నాను. తెలిస్తే చెప్పండి తెలియకపోతే మానెయ్యండి,'' అన్నా.

'' ఎందుకంతకోపం నవ్వుతాలకంటే? సరేకాని ఆలోచించా. ఆరాతీశా.''

''అసలు ఏమి జరిగిందేమిటి?''

'' ఆ అమ్మాయి కళ్ళకేదో జబ్బుచేసి మందుకోసం డాక్టరురావు దగ్గరకు వచ్చింది. అసలురోగం తెలుసుకోక ఏ నిషాలోవుండో ఆమె రెండుకళ్ళు చేతులార పోగొట్టాడు,'' అన్నాడు గోపాల్.

''పొరపాటువల్లనే కళ్ళు పోయాయనుకొందాము. అయినా చూస్తూ చూస్తూ కళ్ళులేని కబోదిని ఎలా చేసుకొన్నాడు?''

''వట్టి పిచ్చివాడివి లాగున్నావు. గుడ్డిపిల్లను మగడు దొరకడని మీ డాక్టరు కట్టుకొన్నాడంటావా? కేసుపెడితే గొంతుమీదికి వస్తుందని గుప్పుడు చప్పుడు కాకుండా పెళ్ళిచేసుకొన్నాడు. కాకపోతే యిలాంటిది జరుగుతుందా?''

నిజమే అయివుండాలి. లేకపోతే డాక్టరు అలా ఎందుకు చేస్తాడు? ఈ మాత్రం తెలివితేటలు నాకు ఎందుకులేవు? లోకం ఆంతర్యం నాకు ఎందుకు అర్థంకాదు? గోపాల్ ఎలా అంతసులువుగా అర్థం చేసుకొన్నాడు?

అందుకే అతడంటే గౌరవం – అంతడంటే భక్తి.

నాకు జబ్బు నయమయింది. ఆరోజు డాక్టరుకు ఫీజు ఇచ్చి, చెప్పివద్దామని వెళ్ళాను. నన్ను కూర్చోబెట్టి రోగులందరినీ వరుసగా చూస్తున్నాడు. డాక్టరు ఉండమన్నప్పుడు కాదని ఎలా వచ్చేది? అది ఆఖరిరోజాయె. రోగులను పంపించివేసేటప్పటికి మధ్యాహ్నం రెండు గంటలయింది. 

''క్షమించాలి. స్నేహంకొందికీ కూర్చోబెట్టాను. అయినా రోగికి ఇప్పుడు స్వస్థత చిక్కిందో లేదో తేల్చుకోవద్దా?'' డాక్టరు నవ్వాడు.

''ఇంతకూ మీ పేషంటుకు స్వస్థత చిక్కిందంటారా?'' అని నవ్వుతూ జేబులోనుంచి పైకం తీశాను.

''ముందు ఆ పైకం ఇలా యివ్వండి. తరువాత చెబుతా,'' అంటూ డాక్టరు చెయ్యిచాపాడు.

డబ్బుపుచ్చుకొని రావు జేబులోనుంచి మూడు సినిమాటిక్కెట్లు బయటికితీసి, ''ఇవ్వాళమంచి ఇంగ్లీషు పిక్చరుంది. మొదటి ఆటకు వెళ్లుదాము. గోపాల్ గారినిగూడ పిలిచాను. సరిగా సినిమా ప్రారంభమయ్యే వేళకు హాలులో వచ్చి కలుసుకుంటాను, తప్పకుండా రండి. నేను రావటం ఆలస్యమౌతుందేమో, ఈ టిక్కెట్లు మీవద్ద ఉంచండి. ఏమంటారు?'' అన్నాడు.

సరేనన్నాను. గోపాల్‌ను కలుసుకొని సినిమాకు వెళ్ళాను. ఆట ప్రారంభమయింది. హాల్లోకి వెళ్ళికూర్చున్నాము. రెండు మూడు రీల్సు నడిచాయి. అప్పుడే డాక్టరుగారు ఆదరాబాదరావచ్చి, మా ప్రక్కన కూర్చుని ''ఎక్స్‌క్యూజ్‌మీ'' అన్నాడు.

''ఇంత ఆలస్యంగా వచ్చారేం?'' అన్నాడు గోపాల్.

''ఏమి చెయ్యమంటారు? ఇవ్వాళ మరొక కేసు వచ్చింది.''

''కేసు వచ్చినా చిక్కేనా?'' అన్నాడు గోపాల్

''అది కాదుభాయ్! మేహరణం, బాగా ముదిరింది. పెళ్ళి కావలసినపిల్ల, కాలుతీస్తే కానిబ్రతకదేమో. అందుకని ఎందుకైనా మంచిదని మద్రాసు తీసుకుపొమ్మన్నా, ఆరోగివెంట వచ్చిన వాళ్ళకు చెప్పాను. వాళ్ళు ఎంతసేపటికి నన్నే చూడమంటారు మద్రాసు వెళ్తే కాలు తీసెయ్యకుండా నయం చేయవచ్చునని అంటే వినరు. అది తెముల్చుకొనేటప్పటికి ఇంత ఆలస్యమైంది.''

''మీ ఆవిడ సలహా పుచ్చుకొని వచ్చారేమో?'' అంటూ గోపాల్ నవ్వాడు.



''ఏమని?'' డాక్టరు అడిగాడు.

''అదికాదు, మీ ఆవిడ కళ్ళజబ్బు నయంచేసుకోవటానికి వచ్చినప్పుడు ఏవునిచెప్పావు? జబ్బు నయంకాదని స్పష్టంగా చెప్పావు. అలాగే జరిగింది. కళ్ళుపోయాయి, ఆ అమ్మాయి గతి ఏంకానని పెండ్లి చేసుకొన్నావా? అలాగే ఒక వేళ ఆ అమ్మాయి కాలుతీసివేయ వలసివచ్చినా భయంలేదు. ఎవరు దొరకకపోయినా నువ్వుంటావుగా,'' అంటూ గోపాల్ నవ్వాడు. గోపాల్ నవ్వు తెలిసిందేగా, రిజర్వుడంతా మావంక తిరిగి చూచింది. ఆనవ్వుతో నాకు నవజీవాలు కుంగిపోయాయి. సినిమా ఎంతసేపాడింది? ఎప్పుడయిపోయింది? తెలియలా, హాలులో లైట్లు వెలిగాయి. డాక్టరు నా చెయ్యి పుచ్చుకొన్నాడు. బయటికి వచ్చాము.

గోపాల్ సెలవు తీసుకొని మరొకదారిన వెళ్ళాడు. అతడు ఎంత నిర్లిప్తుడు! ఎంత ప్రతిభాశాలి! లోకాన్ని నాకు అర్థమయ్యేట్టు చేశాడు. అందుకే అతడంటే గౌరవం – అతడంటే భక్తి.

*ఏప్రిల్, 1947*

# మాయ

ఎన్నడూ చి(రున చీది ఎరుగని మా అత్తయ్య మంచం పట్టింది ఇంట్లో గంటెడు గంజి కాసిపోసేవాళ్ళుకూడ కర్వైపోయారు. నేను ఒక్కణ్ణే అయితే అంత యిబ్బంది వుండేదికాదు. మా నాన్నగారు మూడుకాళ్ళ ముసలి. ఆయనకెప్పుడూ ఏదో ఒకటి ఆజీలుగా ఒక మనిషి అందిస్తూ వుండాలి. పైగా ముప్పూట తినే జీతగాడు - వ్యవసాయం.

చేతులు కాల్చుకోవలసివచ్చినా నాకు కష్టమనిపించలేదు. కాని మా అత్తయ్యదే పెద్ద చిక్కు. మంచంమీదికాలు కింద పెట్టనీయివద్దని డాక్టరు గట్టిగా చెప్పాడు. పొయ్యి అసలే పనికిరాదన్నాడు. కాని ఆమె వింటేనా! మంచిమనిషిలాగా అన్ని సర్దుకుపోవాలని ఆమె తాప(త్రయం, మొత్తుకొంటున్నా వినక పొయ్యిదగ్గరకు వచ్చేది. నేను కోపంవచ్చి చెడామడ తిట్టేవాణ్ణి, ఏమిలాభం? తిట్లదారిని తిట్లు పోయేవి. ఆమె తన అలవాటు (ప్రకారం చేయటానికి (ప్రయత్నించేది.

నా హృదయం జివ్వుమంది. ఇంతకాలం ఆమెచేత అడ్డమైన చాకిరి చేయించుకొన్నాము. తీరా నేడు మూలబడితే గుక్కెడు మందిప్పించలేక పోయామన్న సంగతి తెలిసివచ్చి నిలువున కుంగి పోయాను. అయినా ఏమిచేయను? పంటమీద కాస్తో కూస్తో వస్తూ వుంటె గుడ్డా గోసె, వ్యవసాం ఖర్చులు వెళ్ళమారుతున్నాయి. ఇక పోతే అప్పుతేవాలి. తెచ్చినా తీర్చేది ఎలా? మనస్సు గింజాలాటలోపడ్డది.

మా అత్తయ్యస్థితి మరీ అధ్వాన్నం కాసాగింది. గడియసేపైనా కూర్చోటంలేదు. వంటింట్లోకి తూర్పింట్లోకి తిరిగింది తిరిగినట్టుగా వుంటూవుంది. డాక్టరు చెప్పినట్టు హాస్పిటల్‌కు ఎంత తొందరగా తీసుకెళ్ళితే అంత మంచిదనిపించింది. అసలు ఇల్లువదలితేగాని ఆమె ఒక (ప్రక్కన కూర్చోదు.

కాబట్టి ఊరికి తొందరగా బయలుదేరాలిసిందే. కాని డబ్బు ఎవరిని అడిగేట్టు? అడిగితే మర్యాద దక్కాలికదా? అవతలి (ప్రాణం మీదికి వచ్చినప్పుడు మాట వెలితి అవుతుందేఅని కించపడటమేమిటి? అసలు అంత జంకవలసిన పనేముంది? దేశంలో డబ్బుకు కరువులేదు. ఎవరైనా నాకు అప్పు ఇవ్వటానికి వెనకాడవలసిన పనిలేదు. ఆ ధైర్యంతో నేను నరసయ్యగారింటికి వెళ్లాను.

నరసయ్యగారు ఒక విచిత్ర వ్యక్తేనని చెప్పాలి. ఆయన ఇరవై వేలదాక వడ్డీకి తిప్పుతున్నా ఒకసారికూడా కోర్టుకెక్కినవాడు కాడు. ఆయనడబ్బు మహత్మమేమో కాని కొంపలు నిలువున కూలిపోతున్నా అప్పులవాళ్లు ఆయన డబ్బుమాత్రం అణాలు పైసలతో సహా కట్టిపోయేవాళ్ళు. బాకీదార్లను ఎన్నడూ ఒత్తిడి పెట్టినట్లుకూడా వినలేదు. అసలు ఈ ప్రపంచమంటేనే ఆయనకు అంత విరక్తి అట. అంత వేదాంతి, జ్ఞాని చుట్టుపట్లలో లేరని అనుకొంటూవుంటే విన్నాను. నాకుమాత్రం ఆయనతో గాఢ పరిచంలేదు. కాకపోతే రెండుమూడుసార్లు లైబ్రరీవద్ద చూచాను.

నేను వెళ్ళగానే తూర్పింట్లో బల్లమీద కూర్చోమని, నరసయ్యగారు ఉత్తరీయంపు మడత బుజానవేసుకొని నాకు ఎదురుగా ప్రక్కన ఉన్న స్తంభాని కానుకొని చతికిలబడి,

''ఏమి అబ్బాయి, మీనాన్న తిరుగుతున్నాడా?'' అన్నాడు.

''తిరుగుతూనే వున్నాడండీ.''

''సాయంకాలం లైబ్రరీ అరుగువద్దకువచ్చి కాసేపు కూచుని పోతుండేవాడు. నాలుగు రోజాలనుంచి కనిపించకపోతే ఒంట్లో సుస్తీ చేసిందేమోనని అడుగుతున్నాను.''

 ''ఆయనకు బాగానే ఉంది. కాని మా మేనత్త మంచంపట్టింది. ఇంట్లో గిద్దెడు గింజలు కాసిపోసేవాళ్ళులేరు. నానా యిబ్బందిగా ఉంది.''

''అయ్యో పాపం! ఎంతకష్టం! అన్నీ ఉంటేనే సంసారం నరకం. వేళకు నాలుగు మెతుకులు పెట్టేవాళ్ళులేక ఇంట్లో వాళ్ళు పడకవేస్తే ఇక చెప్పాలి? అందుకనే అన్నారు ''సంసారం సాగరం దుఃఖ''మని. ఏదో ఇలాగే కష్టాలు వస్తుంటాయి, పోతుంటాయి. ఇలాంటి అనిత్యమైన యీ ప్రపంచం, ఈజీవితం నిత్యమనీ సుఖమనీ అనుకోవటంకన్నా తెలివి తక్కువతనం మరేమీ లేదు. అయితే మరి మీ చెల్లెలి కోసం కబురంపించక పోయారా?''

''అదిమాత్రం వచ్చి ఏమిచేస్తుంది? పైగా కంచెంత కాపురం అదీని. వచ్చి నాలుగునెల్లపాటు ఉండాలంటే పడుతుందా?''

''ఇంట్లో గిద్దెడుగింజలు పొంగించేవాళ్ళు లేకపోతే ఎలా?''

''ఏదో మాతిప్పలు మేముపడతాము. కాని మా అత్తయ్యదే చిక్కువచ్చింది.''

''ఏమి?''

''డాక్టర్ ఆమెను మదనపల్లి తీసుకెళ్ళమన్నాడు.''

''డాక్టర్లకేం బాబు, మాటేగద చెప్పటం! చెప్పేస్తారు. అది పడుతుందా లేదా, రోగికి తహతుందా లేదా అని ఆలోచిస్తారా? వాళ్ళు చెప్పినట్లు చేసేటప్పటికి మనతాడు తెగుతుంది. మన ఊళ్లో ఆచారులకి చూపించకపోయారా?''

''ఏ యితర రోగాలైతే అనుకోవచ్చు. క్షయవంటి రోగాల విషయంలో వాళ్ళు చెప్పినట్లు చెయ్యకతప్పదు.''

''మనస్సు నిలువుకోలేక ఏదో అనుకుంటాముకాని, డాక్టర్లు దేవుళ్ళా? ఏ నిమిషానికి ఏమౌతుందో ఎవరు చెప్పగలరు? ఆ గడియ వస్తే, డాక్టరు కాదుకదా బ్రహ్మదేవుడైనా ప్రాణం నిలబెట్టలేడు. బ్రతికేవాళ్లు ఎక్కడున్నా బ్రతుకుతారు, చచ్చేవాళ్ళు, అమృతం తాగినా చస్తారు. జననమరణాలు అనంతప్రవాహాలు. ఎక్కడనుంచి ఎందుకు బయలుదేరుతున్నాయో ఆలోచిస్తే విచిత్రంగా ఉంటుంది.''

నేను ఇక ఏమి మాట్లాడను? డబ్బు అడగటానికి నోరురాలా. కాని అత్తయ్య ఆయాసం జ్ఞాపకం వచ్చి సాహసించి అన్నాను.

''మీరు చెప్పింది ముమ్మాటికి నిజం. అయినా మానవుడు తన ప్రయత్నమేదో తాను చేయాలికదా? మా అత్తయ్యను మదనపల్లి తీసుకెళ్లాలి. రెండు వందలుంటే ఇప్పించండి. 
రేపు జనవరిలో ఇస్తాను.''

''దానికేం తీసుకెళ్లు. డబ్బు ఇవ్వబడుతుందని ఇలా అంటున్నాననుకునేవు. సందర్భం వచ్చింది కాబట్టి చెబుతున్నాను. అయినా నువ్వు చిన్నవాడివా చితకవాడివా? ఎందుకు చెబుతున్నానో నీకు తెలియదటలే,'' అంటూ లోపలికి వెళ్ళాడు.

అప్పటిదాక మాట తీసివేస్తాడేమోనన్న ఆతురత కాస్త పోయి మనస్సు కుదుటబడ్డది. ఎందుకో ఆలోచన పోయింది ఆయన ఎందుకు యిలా అంటున్నాడు? నాకుమాత్రం ఏమీపాలుపోలేదు. ప్రపంచంలో అనేక రకాల వ్యక్తులుంటారు. అనేక సిద్ధాంతాలుంటాయి. అలా ఉన్నంతమాత్రాన వచ్చే నష్టమేమిటి? మానవత్వం అనేది చావకుండా తోటివాడికి ఇబ్బంది వచ్చినప్పుడు కాస్త ఆదుకొంటూవుంటే అంతకన్నా కావలసింది ఏముంది?

నరసయ్యగారికి నోటు వ్రాసి యిచ్చి డబ్బు తీసుకొన్నాడు. ''మీ మేనత్తవెంట నీవేగా వెళ్ళేది? ఆసుపత్రిలో చేర్చినతరువాత ఆమె ఆరోగ్యం ఎలావుంది కాస్త వ్రాస్తూవుండు'' అని నేను వెళ్ళేటప్పుడు ఒకటికి రెండుసార్లు చెప్పాడు.

ఇలాంటి వ్యక్తినిగూర్చి అనుమానించినందుకు నాకు నేనే ఎంతో నొచ్చుకొన్నాను. ఆయన నిర్లిప్తత, సానుభూతి నన్ను విస్మయపరిచాయి. మాటలనుబట్టి హృదయాలను కొలవటమంత తెలివితక్కువపని లేదని నిశ్చయించుకొన్నాను.

ఇంటివద్ద చేయవలసిన ఏర్పాట్లు చేసి మాఅత్తయ్యను మదనపల్లి తీసుకువెళ్ళి హాస్పిటల్లో చేర్పించాను. ఇంతలో నరసయ్యగారి దగ్గర నుంచి ఉత్తరంవచ్చింది. "మీ అత్తయ్య ఆరోగ్యం ఏలావుంది? కాస్త ఉసులుచిక్కిందా? అశ్రద్ధచేయక అక్కడి విశేషాలు వ్రాయవలసింది," అని ఆయన వ్రాశాడు.

ఆ ఉత్తరం చూడగానే నాకు నేనే సిగ్గుపడ్డాను. ఏదో మాట వరసకు ఉత్తరం వ్రాయమన్నాడే కాని మా యోగక్షేమాలు తెలుసుకోవాలని అంత ఉత్సాహపడుతున్నాడనుకోలేదు. ప్రపంచమే మిథ్య అని విశ్వసించేవారికి యోగక్షేమాలు కావలసివస్తాయని ఎలా అనుకొనేది?

వెంటనే ఉత్తరంవ్రాయటం అవసరం. మా అత్తయ్యకు ఎలా వుందో వ్రాసినంతమాత్రాన చాలదు. ఆయన, ఆయన కుటుంబం యోగక్షేమాలు
158 తెలుపవలసిందని కోరటం న్యాయం; విధ్యుక్తధర్మం కూడా. అయితే ఊళ్ళో ఎవరిసంగతీ నాకు తెలియదు, తెలుసుకోవాలని కూడా ఎప్పుడూ ప్రయత్నించలేదు. ఊరిస్థితిగతులనుబట్టి కొంచెం పెడగా ఉండటం మంచిదనిపించి అలాచేశాను. నరసయ్యగారికి ఉత్తరం వ్రాస్తూ ఎవరి యోగక్షేమాలను తెలుపవలసిందని కోరేది?

వెంటనే మానాన్నగారికి నరసయ్యగారి కుటుంబంసంగతి సాధ్యమైనంత త్వరలో వ్రాయవలసిందని వ్రాశాను. ఆయన ఏ గుణంలో ఉన్నాడో వెంటనే జవాబు ఇచ్చాడు.

నరసయ్యగారికి ఒక్కడే కొడుకట. పేరు విద్యారణ్యులు. వేదాంత శిరోమణికి తిరుపతి కళాశాలలోనో, మరెక్కడో చదువుతున్నాడట. విద్యారణ్యులుకి కొడుకట. వయస్సు తొమ్మిదిమాసాలట. ఆ పిల్లవాడు బంగారపు బొమ్మ, తల్లి, పిల్లవాడు నరసయ్యగారి వద్దనే ఉంటున్నారట.

మా నాన్నగారి దగ్గరనుంచి ఉత్తరం రాగానే నరసయ్యగారికి జవాబువ్రాస్తూ, "బసమార్చటంవల్ల ఉత్తరం ఆలస్యంగా చేరింది. అందువల్ల జవాబు ఆలస్యంగా వ్రాస్తున్నాను. మా మేనత్తకు ప్రక్కటెముకలు రెండు తీసివేయాలంటున్నారు. ఆమీద ఎలావుంటుందో? మీరు చెప్పినట్టు మా లిఖితం మంచిదై ఆమెకు ఆయువు ఉంటే బ్రతుకుతుంది. మీ ఆరోగ్యం బాగానేవుంది కాదూ? బేబీశంకరం ఇంట్లోకి దొడ్లోకి

పొరాడుకొంటూపోయి ఆడుకొంటున్నాడుగా. విద్యారణ్యులు ఇంటికి ఎప్పుడువస్తాడు?'' అని వ్రాశాను.

ఈ ఉత్తరం వ్రాసిన ఇరవై రోజులకు కూడా సమాధానం రాలేదు. నాకు ఆశ్చర్యం కలిగింది. ఆయన ఊళ్ళోనన్నా లేకపోవాలి. మరేమన్నా అవాంతరం వచ్చి ఉండాలి. నాకు ఆవిషయమై దీర్ఘంగా ఆలోచించటానికి వీలులేకపోయింది, మా స్థితి నానాటికి అధ్వాన్నంగా ఉంది. ఒకరోజు రాత్రితో ఆమెనుగూర్చి బాధపడవలసిన అవస్థ తీరిపోయింది.

మరునాడే శవాన్ని తీసికొని మా వూరు బయలుదేరి వచ్చేశాను. అత్తయ్య ఎటు తిరిగి పోయింది కాబట్టి ఆలోచించవలసిన పనిలేదు. ఉన్నా ప్రయోజనం లేదు. పోతే బాకీమాత్రం అలాగే నిలబడి ఉంది.

ఇంట్లో ఎద్దడులు సర్దుకొని ఒకరోజున నరసయ్యగారి సంగతి ఆరాతీశాను. కొద్దిరోజులక్రితమే ఆయన మనుమడు బావిలోపడి మరణించాడని తెలిసింది. పొరుకాడుతూ పోయిపడ్డాడో, లేక విరోధులే పడేశారో తెలియదట. తెల్లవారిచూస్తే వారి పెరటిబావిలో బేబీ శంకరం తేలి ఉన్నాడట.

పాపం నరసయ్యగారికి ఎంత కష్టంవచ్చింది! పోయి ఒకసారి ఆయనను పలకరించివద్దామనిపించింది. నేను వెళ్లేసరికి ఆయన తూర్పింట్లో దిగాలుపడి బల్లమీద కూర్చుని ఉన్నాడు. నేను వెళ్ళగానే ఆయన ఒకపక్కకు జరిగికూర్చోమని సంజ్ఞచేశాడు. కూర్చున్న తరువాత, ''ఎప్పుడువచ్చావు, మీ అత్తకు ఎలావుంది?'' అని అడిగాడు. 

నేను కన్నీళ్ళపర్యంతమయ్యాను. ''తెలియక అడిగాను బాబు. ఏడవకు, ఆమె పోయినసంగతే తెలీదు. ఏ నిమిషాన ఏమి జరుగుతుందో ఎవరు చెప్పగలరు? మాశంకరం సంగతే చూడు. ఇలాజరుగుతుందని కలలోనైనా నేననుకోలేదు. ఓదైవజ్ఞుడు చెప్పాడు ముసలీ ముతక ఊడవలసిందే తప్ప ఆ పిల్లవానికొచ్చిన పరవా ఏమీలేదన్నాడు. నేను ఎంతో సంతోషించాను. కొడుకూ మనమళ్ళ చేతిమీదుగా వెళ్ళ మారిపోతావని ఉబ్బిపోయాను. చూడు యేమిజరిగిందో, అదంతా మాయ–వట్టిమాయ,'' అని ఆయన నిట్టూర్చాడు.

''పిల్లవాడు ఎలా బావిలోపడ్డట్టు?''

'' ఏమనిచెప్పేది. దొంగలు ఆపని చేశారందామా బంగారు మొలతాడు, పులిగోరు, చేతిమురుగులు అలాగే ఉన్నాయి. నాకు శత్రువులు నువ్వు ఎరక్కుండా ఎవరున్నారుగనక? ఇంతకూ వాడికర్మ, మాకర్మ అలా నెట్టుకు వచ్చింది.''

''బావి ఎక్కడ?''

''వెనక పెరట్లో ఉంది. నాకు కాళ్ళుకూడా రావటం లేదు, వచ్చి చూసిద్దామంటె.''

''నేనువెళ్ళి చూసివస్తాను లెండి,'' అని వెళ్ళిచూచాను. బావి బొడ్డు ముప్పాతిక ఎత్తు ఉంది. నేను తిరిగివచ్చి, ''శంకరానికి ఎన్నో ఏడు?'' అని అడిగాను.

'' ఏళ్ళా? తొమ్మిది మాసాలుకూడా సరిగానిండలేదు. చావుకోసమే కామాలు గుమ్మటంలాగా ఎదగివచ్చాడు.''

''అంతా మాయ!'' అన్నాను.

'' ఏమి మాయ అంటావు?'' మొగం ఇంత చేసుకొని అడిగాడు.

''మాయ అనిర్వచనీయ మనికదా పెద్దలంటారు.'' అని నేను వెంటనే బయటికి వచ్చేశాను.

మరసటిరోజునే పైకం అవసరంగా వుందని నరసయ్యగారు నాకు కబురుచేశారు.

అగస్టు, 1974

# వేదాంతి

ఊళ్ళోవాళ్ళంటే వెంకన్నగారికి ఒకటే జాలి. ఎప్పుడూ, అదిలేదనీ, ఇదిలేదనీ, రోగాలనీ, నొప్పులనీ ఎందుకు అవస్థపడుతుంటారో ఆయనకు అర్థంకాలేదు. వాళ్ళకు తెలీక అలా ప్రాకులాడుతున్నారనుకోవటానికి అవకాశం కనిపించలేదు. తెలియనప్పుడు పెద్దవాళ్ళనడిగి తెలుసుకోవచ్చునా? లేదు. ఈ కాలానికి అది అసలు పనికేరాదు. ఒకళ్లు చెప్పటం, మరొకరు వినటమా? ఛీ ఛీ , ఎవరికి ఎంతతోస్తే అంత. అది తప్పైనా ఒప్పైనా అలా జరిగిపోవలసిందే. కాస్త అనుభవం ఉన్న వాళ్లు, పెద్దవాళ్లు ''అలాకాదురా నాయనా, ఇలా,'' అని చెప్పటానికి వీలులేదు. వీలుచేసుకొని చెప్పినా మర్యాద దక్కదు.

మొన్నమట్టుకుమొన్న, పురుషోత్తం కొడుకు ఏమిచేశాడు? తీరాచూస్తే భూమికి జానెడులేడు. వాడికి భూమిమీద కాలు ఆనదు. బడినుంచి యింటికి వస్తుంటే మాత్రం మెల్లగా రాకూడదు? ఆ గాడిద పరుగుదేనికి? పడితే ఆ పలకా, సిరాబుడ్డీ–అవి ఏమౌతాయి? కొత్తగా వచ్చినవళ్ళు ఉంటాయా, ఊడతాయా? బుద్ధిచెప్పవలసిన వెంకన్నగారు చూస్తూ ఊరుకోవటం ధర్మమా?

''ఒరే గాడిదా, ఎందుకురా ఆ పరుగులు? గుర్రాన్ని కాస్త కట్టెయ్యి,'' అన్నాడు. అంతమాత్రానికి వాడేమన్నాడో తెలుసా? టక్కున నిలబడి చేతులు జోడించి ''కొత్తపంతులుగారూ! నమస్కారమండి. దారిలో ఇంకొక బడి పెడతారనుకోలేదు,'' అంటాడా?

అంతే, వట్టి పితపకాలం. ఇవి ఒకళ్ళకు చెప్పేరోజాలు కావు. వినుకోనేవి అంతకాన్న కావు. తన చిన్నతనంలో ఈ పచ్చికలి లేదు. ఆనాడు పెద్దవాళ్ళను ఆ దున్నపోతులాగా వెక్కిరించేవాళ్ళా? పెద్ద వాళ్ళు కూకలేస్తే గుడ్లప్పగించి చూచేవాళ్ళు. మరీ చిన్నపిల్లలైతే గజగజలాడిపోయేవాళ్ళు. నిజానికి కొందరు ఒంటేలు కూడా పోసుకొనే వాళ్ళు.

ఆ రోజాలన్నీ పోయాయి. పెద్దవాళ్ళంటే గౌరవం లేదు. ఆ ఆచారాలు, ఆ సాంప్రదాయాలు, ఆ భాష, ఆ సంస్కారం, ఆ కట్టు, ఆ బొట్టు, ఆ నడవడీ ఈ నాడెవరికీ అక్కరలేదు. ఈ లేత బొప్పిలకు తోచిందే సత్యం; వాళ్ళు నడిచినదే బాట. మాట మాట్లాడితే సహేతుకమనీ, సమంజసమనీ, అభ్యుదయమనీ అంటారు. అసలు వాళ్ల బుద్ధి ఎంత? వాళ్ళ అనుభవం ఎంత? పూర్వులు చెప్పిన దాన్ని ఆలోచించటానికైనా తమకు తాహతు ఉందో లేదో ఆలోచించారూ? ఆమాత్రం తోస్తే బ్రతికే పోదుముగా.

ఇంత పచ్చికలి ఎన్నడూ లేదు. వెంకన్నగారు తమ నలభై ఐదు ఏళ్ళ జీవితంలో ఎప్పుడైనా జరిగిందేమోనని ఒకసారి సింహావలోకనం చేసుకొన్నారు. తమకు ఊహ వచ్చినప్పటినుంచి ఇలాంటిది జరుగలేదు. పెద్దవాళ్ళుకూడ తమ కాలంలో ఇలా జరిగినట్లు చెప్పలేదు. నేడు ఇంత విరగబాటు, పెద్దలంటె ఇంత అలుసు దేనికి? ఈ మూన్నాళ్ళ ముచ్చట్లే శాశ్వతమా? నరకకూపంలాగా ఉన్న యీ నరజన్మ, ఈ ఆడపాటు, ఈ మగపాటు పరమార్థాలా!

మనకళ్ళముందే ఐశ్వర్యాలు అంతరిస్తున్నాయి. వజ్రకాయములు జర్జరితమై పోతున్నాయి. ఇవ్వాళ కనిపించినవాళ్ళు రేపు కనిపించటం లేదు. ఎందుకుపోతున్నవో ఎక్కడకు పోతున్నవో వాళ్ళలో ఎవరైన ఆలోచిస్తున్నారా? లేదు లేదు. అలాంటి ఆలోచనే ఉంటే ఈ అదిరిపాటు ఉండదు. పెద్దలన్నా, వాళ్ళ సలహాలన్నా యింత తిరస్కారం ఉండదు.

ఇదంతా ఎందుకు జరుగుతున్నది? వెంకన్నగారు ఆలోచించారు. అధికారులకు పూర్వ సాంప్రదాయాలమీద, సంస్కారాలమీద గౌరవం లేదు. పైగా ఇంగ్లీషు చదువులు వచ్చిపడ్డాయి. వాటి వల్లనే పూర్వ సంస్కృతి సాంప్రదాయాలమీద గౌరవం పోతున్నది. కుక్క గొడుగుల్లాగా తొ(క్రిమొ(క్రి ఆలోచనలు బయలుదేరుతున్నవంటే ఈ చదువులే కారణం.

ఈ నిర్ధారణకు రాగానే వెంకన్నగారు వెంటనే ఇంగ్లీషు మానిపించి కొడుకు సుబ్బరాయలను శాస్త్రులవారి వద్దకు పంపించాడు. అంతటితో తన బాధ్యత తీరిపోలేదని తెలుసుకొని, తత్త్వగ్రంథాలు తిరగవేశాడు. జగత్తు మిధ్య అనీ, జ్ఞానమొక్కటే సత్యమనీ, అది స్వతః ప్రమాణమనీ, అవిచ్ఛిన్నమనీ చదివినప్పుడు అతని హృదయం లేచివచ్చింది. తాను ఇంత కాలం స్పష్టంగా విప్పిచెప్పలేని పరమార్థాలను పెద్దలు ఎంత తేలికగా, ఎంత చిన్నమాటలతో చెప్పగలిగారు?

వెంకన్నగారికి ఎక్కడలేని ఉత్సాహం బయలుదేరింది. ఆయన సునిశితబుద్ధి దీర్ఘంగా ఆలోచించటం మొదలుపెట్టింది. ఒక్కొక్కప్పుడు ఆకలి దప్పులు గూడ స్పృహకు వచ్చేవి కావు. జ్ఞానం ఎదుగుబొదుగులు లేని అఖండ సత్పదార్థమైనప్పుడు పరిణామం ఎక్కడనుంచి వస్తుంది? అలాంటిది ఉండటానికి వీలులేదు. కాదు పరిణామం ఉంది అంటే అది నవ్యుల అహంకారం. పూర్వులకంటె తాము తెలివి గలవాళ్ళమన్న దురహంకారం. అంతకు తప్ప మరేమీలేదు. జ్ఞానం పరిణామ రహితమై అఖండంగా

అనాదినుంచే ఉంటున్నప్పుడు పూర్వులే దాన్ని తెలిసికొని ఉండాలి. ఇవ్వాళ కొత్తగా కనుక్కోవటానికి వెనుక లేనిదయితే గదా. అందువల్ల పరమసత్యం ప్రాచీనతమం కావాలి.

ఈ అభిప్రాయం కలగగానే వెంకన్నగారికి ఒక్కసారి జ్ఞానోదయమైనట్లయింది. ఆవరించిన అజ్ఞాన మేఘాలు విరిసినట్లయింది. సత్యమంతా ఒక్కసారి ప్రకాశించినట్లయింది.

వెంకన్నగారు అప్పుడప్పుడు తెలుగు భారతం చదువుతూ నన్నయ తిక్కన కవిత్వాలలోని తారతమ్యాన్ని కొడుకు సుబ్బారాయుడుకు వివరించి చెప్పేవాడు. నన్నయభట్టారకుడు, తిక్కనసోమయాజి కంటె ప్రాచీనుడు. ఎప్పుడైనా ప్రాచీన కవిత్వం ప్రాచీనకవిత్వమే; నవ్యుల కవిత్వం నవ్యుల కవిత్వమే. ప్రాచీనుల కవిత్వంలో ఆ గంభీరత, ఆధారా వాహికత్వం, ఆ రసవత్త, ఆవిద్వత్త, నవ్యులకు రావు. నన్నయ భట్టారకుని కవిత్వం చదువుతుంటే సాక్షాత్తు ఋక్కులు చదువుతున్నట్లుంటుంది. ఆ కవితాధార అనర్గళం, ఎక్కడా పొల్లు ఉండదు. ''శ్రీసతివోని కుంతియును జెల్వగు మాద్రియు వెంటరా'', అన్నప్పుడు శ్రీసతి అనీ, చెల్వు అనీ ఎంత సాభిప్రాయంగా నన్నయగారు వాడారు. ఆయన నిజంగా ఋషి. తిక్కనగారు అలాకాదు. ఉదాహరణకు ఆయన వాడిన ''సుఖశ్రీ విభవ'' మన్న సమాసమే తీసుకో, శ్రీ అంటే ఏమిటి? విభవమంటే ఏమిటి? – ఇలాంటి పడికట్టు రాళ్ళే ఉంటాయి. పద్యం ముగియకపోతే కౌరవనాథ అనో, ఇభపురనాథా అనో అంటాడు. పద్యం ఎప్పుడూ సాఫీగా నడవదు. నన్నయగారి పద్యంవలె చటుక్కున బోధపడదు. అంతమాత్రాన తిక్కన గారిని తీసివేస్తున్నాననుకోకు. తరువాత వచ్చిన కవులకన్నా ఆయన ఎన్నో రెట్లు అధికుడు, ఎప్పుడన్నా చూడు. ప్రాచీనకవిత్వం ప్రాచీనకవిత్వమే. నవ్యులకవిత్వం నవ్యుల కవిత్వమే. 163

సుబ్బారాయుడు తన తండ్రి సూక్ష్మబుద్ధికి ఆశ్చర్యపోయాడు. అలాంటిఅభిప్రాయాలు తనకే ముందుగా తట్టి, తండ్రిగారికి తనే ముందుగా చెప్పి ఉంటే ఎంత బాగుండేదని ఉబలాటపడుతుండేవాడు. ఇలాంటి ఉబలాటంకొలది భిన్న భిన్న కవుల మామూలు పద్యాలు వ్రాసుకొని సుబ్బరాయుడు తండ్రికి చూపించి, ఏవి బాగున్నాయో చెప్పమనేవాడు. వెంకన్నగారు వాటిని చదివించుకొని దడదడా వినిపించిన పద్యాలు బాగున్నవనేవాడు. ''కాదునాన్నగారూ, ఆ పద్యాలు రామ భద్రుడివి, మిగతావి ఎఱ్ఱాప్రెగడవి,'' అనేవాడు సుబ్బరాయుడు. వెంటనే వెంకన్నగారు ''రామభద్రుడి పద్యాలు బాగానే ఉన్నాయి. ఎఱ్ఱాప్రగడ ఎంత తేలికగా చెప్పాడో చూడు. మామూలు

మనిషికూ్కడ అర్థమౌతాయి. కవిత్వం అంటే అలా ఉండాలి,'' అనేవాడు. సుబ్బరాయలకు మంచి కవిత్వం లక్షణాలు ఎలా ఉంటాయో తెలుసుకోవటం కష్టమని అప్పుడు తెలిసింది. తన తండ్రి అంత అనుభవం, సునిశితబుద్ధి, అభిరుచి సంపాదిస్తేనే కాని లాభం లేదనిపించింది. వాటిని సంపాదించాలని ప్రయత్నిస్తూ వచ్చాడు.

కాని ఇంతలో ఊళ్ళో హైస్కూలు పెట్టారు. ఇంతలేసి వాళ్ళు అంతలేసి వాళ్ళుకూడ స్కూల్లో చేరి చదవటం ప్రారంభించారు. వాళ్ళ చేతుల్లో లావాంటి పుస్తకాలు, జేబుల్లో ఫౌంటెన్ కలాలు, నెత్తిన క్రాపులు కనిపిస్తుండేవి. అందరి దగ్గర డబ్బు మెదలుతుండేది. ఇవన్నీ చూస్తున్న సుబ్బరాయలకు పెరపెరలు పుట్టేవి. అప్పుడప్పుడు హైస్కూలు కుర్రాళ్ళు తన్నుచూచి ఇంగ్లీషులో ఏమేమో చెప్పుకొని నవ్వుకొంటూ ఉండేవాళ్ళు. బహుశా తన పిలకచూచే నవ్వుతున్నారేమో! ఈ అనుమానం తగలగానే సుబ్బరాయలకు మనస్సుమరీ చివుక్కుమంది. తనుగూడ ఇంగ్లీషు చదువుకొంటేనో?

సుబ్బరాయలు తండ్రిగారిని అడుగుదామనుకొన్నాడు. తీరా అడిగితే కాదంటాడేమో! ఈ సందేహంతో ఒకటిరెండు రోజులు తటపటాయించాడు. అడిగితే తండ్రిగారు కాదంటారేమో, దానివల్ల వచ్చే నష్టమేముంది? ఈ ఆలోచన తట్టగానే ఆతడు ఒకనాడు
164 సాయంకాలం వెళ్ళి వీధి అరుగుమీద కూర్చున్న తండ్రిగారి ప్రక్కన చతికిలబడ్డాడు. కొడుకు ముఖంచూచి వెంకన్నగారు ''ఏమిటి విశేషం?'' అన్నాడు.

''అందరూ కొత్తస్కూల్లో చేరుతున్నారు,'' అన్నాడు సుబ్బరాయలు.

''అయితే ఏమంటావు?'' అన్నాడు వెంకన్నగారు

''అవధాన్ల గారబ్బాయి కూడ చేరాడు, నాన్నగారూ!''

''ఇంతకూ నేనుకూడ చేరుతానంటావు, అంతేనా?'' వెంకన్నగారు గద్దించాడు.

సుబ్బరాయలు మళ్ళా నోరు మెదపలేదు. కాసేపు ఆగి వెంకన్న గారు నింపాదిగా అన్నాడు ''ఒరే చూడు, పెద్దవాణ్ణో, చిన్నవాణ్ణో చెబుతున్నాను. మానవజన్మ మెత్తినందుకు ఇహమొక్కటే కాదు. పరంకూడ చూచుకోవాలి. ఈ ఇంగ్లీషు చదువులవల్ల వచ్చేదేముంది? ఎటు దిరిగి అందరికీ ఉద్యోగాలురావు, వస్తాయేపో, అని శాశ్వతమా? పరమార్థాలా? సంస్కృతమే చూడు. ఇటు లౌకికానికి, అటు పారమార్థికానికీ పనికివస్తుంది. ఇవ్వాళ నామాటలు నచ్చకపోయినా రేపైనా నీకు తెలిసిరాపోతుందా!''

ఈ మాటలు విన్న తరువాత సుబ్బరాయలు తండ్రి దగ్గర ఇంగ్లీషు చదువు సంగతి మళ్ళా ఎత్తలేదు. శాస్త్రులవారి వద్ద నైషధం ప్రారంభించాడు. వెంకన్నగారికి కనీసం

తన కొడుకైనా తనమాట విన్నందుకు సంతోషం కలిగింది. ఇలా ఆర్షధర్మం కొంతలో కొంతైనా సాగుతుండబట్టే ప్రపంచం ఇంకా నిలిచి ఉందని బోధపడింది. ఈ సంగతి తెలిసి వచ్చిం తరువాత వెంకన్నగారు తమ ఆర్షధర్మాన్ని యితోధికంగా అనుష్ఠిస్తూ వచ్చాడు.

ధర్మ విహితానుష్ఠానంలో మునిగితేలుతూ వచ్చిన వెంకన్నగారి భార్యకు దగ్గూ జ్వరం ప్రారంభమయ్యాయి. అయినా ఆమె తన ఆచారాలు మానుకోలేదు. వెంకన్నగారు ఆచార్లుగారి మాత్రలు తెచ్చి యిస్తూనే వచ్చాడు. కాని ఆమెకు జబ్బు నానాటికి ప్రబలమై మంచంలో నుంచి లేవలేని పరిస్థితి ఏర్పడింది. సుబ్బరాయలే వంటచేస్తూ వచ్చాడు. అయినా తల్లికి స్వస్థత చిక్కలేదు. అతనికి వంటచేయటం కంటె రాత్రంతలు తల్లి పడుతున్న బాధే దుర్భర మనిపించింది. ఒకనాడు తల్లి మంచం వద్ద కూర్చుని సపర్యలు నడుపుతున్న తండ్రితో చూచాయగా అన్నాడు. ''నాన్నగారు, కొత్త డాక్టరుగారి చేతివాసి మంచిదంటున్నారు.''

వెంకన్నగారు మాట్లాడలేదు.

''ఎటువంటి రోగాలు కూడ నయమైపోతున్నవని అంతా చెప్పుకొంటున్నారు,'' అన్నాడు సుబ్బరాయలు. 

''ఒరే సుబ్బులూ, డాక్టర్లు దేవుళ్ళటరా! ఎవరికర్మ ఎవరు మారుస్తారు? అసలు పూర్వసంచితం అనేది ఒకటి ఉంటుందంటావా?'' అన్నాడు వెంకన్నగారు.

సుబ్బరాయలు కుక్కిన పేనయ్యాడు చెమ్మగిల్లిన కన్నులతో తల్లిని చూచాడు. ఆమె మాట్లాడలేదు. వెంకన్నగారు భార్యకు ఆచార్యుల వారి మాత్రలు ఇచ్చి సపర్యలు నడుపుతున్నాడు. అయినా కర్మబలీయంగా ఉండటం వల్ల ఆమె పతిసేవలు వదలిపెట్టిపోయింది.

భార్య పోయినప్పటినుంచి వెంకన్నగారికి ప్రాపంచిక విషయాల నశ్వరత్వం మరీ స్పష్టమైపోయింది. ప్రతి దానిమీద విరక్తి కలిగింది. తనదగ్గరకు వచ్చే వారందరికీ తన అనుభవాన్ని వివరించి చెబుతూ వుండేవాడు.

ఇంతలో ఆయన రొమ్ముమీన ముక్కు మొనలేని గడ్డలేచింది. అది మొదట్లో బాధపెట్టలేదు. అందువల్ల వెంకన్నగారు త్రోసివేసుకు తిరుగుతూవచ్చాడు. కాని అది నానాటికి ప్రవర్ధమానమౌతూవచ్చింది. దానితో ఆయన ఆచార్లవారి వద్దకు రేపుమాపులు వెళ్ళివస్తూ వచ్చాడు. దాన్నిబట్టి ఆయనకు ప్రాణభయం కలిగిందనుకోవటం చాల

వేదాంతి

పొరపాటు. మానవ జన్మమెత్తినందుకు పూర్వజన్మ సంచితం విరగడ చేసుకోవాలా! ఆత్మస్వరూపం తెలుసుకొని బ్రహ్మానుభూతి పొందనిదే జన్మరాహిత్యం ఎలా లభిస్తుంది? కొడుకు సుబ్బరాయలు ఇంకా సూత్రభాష్యం పూర్తిచేయలేదు. ముందుగానే జన్మచాలిస్తే ప్రయోజనమేముంది?

ఈ ఉద్దేశంతో వెంకన్నగారు ఆచార్లువారి వద్దకు వెళుతుండేవాడు. ఆయనకూడ ఈ లేపనం కాదని ఆ లేపనం, అదికాదని పసరులు పూసి ఎన్నోతంటాలు పడ్డాడు. తల్లక్రిందులుగా తపస్సు చేశాడు. కాని ప్రయోజనం లేకపోయింది. పూర్వసంచితం అంత బలీయంగా ఉన్నప్పుడు ఆచార్యులవారు మాత్రం ఏం చేస్తారు?

వెంకన్నగారి గడ్డ ఇంతై అంతై నభమంత కాదు కాని, తాటికాయంతై ఊరుకొన్నది. వేరేబాధ ఏమీలేదు. కాస్త గట్టి వస్తువు తాకినప్పుడు మాత్రం కొంచెం నొప్పి అనిపించేది. అయినా ఆయన నిత్య వ్యవహారానికి ఆటంకం కలగలా. ప్రతిరోజు జగత్తు మిధ్య అనీ, జ్ఞానం ఒక్కటే నిత్యమనీ, పామర లోకానికి వీలు చిక్కినప్పుడల్లా బోధిస్తూనే ఉన్నాడు.

ఒకరోజున వీధి అరుగుమీద కూర్చుని దస్తావేజు చదివిపెట్టమని వచ్చిన కాపుకు వెంకన్నగారు ప్రపంచ మిధ్యాత్వం వివరించి చెబుతుండగా ఒక జంగమదేవర వచ్చి ''శంభో మహదేవ్'' అంటూనే బయ్యిన శంఖు పూరించాడు. ''అబ్బ ఆపవయ్యా, కాస్త ఆపు,'' అంటూ వెంకన్నగారు భిక్ష తెచ్చి పెట్టటానికి లేచాడు. లేవగానే కప్పుకొన్న ఉత్తరీయం కొంగు ఒకప్రక్కజారి గడ్డ జంగమదేవర కంటపడ్డది. వెంటనే అతడు ''కాస్తయిటు మళ్ళండి,'' అన్నాడు. విస్తుపోయి వెంకన్నగారు జంగం వైపుతిరిగాడు.

''ఆ గడ్డలేచి ఆరెనెల్ల పదిహేను రోజులయింది కదూ?'' అన్నాడు జంగం

''ఆఁ, ఆఁ. ఒకటిరెండు రోజులకేంగాని అంతే'' అన్నాడు ఆశ్చర్యచకితుడైన వెంకన్నగారు.

''మీరు మరొకసారి జ్ఞాపకం తెచ్చుకోండి. ఆ గడ్డ లేచి ఆరెనెల్ల పదిహేను రోజులకన్న ఎక్కువ కావటానికి వీలులేదు.'' అన్నాడు జంగం.

వెంకన్నగారికి పంచప్రాణాలు లేచివచ్చాయి. అంటే బాధవిరగడై పోతుందన్న ఆసగాదు. పూర్వజన్మ సంచితం విరగడై జన్మరాహిత్యానికి ఈ జన్మలోనే అవకాశం లభిస్తుందని ఆయన సంతృప్తి. కాపును పంపివేసి వెంకన్నగారు జంగమదేవరతో బేరమాడాడు. జంగం యాభైరూపాలు కట్నమడిగాడు. అటుగీసి ఇటుగీసి వెంకన్న గారు అతన్ని ముప్పై రూపాయలకు ఒప్పించాడు. ముందు పదిరూపాయలిచ్చేట్టు,

పూర్తిగా నయమయ్యాక మిగత ఇరవై ఇచ్చేటట్టు. ''జ్ఞానపత్రం కూడ దయ చేయించాలి,'' అన్నాడు జంగం. ''సరే అలాగే కాని,'' మ్మన్నాడు వెంకన్నగారు.

మంచిరోజు చూచి వచ్చి జంగం వెంకన్నగారికి వరుసగా మూడు రోజులు పట్టీలు వేసిపోతూ వచ్చాడు. నాలుగోనాటికి గడ్డపై చర్మం చిట్లింది. ఆ రోజున వెంకన్నగారి సంతోషానికి మేరలేక పోయింది. జంగం కొత్త పట్టీవేసి, జ్ఞానపత్రం మరికొంచెం అధికంగా పుచ్చుకొని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి వెంకన్నగారికి కలిగిన ఆ నూతన అనుభూతి చెబితే అర్థమయ్యేది కాదు. ఆయన మంచంలో దొర్లినవాడు దొర్లినట్టుగానే ఉన్నాడు. తెరచినకళ్ళు తెరిచినట్టుగానే ఉన్నాయి. ఆ ఉదయాన కొడుకును పిలిచి వెంకన్నగారు ''ఒరే సుబ్బులు, మధుసూదన సరస్వతి కాలం మిథ్య అన్నాడుటరా?'' అని అడిగాడు. సుబ్బరాయలు 'అద్వైత సిద్ధి' తెరచి, ఆ పంక్తులు చదివి వినిపించి, ''ఆసందేహం మీకెందుకు కలిగింది?'' అని అడిగాడు. ''ఏమీ లేదు, నేనేమన్నా పొరపాటు పడ్డానేమోనని అడుగుతున్నాలే,'' అన్నాడు వెంకన్నగారు.

జంగం ఆ పూట కూడ వచ్చిచూచి, చెప్పిందంతా విని మళ్ళీ పట్టీ వేసిపోయాడు. ఆరాత్రి వెంకన్నగారికి పూర్తిగా అనిమిషత్వం సిద్ధించింది. అనిమిషత్వం సిద్ధించిన తరువాత వైద్యుడు దేనికన్నట్లుగా జంగం మళ్ళీ ముఖం చూపించలేదు.

పై చర్మం చిట్లిన గడ్డ చీముపట్టి వెంకన్నగారికి తీపులు ఎక్కువయ్యాయి. దానితో ఆయనకు తెలియకుండగానే మార్పులు పొడసూపసాగాయి. తన మంచంవద్దనే కాపెట్టుకొని సకల సపర్యలు చేస్తూ వున్న సుబ్బరాయలను వెంకన్నగారు గద్దించటం, చెడామడా తిట్టటం సాగించాడు. సుబ్బరాయలు విస్తుపోయి చూస్తూ ఉండేవాడు.

రోజులు గడిచిన కొందికీ – అసలు గడిస్తేనా – వెంకన్నగారికి బాధ ఎక్కువ కాసాగింది. దానితో 'జగత్తు, మిథ్యేనా? తాను పడుతున్న అవస్థ యిలావుందేమి?' అన్న సందేహాలు మొలకలెత్తసాగాయి. ఒకరాత్రి బాధమరీ ఎక్కువై ''ఒరే సుబ్బులూ!'' అని కేకపెట్టాడు. అప్పుడే కునుకుపాట్లు పడుతున్న సుబ్బరాయలు అదిరిపడి '' ఏమిటి నాన్నగారూ!'' అంటూ దగ్గరకు వచ్చాడు.

''ఒరే నేను బ్రతకనురా. ఒకసారి ఆ కొత్తడాక్టర్ను పిలుచుకురారా,'' అన్నాడు వెంకన్నగారు.

సుబ్బరాయలు తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు. తండ్రి గారు తెలివిలో ఉండే మాట్లాడుతున్నారా అనే సందేహం కలిగింది. వెంకన్నగారు మళ్ళీ అదే ప్రాధేయపడుతూ అడిగాడు.

''నాన్నగారూ! డాక్టర్లు దేవుళ్ళా? ఎవరి కర్మను ఎవరు మారుస్తారు? అసలు పూర్వజన్మ సంచితం నశించందే ప్రయోజనమేముంది? అది నశించకపోతే మళ్ళా జన్మ తప్పదు. ఇలాంటి నరకం తప్పదు.'' అన్నాడు సుబ్బరాయలు.

''అరే కాస్తకని పెంచిన వాణ్ణని అయినా చూడరా, నా గతి ఎలా ఉంటే అలా అవుతుంది. కనీసం నీకున్న పుత్ర ధర్మాన్నైనా తీర్చరా,'' అన్నాడు వెంకన్నగారు.

''ఇంత అనుభవం వచ్చిన తరువాతగూడ పొరపడుతున్నారేమిటి? శంకర భగవత్పాదుల వాక్యాలు మరచిపోయారా. వాడు తండ్రి, వాడు పుత్రుడు, వాడు శత్రువు అనుకోవటం కన్న వ్యామోహం మరేముంది?'' అని జ్ఞాపకం చేశాడు సుబ్బరాయలు.

వెంకన్నగారు మళ్ళా మాట్లాడలేదు. నాలుగురోజులు దొర్లిగింతలు పెడుతూ అరుస్తూ వచ్చాడు కాని పల్లెత్తుమాట అనలేదు. అయిదోరోజు తెల్లవారుజామున

కొడుకునులేపి ''ఒరే సుబ్బులు, జగత్తుమిథ్య; నేను, నాది, నావాడు అనుకోవటం వున్నదే, అది వట్టి వ్యామోహం'', అని కళ్ళు తేలవేశాడు.

*నవంబరు, 1947*

# రామరాజ్యం

గోచి పెట్టినప్పటినుంచి రాఘవులు బుర్రయ్యగారి దొడ్లోనే ఉంటున్నాడు. సాటి సంసారి కుటుంబంలో పుట్టినా, కొంద్ర లేకపోవటం వల్ల అతడు జీతానికి ఉండవలసివచ్చింది.

ఆరునెల్ల ఆవుదూడ పక్కన నుంచుంటే అవతల ఆసామికి కనిపించని దశలోకూడ రాఘవులు ఏమేమో కలలు కంటూ ఉండేవాడు. తాను రామిగాడు తెచ్చే గడ్డి మోపులు కంటే పెద్దమోపులు తేవాలనుకొనేవాడు. రామిగాడు మూడుకట్లమీద బొద్దుమోపుకట్టుకొస్తే దొడ్లో గొడ్లన్నిటికీ ఆరోజుకే అస్తుబిస్తూ, తాను మోపు తెస్తే రెండురోజులకు ఎక్కడకి కావద్దూ!

రామిగాడు తాడువేస్తే కొసమీద నిటారుగా నిలబడుతుంది. అతడు దగ్గరకెళ్లితేచాలు – అంత పొగరుమోతైనా సూరయ్యగిత్త గజగజలాడిపోతుంది. తొట్లో కూచున్నాడో ఎంత బురదలోనైనా, కాడి విరిగేది పెద్దడ్లజత ఎనిమిదిసలకలబండినీ అవతలకి ఈడ్చి పారవెయ్యాలిసిందే. కుప్పెయ్యటాని కెక్కాడో దానికి వంక పెట్టటానికే వీలులేదు. వామో–చూచేవాళ్లు ఆశ్చర్యపోతారు. అంత సంతనీసుగా వేస్తాడు.

తానుకూడ అంతకన్నా పనిగాడు కావాలని రాఘవుల ఆశ.

తెల్లావు కోడెదూడను పెట్టినప్పటినుంచీ రాఘవుల కోర్కెలు రేగాయి. ఎర్రావుకూడా కోడెదూడను పెడితే ఎంత బాగుంటుంది! జత ఏర్పడుతుంది. తనతోపాటు అవీ ఎక్కవస్తాయి. తానే వాటిని అలవర్చవచ్చును. తానెంత పనిమంతుడౌతాడో అవీ అంతపందెగాళ్లు అవుతాయి. ఊళ్లో మళ్లీ యిలాంటి జత లేదనిపించుకొంటే ఎంత బాగుంటుంది! అవే ఎక్కవస్తేనా తను యీనాడు సన్యాసులమాదిరిగా చేస్తాడా? అలాగ్గా రోజుకి రెండెకరాల మెట్టసాలు దున్నిరాడూ!

ఇంతకూ ఎర్రావు కోడెదూడను పెట్టాలిగదా అన్న సందేహం వచ్చింది. రాఘవులకు మనస్సులో చెప్పరాని ఆందోళన కలిగింది. నిజంగా ఈ యీతకు ఎర్రావు కోడెదూడనుపెడితే, పుట్టాలమ్మకు తప్పక నాలుగు కొబ్బరి కాయలు కొడతానని అతడు మనస్సులో మొక్కుకున్నాడు.

ఆ ఆవులు తనవికావు. ఆ ఆసామి తనను దొడ్లో ఎంతకాలం ఉండనిస్తాడో తెలీదు. అలాంటప్పుడు కోడెదూడపుడితే కొబ్బరికాయలు తనజీతంలో డబ్బుపెట్టికొని

కొడతానని మొక్కుకోవడమేమిటి? ఇలాంటి ప్రశ్నే అసలు ఏమాత్రంకూడ స్ఫురించలేదు. కాని రాఘవులు మాత్రం మొక్కుకున్నాడు.

ఇలాంటి ఆశలు లేకపోతే మానవునికి క్షణంసేపు గడవదు. రాఘవులుకూడ ఇలాంటి ఆశలతోనే తన పదమూడోయేడు గడుపుతున్నాడు.

★ ★ ★ ★

ఆనాడు కొంచెం ప్రొద్దెక్కింది. బర్రెగొడ్లను తోలుకెళ్ళటానికి రాఘవులు హడావుడిగా అన్నం తింటున్నాడు. అప్పుడే బుర్రయ్య కల్లాంనుంచి ఇంటికివచ్చి చేతిలోని ములుగర్ర తూర్పింట్లో మూలబడేసి రాఘవుల్ని చూచాడు.

''తొత్తుకొడకా, ఇంకా తిండిదగ్గరేవుంది యవ్వారం? ఊళ్లో గొడ్లన్నీ పోయి ఎంతోసేపైయిందిరా?'' అన్నాడు.

మొదటినుంచీ రాఘవులు మాటంటే పడేవాడుకాడు. కొంచెం ఎండెక్కినమాట నిజమే. అయినా వాడూరికేనే కూర్చున్నాడా? తెల్ల వారిజామునుంచీ ఎముకలు విరుచుకొంటూనే ఉన్నాడాయె. ఏదో చెప్పబోయాడుకాని అప్పుడున్నస్థితిలో ఎదురుచెబితే ఉతుకుతాడేమోనని మానివేశాడు.

170

''కూర్చున్నావేమిరా దున్నపోతా! తొందరగాలేచి గొడ్లనువిప్పు'' అన్నాడు బుర్రయ్యదొర.

రాఘవులు తల ఊపాడు.

''యాడికి తోలుకెడతా?''

''కుప్పేస్తున్నారుగా, అక్కడికి తోలుకొస్తాను.'' అన్నాడు బుడ్డాడు.

''అక్కడికి దేనికి; యెత్తుకుతిన్నా? మన పడమటి పొలం తోలుకెళ్లు. అవుల్నికూడ విప్పుకెళ్లు. చేనునిండా జనపపరిగా, ఊదా, పచ్చికా దండిగావున్నాయి; పొద్దు గూకిందాకా తిప్పుకురా. అవుల్ని వదలిపెట్టి వెళ్ళేవు. మధ్యాన్నం నీళ్లపోసేవాళ్లుకూడా లేరు.''

రాఘవులకు గుండె గుభేలుమంది. ఎంతో కాలంనుంచి కట్టేసివున్న ఎలు ఎల్ను మళ్లెయ్యటమంటే సామన్యం కాదు. పైగా ఆపొలం విసిరవేసినట్టు దూరంగా ఉంటుంది. మనిషి అనేవాడు యీరోజుల్లో కనిపించడు.

''కుప్పదగ్గరకువస్తే బంతితోల్తాగా,'' అన్నాడు రాఘవులు.

''ఏడిచావులే, ఇదిగోచూడు – జనపకట్ట దిబ్బమీద పోగేసి ఉంది. గొడ్లు దిగదొక్కుతాయి, జాగర్త. జతగాళ్ళను ఎంటేసికెళ్ళి లోకుల గొడ్లన్నిటినీ చేలోకి రానిచ్చేవు. పొద్దుగూకేటప్పుడు వచ్చిచూస్తాగా? చేదు గొడ్డు, పడిగొడ్డు వచ్చినజాడ కనపడాలి; తిత్తిఒలిచానే.'' అన్నాడు ఆసామి.

రాఘవులు చల్లాఅన్నంతిని, కిందబడ్డ మెతుకులేరి గిన్నెలో వేసుకొని బయటకెళ్ళి కడిగి పారబోసివచ్చాడు. కర్రకోసం వెదికాడు. కనపడలా, చివరికి అతడు మూలపడేసిన ములుగర్ర పట్టుకొన్నాడు.

''నాకర్ర తీస్తావేమిరా గాడిదా; నీకర్ర ఏమైంది?'' అన్నాడు ఆసామి.

''నాకో కర్రెక్కడిది? రోజా ఏపుల్లో తీసుకెళ్ళుతున్నా, ఇవ్వాళ అవుల్ని మల్లేయాలిగా'' అన్నాడు బుడ్డాడు.

బుర్రయ్య నసికాడు. ఏరైతూ జీతగాడికి కొత్తకర్ర యివ్వటానికి ఒకపట్టున ఒప్పుకోడు. పుస్తకాల్లో చూస్తే మూడులోకాల్ని మూపున వేసుకొని మోస్తున్నట్లు కనిపిస్తాడు. 171

రాఘవులు దొడ్లోకివెళ్ళి పాడిబర్రెనూ, పడ్డనూ విప్పాడు. పడ్డ ఉచ్చతోకతో ఫెడేలున అతనిముఖాన కొట్టి వాయిక్కర్లు కొట్టుకొంటూ దొడ్డిగేటుదాక దౌడు తీసింది.

'' ఓసి నీయమ్మ సిగతరగ! నీకెంత పెట్టాడే దేవుడు,'' అంటూ అతడు కర్రిపెయ్యను తప్ప మిగిలిన ఆవులపలువులు తప్పించాడు. స్నానం చెయ్యటానికి దొడ్లోకివచ్చిన బుర్రయ్య కర్రిపెయ్యనుచూచి ''దాన్ని విప్పవేమిరా? నదరకట్టంగా ఉండాలా యేమిటి'' అన్నాడు,

''బాబోయి దానిదగ్గరకు పోను.''

''విప్పలేవూ! తింటా తూమెడైతే.''

బుర్రయ్య జీతగాడి దగ్గరనుంచి కర్రతీసుకున్నాడు. అతగాడికీ గుండె లటుక్కే. ఆ కర్రిపెయ్యే ఆసామిని ఒక సారి యెత్తి గాట్లో కుదేసింది. అప్పుడు వచ్చిన నడుము కలక యింకా అప్పుడప్పుడు కనిపిస్తూనే ఉంటుంది.

దొర కర్రిపెయ్యను విప్పేటప్పటికి దొరసాని దగ్గర నుండి అతడూ అన్నంమూట పుచ్చుకొన్నాడు. ఆవులు అలవాటుచొప్పున చావిట్లోకి వెళ్ళాయి. అతడు దొరదగ్గరనుంచి

కఱ్రతీసుకొని వెళ్ళి ఆవుల్ని బయటికి తోలాడు. మళ్ళీ దేని కట్టుగొయ్యదగ్గర అవి రష్యన్ సైనికుడిలాగా వచ్చి నిలబడ్డవి. మళ్ళీ బయటికి తోలితే కొన్ని చావిట్లోకి, కొన్ని గడ్డి మోపుదగ్గరకూ చేరుకొన్నాయి. అచ్చుగా కాంగ్రెస్ మచ్చే. జైళ్ళలో నుంచి నెడితే పదవులలోకీ, పదవులలోనుంచి నెడితే జైళ్ళలోకి తిరుగుతున్నట్లుగానే పశువులుకూడా ప్రారంభించాయి.

వాటిని దొడ్డిబయిటికి తోలేటప్పటికి రాఘవులికి పెద్దలు దిగివచ్చారు.

ఇక బజారుకు వచ్చినతరువాత తిన్నగా పోవచ్చునా? లేదు. దొడ్లో ఉండి ఉండి కాళ్ళు గుదుళ్ళు పట్టాయేమో, ఆవులు తోకమట్ట లెగబట్టి నాలుగుకాళ్ళమీద లేచాయి. అన్నీ ఏదో ఒక దిక్కుకు పరుగెత్తినా ఇబ్బంది ఉండేది కాదు. ఒకటి ఉత్తరవీధికి, నాలుగు దక్షిణవీధికి, మూడు తూర్పువీధికి పరుగెత్తాయి.

పొడుగాటి ములగఱ్ఱ పైకెత్తుకొని రాఘవులు ఉత్తర వీధినిపడ్డ ఆవు వెంట పరుగెత్తాడు. తన ఆదికిమించిన ఆ పాతచెప్పులు, ముచ్చటముడి ఊడి అన్నపుమూటతో కలిసి వీపున దరువేస్తున్న ఆ వెంట్రుకలు, అతడు పరుగెత్తుతున్న కొందికి ఆవు నాలుగు కాళ్ళస్వారి లంకించుకుంది.

172 ఇంతలో ఎదురుగావస్తున్న రైతు ఆవును మళ్లేశాడు. ఎలాగో ఆ బుడ్డాడు ఆవును అసలువీధికి తోలుకొచ్చాడు ఇంతలో రామిగాడు ఎదురయ్యాడు.

''అరేయ్ కాస్త ఊరిబయటదాక వీటిని తోలిపెట్టరా'' అని అడిగాడు.

''పో అస్సె, నాకు బొచ్చెడంత పనుంది'' అన్నాడు రామిగాడు.

''సాయంత్రం నీకు పొగాకుపెట్టద్దా, రా, కాస్త అందాకా వచ్చావా నేనే త్రోలుకెళ్లతా.''

ఆసామికి తప్ప మరొక నరమానవుడికి రామిగాడు వంగేవాడుకాడు. కాని ఏగుణానవున్నాడో రాఘవులకు తోడయ్యాడు. ఇద్దరూకలిసి గొడ్లన్నిటిని పోవాలిసినవీధికి మళ్లేసుకొచ్చారు.

రాఘవులకు చెమటలు దిగ్గారుతూన్నాయి. అతిపసికాయ కావటంవల్ల దమ్ము తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. అతని యీడుపిల్లలు అప్పుడే బళ్లోకి వెళ్లుతున్నారు.

తాను బళ్ళోకివెళ్లి వాళ్ళమాదిరిగా ఎందుకు చదువుకోగూడదు? నీడపట్టున హాయిగా కాలుమీద కాలువేసుకొని, నోట్లో వేలుకూడ వేసుకొని కూర్చోవచ్చునే.

---

జి.వి. కృష్ణరావు

ముందుపోతున్న కర్రిపెయ్య పక్క గోడమీద బీరతీగను ఎప్పుడు చూచిందో యేమో, అమాంతం ముందు రెండుకాళ్లతో అంతెత్తూ గోడకూ నిచ్చేనేసి తీగను అందినంతవరకు బరుకుతున్నది. రాఘవులు పెద్దగా కేకలు వేస్తూ పరిగెత్తుకొని వస్తూనేవున్నాడు.

అతడు అసలు అరవకుండా ఉండే పిడకలు చేసుకొంటూ ఉన్న ఆ యిల్లాలు చూచివుండేది కాదేమో, ఆ కేకవిని చూచి '' ఔరౌరా! నీకళ్ల తోడారా? పాదుపైకి ఆవునుతోలి ఊరుకొంటావా? పేగులు ఎళ్ళదొక్క వాళ్ళులేక'' అంటూ గలగలా జగడానికి వచ్చింది.

రాఘవులు పెయ్యను తోలాడు. అప్పుడు మాట్లాడితే పోట్లాటే. ఆ యిల్లాలు ఇంకా తిడుతూనేవుంది.

ఇలా తిట్లుతినమనేనా తనతల్లిదండ్రులు కనిపారవేసింది? ఈ తిట్లు నిజంగా తగిలితే లోకం ఉంటుంది! ఎందుకు నోరిలా పారేసుకుంటారు? తాను గొడ్లను తిట్టటంలా? అయితే తానుగూడా ఒక గొడ్డేనా?

అంతేనేమో? వాటికన్నా తనగతి ఏమంత బాగున్నది?

పడమటిపొలమెల్లే డొంకవచ్చింది. రామిగాడు వెళ్లిపోయాడు. వాడుకూడ వస్తే ఎంతబాగుండును. హాయిగా పిచ్చాపాట మాట్టాడుకుంటూ వుండవచ్చును. వీల్లేదు. బుర్రయ్య ఊరుకుంటాడూ? తమ యిద్దరిబుర్రలు రామకీర్తన పాడించడూ? 173

ఆడొంకకు మామూలుగా గొడ్లురావు. రాఘవులికి బిక్కు బిక్కు మంటూ ఉంది. గుండెనిబ్బరం తెచ్చుకోవటానికి చూపు టేలుమడిచి ఈలవేశాడు. బర్రెలు దుడుకు దుడుకు పరుగుపుచ్చుకున్నాయి. వాటితో ఆవులు లేచాయి. కాస్తలెక్క వెళ్లాక పెద్దకాలవ వచ్చింది. కాలవ కట్టేసి చాల కాలమయింది. అయినా రేవులో తొడలోతున నీళ్లున్నాయి. ఇంటిదగ్గర నీళ్లుతాగని ఆవులు కాలవలోనీళ్లు తాగాయి. బర్రెగొడ్లు అమాంతం నీళ్లలో పండుకున్నాయి.

నీళ్లు తాగింతరువాత రాఘవులు ఆవుల్ని అదలించాడు. అవి తటపటాయిస్తున్నాయి. కర్రిపెయ్యను గట్టిగా తెల్లావుమాటునవుండి కొట్టాడు. నీళ్లు కరుస్తున్నట్టుగా అది తోక పైకెత్తి అవతలఒడ్డుకి ఉడాయించింది. దానితో కడమ ఆవులుకూడా కాలవదాటాయి.

బర్రెగొడ్లమందను నీళ్లలోనుంచి ఎక్కగొట్టేటప్పటికి పెద్దలు దిగివచ్చారు.

ఆ డొంక, నేరుగా బుర్రయ్య ఏడెకరాల మళ్లోకి తీసుకెళ్లింది. పచ్చి పరకలకు కరువ్వాచివున్న ఆవులు మేతకు పడ్డాయి. రోజూ పొలం తిరిగి వస్తున్న బర్రెగొడ్లుమాత్రం కాలాడిస్తూ అక్కడక్కడ దొరుకుతున్న జనపపుల్లలు నంజాతున్నాయి.

డొంకదరినేదిబ్బ. దిబ్బమీదనే జనపకట్టె పోగేసి వుంది. చేను ఆవలిగట్టున యాపచెట్టు ఉంది. చెట్టునీడను కూర్చుంటే ప్రాణాలు కాస్త కుదటపడతాయి. కాని యీ పాడుమందను ఏంచేసేటట్లు? దిబ్బమీద జనపకట్టెను ఆరుమూడు చెయ్యవు? చేస్తే తనవీపు తప్పెట మోతలేగదా?

అందువల్ల జనపకట్టదగ్గర కూచోటమేమేలు. అయితే తీసి చరుస్తూ ఉన్న ఎండలో ఎలా కూలబడటం?

రాఘవులు పొట్టురాలకుండా పదికట్టలుతీసి గూడువేశాడు. కూచోబోతున్నాడని పసిగట్టిందేమో, కర్రిపెయ్య పక్కచేలో ఉలవకు బయలుదేరింది.

'' ఎహై, ఎహై! నినుమాదిగింటికీడవా! తిరుగు,'' అని కేకపెట్టాడు.

ఒకసారి రుచిమూస్తే పుల్లయ్యచేను బోడి తుడిపే. కర్రిపెయ్య చేను దరిదాపులకు చేరుకొంటున్నది. అతడు ములుగర్ర బుజానెట్టుకొని చేను కడ్డంబడి పరిగెత్తాడు. చేనంతట గసికలలాంటి జనపమోళ్ళు, చెప్పులకాళ్లతో పరిగెత్తటం. ఒకమోఢుతగిలి అతడు బిళ్ళబీటుగా పడ్డాడు. మోడు డొక్కలో గుచ్చుకొన్నదేమో, పై ప్రాణాలు పైనే
 ఎగిరినట్లయింది. అతని కళ్లమ్మట గిర్రున నీళ్లు తిరిగాయి.

మోరెగబట్టుకొని మరీవెళ్లుతున్నది. రాఘవులు లేచి పరుగెత్తివెళ్లాడు. దగ్గర్లోకిరానిచ్చి అది కస్సున అతని మీదికి తిరగమల్లింది. రెండడుగులు వెనక్కు పరుగెత్తి అతడు సత్తువకొందికీ కర్రను గిరాటుపెట్టాడు. ఆదెబ్బతో దడిసి కర్రిపెయ్య గొడ్లవైపు మళ్లింది. దానిని గొడ్ల మధ్యలోకితోలాడు

ఇంతలో ఎర్రావు జనపకట్టెమీదికి దండెత్తుతూవుంది.

'' ఎహై, మళ్లు! దెబ్బకు కోడెదూడను పెట్టాలి.''

మళ్లీ పరుగు. నాలుగడుగుల్లో జనపకట్టె. రాఘవులు ఉడాయింపు ఎక్కువచేశాడు. ఆ తొందరలో మోడుకస్సున పక్కవాటుగా కాల్లో గుచ్చుకొని నెత్తురు భొల భొల కారింది. ఆబాధ నసాళమంటింది.

ఎర్రావు జనపకట్టల్ని లాగనే లాగింది. ఆసామి భయంకొందికీ అతడు మళ్లీ పరిగెత్తి దాన్ని మందలోకి కొట్టాడు. పాడుచేసిన నాలుగు కట్టలు ఏమిచేసేటట్లు? సాయంతరం దొరవచ్చిచూస్తే తన్ను బ్రతకనిస్తాడా?

రాఘవులు దిగులువడ్డాడు. గొడ్లను తిట్టాడు. తన్ను తాను తిట్టుకొన్నాడు. తన్ను

కనిపారేసినందుకు తల్లి దండ్రుల్ని తిట్టాడు. చివరికి ఆ జనపకట్టల్ని తీసికెళ్లి చేను మధ్యలో గొడ్లను పోగువేసి వాటికేశాడు. ఆ నాలుగు పుల్లలు అయిపోయేదాకా ఊరుకొన్నాయి.

తరువాత మళ్లీ మొదలు. ఆవులు పుల్లయ్య చేనువైపు, పద్ద కాలవవైపు బయలుదేరాయి.

ఈ వరసన చెడుగుడులు ప్రారంభించాయి. రాఘవులు ఒక్కొక్కదాన్నే మళ్లెయ్యను, ఒకనిట్టూర్పు విడవనూ. కారుతున్న చెమటను చేతితో తుడిచి క్రిందికి విసరను.

అతనికి ఏడుపు వచ్చింది. కర్ర దూరంగా విసరిపారేశాడు. పారిపోదామని గనుము పుచ్చుకొని నాలుగు బారలు వెళ్లాడుకూడా.

ఎక్కడికి పారిపోవటం? రాత్రి యెలా జరగాలి? చీకట్లో ఎక్కడ పండుకొంటాడు? ఒంటరిగా పండుకొంటే దయ్యాలు కనిపించవూ? తిండి ఎవరు పెడతారు? ఈ వరస వాడిని ఎవరు జీతానికి పెట్టుకుంటారు?

గొడ్లు ఏమౌతాయి? ఏమయ్యేదేముంది? పుల్లయ్య చేలోబడి సుష్టాచేస్తాయి. పుల్లయ్య వాటిని తోలుకెళ్లి బందిలిదొడ్లో పెడతాడు. బుర్రయ్య వెళ్లి తనయింటిమీద పడతాడు. తనబాబు తనయెముకలు ఏరటానికి బయలుదేరుతాడు.

దొడ్లో బుజ్జాయి ఏమౌతుంది? రోజా తనవెంట పరుగెత్తుకొస్తుందే. దానిగతి ఏమికావాలి? పెద్దదైన తరువాత దాన్ని బండికి అలవర్చవద్దూ? ఇన్నాళ్లనుంచి తాను అనుకొంటున్న వాటినన్నింటినీ ఒక్కసారిగా వదులుకొని వెళ్లడమే? 

రాఘవులు ముక్కుచీదుకొని, పారేసినకర్రను తిరిగి తెచ్చుకొని జనపకట్టల గూటిదగ్గరకు వెళ్లాడు.

ఎవరోవస్తున్నారు. బుజాన తట్ట ఉన్నట్టుంది. ఎవరై ఉంటారు? అసలు ఈలాంటివేళ ఎవరు వస్తారు? పొద్దు వాటారినట్లుంది. అయినా ఎవరువస్తారబ్బ! తట్ట తెచ్చిన మనిషి తన ఆసామి చేలోనే వంగినట్లుంది. పేడ వేస్తున్నదా యేమిటి?

''ఎవరది! బెల్లంగొట్టినరాయిలా పలకవేం?'' అని కేకవేశాడు.

ఆమనిషి పలకలా. అలాగే నిలబడ్డది. రాఘవులు కుంటుకుంటూ దగ్గిరికెళ్లాడు. బూసిగాడికూతురు రత్తి. పేడవేస్తూ ఉంది. అతడమాంతం పేడతట్ట లాక్కొని;

'' ఇది చేననుకొన్నావా, మీ తాతగాడి దొడ్డనుకొన్నావా?'' అన్నాడు.

రత్తి చిన్నగుంట. బిక్కమొగం వేసింది. తనయింటి పక్కనేవుండే రాఘవులు ఇలా అంటాడనుకోలేదు.

''నుంచున్నావేం? పో, ఇంకా ఉన్నావా నడుములు ఇరగదంతాను,'' అంటూ అతడు బయటవేసుకొచ్చిన పేడకూడ చేలో కుమ్మరించాడు.

''నా – తట్ట –'' అంది దీనంగా రత్తి.

'' ఇవ్వను. నీ బాబుగాడితో చెప్పుకో.''

''అన్నా, అన్నా! మల్లా యిటుకేసిరాను.''

''నేనివ్వను''

''పొరపాటయింది అన్నా, యీసారికివదులు. మళ్లీ రాను – నీతోడు, అన్నా, అన్నా! యివ్వాళ చిదపకూడా దొరకలా. ఊరికే యింటికెళ్లితె అమ్మ తంతుంది. అందుకని, అన్నాయేకదా అని వచ్చా.''

'' ఈ టక్కులు నా దగ్గర చెల్లవు. ముందు చేనుదాటి మాట్లాడు.''

రత్తి పైటచెంగుతో కంటిచెమ్మ తుడుచుకొంటూ ''అమ్మ కొడుతుంది.''

''తుగ్గుదుగ్గుగా తన్నాలిసిందే. తన్ననీ.''


''కొత్తతట్ట, అయ్య పంచెయిచ్చి మొన్ననేకొన్నది. దానికి మా అయ్య అమ్మను పట్టుకు తన్నాడుకూడా. ఆ తట్టపోతే అమ్మ నన్ను బతకనిస్తుందీ?''

''మరీమంచిది. మళ్లీ యిలాంటిపని చెయ్యకుండా బుద్దొస్తుంది. పోవేం, నుంచున్నావెందుకు దయ్యంలాగా?''

''తట్ట యిచ్చిందాకా పోను. తట్టలేకపోతే యిల్లెక్కడుంటుంది?''

ఇంతలో కఱ్ఱెపెయ్య జనపకట్టెమీదికి దండెత్తింది.

.'' ఎహె, నిన్ను మాదిగాడుతినా! తిరగవేం'' అని అక్కడుండే కేక పెట్టాడు. అది వినిపించుకోకుండా పోతూనే ఉంది. రోజూ తన్ను ఆసామి తిట్టేతిట్లన్నీ దానిని తిట్టాడు. కఱ్ఱెపెయ్య జోరీగలతోపాటు తిట్లను దులపరించుకొని పోతూ ఉంది.

రత్తి చటుక్కున రాఘవుల చేతిలో ములుకఱ్ఱ లాక్కొన్నది. అతడులిక్కిపడ్డాడు. రత్తి నవ్వుతూ కఱ్ఱెపెయ్యవైపు పరిగెత్తుతూ ఉంది. రాఘవులు తట్టసంగతి అప్పుడు మరచిపోయాడు. అలా కళ్లమునాసుకు పరిగెత్తుతున్నది. జనపవెూడు గుచ్చుకొంటుందేమో, అన్యాయంగా కఱ్ఱెపెయ్య కుమ్మేస్తుందేమోనే! అన్న ఆలోచనలు అతనికి కలిగాయి.

''జాగ్రత్త పొడుస్తుందేమో.'' అని కాలెత్తెత్తి వేసుకుంటూ పరిగెత్తాడు.

పిల్ల గట్టిదే, ఎడంగా నిలబడి గురిచూచి ముట్టెమీదికి సరిగా కఱ్ఱ గిరాటు పెట్టింది. దెబ్బతో కఱ్ఱపెయ్య మళ్లీ గొడ్లవేపు పారిపోయింది.

రాఘవులు తట్టతో జనపకట్టెలు గూడువైపు సాగాడు రత్తి అతని వెంట బయలుదేరింది.

''నువ్వు కఱ్ఱపెయ్యను మళ్లేశావని తట్టయిచ్చేదిలేదు. పో.''

''సరే యిందాకే చెప్పావుగా.''

''మరి నాయెంట దేనికి? ఇంటికెళ్లు.''

''వెళ్లతానో వెళ్లనో. నా ఊసెందుకు?

రాఘవులు జనపకట్టెల గూటిదగ్గరకెళ్లి నిల్చున్నాడు. రత్తి గూట్లోకెళ్లి మూటచూచి-

''ఇదేమిటి? వణ్ణమా? ఇంకా తినలా?''

అతడు లేదని తల ఊపాడు.

''ఇంకా తినలా? పొద్దువాటారిపోతే. ఈ గొడ్లకోసం బువ్వ మానేస్తావా? తిను, తిను. ఏపనైనా దానికోసమే గొడ్లను నేను చూస్తాగా.'' 

రాఘవులకు కరకరా ఆకలివేస్తున్నా మాట్లాడలా. రత్తి అన్నపుమూట విప్పి అతనిదగ్గర పెట్టింది. అతడు మాట్లాడలా.

''నేను ఉలవచేను గట్టున కూచుంటా.'' అని పిలుస్తున్నకొందికీ వినిపించుకోకుండా కఱ్ఱ తిప్పుకుంటూ వెళ్లింది.

దగ్గర్లో బావిలేదు. కాలవలో ఒక వేళ నీళ్లున్నా పసర్లేసి ఉంటాయి. అతనికి ఏమీపాలుపోలా. అలానే అన్నానికి కూర్చుని తీరాచూస్తే పాసిపోయి నీరుకారుతూ వుంది. సరైన కూరన్నా ఉందేమోనని వెదికాడు ఉప్పుగోంగూర ముద్ద చూచేటప్పటికి కడుపులో రాయిపడ్డది. పొద్దుటన్నం పెట్టి ఇంత ఎఱ్ఱగారపు పచ్చడో చింతకాయపచ్చడో వెయ్యగూడదూ?

తన దొరసాని దొడ్డగుణాన్ని రాఘవులు సంస్మరించుకొంటూ ఎలాగో తిండితిన్నాడు. అన్నపుగుడ్డను తీసికెళ్లి పసర్లేసివున్న కాలవనీళ్లలో జాడించి మూతిచేయి కడుక్కొన్నాడు. నీళ్లుమాత్రం పుక్కిలించలేదు. ''సుజలాం సుఫలాం''లో అతడు దోసెడు నీళ్లకుకూడ నోచుకోలేదు.

గట్టుమీద కూర్చున్న రత్తి-

గొడ్డకాడి బుడ్డోడి పెళ్లెప్పుడోయ్

గొడ్డుపోయి చేలోన పడ్డప్పుడోయ్

అని పాడుతూ ఉంది. ''దీనితస్సచెక్క! యిప్పటిదాక బిక్కమొగం పెట్టి ఇంతలోనే పాడుతూ ఉందే'' అని అతడనుకున్నాడు.

చల్లమాపయింది. పాడావు పాడిబర్రె పాలు చేపుకుని చిందులేస్తున్నాయి. ఇద్దరూ మళ్లేసినా ఆగటంలేదు.

''అన్నా, పోదాం పద. గొడ్లిక ఆగవు'' అన్నది రత్తి.

'మరి తట్ట అక్కర్లేదా?''

'' ఉహుఁ'' తల అడ్డంగా వూపింది.

''తట్టలేకుండా వెళ్లితే మీ అమ్మ చీపురుకట్ట పుచ్చుకోదూ?''

''నేను ఇంటికి వెళ్లితేగా.''



''మరెక్కడికి వెళ్లుతా?''

''అన్నయ్యతో.''

''మాదొర దుడ్డుకర్రతో నన్ను బేకుతాడు.''

''నేను చూస్తాను. మరి చూడకుండా ఎట్లా? నువ్వు ఏడుస్తూ ఉంటే నేను చిందు లెయ్యద్దూ?''

'' ఓసి నీ సిగదరగా, నేను ఏడిస్తే నువ్వు చిందులేస్తా?''

''నీ చెల్లిలి సిగగోస్తే నీకు నామర్దా కాదు?''

''బాగానే ఉంది వరస, పోయి తట్టతీసుకురా.''

''నేను తేను, నీకింద జీతగత్తె ననుకున్నావా?

''సరేలే తెచ్చుకుంటాలే.''

రాఘవులు తట్ట తెచ్చేలోగా రత్తి గొడ్లను డొంకెక్కదోలి అతని కోసం చేలోనే నిలబడ్డది. గొడ్లు చేలో పెట్టిన పేడకళ్లను, అంతకుముందు కుమ్మరించిన పేడను అతడు తట్టకేసి, '' ఎత్తుకో''న్నాడు.

''నాకొద్దు. బుర్రయ్యగారు తంతాడు.''

''నేనున్నాగా. ఎత్తుకో''

''అమ్మో నాకొద్దు. అప్పుడే చచ్చిపోయేదా?''

''సరే. నేనే యింటికెత్తికెళ్ళుతా. కాస్త పళ్లికెత్తు.''

''నే నెత్తను.''

'' ఓసి నీదుంపతెగ. ఎత్తవే లేవటంలేదు.'' పళ్లిక దాదాపు రొమ్ములదాక లేచింది. కాని ఆపైన లేవలేదు. మళ్లీ ప్రయత్నం చేసి ఎలాగైతేనేం. అతడు నిండు తట్ట తలకెత్తుకొన్నాడు.

ఇద్దరు బయలుదేరి ఊరి దరిదాపులకు వచ్చారు.

'' ఇదిగోనేతట్ట,'' అన్నాడు రాఘవులు.

'' ఎవరిది?''

'' ఇంతదూరం మోయించావు చాలదూ? ఎత్తుకో.''

''అక్కర్లేదు. తీసికెళ్లి మీ మురుగుడు గుప్పలో వేసుకో.''

''అబ్బబ్బ, మెడలు పోతున్నాయే.''

''గొడ్లను కాయటమనుకొన్నా?''

''వినవేమే, పాడిగొడ్లు ముందు వెళ్లాయి. దూళ్లను కుడుపుకొంటాయేమో. తీసుకోవేఁ?''

రత్తి వట్టిదో నిజమో తేల్చుకోటానికి పస్తాయించి చూచింది. పాడిగొడ్లు కనపడలా. చివరికి తట్టను నెత్తి కెత్తుకొన్నది.

''అబ్బ మచ్చుమాపావుగదే. అరే! మెడకూడా తిరగటంలేదు. సరే పోతున్నా.''

''పదా. మీ దొడ్డిదగ్గరకే వస్తున్నాగా.''

''కొంకు లిరగదంతా, నాసంగతి తెలియందు కావాలు'' అని పై పంచె విదిలించుకొంటూ పరుగెత్తి కెళ్లాడు.

రాఘవులు రోజులు బాగుండి పాడిగొడ్లు దూడను కుడుపుకోలేదు, బర్రె తిన్నగా కుడితిగాబు కెగబడ్డది. పాడావు దూడదగ్గరకెళ్లింది. కాని దూడమాత్రమింకా ముట్టెను

పొదుగువైపు పోనివ్వలేదు. అతడు దేనిని ఎక్కడ కట్టివేయాలో అక్కడ కట్టివేసి మేతవేశాడు.

ఇంతలో బుర్రయ్య కల్లమునుంచి వడ్లబండిని తోలుకొచ్చి పాతరదగ్గర ఆపాడు. తొట్లోనుంచి కర్రతో కిందికిదిగి ఎడ్ల మెడమీద కాడి దించకుండానే రాఘవులను పిలిచాడు.

ఆ పిలుపుతో రాఘవులు ఉలిక్కిపడ్డాడు. బండి దించటానికేమో ననుకుని అతడు దగ్గరకు వెళ్లాడు.

'' ఇవ్వాళ ఏంచేశా?'' అని దొర గద్దించాడు.

'' ఏంచేశాను?'' అన్నాడు రాఘవులు.

''నిజం చెప్పు తొత్తుకొడకా?'' అని రెట్టించాడు. రాఘవులకు పై ప్రాణాలు పైనే పోయాయి.

'' ఏంచేశాను?''

'' ఏం చెయ్యలా? చేలో పేడకళ్లు బూసిగాడి కూతురికేసిపంపలా?'' అంటూ

180 చేతికొందికీ కర్రతో కొంకుల మీద ఒక్కటి పెట్టాడు. రాఘవులు కెవ్వుమని చతికిలబడ్డాడు. పడ్డవాణ్ణి ఆరుస్తున్న కుందికీ బర్రెను బాదినట్లు బాదుతున్నాడు. రాఘవులు ఏడుపుకు బెదిరి సూరయ్య గిత్తలు బండిని పాతరమట్టిమీద కీడ్చినయి. రోజూ లేచి బండి బోల్తాపడింది. ఈ హడావిడికి బుర్రయ్య జీతగాణ్ణి వదలి బండిదగ్గరకు వెళ్లాడు.

ఆ సందుచూచుకొని రాఘవులు దొడ్లోనుంచి పారిపోయాడు.

ఆ పోవటం పోవటం ఇంతవరకూ అయిపులేదు. ఆనవాలులేదు.

మీ కెక్కడన్నా రాఘవులు కనిపిస్తే ఈ ఒక్క ముక్కమాత్రం అతని చేవిని వేయండి ''ఆనాటి నీ జీవితం కంటె ఉత్తమమైన జీవితం లేదు. ఆ లోకమే రామరాజ్యం.'' అప్పటి నీ ముచ్చటిముడిలో అజంతా శిల్పసౌందర్యముంది. ఆ ఉప్పు గోంగూరలో ఇనుమున్నది. ఆనాడు నువ్వు తిన్న పైటన్నంలో విటమిన్లు అన్నీ ఉన్నాయి.''

మరిచిపోరు కదూ!

---

జి.వి. కృష్ణరావు

# అనిర్వచనీయ ఖ్యాతి!!

తెనాలి స్టేషన్ దగ్గరకువస్తున్న కొలది తహతహలు హెచ్చిపోయాయి. తనస్థితిని చూచుకొంటే తనకే ఆశ్చర్యం కలిగింది. ఇంతకాలం జైలులో ఉంటే యీ ఆరాట మేమైంది. స్వగ్రామ మమకారం. బంధుదర్శనాసక్తి ఏదేశానికి వలసపోయాయి? తన తహతహపాటు చూచి తనకే నవ్వు వచ్చింది. ఎన్నిసార్లు తన ఊరును తిట్టలేదు! మిట్ట మధ్యాహ్నం నిప్పుపెట్టినా మండిపోదని యెన్నిసార్లు మెటికలు విరవలేదు?

ఇలాంటి ఊరుమీద అంత అభిమానం దేనికి? ఎప్పుడూ కస్సు బుస్సుమనే అన్నమీద, చీటికి మాటికి శివాలువేసే తండ్రిమీద నేడు యింత ప్రేమ దేనికి? తండ్రి వెనకటికాలంవాడు. నేటి ఆచారాలు, పద్ధతులు తండ్రికెలా తెలుస్తాయి? వయస్సు మళ్లిన కొందికీ చిర్రుబుర్రులు సహజమే, అందులో తండ్రికి ఉబ్బసం. ఎంత అవస్థపడుతున్నాడో! ఎంత చిక్కిపోయాడో! తన్ను తలవకుండా వుంటాడా? తనకోసం అలవటించిపోయి ఉంటాడు. తనమీద బెంగవల్లనే సగం మంచమెక్కి ఉంటాడు.

అన్నయ్యకు కుర్రతనం. ఏదో అని ఉంటాడు. అంత మాత్రంచేతనే మనసు విరగాలా? అన్నట్టు వదినెకు నేను బయలుదేరినప్పుడు నెల తప్పింది. ఎప్పుడది? సెప్టెంబరు.... రెండు సంవత్సరాలైంది. మగపిల్లవాడో, ఆడపిల్లో! మగపిల్లవాడే అయి ఉంటాడు. మగపిల్లవాడే. సంవత్సరం మూడునెల్లు. అంటే యీపాటికి తప్పటడుగులు వేస్తూ ఉండాలి. అమ్మా, అత్తా అంటూ ఉండాలి. వెళ్ళగానే ఆ నంగిమాటల్తో అత్త అత్త అంటూవస్తాడు కామాలు!

తనకు మతికూడా పోతూ ఉంది. వాడు తనముఖమెప్పుడైనా చూచాడా? వాణ్ణి తాను యెప్పుడైనా యెత్తుకొన్నదా? తనదగ్గరకు యెలావస్తాడు? తన్ను చూచి బావురు మంటాడో, లేక తల్లిచాటున నక్కిదొంగచూపులు చూస్తాడో?

ఇంతకూ ఆడపిల్లే అయితే.....

వెనకటి ఆలోచనలన్నీ బాంబుతిన్న భవనాలయ్యాయి. నొసలు చిట్లించింది. మళ్ళీ ఆలోచనలు బయలుదేరాయి.

ఆడపిల్లకాదు. మగపిల్లవాడేనని నిర్ధారణమెట్లా అన్నయ్య అయినా ఒకముక్క రాసేసి ఉండకూడదూ? యెలా వ్రాస్తాడు? నేను యెక్కడున్నాడో అన్నయ్యవాళ్ళకు యెలా తెలుస్తుంది? ఎవరైనా చెప్పింవుండరా? లేక పత్రికలైనా వ్రాసి ఉండవా? రోజూ అంతమంది పేర్లు వేస్తూ ఉంటాయి.

శ్రీమతి ఉషగారి అరెస్టు – రెండు సంవత్సరాల కఠినశిక్ష

గాంధి మహాత్ముని స్వాతంత్ర్య సందేశం ఆలకించినందుకు.

లైబ్రేరీలో చెంచయ్య చదువుతూంటే అంతా మూగి వింటూ ఉంటారే. నాపేరు చూడకుండా ఉంటారా? చూచినమాత్రం తానేజైలులో ఉన్నదో యెలా తెలుస్తుంది? అందుకనే అన్నయ్య ఉత్తరం వ్రాయలేదు. తెలిస్తే నానన్నా ఊరుకునేవాడు కాదు. ఎవరిచేతనన్నా ఒకముక్క రాయించి వేసి ఉండేవాడు.

అన్నయ్యకు కొడుకా కూతురా? మావాళ్ళ చాలును బట్టిచూస్తే తొలికాన్పు కొడుకు కావాలి. అన్నయ్య అత్తగారివైపు చాలుకూడా అదేనేమో?

మగపిల్లవాడేనని తనకంత గట్టినమ్మకం దేనికి? తాను కనబోయే పిల్లకు మొగుడు దొరక్కుండా పోతాడా?

ఈ భావంతో గుండె కలుక్కుమంది.

తన జీవిత స్కంధంలో యిక్కడే గొడ్డలిపెట్టు తగిలింది. భర్త పెళ్ళినాటి కట్నం ముట్టలేదని వదలివేశాడు. అలాంటప్పుడు అన్నయ్యకు కొడుకే పుట్టి ఉంటాడనుకోవటం విడ్డూరంగా ఉంది. అన్నయ్యకు మగమొలక కలిగితే తనకుగలిగిన
182 దురవస్థ పట్టదుగా! ఆడదై పుట్టటంకంటే అడవిలో మ్రానైపుట్టటం మేలు.

ఉష తన కాపురంసంగతీ, తన సంగతీ ఆలోచించకుండా ఉండలేకపోయింది.

ఇప్పుడాయన యేమంటాడు, ఊళ్ళోవాళ్ళు యేమంటారు?

స్టేషనులో దిగగానే జైలునుంచి తిరిగివస్తున్న తనకు పూలమాలలు వేస్తారు. స్వాగతపత్రం సమర్పిస్తారు. గ్రామమహిళా సంఘం ఒకటి, యువజన సంఘం ఒకటి దేవుడు మేలుచేస్తే హరిజనసంఘం ఒకటి ఇన్ని ఉన్నాయి. స్వాగతపత్ర మివ్వకుండా ఊరుకుంటారా? స్వాతంత్ర్యం కోసం ప్రాణాలను కూడా తెగించి జైలుకు వెళ్ళిన దేశభక్తుల్ని యేదేశం గౌరవించుకోదు? ఆత్మగౌరవాభిమానాలున్న ఏజాతి సత్కరించుకోదు?

తప్పకుండా గౌరవిస్తుంది. వ్యక్తిగతంగా యీ నల్లమ్మాయిని చూచి కాకపోయినా, యీ నల్లమ్మాయిలో తొంగిచూచే స్వాతంత్ర్య కాంక్షను, గాంధీజీపై ఉన్న భక్తిని ఆదరిస్తుంది.

అప్పుడు ఆయన యేమనుకుంటాడు? ప్రజలు అస్త్రబలంగా చూచుకొనే తన భార్యను త్రోసివేస్తాడా? త్రోసివేస్తాడేపో లోకులేమంటారు? యెత్తిపొడవరూ? ఏదో పూర్వజన్మలో చేసుకొన్న పుణ్యవిశేషంవల్ల ఆ అమ్మాయి నీపాలిటబడ్డది. లేకపోతే

నీవంటివాడికి దక్కవలసిందా? ఆ అమ్మాయి కాలిగోటికైనా పనికిరావే అని సూటిపోటీలు అంటూ ఉంటే ఏమానవుడైనా యెంత వరకు సహిస్తాడు?

ఆయన తన్ను తీసుకెళ్ళటానికి రాక తప్పదు.

అయితే వెళ్లిపోవటమేనా? ఇన్ని సంవత్సరాలనుంచి ఇలా వేధించినవాడితో ఏ ఆడదైనా యెలా కాపురం చేస్తుంది? తాను కాపురానికి వెళ్ళదు. వెళ్ళకపోతే లోకులు ఏమంటారు? తన్ను ఏమనుకున్నా ఇబ్బంది లేదు. కాని ఉద్యమం ఏమౌతుంది? గాంధి మహాత్ముని సందేశాన్ని ఏవిధంగా భావిస్తారు? ఆలోకోత్తర పురుషుని సందేశానికి వంకలు పెడతారు.

తన జీవితం యెలా తగలబడినా, తనవంటివారు లక్షలకొలదిగా బలి అయినా ఉద్యమం సాగాలిసిందే.

అవును గాంధిజీ సందేశం మూలమూలలకూ, హృదయ హృదయాలకూ అందజెయ్యాలి. సంసార బంధంలో తగుల్కొని ఉంటే యెలా సాగుతుంది? ఇలాటి త్యాగం లేకపోవటంవల్లనే దేశంలో అజ్ఞానం, దారిద్ర్యం, సంకుచితత్వం పెచ్చుపెరిగాయి. నేడు కొత్తగా యీ బందాలు ఎందుకువేసుకోవాలి? గాంధిజీ ఆజ్ఞాపాలనమే తనవ్రతం, దీనికి లోకం కాదంటుందా?

తండ్రీ! తరుణోపాయం చూపించావు. నివృత్తి మార్గం ఉపదేశించావు. నీ సందేశా 183
మృతాన్ని విడువను. ఈ అమృతము లేకపోతే యీ అనాధజీవితం ఏమయ్యేది? ఒకదారీ తెన్నూ అంటూ ఉండేదా? నిజంగా ప్రాణం పోశావు తండ్రీ!

ఉష లోలోపలే గాంధీజీకి చేయెత్తి నమస్కరించింది. కృతజ్ఞతతో కన్నులు చెమ్మగిల్లాయి.

రైలు ఆగింది. పొడుగుగా ఉన్న ప్లాటుఫారంమీద నల్లడోమలతో అర్ధనిమీలితాలైయున్న విద్యుద్దీపాలు పెట్టుబడివర్గాన్ని ప్రభుత్వ ఉద్యోగులు లాలిస్తూ ఉన్నట్లుగా చీకటిని లాలిస్తూ ఉన్నాయి. తెనాలి, తెనాలి కిల్లీ సోడా బిస్కేటు స్లోగన్లు చెవులకు గింగుర్లుకొట్టుతున్నాయి.

రైలు ఎక్కేవాళ్లు దిగేవాళ్ళతో ద్వితీయరంగం ప్రారంభమైంది. ఉష ఖాదీసంచితో నిలుచుంది. జనం అటునెట్టి యిటునెట్టి చివరికి తలుపుగుండా ప్లాటుఫారం మీదికి నెట్టింది. అంతా జన సముద్రం.

అటుయిటూ ఉష కలా మెలా చూచించి. తనకోసం పూలదండలతో.......

ప్రజాప్రవాహం గేటుదగ్గరకు నెట్టుకువెళ్ళింది. గేటు దగ్గర యెడమప్రక్కన కొంత ఖాళీగా ఉన్న కటకటాల దగ్గరకు ఆమె చేరుకున్నది. పూలదండలతో స్వాగతమివ్వటానికి

వచ్చిన వారెవ్వరూ ఉషకు కనిపించలేదు. వాడిన మల్లె చేమంతి గులాబీ పూలను అమ్ముకొంటూ లోపల ఒక ముసలివాడు మాత్రం కనిపించాడు. స్వాగతసన్మానాలనేవి కేవలం అమ్మకానికే దొరుకుతాయన్న సంగతి అప్పుడుకూడా తోచలా.

ఈలోగా బండిలోనుండి దిగిన ప్రయాణీకులు వెళ్ళిపోయారు. రైలు అంతకుముందే వెళ్ళిపోయింది. అంత ప్లాటుఫారంమీద యిర్వై ముప్పైమంది మాత్రం ఉండి ఉంటారు.

ఉష తన ఆరాటాన్ని చూచి నవ్వుకొంది. ఈ అర్ధరాత్రాన యెవరైనా యెలా స్వాగతమిస్తారు? తాను విడుదలైనసంగతి అసలు తెలిసి ఉండదు. పత్రికలు వేయలేదేమో? ప్రపంచంలో ఏమూల ఏమిజరిగినా, ఒకనల్లికి పదిపిల్లలు పుట్టినా పన్నెల చిన్నెలతో వేస్తారే. తన విడుదల సంగతి వెయ్యకుండా ఉంటారా? వేసి ఉంటారు. అయినా తాను ఫలాని రోజున ఫలాని బండికి తెనాలిలో దిగుతున్నసంగతి తెలుస్తుంది. అప్పుడు మీటింగుచేసి తన్ను మాట్లాడమంటారు. బుచ్చయ్యగారికి వెనకయిలాగే చెయ్యలా? అప్పుడు యెవ్వరూ స్టేషన్‌కు వెళ్ళ లేదు. మరునాడు మీటింగుచేసి పూలదండలు వేశారు.

ఉష టిక్కెట్టిచ్చి వెలుపలకు వచ్చింది. కన్ను పొడుచుకొన్నా కనిపించటంలేదు. మూడు నాలుగు ఒంటెద్దుబళ్ళు, ఒకటి రెండు రిషాలు ఉన్నాయేమో.

184 ''బండి కావాలవమ్మా బండి'' ఒంటెద్దు ముసలయ్య అడిగాడు. ఉష బండెక్కుదామనుకొంది. కాని తనదగ్గరున్న డబ్బులతోపాటు గాంధీజీ సందేశం జ్ఞాపకం వచ్చింది. నిరాడంబరంగా ఉండాలన్నాడు కదూ మహాత్ముడు. రెండడుగులువేస్తే తన ఊళ్లోవుంటుంది.

ఆమె మెల్లగా సాగి నందివెల్లురోడ్డు పుచ్చుకుంది.

ఊరు సమీపిస్తున్న కొందికీ ఉషకు కాలుసాగటం లేదు. మనస్సు పరిపరివిధాల పోతూ ఉంది! తాను యింటికి చేరుకుంటుందా? నాన్న అన్నయ్య ఏమంటారు? ఇక ముందు తనజీవితం ఏం కావాలి?

ఆపాదమస్తకం చెమటపోసింది. అడుగు పడటం లేదు. మళ్ళీ దుర్భరజీవితంలో ప్రవేశించవలసిందేనా? అన్నయ్య చేత ఛీఛా అనిపించుకొంటూ వదినచేత మొట్టికాయలు తింటూ ఉండవలసిందేనా? పుట్టింట్లో యిలా అభాగ్యురాలై పడివుండవలసిందేనా?

తాను వెనుకటి ఉషకాదు. సత్యాగ్రహంచేసి రెండు సంవత్సరాలు జైలులో ఉండివచ్చింది. లోకమంతా పువ్వులలోపెట్టి పూజించే తన్ను యెవరు సరిగా చూడరు? దేశసేవకు దిగినవ్యక్తిని యెవరేమి అంటారు? పరధ్యానంలోవున్న ఉషను కాళ్ళు యెలాగో ఊళ్లోకి చేరవేశాయి. కచేరీ అరుగుమీద కాని వేపచెట్టుకింద కాని, ఒక పురుగుకూడలేదు. గొరకొయ్యలు నెత్తిమీద ఉన్నాయి.

ఆమె పుట్టింటికి – అన్నయ్య యింటికి వెళ్ళింది. ఎవరిని పిలిచేటట్లు? అన్నయ్య యెక్కడో గదిలో పడుకొని ఉంటాడు. అన్నయ్యనులేపి నిద్రను పాడుచేయటం దేనికి? నాన్న తూర్పింట్లో పడుకొని ఉంటాడు. నిద్రకూడా తక్కువ. పిలవగానే పలుకుతాడు. నాన్ననే పిలుస్తా.

''నాన్నా నాన్నా!''

తలుపుతట్టింది. జవాబులేదు. మళ్ళీ పిలిచి తలుపు తట్టింది. ఆమె పిలుపుకంటె తలుపుచప్పుడే యెక్కువగా ఉంది.

ఇంట్లో యెవరో కదిలిన చప్పుడైంది. ఎవ్వరై ఉంటారు? ఆ అడుగులు చప్పుడు నాన్నది కాదు.

'' ఎవరది?''

''నేనే''

''నేనంటే''

''నేనే నన్నయ్యా''

బెడ్‌లైటుతో వచ్చి జారుతూ ఉన్న కట్టుపంచెను సర్దుకుంటూ అన్నయ్య తలుపు తెరిచి నిర్ఘాంతపడిపోయాడు. ఆ దీపంతో అతడు స్తంభంలాగా నిలబడిపోయాడు. 

''నేనే అన్నయ్యా'' ఉష తలవంచుకొన్నది. అతని నోటివెంట మాటలు రాలేదు. కాసేపు యిద్దరూ అలాగే బొమ్మలులాగా నిలబడ్డారు.

''లోపలికి రా గడపలోనే యెందుకు తగులడతావు?''

ఆమె లోపలికి వచ్చింది.

''నువ్వురావటం యెవ్వరైనా చూచారా?''

ఉషకు భయం అధికమైపోయింది. తన్ను యెవరు చూచినా పోయేది ఏముంది? అయినా గుండె పీకుతూనే ఉంది.

ఉష తూర్పింట్లో తగతాబల్ల అనుకొని నించునివుంది. అన్నయ్య దీపం మాత్రం మెల్లగా నేలమీదపెట్టి గబగబా తండ్రి మంచందగ్గరకు వెళ్ళి తండ్రిని కుదిపాడు. ముసలయ్య మూలుగుతూ అప్పుడే కునుకుపట్టింది కాబోలు మరొక పక్కకు ఒత్తిగిల్లాడు. ఉష కన్నులప్పగించి చూస్తూ ఉంది.

''నాన్నా, నాన్నా!'' కొడుకు తండ్రిని గట్టిగా తట్టాడు.

ముసలయ్య ఉలిక్కిపడి లేచాడు.

''ఏమిట్రా?''

''వచ్చిందే, వచ్చింది!''

''ఎవ్వరు?''

''అదే దయ్యం''

ముసలయ్య భయంతో పరకాయించి వెంటనే గుర్తుపట్టలేదు.

''ఏవర్రా అది?''

''ఎవరున్నారు – నీ కూతురు.''

''నా కూతురా?'' ముసలయ్యకు అంతా ఆకళింపుకు వచ్చింది.

''నా కూతురా? నాకు కూతురెక్కడిది? రెండేళ్ళక్రితమే చచ్చిపోయింది. అప్పుడే పారేశాను. ఈ చేతులు మీదుగా తగలేశాను. ఇక నా కెక్కడిదిరా కూతురు?''

ఉష ఒక్కసారిగా బావురుమంది.



''నాన్నా, నాన్నా!''

''ఛీ, నోరుముయ్. నీకు నేను తండ్రినా? ఎవరు చెప్పారు? ఊళ్ళోవాళ్ళందరికీ తెలుసు. నాకూతురు రెండుసంవత్సరాల క్రిందటే చచ్చిపోయింది. కావలిస్తే పురోహితుణ్ణి అడుగు; ఆబ్దికాలు పెడుతున్నానో లేదో, నా కూతురైతే భర్తదగ్గర ఉండాలి. లేకపోతే నా దగ్గర ఉండాలి.''

''నే నేం తప్పుచేశాను నాన్నా?'' అంటూ ఉష ఒక్కసారిగా వెళ్ళి తండ్రికాళ్ళకు చుట్టేసుకుంది.

''ఛీ, దూరంగా ఉండు, నువ్వెవరు? నా కూతురు చాల మంచిది. తండ్రికి యెంతో గౌరవం తెచ్చేది. వంశానికి పేరు ప్రతిష్ఠలు తెచ్చేది. చెడ తిరిగేది నా కూతురా? ఎవరంటారు? అన్నవాళ్ళ గొంతు నులిమివేస్తాను. నా కూతురు ఏనాడో చచ్చిపోయింది. ఈ ముసలివాణ్ణి దిక్కులేనివాణ్ణి చేసిపోయింది. ఈ ముసలి తనంలో నన్ను చూస్తుందనుకొన్నాను, పోయింది. చేయి దాటిపోయింది. పిచ్చిపిల్లా! నువ్వు నా కూతురువా! ఈ ముసలివాడికి మతిపోతుందను కొన్నావేమో? లేదు. పోపో, నా కూతురు రోజూ నాకలలో కనిపిస్తూ ఉంటుంది. ముసలయ్య కన్నులలో నుండి అశ్రువులు జలజల రాలాయి.

ఉష పెద్దపెట్టున ఏడ్చింది.

''ఛీ, నోరుముయ్ పక్కవాళ్లు వింటారు,'' అని అన్న గదిమాడు.

ఈ అలికిడితో మేలుకొన్న వదినె; వదినె తమ్ముడైన రఘూ గబగబా వచ్చి ''ఏమిటేమిటి?'' అని గాభరాపడుతూ అడిగారు.

''ఏముంది? చెడిపె లంజె కొంప బాగుండిపోయిందేమోనని తిరిగి వచ్చింది'' అన్నాడు అన్న.

ఉష సహించలేకపోయింది. తానేమి తప్పుచేసింది? ఇంత చులకనగా మాట్లాడితే రేపటినుంచి వదినెదగ్గరయెలా వేగుతుంది? వదినెను చూచేటప్పటికి ఉషకోపం పట్టలేకపోయింది.

''అన్నయ్యా! మాటలు తిన్నగారానీ ఏమనుకొన్నావో!''

''ఏమంత పొడుచుకువస్తున్నావు? చెడతిరిగేటప్పుడు ఈ రోషాభిమానాలు ఏమయ్యాయి?''

''కాస్త ఒళ్లు దగ్గరుంచుకొని మరిమాట్లాడు.''

''ఎంత పొగరుపట్టింది! తిరిగి వచ్చిందికాక చెలరేగుతున్నావా?''

''ఇదివరకే చెప్పాను. మళ్ళీ అన్నావా మర్యాద దక్కదు.'' 187

'' ఈ రెండు సంవత్సరాలు ఎవడితో ఊరేగివచ్చా? నాయింట్లో ఒక్కక్షణం ఉంటానికి వీల్లేదు. పో! యింకా నుంచున్నావేం?''

'' నీ యింటికి రాలేదు. నా తండ్రి యింటికి వచ్చాను. నీ యింటికి వచ్చినప్పుడను. ఉద్యమంలో రైలుపట్టాలు పీకి జైలుకు వెళ్ళాను. ఇదేం తప్పుపని కాదే? దొంగ తనం కాదే? లంజరికం కాదే? గాంధీ మహాత్ముని సందేశాన్ని పాటించి జైలుకు వెళ్ళాను. నువ్వు గాజులు తొడుక్కొని ఆడముండలాగా ఇంట్లో కూచున్నావు. నీబోటి కనాకష్టపు వెధవలుండబట్టే ఆడవాళ్లు బయలుదేరవలసివచ్చింది.''

అన్న కోపంతో ఉక్కిరిబిక్కిరై ఊరుకొన్నాడు. నిప్పులు తొక్కుతున్న రఘుకి దగ్గర్లో సి. ఐ. డి. ఉంటే బాగుండుననిపించింది.

''గాంధీజీ అలాంటి సందేశమెన్నడూ యివ్వలేదు. ఇలాంటి ఘాతుకకృత్యాలు చెయ్యమని యెన్నడూ చెప్పలేదు. అహింసామూర్తి గాంధీజీ యెక్కడ? యీ దారుణా లెక్కడ? ఈ మధ్యనే బాహాటంగా అలాంటిచర్యలను ఆయన పూర్తిగా నిరసిస్తు ప్రకటించాడు. ఎక్కడో ఊరేగివచ్చింది కాక గాంధీజీకి యీ దోషంకూడా అంటగట్టు తున్నావా?'' అన్నాడు అన్న.

''ఏమిరా, రఘూ! ''విజయమో మరణమో'' అన్న కరపత్రాన్ని చదివి వినిపించలా? ఆ రోజున నువ్వు లేవు? నువ్వేమన్నా? నేను ఉద్యమంలోకి వెళ్లుతానంటే ఏమన్నా?''

''నే నెప్పుడు చెప్పాను? నిన్ను రైలుపట్టాలు పీకమన్నానా? మాపార్టీ యిది ప్రజాయుద్ధమని ఘోషిస్తూ ఉంటే, నీకు నేను యెలా చెప్పాను? ఊరేగివచ్చిన దానివి ఊరేగివచ్చినట్టుగా ఉండకుండా ఇదికూడా మొదలెట్టావా?''

ఉషకు నవజీవాలు కుంగిపోయాయి. ఇలా వస్తుందని యెన్నడూ అనుకోలేదు. తాను నమ్మిన సిద్ధాంతమే తన్ను ద్రోహిణి అంటుందని యెన్నడూ అనుకోలేదు. అప్రయత్నంగా ''సత్యం, ప్రజాయుద్ధం'' అన్న మాటలు ఆమె నోటినుంచి వెలువడ్డాయి. ఆమె మనస్సులో వొక్కసారిగా ఊళ్లో గోడలు, రోడ్లమీద ఈతచెట్లు గిర్రున తిరిగాయి.

''ఇంతకాలం ఎవడిదగ్గరున్నావో చెప్పు. ఈ దొంగ వేషాలు ఎవరికీ తెలియు వనుకొన్నావా?'' అన్నాడు మీదిమీదికి వస్తూ అన్న.

''నేను సత్యం చెబుతున్నానో లేదో ఈ ప్రజలకు తెలియదా? పైన ఉన్న ఆ భగవంతుడికి తెలీదా?'' అని ఉష దీనంగా అంది.

''నువ్వొక్క క్షణం ఇంట్లో ఉంటానికి వీల్లేదు. పో. వెళ్ళిపో. ఇంతవరకూ మోసిన నిందచాలు.'' అన్నాడు అన్న.



''పోవమ్మా తల్లీపో! మా పిల్లదానికైనా పెళ్లికావాలా లేదా?'' అంది వదినె.

ఉష తండ్రికాళ్లు గట్టిగా కావులించుకొంది. ఆమె కన్నీళ్లు ముసలయ్యకాళ్లు కడుగుతూ ఉన్నాయి.

''వెళ్ళవేం? రెండు సంవత్సరాల క్రితమే పిన్నమ్మగారింట్లో మన్య జ్వరంతో చచ్చిపోయావని ఉళ్లో చెప్పుకొన్నాం. రేపు ఊళ్లో తలెత్తుకోనక్కరలా? పో, ఎవడితో ఉన్నావో వాడి దగ్గరకేపోయి ఊరేగు.''

''నాన్నా, నాన్నా'' అని యేడుస్తూ ఉష తండ్రికాళ్లు మరీ గట్టిగా కౌగలించుకొంది.

రఘు, అన్నా పులులు లాగా ఆమెమీద విరుచుకుపడ్డారు. ముసలయ్య కొయ్యబారిపోయి పిచ్చిచూపులు చూస్తూ ఉన్నాడు.

ఇద్దరూ కలిసి ఉషను గట్టిగా చితకబొడిచారు. కారాగారవాసంతో యెముకలు మాత్రమే మిగిలి ఉన్న ఉష అస్తిపంజరంలోనుంచి హంస యెగిరిపోయింది.

ఊరిపక్క కాలవ నాటి తెల్లవారుగట్ల మరీపొంగుతూ ప్రవహించింది.

సూర్యుడు మాత్రం తూర్పుననే ఉదయించాడు.

---

జి.వి. కృష్ణరావు

# కర్మభూమి

అదొక పెద్దగుహ. చీకటిలేనిది గుహ అవుతుందా? కాబట్టి అది చీకటి కొనేరై వుండాలి. అంత కటికిచీకటి అయితే అసలు అది గుహ అని ఎలా తెలుస్తుంది? కాబట్టి అంత చీకటిగానూ ఉండదు, అంత వెలుతురుగానూ ఉండదు.

అలాంటిగుహలో సాలీళ్లు మగ్గాలు పెట్టుకొని కర్మయోగం సాగిస్తూ ఉన్నాయి. ఆ మగ్గాలతీరూ, ఉనికీ చూస్తే కేవలం కర్మయోగంకోసమే ఆగుహ యేర్పడిందా అనిపిస్తుంది.

కర్మయోగం సాగేదేశాన్ని కర్మభూమి అనే పిలుస్తారు కదూ! అందువల్ల అది కర్మభూమి.

కర్మభూమిలో ఆస్తికభావం. ఆధ్యాత్మికచింతనా సహజమే. దేశగుణాలు దేశీయులకు పట్టుపడకుండా యేలా ఉంటాయి? కాబట్టి అక్కడి సాలీళ్ళకు కూడ ఆధ్యాత్మికచింతన, అవీ ఉంటం సహజమేకదా! అందువల్ల అవి పరమాత్మునికోసం నూలుపోగులతో గుళ్ళూ గోపురాలూ తీర్చి కట్టేవి. తద్వారా తమ ఆధ్యాత్మిక చింతనకు ఒకరూపాన్ని కల్పించి జీవితాలను సార్థకంచేసుకొనేవి.

జన్మ యెత్తినందుకు మరి ఫలము ఉండాలి కదా?

ఆ కర్మభూమిలో చీమలు, దోమలు, ఇంకా సన్నజీవాలు ఎన్నో ఉండేవి. అవి కాస్త కాలు కదలించినా, కొంచెం రెక్క ఆడించినా కర్మయోగుల పుణ్యక్షేత్రాలలో, అంటే గుళ్ళూ గోపురాలలో తగుల్కొని కేవలం పాంచభౌతిక దేహాలను మాత్రం విడిచిపెట్టేవి. కర్మయోగులు యీ భక్తకోటికి పుణ్యలోకాలు ఇప్పించేవి. ఏ నాస్తికుడన్నా మొండి ప్రాణాలవాడై 'యిదంతా ద్రోహం, ప్రజాద్రోహం' అని రెక్కలు జాడిస్తూ, కాళ్లు చేదుకొంటూ అరిస్తే, యోగులు పాపులను తాకటానికి భయపడి దూరంగానేవుండి మండిపడుతూ, ''నాస్తికుడికి యింతకన్నా మంచిగతి రమ్మంటే ఎలా వస్తుంది? చావరా, గాడిదకొడకా! చావు.'' అని శపించేవి.

ఇలా లోకవ్యవహారం సాగుతూ వచ్చింది. కర్మభూమిలో కర్మయోగం అధికమై జీవులకు మరణయోగం ఎక్కువవుతూవచ్చింది. జీవులకు అప్పుడప్పుడు భౌతికరోగం పట్టుకొనేది. జీవులన్న తరువాత రోగాలు, నొప్పులూ రాకుండా ఉంటాయా? అలా రాకుండా ఉంటే కర్మయోగం ఏమికాను?

అందువల్ల అప్పుడప్పుడు భౌతికరోగాలు వచ్చేవి. ఈ రోగాలు వచ్చినప్పుడు జీవులు. కొంత విసుక్కొనేవి.

కర్మయోగులు అప్పుడప్పుడు యోగశక్తిని ప్రదర్శిస్తూ మధ్యేగగనంలో నిల్చుని పామరలోకాన్ని అనుగ్రహించేవి.

''నాయనలారా, మనది ఉత్తమోత్తమమైన కర్మభూమి, కర్మభూమిలో ప్రతివర్ణమూ, ప్రతిజాతి తనకర్తవ్యాన్ని నిర్వహించాలి. సుఖదుఃఖాలు, శీతోష్ణము, జీవన మరణాలు మిథ్య. ఆత్మ ఒకటేనిత్యం, సత్యం. కాబట్టి ఏదో బాధపడుతున్నామనీ కష్టాలు కలుగుతున్నాయనీ అనుకోగూడదు. కర్మప్రవృత్తులుకండి.

''కర్మ అంటే నిష్కామకర్మ – ఫలాపేక్షలేని కర్మ. సుఖాన్ని ఆపేక్షించక చేసేకర్మ. సుఖానికి ఒక అవధిఅంటూలేదు. ఒక తృప్తి అంటూ ఉండదు. అందువల్ల కోర్కెలను పెంచుకోక నిరాడంబరజీవులై నిష్కామకర్మసాగించండి.'' అని కర్మయోగులు ఉపదేశించాయి.

''మీ గుళ్లూ గోపురాలూ కేవలం నిష్కామకర్మలే. ఇందులో యేమాత్రం సందేహం లేదు, వినండి వినండి.'' అంటూ ఒక పిల్లదోమ కాసేపు సభాసదులందరిదగ్గరా బఁయ్యిన ఊది మళ్ళీ యథాస్థానంలో కూర్చుంది.

''అలా అనటం మహాపాపం. సర్వజీవులు యేనాడో ఒకనాడు చావక తప్పదుగదా? చావకుండా ఉంటున్నారా; చెప్పండి?'' అని యోగులు ప్రశ్నించాయి.

''నిజం నిజం. ముమ్మాటికీ నిజం'' అని గుడ్లు మిటకరించి చప్పిదౌడలను అప్పళించి తోకలు మూడుసార్లు ఊపి నిశ్శబ్దంగా అరిచాయి బల్లులు.

''కాబట్టి చావు అనేది పుట్టినవాడికి తప్పదుకదా! అలాంటప్పుడు భగవంతునికోసం మరణించటంవల్ల యెలాంటి ఉత్తమగతులు ప్రాప్తిస్తాయో ఆలోచించండి. అప్పుడు యీ గుళ్ళు గోపురాలకు నమస్కారం చేస్తారే కాని ధ్వంసం చెయ్యాలని కోరరుకదా,'' అని యోగులు సెలవిచ్చాయి.

''తంతువాయు మహర్షులకు జై! డౌౝ విత్ ది యేథీస్ట్స్!'' అని అనుకొని తేళ్ళుకొండీలెత్తి ఫాసిస్టు నమస్కారాలు చేశాయి.

మళ్ళీ కర్మభూమి నివాసులు వర్ణాశ్రమ ధర్మానుసారంగా జీవితాలను చక్కబెట్టుకోసాగాయి. అప్పుడప్పుడు పురాణకాలక్షేపం జరుగుతూ ఉండేది. కాని యిలాంటివాటిల్లో చీమలకు తావే ఉండేదికాదు. అసలు వాటికి కాసేపు కూర్చుందామన్నా

తీరిక ఉండేదికాదు. పొరపాటున యెప్పుడన్నా కర్మం చాలక యేచీమన్నా బయట తిరుగుతున్నట్లు కనిపించిందో, తేలురాజు ఆర్షప్రోక్తంగా, శ్రుతిస్మృతి వాక్యానుసారంగా శిక్షిస్తూ వుండేది.

ఇలా కొన్నియుగాలు జరిగాయి. ఇంకా మరికొన్ని యుగాలుకూడ యిలాగే జరిగి ఉండవలసింది. కాని యిలా జరగలేదు.

జరక్కపోవటానికి కారణాలను టెస్టుట్యూబులకు వదలివేస్తేమాత్రం వ్యావహారిక జగత్తులో యిలా నడచింది.

కందిరీగలు సంగీతాన్ని అమ్ముకోవటం కోసం కర్మభూమికి వచ్చాయి. అయితే కర్మభూమిలో సంగీతం లేదా అంటే సమాధానం లేదు. కాని కందిరీగలు అమ్ముకోటానికి వచ్చినమాట మాత్రం రూఢి.

అప్పటిదాకా తపస్సుకు మాత్రమే యోగ్యంగా వుంటూవచ్చిన కర్మభూమిలో ఝుంకారధ్వనులు బయలుదేరాయి. కర్మయోగుల యోగనిష్ఠకు భంగం వాటిల్లింది.

శాపానుగ్రహసమర్థులు కోపంవస్తే వూరుకొంటారా! కళ్ళువిప్పి చురచుర చూచారు. కలి ప్రథమపాదం ప్రవేశించింది. కాబట్టి కందిరీగలు బ్రతికిపోయాయి. అప్పటికీ ఆగక నోరుచేసుకున్నాయి. కాని కర్మభూమిలోని ప్రశాంతి ప్రాబల్యంవల్ల శబ్దం నిశ్శబ్దతలోనుంచి బహిర్గిల్లక అందులోనే లీనమైపోయింది. అందువల్ల శబ్దరూపం నిష్పన్నంకాలేదు. శబ్దం నిష్పన్నం కానప్పుడు కందిరీగలు యెలా శాపదగ్ధమైపోతాయి? 

ఆరోజు యెలాగో గడిచిపోయింది. యోగనిష్ఠలో వున్న యోగులు కూడ యోగాన్ని కట్టిపెట్టి గుళ్ళూ గోపురాలూ మరామత్తుచేసుకోవలసి వచ్చింది. ఇలా గుళ్లూ గోపురాలూ బాగుచేస్తూ యోగులు ఒండొరులను చూచుకొని యెవరికి వారే దుఃఖపడ్డారు. చూపులతో ఒకరి హృదయాన్ని ఒకరు అర్థంచేసుకొన్నారు. ఇంతలోనే ఒక కందిరీగ బఃయ్యిన బయలుదేరి వచ్చింది. దాని రెక్కలదాడికి ఒక భాగంలోని గోపురాలన్నీ బదా బదలుగా విచ్చిపోయాయి. ఆ దేవాలయార్చకుడైన కర్మయోగి సహించలేకపోయాడు. భగవంతునిపట్ల అపచారం జరుగుతూ ఉంటే, పరం పరాగతమైన ధర్మం, సామాజికవ్యవస్థా కూలిపోతూ ఉంటే యేభక్తుడు, యే ప్రపంచకల్యాణకామి సహిస్తాడు?''

''ఇది తపోభూమి మీలాంటి దుష్టులు మా దేశంలో నుంచి వెళ్ళిపోవాలి. మా గుళ్ళూ గోపురాలూ ధ్వంసం చేయటం యేమిధర్మం? కాబట్టి వచ్చినదారినే త్వరగా వెళ్లిపొండి.'' అని ఉపదేశించాడు నిష్కామయోగి.

"విశ్వం యెవ్వరి ముల్లేకాదు, మీ గుళ్ళూ గోపురాలూ జీవుల స్వాతంత్ర్యాన్ని అరికడుతూ వున్నాయి. పైగా జీవుల నిండు ప్రాణాలు బలిగొంటున్నాయి. అసలు మీలాంటి లోకకంటకుల్ని ఉండనీటానికే వీలులేదు." అని బొంయ్యని రొదచేసుకొంటూ ఒక కందిరీగ యోగి పైపైకే వెళ్ళింది.

సృష్టి ప్రారంభమై యెన్ని వేలయేళ్ళు గతించాయి? ఎంత దుష్టుడైనా యింత తెగబడి మాట్లాడాడా? భూమి యెందుకు కుంగిపోదు! సప్తసముద్రాలు యెందుకు ఘూర్ణిల్లవు? ద్వాదశాదిత్యులు యిలాంటి లోకాన్ని మలమలా యెందుకు మాడ్చివేయరు!

ఈ సమస్యలలోపడ్డ యోగి అసలుసంగతి మరచిపోయి పక్కకు ఒత్తిగిల్లాడు. నిజానికివస్తే యోగిముందు కందిరీగ నిలుస్తుందా మరి?

రోజురోజుకూ కందిరీగల రాకపోకలు యెక్కువయ్యాయి. గుళ్లూ గోపురాలూ బదాబదలు అవుతూ ఉండటం, ప్రతిదినం కర్మయోగులు వాటిని తిరిగి మరామత్తు చేయటానికి ప్రయత్నిస్తూ ఉండటం జరుగుతూ వచ్చింది.

ఏది యెలావున్నా కర్మయోగులు స్థాపించిన వ్యవస్థ సడలింది. సడలితే అధర్మం పెచ్చు పెరిగిపోలేదా? కర్మభూమి పతితం కాలేదా?



గుహమాత్రం పతితంకాలేదు. ఎప్పటిచోటనే ఉంది. పై పెచ్చు జీవులసంఖ్య పెచ్చు పెరిగింది. పాపం పెరగటం వల్లనే యీ జనాభా పెరిగి ఉండవచ్చును.

ఏ కారణాలు ఎలా ఉన్నా, ఇప్పుడు జీవులకు కొంచెం గాలిని పీల్చుకోటానికి వీలైంది. చిన్న చిన్న పురుగులు ఇదివరకుకన్నా కొంచెం రెక్కాడించటానికి వీలైంది.

ఇలాంటి అవకాశాలు లభించటంతోనే జీవులు కొంత మథనపడసాగాయి. "ఈ యోగులు మన ప్రాణాలకు ఉచ్చులుపోసి దేవుడంటున్నారురా." అని కళ్ళు తెరచీ తెరవని ఒక గడుగ్గాయి అంది. పక్కగోడమీదనేవుండి వింటూ ఉన్న బల్లి కొరకొరా చూచింది. తీరా ఒక దౌడకిందికి రాదే! ఇంతమాట అంటుందా? ఎంత పితప కాలం, ఎంత పితప కాలం!

కందిరీగలను ఉపేక్షిస్తే ప్రయోజనం లేదని కర్మయోగులు నిశ్చయించారు. అవును దేశానికీ దేవుడికీ, అపచారం జరుగుతూ ఉంటే ఎలా సహిస్తారు?

కందిరీగలను కర్మభూమినుంచి సాగనంపటం అవసరం. ప్రజాక్షేమంకోసమైనా తప్పక పంపించివెయ్యాలి. కర్మ యోగులుమాత్రమే ఈ పనిచేయలేరు. తతిమ్మా జీవులు కూడ యీపనికి పూనుకోవాలి.

అందువల్ల ఎంత యిష్టంలేకపోయినా, ఇతరుల ఆచార వ్యవహారాలు ఎంత తెలియకపోయినా, ఎలాగో ఒక లాగున అన్నీకలిసి ఒక చోట సమావేశం జరిపాయి.

కర్మయోగులు ఒక్కొక్కరే లేచి యిలా ప్రారంభించారు:-

''మన దేశాన్ని పరాయివాడు ఆక్రమించుకొంటే మీరు చూస్తూ ఉంటారా? తతిమ్మా ప్రపంచం అజ్ఞానాంధకారంలో మునిగివున్నప్పుడు యీ దేశం విజ్ఞానంలో మునిగి తేలుతూవచ్చింది. ఇలాంటిదేశాన్ని తుచ్ఛ నాస్తికులు, నాగరకతలేని జంతువులు ఆక్రమించుకొన్నాయి. అనాదినుంచి వస్తున్న మన పవిత్రాచారాలు, సంస్కృతి, గుళ్ళు, గోపురాలు, భక్తివిశ్వాసాలు ధ్వంసమై పోతున్నాయి.''

ఇంతలో నోరు బారలు తెరచుకొని, కళ్ళువిచ్చి వింటూ ఉన్న కప్పగారినోట్లో ఏమిదూరిందో బెక్ బెక్ మని ఎగిరి రెండు గంతులు వేసింది. సభలో ఆమూల కొంత అల్లరి బయలుదేరినా వెంటనే ఆగిపోయింది.

ఉపన్యాసక మహాశయుడు సభాసదుల ముఖాలు ఒక సారిచూచి శ్లేటుమార్చి సాగించాడు:-

'' ఉప్పున ఊదితే తెగిపోయే యీ దారాలతో సోదరుల ప్రాణాలు తీస్తూవున్నామనీ, వారి రక్తాన్ని పీల్చి వేస్తున్నామనీ మన శత్రువులు, మన సంస్కృతి విద్వేషకులు ప్రచారం చేస్తూ ఉన్నారు. ఇది నిజమే కాబోలునని మన సోదరులుకూడ కొంతమంది నమ్ముతూ ఉండవచ్చును. శత్రుప్రచారాన్ని నమ్మే దుర్గతి మనకు పట్టటం చాలా శోచనీయం. 193

''మనశత్రుకోటిలోని సర్ ఫ్రాగ్ మహాశయుడు ఏమని సెలవిచ్చాడో తెలుసునా? కర్మభూమి సంస్కృతి అత్యుత్తమమైనది. అధః పతనానికి పోతూ ఉన్న పశ్చిమ దేశాలు బాగుపడాలంటే ఒకటే దారిఉంది. కర్మభూమి నుంచి ఆ నిరాడంబర జీవనం, ఆ కర్మసిద్ధాంతం, ఆ మిధ్యావాదం అవశ్యం గ్రహించాలి. కళ, కవిత్వం అనేవి వృద్ధిపొందాలంటే కర్మభూమిలోని సామాజిక వ్యవస్థే శరణ్యం. అక్కడి గుళ్ళు గోపురాలు, శిల్పం, చిత్రలేఖనం, లోకోత్తర సౌందర్యం ఎవరిని తన్మయులను చెయ్యవు? సూర్యోదయకాలంలో ముఖ్యంగా కర్మయోగులు నిర్మించిన గోపుర ద్వారాలు చూస్తే, జీవుల అల్పత్వం, సృష్టి గాంభీర్యం, పరమాత్ముని ప్రేమ సాక్షాత్కరిస్తాయి. ఇవి నా మాటలు కావు.''

''హియర్ హియర్,'' అని ఈగలు పదతాళధ్వనులు చేశాయి. తేలు సంతోషం కొలదీ ప్రక్కనున్న మండూక మహాశయుణ్ణి కొండితో అంటబొడిచింది. మండూకుడు

ఎగిరి రెండుగజాలు దూకి మంద్రగబ్బ ముడుచుకొన్న కొండీమీద టఫీమని చతికిలబడ్డాడు. కొండీ యెత్తుకోలేని మంద్రగబ్బ కోపంకొలది గిట్టలతో నేలగట్టిగా వాయించింది.

ఈ హర్షధ్వనులతో వొళ్ళుపొంగి ఉపన్యాసకుడు ఇలా అన్నాడు:-

''మన ఆచారాలు నిరర్థకమైనవికావు. త్రికాలవేదులైన మన పెద్దలు ముందు వెనకలు విచారించే వీటిని ప్రవేశపెట్టారు. ఉదాహరణకు మన గుళ్ళా గోపురాలనే తీసుకోండి. కర్మభూమి యీ కొసనుంచి ఆ కొసకు సూత్రాలువేసి గుళ్ళా గోపురాలు కడుతూ ఉంటంవల్లనే, యెన్ని జంఝామారుతాలు వీచినా, యెన్ని ప్రళయాలు వచ్చినా యీభూమి నిలిచి ఉంది. లేకపోతే మేమిక్కడ నిలిచి ఉపన్యసించటం, మీరు అక్కడ ఉండి వినటం తలస్థించేదేకాదు.

ఇక్కడ చేరినవారంతా ఆస్తికభావులే కాబట్టి మరొక దేవరహస్యం చెబుతూవున్నాను. ఈ గుళ్ళూ గోపురాలు లేకపోతే, వీచేగాలిలోవుండే దుమ్ము, ధూళి సర్వం కొట్టుకొనివచ్చి ప్రజల ఆరోగ్యం చెడిపోయి ఉండేది. దానివల్ల రోగాలు, అకాలమృత్యువు; అసంపూర్ణానుభూతి, మొదలైన అనర్థకాలన్నీ వచ్చి మానవ జాతి ఊరుపేరు లేక యేనాడో నశించి ఉండేది.

''కాబట్టి యిలాంటి ఉత్తమాచారాలను, స్వాతిక ప్రకృతిని భగ్నంచేసి నిరంతరం రణగుణధ్వనిచేసే శత్రువులకు ఆస్కారమిస్తారా? అంత దేశాభిమానం లేదా? మీకు నెత్తురు లేదా?''

''అదంతా తమరెప్పుడో గుటకాయస్వాహా అన్నారు.'' అని ఒక సభ్యుడు అరిచాడు.

''ఎవడా ద్రోహి, నోరుమూయమనండి.'' అని తతిమ్మా సభ్యులు కేకవేశారు.

''కాస్త ఓపికపట్టి వినండి. మన సోదరుడు ఒకాయన అంతర్జాతీయ భావము ఉండాలంటున్నాడు,'' అని ఉపన్యాసకుడు గొంతు సవరించుకొంటూ తొట్రుపాటు కనపడనీకుండా అన్నాడు.

''నేనన్నది ఆముక్కకాదు.''

ఉపన్యాసకుడు మళ్లీ ప్రారంభించాడు;

''ఇస్, చెప్పేది వినండి. మన శత్రువులే మనసంస్కృతిని ఎందుకు అవలంభించగూడదు? వాళ్ళ సంస్కృతి వాళ్ళు విడువరు. మన సంస్కృతికి మాత్రం

మనం తిలోదకాలు వదలాలి. ఇంత అన్యాయం యెక్కడన్నా ఉందా? భ్రష్టులు తప్ప దేశాభిమానమున్నవాడు, ప్రపంచ శ్రేయస్సుకోరేవాడు యిలాంటిపని చేస్తాడా? కాబట్టి మన శత్రువుకాని, మన శత్రువుల పద్ధతులుకాని మనకేమాత్రం పనికిరావు. వాటిని మనదేశం చాయలకన్నా రానీగూడదు!''

ఇలా కర్మయోగులు ఉపన్యాసాలు చెప్పి ముగించగానే దోమలు జాతీయగీతాన్ని పాడాయి. మండ్రగబ్బలు డెక్కలతో తాళంవేస్తూ కొండీపతాకాలెత్తాయి. తేళ్లవాలంటీర్లు బారులు బారులుతీర్చి కొండీలు పైకిముడిచి మిలిటరీ శాల్యూటు కొట్టాయి. ఈగలు విమానాలు నడుపుతూ జాతీయ యుద్ధసంపదను చాటాయి.

ఇంతలో కందిరీగల గుంపులు బర్రున కర్మభూమిలో ఈ మూలనుండి ఆ మూలకు ఆమూలనుంచి ఈ మూలకు తిరుగుతూ ఝుంకారాలు సాగించాయి.

ఇంకా యుద్ధం ప్రారంభమైనదీ లేనిదీ తెలియలేదు.

త్వరలోనే పిపీలికా విలేఖరి కేబుల్ చేస్తాడని ఎదురుచూస్తున్నాము.

# ఉదబిందువులు

''అమ్మా, అమ్మా!''

కొడుకు పిలుపులోని ఉద్వేగాన్ని పసికట్టిన సుభద్రమ్మ చెరుగుతున్న వడ్లచేట క్రిందబెట్టి అతనివైపు చూచింది.

''కృష్ణా రామా అంటూ మూల కూర్చోక ఇదేమిటే? ఓపిక ఉన్నది ఒళ్లు దాచుకొంటే, బండెడు చాకిరి నెత్తిమీద వేసుకొన్నావా?'' రామయ్య ధోరణి మార్చాడు.

''ముసలిదానిమీద ఎన్నాళ్లనుంచిరా ఈ మమకారం? నిండు చులాలు ఈపని చెయ్యలేదు కాని అసలు సంగతేమిటో చెప్పు.'' సుభద్రమ్మ నవ్వింది.

తన హృదయాన్ని యిట్టే పసికట్టినందుకు అతని చిరాకు మరీ ఎక్కువయింది.

''నీ ముద్దుల కొడుకు ఏమి చేశాడో చూచావా?''

''నా చిట్టి తమ్ముడు ఏమిచేశాడో చూచావా అనరాదూ? అనవు. ఎందుకంటా? ఇంతకూ అసలు సంగతేమిటో?'' తల్లి నిట్టూర్చింది.

కన్నంలో దొంగకు తేలుకుట్టింది. అవును, తల్లివల్ల జరిగిన పొరపాటేముంది?

''మా తమ్మయ్య ఉత్తరం వ్రాశాడు. నేను ముందుగా వ్రాస్తేనే వ్రాశాడనుకో!''

''నువ్వేమి వ్రాశావు? అతగాడేమన్నాడు?''

''ఏమున్నది వ్రాయటానికి? ఈయేడు ఊచతెగులు తగిలి పంటలు పోయాయి. ఎకరానికి అయిదారు బస్తాల రాలుబడి కూడ లేదని వ్రాశాను.'' రామయ్య గొంతు జీరపోయింది.

''అవును, ఈయేటి రాలుబడి అంతేగా! నువ్వు చేలను పండవద్దన్నావా యేమిటి?'' తల్లి వాత్సల్యం అతన్ని కప్పింది.

''ఊళ్ళో మగతాదారులు ఏమిచేస్తున్నారని మా చిట్టి తమ్మయ్య అడుగుతున్నాడు. అవును, ఇంతకాలంనుంచి వాడి చేలో నేను చేస్తున్నదేమిటి మగతా కాక?''

''ఉద్యోగంలో చేరింతరువాత చిన్నవాడికి బొత్తిగా మతిపోయింది.''

''వాడికేమీ మతిపోలా పోయిందల్లా మనకే?''

''అయితే నేను వచ్చిపొమ్మంటున్నానని కార్డుముక్క రాసిపడెయ్యి.''

''రాయవలసిన అవసరం నాకేమీ లేదు. వాడి లెక్కప్రకారం రావలసిన పైకం అణా పైసలతో సహా ఇవాళే మనియార్డరు చేస్తున్నా.'' రామయ్య వెళ్ళిపోయాడు.

సుభద్రమ్మ విస్తుపోయింది. తన ఇద్దరి కొడుకుల సంగతి ఆమెకు పూర్తిగా తెలుసు. వాళ్ళకు తండ్రి అయినా తల్లి అయినా తనే. తన చేతులమీదుగా పెంచి పెద్దవాళ్ళను చేసింది. ఇద్దరూ కవలలు, ఒకటే పోలిక. ఒకే తల్లిపాలు త్రావి ఒకే సంస్కారంలో పెరిగారు. అయినా గుణాలలో ఇరువురికి ఎంతో తేడా, పెద్దవాడి మనసు ఉదారం. చిన్న వాడు కూడా మంచివాడే కాని, కాస్త లోభగుణం ఉన్నదేమోననిపిస్తుంది. అయినా సుభద్రమ్మ కనుగలిగి దిద్దటానికి ప్రయత్నించింది. ఉన్న కొంద్ర తక్కువ. ఇద్దరి పిల్లలకూ ఇంగ్లీషు చెప్పించే తాహతు లేదు. కనుక చిన్నవాడైన లక్ష్మయ్యను ఇంగ్లీషు చదువులకు పంపి ఆమె రామయ్యను వీధిబడి చదువుతో మానిపించి తనకు తోడుగా నిలుపుకొన్నది.

రామయ్యకు ఏకోశానా కుళ్ళుబోతుతనం లేదు. నమ్మిక చిక్కితే అతడు ఒడలు కోసి యిస్తాడు. మనసు విరిగిందో అతనిని ఎవరూ వినిపించలేరు. అతని స్నేహం వంటిదే పగకూడ. అవి అతి ఉత్కటాలు. లక్ష్మయ్య లక్ష్మణరావై ఎల్. టి. పూర్తి చేసుకొని బస్తీలో బడిపంతులై ఒక గ్రాడ్యుయేటును పెళ్ళి చెసుకొన్నాడు. కొడుకు లిద్దరూ ఒకరి కొకరు అండదండగా ఉండాలన్న ఆశకొలది లక్ష్మయ్య చదువు ఖర్చులు పాటికి రానీక తనవంతు రెండెకరాలు పోను మిగతా ఆస్తిని ఇద్దరికి చెరిసగం పంచి యిచ్చింది. తమ్ముడూ, తల్లీ కావాలనుకొన్న రామయ్య సణగలేదు. అంతేకాదు, తమ్ముని పొలం తానే చేస్తూ రాలిన పంటను అమ్మి ముద్రశుద్ధిగా ఈనాటి వరకూ అప్పగిస్తూ వచ్చాడు. 

అలాంటి రామయ్యకు లక్ష్మణరావు అలా ఉత్తరం వ్రాశాడని వినగానే సుభద్రమ్మ మనస్సు చివుక్కుమన్నది. తనకే అలా అనిపించినప్పుడు పెద్దవాని మనస్సు ఎలా ఉండాలి? చిన్నకొడుకు దగ్గర ఉంటే గూబ గుయ్యిమని పించేది. కాని, ఏమి లాభం? ఎక్కడో దూరాన ఉన్నాడు.

ఆవాళే సుభద్రమ్మ చివాట్లువేస్తూ చిన్నకొడుకుకు ఉత్తరం వ్రాసింది. కాని మళ్ళీ ఏమి తోచిందో వ్రాసిన ఉత్తరం చించివేసి జరూరుగా ఒకసారి వచ్చి వెళ్ళవలసిందని కార్డు వ్రాసి రామయ్య కొడుకు సూర్యం చేత పోస్టులో వేయించింది.

రామయ్య తల్లిని పలకరిస్తూనే ఉన్నాడు. కాని ఆమెకు ఆ పలకరింతలో ఏదో లోటు ఉన్నట్లుగానే ఉన్నది. వారం రోజులకు చిన్నకొడుకునకు మారుగా కవరు వచ్చింది. ఆమె విప్పి చదివింది.

అత్తయ్యకు,

నమస్కారాలు, ఇక్కడంతా క్షేమం. అక్కడ అందరికీ కుశలమే కదా!

మీ ఉత్తరం చేరింది. ఏదో చిరాకులో ఉండి మీ అబ్బాయి బావగారికేదో తెలివితక్కువ సమాధానమిచ్చారట. ఎంతో నొచ్చుకొంటున్నారు. తనకు మొగం చెల్లక నన్ను సమాధానం వ్రాయమన్నారు. మీరే వ్రాస్తే బాగుంటుందని మొత్తుకొన్నాను. వింటేనా? ఇంకా జాగుచేయటం మర్యాదకాదని వ్రాస్తున్నాను. నా సాహసానికి క్షమించాలి. నేనే వచ్చి బావగారికి కనిపించి క్షమాపణ చెప్పుకొంటే మేలేమోననిపించింది. కాని అన్నదమ్ముల నడుమ నీ జోక్యమేమిటి అంటారేమోనన్న భయంతో మానివేశాను. బావగారికి మీరెలాగైనా నచ్చజెప్పండి. అదనంగా పంపిన ఆరువందలకు చెక్కు పంపిస్తున్నాను. వారికి అందజేయండి.

అక్కయ్యతో గలిసి ఒకసారి మీరు ఇక్కడకు ఎందుకు రాగూడదు?

ఇట్లు
మీ కోడలు
శ్యామల.



''ఇందుకే చదువుకొన్నవాళ్ళకంటె చాకళ్ళు మేలంటారు'' సుభద్రమ్మ విసుగుకొన్నది.

ఆ రాత్రి రామయ్య భోజనం చేసి తాపీగా కూర్చుండగా, ''నీ తమ్ముడు ఉత్తరం రాశాడురా!'' అని తల్లి చెప్పింది.

అతడు ఊంకొట్టి ఊరకొన్నాడు. ''పొరపాటు జరిగిందని వాడెంతో బాధపడి ఆరువందలు తిరిగి పంపాడు,'' అంటూ ఆమె కోడలు పంపిన చెక్కు ఇవ్వబోయింది.

''కుక్క ముట్టిన కూటికోసం ఈ రామయ్య ఎన్నడూ ఆశపడడు.'' అతడు చివుక్కున లేచి బజారుకు వెళ్ళిపోయాడు.

సుభద్రమ్మ నిర్ఘాంతపోయింది. ప్రక్కనే ఉండి అంతా విన్న పెద్దకోడలు, ''అత్తయ్యా, పెద్దదానవు, నీకు తెలియనిదేముంది? ఆ మనిషికి కోపం వస్తే అంతేగా! పోటు పొడుస్తున్నంతమాత్రాన కళ్ళు తీసివేసుకోగలమా?'' అన్నది.

''అవునమ్మా, అంతే, మిన్ను కురవకచేలు, కన్ను కురవక బ్రతుకులూ పండవు.'' సుభద్రమ్మ పైట కొంగుతో ముక్కు తుడుచుకొన్నది.

---

మబ్బులురివమాయి. తత్తరపాటుతో రైతులు అరకలుకట్టారు. మెట్టచాళ్ళు ముగిసాయి. గంగమ్మ వెళ్లిపొడిచింది.

సాయంకాలం దమ్ముమనాగలి ఇంటికి తోలుకుపోతూ పాత పాలేరు ముత్తయ్యా చినబాబు చేను దున్నించలేదేమని సుభద్రమ్మను ప్రశ్నించాడు. ఆ రాత్రి ఆమె రామయ్యను కదిలించింది.

"ఇకనుంచి నీ పొలంతో నాకు నిమిత్తం లేదని ధాన్యం డబ్బు పంపిననాడే వ్రాశానే!"

" ఇంతకూ చేను దున్ననేలేదు!"

"పోరంబోకులన్నీ దున్ని జరిమానాలు వేయించుకొనే దుర్గతి నాకింకా పట్టలేదు."

"పోరంబోకలా?" తల్లీకొడుకుల మాటలు వింటున్న మంగమ్మ అందుకొన్నది.

"కాదు, మీ బాబిచ్చిన అరణం!"

"అమ్మాయ్! పుణ్యానికి పోతే పాపం వెంటబడుతుంది గాని నీవూరుకో, వాడీలోకంలో లేడు."

సుభద్రమ్మకు అర్థమయింది. పెద్దకొడుకు వ్రాసే ఉంటాడు. చిన్నకొడుకు అన్నను నలుగురిచేత అనిపించాలనో, మొగం చెల్లకో, మరచిపోయో చేను సంగతి పట్టించుకోలేదు. చూస్తూ, చూస్తూ బంగారంవంటి చేను పాడుపెట్టటమా? పిల్లాజెల్లా ఉన్నవాడు. బస్తీలో కాపురం. 199

తెల్లవారుజామున సుభద్రమ్మ లేచివెళ్ళి ముత్తయ్యను లేపి లక్ష్మయ్య చేను చేసుకొమ్మన్నది. తరుణం దాటిన తరువాత తలకెత్తుకొనే సాహసం లేక అతడు తనవల్ల కాదన్నాడు. "అయితే కూలి నాగళ్ళు పెట్టి దమ్ముచేయించి నాటువేయించు. ఖర్చులన్నీ నేనే పెట్టుకొంటాను. నీకష్టం అట్టి పెట్టుకోను ముత్తయ్యా!" అన్నది. లోగడ చాలకాలం తన్నాదుకొన్న ముసలమ్మ నోరు తెరిచి అడుగుతున్నది. అతడు కాదనలేకపోయాడు.

లక్ష్మణరావు చేలో పడ్డమొక్కలు రామయ్యచెవిలో పకాపక నవ్వాయి. తాను తల్లిని పువ్వుల్లోపెట్టి పూజిస్తుంటే ఈనాడు ఇలా నలుగురిలో నవ్వులపాలు చేస్తుందా? మాటమాత్రమైనా తనతో అనలేదు. నిజానికి ఆమె బొంది మాత్రం తమతో ఉన్నదే కాని ప్రాణాలన్నీ చిన్నకొడుకు వద్దనే.

ఈ ఆలోచన రాగానే రామయ్య మనసుకు గతమంతా మరొకరీతిగా తోచింది. తల్లిపక్షపాత బుద్ధితోనే తన చదువు మానిపించింది. చిన్నవాడి చదువు ఖర్చులు లెక్కకట్టనీక ఆస్తి సమంగా పంపిళ్లు వేయించింది. కళ్ళు ఉండీ తాను అంధుడయ్యాడు.

ఆ రాత్రి సుభద్రమ్మ మనుమణ్ణి ఒళ్ళో కూర్చోబెట్టుకొని, '' ఓయమ్మ నీ కుమారుడు'' అన్న భాగవత పద్యం చెబుతున్నది. రామయ్య ప్రక్క అరుగుమీద ఒద్దికగా కూర్చుని, ''అమ్మా!'' అన్నాడు.

''ఏమిటిరా!''

''ఏమీ లేదు. ఇంత కాలం పెంచావు. ఒక యింటివాణ్ణి చేశావు. ఇంకా నీమీద ఆధారపడటం బాగుండలేదవమ్మా! రేపటినుంచి మా సోలెడు మేము పొంగించుకొంటాము.''

సుభద్రమ్మ కొయ్యబారిపోయింది. ఎలాగో తెమల్చుకొని డగ్గుత్తికతో అడిగింది: ''ఇంతకూ నేను చేసిన పాపమేమిటి?''

అతడు మాటాడలేదు.

''గడవవలసిన పురుళ్ళూ, పుణ్యాలు గడచినా ఈ మొండికట్టె పోక వచ్చింది.''

రామయ్య మారు మాటడక వెళ్ళిపోయాడు. ఆమాటలన్నీ వాకిట్లో నిలబడి వింటున్న మంగమ్మ బావురుమన్నది.

200 ''అవమ్మాంయీ, జరగవలసిందేదో జరుగుతుంది. నెలలువచ్చిన మనిషి దిగులుపడరాదు.''

మరునాడు జాము ప్రొద్దెక్కిన తరువాతగాని సుభద్రమ్మ లేవలేదు. లేచి ఆమె దొడ్లో కాలు పెట్టగానే తొలిచూరి పడ్డ, వెల్లావు, దూడ ఒక్కసారిగా అరిచాయి.

'' ఏమే అమ్మాయి! దూడను విడవలేదా?'' ఆమె కోడలిని పిలిచి అడిగింది.

''వాటికైనా బుద్ధి ఉండదా అత్తయ్యా?''

''నాయనమ్మా! నాయనమ్మా! ఇందాక పాలచెంబు పత్తుకుని నాన్న దగ్గిలికెలితే పడ్డా ఆవు ఏమి చేశాయనుకొన్నా? నువ్వు చూలాలిసింది. బలే చిందులు పెత్తాయిలే! సినిమాలో కూలా అలా చిందులు పెత్తాయి,'' సూర్యం అభినయించాడు.

''నోరుముయ్ వెధవ!'' మళ్ళీ పాలచెంబు పట్టుకొనివచ్చిన రామయ్య తన చేతిలోని దాయత్రాటితో కొడుకును బకటి వేశాడు.

''పెద్దబ్బాయ్!'' చిరుతపులి కాంద్రుమన్నది.

''ఇది నా సంసారం.'' రామయ్య తల్లివంకకైనా చూడక వెళ్ళి లేగ కోడెదూడను విప్పి ఆవుకు దాయ వెయ్యబోయాడు. అది బిసతప్పిన రాకెట్టయి ఎగిరిపడ్డది. మరికొంచెమైతే అతని కన్ను పోవలసింది.

జి.వి. కృష్ణరావు

సుభద్రమ్మ గిరుక్కున మళ్ళీ ఇంట్లోకి వెళ్ళిపోయింది. పోయిన కొంచెంసేపటికే బాదుతున్న చప్పుడు, పడ్డ అరుపులు వినిపించాయి. దానిని ఆమె కన్నబిడ్డలాగా పెంచింది. కట్టుతాడు విప్పితే అది వెంటబడి వంటయింటి గుమ్మందాక వచ్చి నిలబడిపోయేది. ఆ సంగతి జ్ఞప్తికి రాగానే ఆమె నిలుచున్న చోటనే చతికిలబడిపోయింది.

భూమి మాత్రం చతికిలబడలేక తన చుట్టూ నాలుగుసార్లు అలంగం తిరిగింది. ఆ మధ్యాహ్నం కటికినులకల్లో పండుకొని సుభద్రమ్మ ఇంటి వాసాలవంక చూస్తున్నది.

''నాయనమ్మా, నాయనమ్మా!''

''ఎవరది?''

''ఇస్! బిగ్గలగా మాతాలకు. నాన్న బయత అలుగుమీన కూచున్నాలు. ఇంతాలు.''

''అరే, అటు తిరిగిరా!''

''అమ్మో! వత్తే బతకనిత్తాలు? మొన్నే చెప్పాలుగా, పానాలు తోలేత్తానన్నాలు.''

''అలాగా!''

''సలేగాని, అన్నం తిన్నావా?''

''ఆఁ... ఆఁ''

''ఒత్తిదే. అబద్దాలు చెపుతున్నావు. నీకు ఆడపిల్లలు పులతాలు నాయనమ్మా!''

''ఓరి పిచ్చిగాడిద!''

''గాలిద ఓంద్రపెత్తును. నేను పెత్తను.''

ఆమె మాటాడలేదు.

'' ఈ యింట్లో అందలికి కోపాలే. నీకు కోపం, నాన్నకు కోపం, అమ్మకు కోపం, ఆవుదూడలకు కోపం, నాకేనా లేంది? నేనూ కోప్పలతా, ''ఒలే పెద్దబ్బాయ్! నీకు మతిపోయిందిలా! లేకపోతే నిచ్చేపంలా పాలు తాగలేక పద్దను అమ్మేత్తావా?'' సూర్యం నాయనమ్మను అనుకరించాడు.

నవ్వుతుందనుకొన్న నాయనమ్మ బొమ్మలాగ చూస్తున్నది. సూర్యానికి ఏమీ అంతుపట్టలేదు. ఏదో తప్పుచేశానన్న భయంతో అతడు చల్లగా జారుకొన్నాడు.

తనను దగ్గరకు చేరనీని పాడిపడ్డను తెగనమ్మి రామయ్య బక్క నీళ్లకుగూడ వాసిపోతున్నాడు. ఆవుకూడ దాయ వేయనీయటంలేదు. ఇక్కడదూడ గదా అదైనా

బాగుపడుతుందన్న ఆశతో వదలి ఊరుకొంటూ వచ్చాడు. ఆవు తరిగలదనీ, ఒక ప్రక్క అయినా తీయకపోతే లేగదూడ అరమాయించుకోలేదనీ అతడు గుర్తించలేదు. పొలము మీది చాకిరి అయితే చేస్తూ వచ్చాడేకాని పాడి పశువులకు అతడెప్పుడు పరామరిక చేశాడు? పదిరోజులలోనే అజీర్తిరోగంతో కోడెదూడ చచ్చిపోయింది. వలవల ఏడుస్తూ సూర్యం ఆ సంగతి తడిక కంతలలో నుంచి సుభద్రమ్మకు చెప్పాడు. నిప్పుల కవ్వంతో ఆమెకు గుండెలు చిలికినట్లయింది. వచ్చిపడుతున్న కడగండ్లన్నిటికీ తల్లే కారణమని కొడుకు మరీ గండరించాడు.

లేగదూడ చనిపోగానే సుభద్రమ్మ మనసు పరిపరివిధాల పోయింది. తన ఉనికివల్ల కొడుకు కోపం పెరుగుతుందే కాని తరగదు. ఆ కోపంతో ఇలాగే ఏవో తెలివితక్కువ పనులు చేస్తాడు. నష్టపోతాడు. తన మనస్సు మరీ వికలమవుతుంది. ఈ చిక్కులన్నీ దేనికి? కొంతకాలం తానక్కడ లేకపోతేనో? వాడి మనస్సు కుదుట పడవచ్చును. లేదా తనకైనా కొంత మనశ్శాంతి కలుగవచ్చును.

ఆ మధ్యాహ్నం కొడుకు వాటాలోకి వెళ్లి మంగమ్మను పిలిచి, ''అమ్మాయి, ఇల్లు భద్రం! నీ సంసారం సంగతి నీకు చెప్పనక్కరలేదు. వస్తానమ్మా!'' అన్నది. గ్రుడ్ల
202 నీరు గ్రుడ్లలోనే క్రుక్కుకొంటూ ''నన్నేమి చేసిపోతున్నావత్తయ్యా!'' అని మంగమ్మ అన్నది.

''నేను బిడ్డల్ని కన్నానేగాని, గడ్డల్ని కనలేదు.'' సుభద్రమ్మ ముఖం కొంచెం ఎర్రబడ్డది.

కోడలు మళ్లీ నోరెత్తలేదు.

సూర్యం ఇంటివద్దలేని సమయం చూచుకొని సుభద్రమ్మ చిన్నమూటతో బయలుదేరి ఎలాగో మరునాటి పదకొండు గంటలకు లక్ష్మయ్య ఇంటికి చేరింది. ఇంట్లో కొడుకుగాని, కోడలుగాని లేరు. పనిమనిషి బండ బూతులు తిడుతూ లోపలినుంచి నాలుగేళ్ల వాణ్ణి, తరుముకొచ్చి వరండాలో నిలబడ్డ సుభద్రమ్మను చూచి, ''బిచ్చానికి ఏలాపాలా లేదా ఏంది? పోపో,'' అని కసరుకొన్నది.

సుభద్రమ్మకు తన రేగిన తల, రైలుప్రయాణంతో మాసినబట్ట జ్ఞప్తికివచ్చి నవ్వుకొని, ''లక్ష్మయ్య లేడూ?'' అన్నది.

''ఈడ లచ్చుమయ్యలు లేరు, గిచ్చుమయ్యలు లేరు పోపో, ఈ దొంగేసాలు సాలసూసాము.'' పనిమనిషి పిల్లలను లోపలికినెట్టి తలుపు వేసుకొన్నది.

ఆ క్రిందటి ఉదయాన ఎప్పుడు రెండు మెతుకులు ఎంగిలిపడ్డదో ముసలిప్రాణం ఆ వరండాలోనే చదికిలబడ్డది. సాయంకాలం నాలుగున్నరకు స్కూలునుంచి తిరిగి వచ్చిన లక్ష్మణరావు విస్తుపోయి పనిమనిషిని చెడామడాతిట్టి, తల్లి స్నానానికి నీళ్ల తోడించాడు. ఆమె స్నానం చేసింది. అంతలోనే శ్యామల ఆఫీసునుంచి వచ్చి జరిగినదంతా విని నొచ్చుకుంటూ, ''ముందుగా ఉత్తరంముక్క వ్రాస్తే కాకపోయిందా అత్తయ్యా!'' అన్నది.

''ఇంతకూ మా వియ్యంకుడికి ఉత్తరం వ్రాయమంటావు!''

''ఏమని?'' శ్యామల విస్తుపోయింది.

''ముందుగా ఉత్తరంముక్క వ్రాస్తే తప్ప అమ్మాయిని ఇంటికి రానీయవద్దని.''

''అదిగాదు అత్తయ్యా! మాట మాత్రం ముందు తెలిస్తే ఇలా జరగకపోనుగదా అని అంటున్నాను.''

''రోజుకొక పనిమనిషిని మార్చుకొంటున్నారని నేను మాత్రం కలగన్నానా?''

''ఏమండోయ్, మిమ్మల్నే? సమాధానం చెప్పండి. నావంతు అయిపోయింది.'' కోడలు నవ్వింది. 203

''బాగుంది వ్యవహారం. అత్తాకోడళ్లు పోటాడుకొనేవాళ్ళు పాటాడుకోండి. మధ్య నన్ను లాగుతారు దేనికి?''

''ఇంతకూ మేమిద్దరం పోటాడుకొంటే చూస్తానంటావు?'' తల్లి కొడుకు వంకతేరి చూచింది.

''అమ్మ బాబోయ్, ఇద్దరూ ఏకమయ్యారు! ఈ రాత్రినుంచి సత్ర భోజనం మఠంనిద్ర తప్పదుకాబోలు!'' లక్ష్మణరావు ఉత్తరీయం బుజాన వేసుకొని బయలుదేరాడు.

''అత్తయ్య ఎప్పుడు ఎంగిలిపడ్డదో! పెందలాడేరండి?'' శ్యామల భర్తను హెచ్చరించింది.

రోజులు తరాటు గొడుతున్నాయి. ఒళ్లు సరిగా వంచుకోలేక, చేతివాటుకు వీలుపడక పనిమనిషి మానుకొన్నది. సుభద్రమ్మ విసుగుకోలేదు. అన్ని పనులూ తానే అందుకొంటూ కొడుకు ఇల్లు చక్కద్రోసుకొస్తున్నది. పిల్లలు ఏడుపులు పెడబొబ్బలు తగ్గించి పెందలాడే లేవటం, ఎవరి పనులు వారు చక్కబెట్టుకోవటం ప్రారంభించారు. ''నానమ్మా! నానమ్మా! మొగం కడగవూ?'' అంటూ మూడోవాడు లేచి వచ్చేవాడు.

''అరే అన్నాయ్, చిట్టాడి ముఖం ఇత్తడి తెపాలరా, అందుకేకడిగి అవతల పెట్టమంటున్నాడు,'' అని రెండోవాడు వెక్కిరించాడు. ''నీ మొగమే సత్తెపాలరాచిప్ప,'' అని కొక్కిరించి నాయనమ్మా కడుగుతానన్నా వద్దని తన పని తాను చేసుకోవటం మొదలెట్టాడు. అయినా నాయనమ్మ చేసేవంటకాలలో అదనంగా ఉప్పు, కారాలువేసి సరిక్రొత్త రుచులు కల్పించటానికి యత్నించకపోవటం లేదు. కాని సుభద్రమ్మ పడనీయటంలేదు.

మంగమ్మ అత్తయ్యకు ఉత్తరం వ్రాసింది. తనకు ఆడపిల్ల కలిగిందట. అంతా కులాసాగా ఉన్నారట. సూర్యం నాయనమ్మకోసం మారాము చేస్తున్నాడట. రామయ్య తల్లి వాటాలో అడుగుపెట్టటం లేదు సరిగదా, అందులో దీపం కూడా పెట్టనీయటం లేదట.

''బావగారికి ఎందుకంత పట్టుదల?'' ఉత్తరం చదివిన శ్యామల విస్తుపోయి అడిగింది.

''మనిషికొకబుద్ధి, మనమేమి చెబుతాము?'' సుభద్రమ్మ నిర్వేదంతో నిట్టూర్చింది.

ఒకనాటి సాయంకాలం అంతా హాల్లో కూర్చుండగా లక్ష్మణరావు ఉత్సాహంతో
 అన్నాడు:

''అమ్మా, ఇవాళ మన ఊరినుంచి ఉత్తరం వచ్చిందే!''

''రామయ్య వ్రాచాడా?'' సుభద్రమ్మ ముఖం విరిసింది.

''కాదు, షావుకారు చంద్రయ్య వ్రాశాడు.''

''ఏమని?'' ఆమె గొంతులో మొదటి ఉత్సుకతలేదు.

''మనవాటా, ఇల్లూ, దొడ్డీ అమ్ముతారా అని అడుగుతున్నాడు. పదివేలదాకా పెంచేట్లున్నాడు.''

''ఇవాళ ఇల్లు అమ్ముతానంటావు, రేపు నన్నమ్ముతానంటావు!''

''అమ్మా! అమ్మా! నిజంగా నాయనమ్మను అమ్ముతారంటే?'' పెద్దకొడుకు రఘు ఉత్సాహంతో అడిగాడు.

''ఆఁ, అమ్ముతారు, కొంటావా?'' శ్యామల అడిగింది.

''ఓ.''

''ఏంపెట్టి?''

''ఏంపెట్టి?''

''నాన్నను తాకట్టుపెడతాము. నాయనమ్మను కొనుక్కుంటాము.''

''ఆ తాకట్టు కొప్పుకునే దరిద్రుడెవడంట?''

''మా నాన్న బాగా లెక్కలు వేస్తాడే. హైస్కూలు పిల్లలంతా అంటున్నారు. ఏ షావుకారైనా తాకట్టు పెట్టుకోడా యేమిటి? ఎందుకు నవ్వుతా?''

''నోరుముయ్, వెధవ! వసపిట్ట వాగుడూ నువ్వూను. అది కాదమ్మా! ఆ కొంప అక్కడ ఉండి ఏమి చేస్తున్నది? దీపం పెట్టే వాళ్లయినా లేరా? అమ్మితే యేం? నువ్వు చూస్తూనే ఉన్నావుగా. అద్దెకట్టలేక ఎంత అవస్త పడుతున్నామో, ఆ డబ్బుతో ఇక్కడ స్థలమైనా కొనుక్కోవచ్చునుగా! ఏమంటావు శ్యామలా?'' అతడు భార్యను హెచ్చరించాడు.

''అమ్మాయ్, మీ ఆస్తిని మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి! మధ్య కాదనటానికి నాకేమిటి హక్కు?'' సుభద్రమ్మ చటుక్కున లేచి వెళ్లింది.

ఆ రాత్రి శ్యామల భర్తతో తగవు పెట్టుకొన్నది. ''మీ సుఖం మీరు చూచుకొంటే సరిపోయిందా? ఇదివరకే మీ అన్నయ్య ఆమె మీద కారాలు, మిరియాలు నూరుతున్నాడు. ఇప్పుడు ఇల్లు అమ్మటానికి ఒప్పుకొంటే ఏమవుతుంది? కచ్చెకట్టి మీచేత ఇల్లు అమ్మించిందనుకోడా? ఇదివరకు వచ్చిన మాటపట్టింపులతోనే ఆమె కుమిలి పోతుంటే, ఇది మరొకటా? ఆమెను మళ్లీ పెద్దకొడుకు ముఖం చూడవద్దంటారు. మీలాగే వారూ ఆమె కడుపున పుట్టలేదా?'' 205

''నీకు బొత్తిగా మతిపోయింది. నువ్వనేదేమిటి? నీ పిల్లల బాగోగులు నీకు పట్టకపోతే నాకా?'' లక్ష్మణరావు వికటంగా నవ్వాడు.

''అందుకే మండుతుంది. అంత దూరపు ఆలోచన కలవాళ్ళు అయితే మీ అన్నయ్యతో మాటాడి ఆమెకు చెప్పండి. అయినా తెలియక అడుగుతాను. ముందుగానే అన్నదమ్ములిద్దరూ ఆమె ఆస్తిని అమ్ముకొంటే ఆమె ఎక్కడ ఉంటుంది? ఏమి తింటుంది? ఆమెకు ముసలితనం వచ్చిందనేగా ఈ ఆట ఆడుతున్నది?''

మరునాడే సుభద్రమ్మ ప్రయాణం కట్టింది. వెళ్ళవద్దని శ్యామల ఎంతగానో బ్రతిమాలింది. పెద్ద మనుమలిద్దరూ చెరొక రెక్క పట్టుకొన్నారు. మూడోవాడు ఆమె మాటను తీసుకుపోయి ఇంట్లో ఎక్కడో దాచాడు.

లక్ష్మణరావు తిరిగి గృహవిక్రయ ప్రస్తావన తేలేదు. మాసాలు గడిచాయి.

''అమ్మా, మనియార్డరు వచ్చింది,'' అంటూ ఒకనాడు లక్ష్మణరావు డబ్బూ, ఫారము పట్టుకొచ్చి తల్లి కివ్వబోయాడు.

''ఎక్కడనుంచి? ఎవరు పంపారు?'' ఆమె అడిగింది.

''అన్నయ్య, నీ పంట పైకం కాబోలు. కాకపోతే ఎనిమిది వందలు దేనికి పంపుతాడు? ఇక నుంచి పొలం ఎవరికైనా ఇచ్చుకొమ్మంటున్నాడు.''

''అక్కరలేదు. తిప్పి పంపు.'' ఆమె తాపీగా అన్నది.

''ఎనిమిది వందలే!''

''ఊళ్ళో క్లబ్బులున్నాయే!'' శ్యామల నవ్వింది.

''షటప్!''

''బళ్ళో ఈ చదువులే చెబుతున్నావా?'' సుభద్రమ్మ కొడుకు వంక చూచింది.

లక్ష్మణరావు అక్కడనుంచి వెళ్ళిపోయాడు. ఆరాత్రి ఇంటికి రాలేదు. మరునాటి
206 ప్రొద్దున్నే సుభద్రమ్మ కోడలిని అడిగింది.

''రాత్రి అబ్బాయి రాలేదుగా!''

''లేదత్తయ్యా!''

''ఎక్కడికి వెళ్ళాడో!'' సుభద్రమ్మ గొంతులో విషాదం పలికింది.

అంతకుపూర్వమే సమాధానం ఆలోచించుకొన్న శ్యామల చెప్పింది: ''ఏదో పని ఉన్నదట. ఒకవారం స్కూలుకు సెలవు పెట్టి వెళ్ళారు.''

సుభద్రమ్మ మళ్ళీ ప్రశ్నించలేదు. నిజానికి ఆ ధైర్యం కూడ లోపించింది. వెనుకటి దుఃస్థితి తిరిగి తారసిల్లుతున్నదా? లోగడ చిన్న కొడుకున్నాడని బయలుదేరి వచ్చింది. ఇప్పుడు మరెక్కడకు బయలుదేరుతుంది? ఆలోచించే సాహసంలేక సుభద్రమ్మ కోడలిమాట నమ్మింది. జీవనలాలస ప్రగాఢం. అతి విచిత్రం. అది జీవేశ్వరులనే కాదు, సర్గాపవర్గాలనే కాదు, ధర్మాధర్మాలనే కాదు, హేతువునే సృష్టిస్తుంది. అవసరమైతే ఆ హేతువును గూడ నాశనం చేస్తుంది.

శ్యామల చెప్పిన వారం రోజులు గడిచాయి. కాని లక్ష్మణరావు ఇంటికి రాలేదు. క్లబ్బులోనే మకాము పెట్టి అక్కడనుంచే స్కూలుకు వెళ్ళివస్తూ ఇంటిముఖం చూడలేదు.

ఈ సంగతి తెలుసుకొన్న శ్యామల లోలోన ఉడికిపోతున్నది. అత్తకు ఏమని చెబుతుంది? ఆమెకు నీడలేకుండా ఎలా చేస్తుంది?

''నాయనమ్మా, నాయనమ్మా! నాన్న ఎక్కడకు వెళ్ళాడు? ఎప్పుడు వస్తాడు?'' అని రఘు ఒక సాయంకాలాన అడిగాడు.

''బుద్ధిలేనివాళ్ళు ఎక్కడికైనా వెళ్ళుతారు. ఎన్నాళ్ళయినా ఉంటారు. నీక్కూడ బుద్ధిలేదా?'' శ్యామల కొడుకుమీద విరుచుకుపడ్డది.

''చూచావా, చూచావా? నేను చేసిన తప్పేమిటి నాయనమ్మా;'' రఘు మొగం చిన్నబుచ్చుకొన్నాడు.

''అన్ని తప్పులూ నావే బాబూ!'' సుభద్రమ్మ గొంతు జీరవోయింది.

ఆ తెల్లవారుజామున సుభద్రమ్మ కోడలిని లేపి, ''వస్తానమ్మా,'' అన్నది. శ్యామల తెల్లబోయింది.

''నాకు అంతా తెలుసమ్మా! నేనుండగా వాడు ఈ ఇంట్లో అడుగు పెట్టడు. అదంతా నా ప్రారబ్దం. దానికి నీవేమిచేస్తా? వస్తానమ్మా వస్తా. నేను వెళ్లిపోవటం నీకు కష్టమే. కాని, ఏమిచేయను? కలకలలాడే సంసారం నామూలాన పాడుకావటం నాకిష్టం లేదు. ఆలుమగల్లను ఒరికొకరు కాకుండ చేయలేను. నేను రాకముందు హాయిగా ఉన్నారు. వచ్చి లేనిపోని కలతలు తెచ్చిపెట్టాను. అవన్నీ మరచిపో. వెనుకటిలాగా సుఖంగా ఉండండి!'' 207

''అక్కడ కాదనుకొని ఇక్కడకు వచ్చారు. ఇక్కడ కాదనుకొని ఎక్కడకు పోయేటట్లు? వద్దు అత్తయ్యా, వద్దు! ముసలితనంలో తల్లిని తరిమివేసే అధికారం ఎవరిచ్చారు? అయినా తన సంపాదన తెచ్చి ఎవరినీ పోషించటం లేదు. కాస్తో కూస్తో నేనూ తెస్తూనే ఉన్నా. అంత కష్టమైతే మానుకొంటారు. నేను తెస్తున్న దానితోనే ఎలాగో సర్దుకొందాము. మీరు ఉండాలి అత్తయ్యా! జంకితే ఎంత దూరమైనా తరిమికొడతారు,'' శ్యామల అత్త చేతులు పుచ్చుకొన్నది.

''కడుపున పుట్టిన బిడ్డలకంటే నీవే చాల నయం. చాలు, నాకు ఇంతకన్నా ఏమి కావాలి? కాని, ఒకటి ఆలోచించు. అత్త వచ్చి కొడుకును కోడలికి కాకుండా చేసిందని లోకం ఆడిపోస్తుంది. లోకం సంగతి ఎలా ఉన్నా అంతరాత్మ పీడిస్తుంది. ఏదైనా బాధపడతానుగాని ఈ బాధ మాత్రం పడలేను. కాటికి కాళ్ళు చాచుకొన్న నా సంగతి వదలు. మగని కెడమైన మగనాలు ఎంత చులకనవుతుందో ఆలోచించు. పైగా పిల్లా

జెల్లా. వీళ్ళందర్నీ ఈడేర్చాలి. ఈ బాధ్యత గొప్పదమ్మా! మనం మనుషులం కాని, పశువులం కాదు.''

శ్యామల నిశ్చల దీపశిఖ అయిపోయింది.

''అమ్మాయ్!''

''ఎమిటి అత్తయ్యా?''

''ఇంతకాలం నుంచి హృదయం చిదిమిపెడుతున్నా సంతృప్తి పడక ఈ ముసలిప్రాణం మరొకటి కోరుతున్నదమ్మా!''

''ఏమిటి అత్తయ్యా?''

''నాకోసం లక్ష్మయ్యతో తగాదా పడనని మాట ఇవ్వు!''

శ్యామల అత్తవంక చూడలేక ముఖం తిప్పుకొన్నది.

''మాటాడవేమమ్మా? కోరరాని దానిని కోరానా?''

''అంతా మీలాంటివారు కాలేరత్తయ్యా!''


''కావద్దు తల్లీ! కావద్దనే నా ఆశీస్సు!''

సుభద్రమ్మ వెళ్ళిపోయింది. ఇంక క్లబ్బులో అజ్ఞాతవాసం చేయవలసిన అవసరం ఏమాత్రం లేదని శ్యామల ఉత్తరం వ్రాసి రఘుచేత భర్తకు పంపించింది. ఆ సాయంకాలమే అతడు ఇంటికి చేరాడు.

సుభద్రమ్మకు తన యింటికిపోయి తానల్లరిపడటం, పెద్దవాని మనస్సు వికలం చేయటం ఇష్టంలేకపోయింది. ఏగూటిలో పక్షులు ఆ గూటిలో ఉంటున్నవి. వాటి సుఖం తానెందుకు చెడగొట్టాలి? బ్రతికి ఇంకా ఎవరిని ఉద్ధరిస్తుంది?

ఈ ఆలోచన రాగానే సుభద్రమ్మకు తన జీవితమ్మీద విరక్తి కలిగింది. కాని బలవంతాన ప్రాణాలు తీసుకోలేక చేతి బంగారు మురుగులు అమ్మివేసి ఆ బస్తీలోనే మారుమూల పేటలో బియ్యపు కొట్టు పెట్టుకొని జీవయాత్ర సాగిస్తున్నది.

ఆ సంక్రాంతికి రామయ్యవద్ద నుంచి తల్లిపేర మనియార్డరు వచ్చింది. లక్ష్మణరావు నిర్ఘాంతపోయాడు. తల్లి స్వగ్రామం చేరక ఎక్కడకు పోయినట్లు? అతడు పోయి భార్యకు మనియార్డరు చూపించాడు.

''ఇంకేం, కావలసిందేదో వచ్చిందిగా, పుచ్చుకోండి.''

''ఫోర్జరీ చేయమన్నావా?''

''ఎన్నాళ్ళనుంచి ఈ ధర్మబుద్ధి?''

''అన్నయ్యతో వ్యవహారం!''

''అయితే కూడబలుక్కుని పంచుకోండి.''

''ఎందు కంత కోపం?''

''నాకు భాగం లేదని.''

అతడు మళ్ళీ మారాడలేదు. ఆ సాయంకాలం శ్యామల రఘువద్ద వాపోయింది.

''మీ నాయనమ్మ మన వూళ్ళో లేదట రఘూ!''

''మన వూళ్లో లేదా?'' రఘు ఆశ్చర్యపోయాడు.

''ఇవాళ అక్కడనుంచి మనియార్డరు వచ్చింది. ఉంటే ఎందుకు వస్తుంది?'' ఆమె కంట తడి పెట్టింది.

రఘుకు అర్థమయింది. తల్లి కన్నీరు చూడలేక అన్నాడు.



''నాయనమ్మ ఈ ఊళ్ళోనే ఉన్నదమ్మా!''

''ఈ ఊళ్ళోనే? నీవు చూచావా?''

''ఉంది. అప్పుడప్పుడు వెళ్ళివస్తూనే ఉన్నా.''

''ఒకనాడు కాకపోతే ఒకనాడైనా చెప్పావుకాయేమిరా? అవునులే, విత్తొకటైతే చెట్టు మరొకటవుతుందా?''

''చెప్పవద్దంటే ఏమి చేయ్యను?'' రఘు ఖిన్నుడయ్యాడు.

''అయితే బయలుదేరు.'' శ్యామల కొడుకును తొందర పెట్టింది.

''నాన్న వింటాడేమో!''

''ఎవరి మోచేతి నీళ్ళు త్రాగటంలేదు కాని పద.''

ఇద్దరూ రిక్షాలో బయలుదేరారు. వారు వెళ్ళేటప్పటికి కొట్టువేసి ఉన్నది. రఘు ప్రక్కవారిని కనుక్కొంటే రెండు రోజులనుంచి కొట్టు మూసివేసి ఉంటున్నదని చెప్పారు. అంతకుముందెన్నడూ అతడు నాయనమ్మ యింటికి వెళ్ళలేదు. ఆమె అడ్రసు కనుక్కొని

తల్లీ కొడుకులు వెదకికొంటూ శిధిలావస్థలో ఉన్న ఒక చిన్న పెంకుటింటికి చేరారు. తలుపు ఓరవాకిలిగా వేసి ఉన్నది. లోపలి నుంచి మాటలు వినిపిస్తున్నాయి. ''కొత్త సరుకు. ఆ బియ్యం మీకు పనికి రావు. మాట పోతుంది. మీ అమ్మతో చెప్పు. నాలుగైదు రోజుల్లో పాతరపడ్డ సరుకు వస్తుంది. అప్పుడు నేనే పంపిస్తాగా!'' శ్యామల తలుపు బారలుగా త్రోసుకువెళ్ళింది. లోపల ఎవరూ లేరు. గది చీకటి కోనేరుగా ఉన్నది. మూలుగునుబట్టి తడవుకొంటూపోయి ఆమె నులక మంచంలో పండుకొన్న అత్తచేయి పట్టుకొని చూచింది. ఒడలు సెగలు, పొగలు చిమ్ముతున్నది.

'' ఒరే రఘు, నీవు రిక్షాలోపోయి నేను రమ్మంటున్నాని చెప్పి డాక్టరు రాధమ్మను అర్జెంటుగా వెంటబెట్టుకురా, ఇప్పుడు ఇంట్లోనే ఉంటుంది. ఇల్లు తెలుసుగా?''

అతడు రాధమ్మ కారులో తిరిగి వచ్చారు. డ్రైవరు సాయంతో సుభద్రమ్మను కారువెనుక సీటులో పండుకోబెట్టి గదికి తాళంపెట్టి శ్యామల రఘు వెనుకసీటు ముందు కూర్చున్నారు. కారు బయలుదేరింది.

''ఎవరు ఈ ముసలమ్మ?'' రాధ అడిగింది.

210 ''దిక్కులేనిది,'' శ్యామల గొంతు డగ్గుత్తిక పడ్డది.

''ఈ అనాథసేవ ఎప్పటినుంచి?'' ఆమె నవ్వింది.

''ఏదో దూరపు చుట్టరికం. ఆమెకు కావలసివాళ్ళు ఎక్కడో ఉన్నారు. సుస్తీగా ఉన్నదంటే చూచి నీకోసం కబురంపించాను.''

''నర్సింగ్‌హోంకు పోదామా, మీ యింటికా?''

''నర్సింగ్‌హోంకే పోనీండి?''

''అమ్మా!'' రఘు ఏదో చెప్పబోయాడు.

ఆమె మెల్లగా కొడుకును గదిమింది.

శ్యామల ఆఫీసుకు సెలవుపెట్టి అత్తవద్దనే ఉంటున్నది. పిల్లలు అప్పుడప్పుడు వచ్చి చూచిపోతున్నారు. లక్ష్మణరావుకు ముఖం చెల్లక రాలేదు. నాలుగు రోజుల తరువాత సుభద్రమ్మకు తెలివి వచ్చింది.

''ఎవరిల్లు?''

''ఇల్లుకాదు నాయనమ్మా! ఆసుపత్రి.'' దగ్గర ఉన్న రఘుఅంతా వివరించి చెప్పాడు.

''డాక్టర్లు దేవుళ్లు కాదూ?'' అంటూ కోడలు కనిపించగానే ఆమె బలహీనంగా నవ్వింది.

''అదేమిటత్తయ్యా?''

''ఎందుకొచ్చిన దండుగ గాని నీ యింటికి చేర్చు. ఈ ముసలి తనంలో మందులు పట్టవు.''

''అలాగే నత్తయ్యా! బావగారికి ఉత్తరం వ్రాశాను. బండి తోలుకొస్తారు. రాగానే వెళ్లిపోదాము. ఈ మందు పుచ్చుకోండి!''

''అవునవును. రామయ్యబండి తప్పక తోలుకొస్తాడు!''

సుభద్రమ్మ మందు త్రోసివేసింది.

''ఇంతగా కలవరిస్తున్నావే, నిన్ను చూట్టానికి పెదనాన్న ఎందుకురాడు?''

''రాడు బాబూ, రాడు. నేను చచ్చిపోయినా రాడు. వాడి సంగతి నీ కిప్పుడప్పుడే అర్థం కాదు.''



పెద్దకొడుకు వచ్చి చెబితేనన్నా మందు తీసుకొంటుందేమోనని శ్యామల బావగారికి ఉత్తరం వ్రాసింది. మంగమ్మ, సూర్యం వచ్చారే కాని రామయ్య మొగమైనా చూపించలేదు. సుభద్రమ్మ పోరుపడలేక శ్యామల ఆమెను తన యింటికి తీసుకువెళ్లింది.

మళ్లీ జ్వరం ఎక్కువయింది. ఎవరెన్నివిధాల బ్రతిమాలినా సుభద్రమ్మ మందు త్రావటం మానివేసింది. ఒకనాడు రఘును ఒంటరిగా పిలిచి, ''బాబూ, ఉత్తరం ఏమిచేశా''వని అడిగింది. ''పెదనాన్నను కలుసుకొన్నప్పుడు ఇమ్మంటివిగా. అలాగే ఇస్తాను నాయనమ్మా!''. అన్నాడు.

కొలది రోజులకే హంస లేచిపోయింది. ఆమె శరీరంతో లక్ష్మణరావు, శ్యామల, పిల్లలు, మంగమ్మ, సూర్యం స్వగ్రామం చేరారు. అప్పుడు గూడ రామయ్య వెళ్లి తన గొడ్లచావట్లో కూర్చున్నాడే కాని తల్లిని చూడటానికైనా రాలేదు. ఎందరు ఎన్ని విధాలుగా అన్నా తల్లి అంత్యక్రియలలో పాల్గొనలేదు.

కర్మ ముగిసిన తరువాత లక్ష్మణరావు అన్న వద్దకువెళ్లి అయిన ఖర్చులు చెప్పి తల్లి తాలూకు పది సంవత్సరాల పంట నిలువ ఉండాలని లెక్క తేల్చాడు.

''ఆమె పంట దమ్మిడి ముట్టుకోలేదు. ఎప్పటికప్పుడు మనియార్డరు చేస్తూ వచ్చాను. ఆమె తిరగగొడుతుంటే ఆమె సేవింగ్స్ అకౌంటులో జమ కట్టించాను.'' రామయ్య లోపలకు వెళ్లివచ్చి ప్యాస్‌బుక్కు తమ్ముని ముందు పడేసి గొడ్లచావడికి బయలుదేరాడు.

''ఖర్చులు పోగా నీకు సగం వస్తుందన్నయ్యా!'' పుస్తకం తెరిచిమాస్తూ లక్ష్మయ్య అన్నాడు.

''నాకేమీ సంబంధం లేదని ఏనాడో చెప్పాను.'' అతడు వెళ్లిపోయాడు.

రఘు వెదకికొంటూ వచ్చేటప్పటికి రామయ్య గొడ్లచావట్లో గాటిమీద కూర్చుని మేస్తున్న ఎడ్లజతవైపు దిగాలుగాచూస్తున్నాడు.

''పెదనాన్నా!''

''ఏమిటి?''

''నాయనమ్మ ఈ ఉత్తరం మీ కిమ్మన్నది.''

''అమ్మ చచ్చిపోయింది. అత్యక్రియలు గూడ జరిగిపోయాయి.''

212 ''ఈ ఉత్తరం మీకిమ్మని చెప్పి చనిపోయింది.''

''చచ్చిపోయినవాళ్లకు బ్రతికున్నవాళ్లతో పనేమిటో!''

రఘుకు ఆశ్చర్యం, కోపం కలిగాయి. ''నాకెలా తెలుస్తుంది?'' అంటూ ఉత్తరం ఇవ్వబోయాడు.

''నే నెందుకులే, నువ్వే చదువు.''

రఘు కవరు చించి ఉత్తరం తీసి మెల్లగా ప్రారంభించాడు:

''పెద్దబ్బాయ్!''

''తల్లినయి ఉండి చిన్నవాడిమీద పక్షపాతం చూపించాననే కదా నీకు కోపం? మానవులన్న తరువాత మమతలలో ఎచ్చులొచ్చులుంటాయి. మనకు రెండు చేతులొకటే. కాని ప్రతి పనికీ నీవు ముందు కుడిచేయి చాపుతావు. మరి కొందరు ఎడమచేయి చాపుతారు. దీని కేమంటాము? అది అలా ఉంచు. చిన్నవాడి చదువు ఖర్చులు లెక్క గట్టక ఆస్తిని సరిసమానంగా పంచాననే కదా నీ బాధ. కలతలు లేక ఇద్దరూ ఒకరికొకరు తోడుగా ఉంటారని ఆశపడి మోసపోయాను. పెద్దగా చదువుకొన్నంత మాత్రాన

గుణాలురావు. చిన్నవాడు నీ మనసు గుర్తించలేదు. జరిగినదేదో జరిగిపోయింది. ఈ పదేళ్ల పంటనీదే. దీనిలో దమ్మిడీ కూడా చిన్నవాడికిరాదు. ఇకనైనా నన్ను క్షమిస్తావు కదూ?

సుభద్ర.''

రఘు ఉత్తరం ముగించి చూచేటప్పటికి పెదతండ్రి చెక్కిళ్లపై సెలయేళ్ళు ప్రవహిస్తున్నాయి. అతడు ఉత్తరం పెదతండ్రి కిచ్చాడు.

''బాబూ, ఈసంగతి మీనాన్నకు చెప్పకు.'' మాట తీసికొని అతడు ఉత్తరం ముక్కలు ముక్కలుగా చించివేశాడు.

రఘు దిమ్మరపోయి తేరుకొని నమస్కరించాడు.

-జూలై, 1963

# రాజకీయాలు - రచనలు

సమాజంలో రచయితల బాధ్యతలను గూర్చి మీ పత్రికలో ప్రచురిత మవుతున్న లేఖలను చూస్తున్నాను. మీరు చేస్తున్న పని నిజంగా ప్రశంసాపాత్రం. ఇలాంటి అవకాశం. కల్పించటం వల్ల ఆంధ్రప్రజానీకం, రచయితలు విజ్ఞానవంతులు కావటానికీ, ఈనాడున్న వాదాలను, అభిప్రాయాలను తెలిసికొని, మంచిచెడ్డలను పరామర్శించి, సత్యం గ్రహించి తదనుగుణంగా వ్యవహరించటానికి వీలేర్పడుతున్నది. ఇలాంటి ఉత్తమోత్తమ కర్తవ్యాన్ని యింత తీవ్రంగానేడైనా పూనుకొని సాగిస్తున్నందుకు తెలుగు దేశం కృతజ్ఞం.

ప్రాణి అన్న తర్వాత, ఆకలి, మనిషి అన్న తర్వాత అభిప్రాయం లేకుండా ఉంటాయా? అయితే అభిప్రాయాలన్నీ పత్రికలలోకి పుస్తకాలలోకి ఎక్కతగవేమో! అట్లా ఎక్కించటానికి పూనుకొన్నా స్థలం చాలదు. కాబట్టి యుక్తియుక్తము హేతుమంతము అయిన వాదాలను మాత్రమే స్థాన ముండాలి. అయితే నేను వ్యక్తం చేయబోతున్న అభిప్రాయాలు, భావాలు ఎంతవరకు పై సూత్రాన్ని పాటిస్తాయో చెప్పవలసినది మీరు – పాఠకులు.

ఇంతవరకు రచయితలు గురుత బాధ్యతను గూర్చి వెలువడిన లేఖలలో ప్రధానంగా మూడంశాలు గోచరమవుతున్నాయి. (1) యుక్తులు, హేతువుల కంటె ఆవేశాలధికంగా ఉండి మనస్సులు విప్పి చర్చించుకొని ఒక నిర్ణయానికి వచ్చే అవకాశాలు కన్పించటంలేదు. (2) చాల మంది రచయితలు ప్రజాస్వామ్యం స్వాతంత్ర్యం అభ్యుదయం సంస్కృతి సంప్రదాయం జాతీయం అన్న పదాలను విశృంఖలంగా వాడారు. ఆయా పదాలను వారు ఏయే అర్థాలలో వాడారో టూకీగా నైనా వివరించి ఉంటే బాగుండేది. దానివల్ల అసలు సమస్య కూడ చాల తేలికయ్యేది. (3) సమాజానికి మార్గదర్శకులు కావలసిన మన రచయితల బావాలు, మనస్సులు సంకుచితంగా సంవృతంగా ఉన్నవేమోననిపిస్తుంది. ఎందుకంటే ఏ నలుగురో అయిదుగురో రచయితలు వినా మిగిలినవారంతా జాతీయకాంగ్రెసు ధృక్పథం, కమ్యూనిస్టు ధృక్పథం తప్ప భారతదేశానికి మరో తరణోపాయం వూహించ వీలున్నట్లుగా కూడా పేర్కొనలేదు. దీనినిబట్టి మన జ్ఞానం విచారణశక్తి ఏ స్థితిలో ఉన్నదో ఊహించుకోవచ్చు.

ఈ మాటలు ఆగ్రహావేశాలకు కారణం కావచ్చు. కాని ఒక మనవి. ఒట్టి ఆగ్రహాల వల్ల ఆవేశాల వల్ల ప్రయోజనం లేదు. సాకల్యంగా ఆలోచించుకోవటం, సహకార

ఈ వ్యత్యాసానికి మరొకటి తోడవుతున్నది. దైనందిన వ్యవహారానికి కావలసిన శబ్దజాలం పరిమితం. సాహిత్యానికీ వివిధ శాస్త్రాలకూ అది చాలదు. షేక్స్‌పియర్ ముప్పదివేల శబ్దాలు వాడుకొన్నాడు. ఈనాడు ఆంగ్ల సాహిత్యంలో ఒకమాదిరి రచయితగా పరిగణన పొందటానికైనా 50 వేల పదాలైనా వాడగలిగి ఉండాలట. ఒక రచయిత ఎంత ఎక్కువ శబ్దజాలాన్ని వాడితే అంత వ్యర్థుని క్రింద నేటి వ్యావహారికవాదులు జమకడుతున్నట్లు కనిపిస్తున్నది. అనపేక్షిత శబ్ద ప్రయోగం దోషమని అలంకార శాస్త్రోద్ఘోష.

ఏది ఎలా ఉన్నా శాస్త్ర సాహిత్యాలకు విస్తృత శబ్ద ప్రపంచమూ అభివ్యక్తి సౌలభ్యమూ కావాలి. అవసరమైనప్పుడు క్రొత్త శబ్దాలను సృష్టించుకోవటానికి వీలుగా భాషను పెంపొందించుకోవలసి వుంటుంది. అనాదినుంచి వ్యాకర్తలు ప్రకృతి ప్రత్యయ వివేచనంతో సాధు శబ్దానుశాసనం చేయటంవల్ల కావలసిన మాటను కల్పించుకోవటానికి, ఎట్టి భావాన్నైనా వ్యక్తంచేయటానికి సంస్కృతం సమర్థతను గడించింది. తెలుగులో కూడ మొదటినుంచి ఈ పని జరుగుతూ వచ్చినట్లయితే యీనాటి దుస్థితి మనకు ఏర్పడి ఉండేదికాదు. గత జల సేతుబంధనంవల్ల ప్రయోజనంలేదు. కాని అలాంటి ప్రయత్నంచేసినవారినీ, చేయబోయేవారినీ పరిహసిస్తున్నాము. ఈ దృష్టి ఎంతవరకు 243
సమర్థనీయమో మరొకసారి పరామర్శించుకోవలసిన అవసరం ఉన్నది.

ఆధునిక యుగంలోని మనుగడకు విజ్ఞాన శాస్త్రాలు ఎంతైనా అవసరం. ఆ శాస్త్రార్థాలను తెలుగు ప్రజానీకానికి అందజేయాలంటే ఎంతో కొంతమేర క్రొత్త శబ్దాలను కల్పించుకోవటం, అన్యదేశాలను ఎరవు తెచ్చుకోవటం తప్పదు. ఇలా నూతన శబ్దావశ్యకత ఏర్పడుతున్న తరుణంలో గ్రాంథిక భాషా పరిహరణం అర్థవంతంగా కనిపించడం లేదు.

గ్రాంథిక భాషను పూర్తిగా పరిహరిస్తే భాషా సాహిత్య సంప్రదాయ విచ్ఛేదం కలుగుతుంది. ఈ విచ్ఛేదము ఏమాత్రం అభిలషణీయం కాదు.

సంప్రదాయాన్ని అవగతం చేసుకొని ముందుకు పోవటం అవసరం. ఒకప్పుడు నేనూ అనుకొన్నాను. వ్యావహారిక భాష విద్యాసంస్థలలో ప్రవేశపెడితే జ్ఞాన సముపార్జనకు సౌలభ్యం ఏర్పడుతుందని భావించాను. అధ్యాపక వృత్తి అందున్న చిక్కులను నిరూపించింది. విద్యార్థికి వ్రాతకోతలు నేర్పాలి. అతని రచనలో ఎన్నో రకాలదోషాలు శాబ్దికాలు, ఆర్థికాలు, తదుభయాలు దొర్లుతుంటవి. వీటిని ఏ ప్రమాణమును చూపి సంస్కరించాలి? ఈ నాటివరకూ వ్యావహారికభాషకు ప్రమాణాలు లేవు. వ్యక్తిగత

అభిమతాలను బట్టి సంస్కరణలను సూచిస్తే విద్యార్థి ప్రశ్నించవచ్చును. ఆ ప్రశ్న సహేతుకమే. హేతువాదాన్ని పెంపొందించ వలసిన యుగంలో ''నేను చెబుతున్నాను. నీవు నన్ను నమ్మి సరిదిద్దుకోవాలి'' అని శాసించటం సముచితం కాదు.

నిర్దిష్టమైన చట్ట మున్నప్పుడు స్వాతంత్ర్యం ఏర్పడుతుంది కాని, పాలకుల ఇష్టానిష్టాలే శాసనాలైనప్పుడు స్వాతంత్ర్యం ఎక్కడ ఉంటుంది? ప్రజాస్వాతంత్ర్యానికి ఉదార రాజ్యాంగపు చట్టం ఎంత అవసరమో, భాషా లక్ష్యాలైన శాస్త్ర సాహిత్యాల సమ్మతికి నియతి అవసరం. యునైటెడ్ కింగ్డం వంటి రాజ్యాలలో లిఖితపూర్వకమైన రాజ్యాంగపు చట్టం లేని మాట వాస్తవమే. అక్కడ ప్రజాస్వామ్యం ఉత్తమ స్థాయిలో జరుగుతున్నమాట వాస్తవమే. అయితే దానికి కారణం ప్రబలతరమైన నిర్దిష్ట సంప్రదాయమే. దానివల్ల అచటి ప్రజలు స్వాతంత్ర్యం అనుభవిస్తూ పురోగమించటానికి అవకాశం ఏర్పడింది.

అలాగే యిప్పటి మన వ్యావహారిక భాషకు నిర్దిష్టమైన సంప్రదాయం ఏర్పడిందా? లేదు మన పరిపాలన నిర్వహణకు ఏమి చేశాము. లిఖిత అవసరం రాజ్యాంగ నియమావళిని ఏర్పరుచుకొన్నాము. అనుకొన్నాప్పుడు ఈ చట్టాన్ని సవరించుకొంటున్నాము. అలాగే భాషకు కూడా నియతి, వ్యవస్థ ఆవశ్యకం. వ్యవస్థ

లేక ప్రపంచంలో ఏదీ కొనసాగదు. అవ్యవసిత చిత్తానాం ప్రసాదోఽపి భయంకరః'' అని అనుభవజ్ఞుల అభియుక్తి.

కనుక భాషలో వ్యవస్థ అవసరం. ఈ వ్యవస్థ ప్రకృతి ప్రత్యయ వివేచనంతో సుశబ్దాన్ని బోధించే వ్యాకరణంవల్ల లభిస్తుంది. కాని భాషాశాస్త్రం, చరిత్ర నిరుపయోగాలని వివేకవంతుడెవ్వడూ అనడు. వాటికి ప్రత్యేక ప్రయోజనాలున్నవి. అవి వేరు. అవి వ్యాకరణ నిర్మితికి సహకారులు.

మనం కోరుతున్న వ్యాకరణం కేవలం వ్యావహారిక భాషకు మాత్రమే పరిమితమై ఉండరాదు. పాణివ్యాదులు అటు వైదికభాషకు, ఇటు లౌకికభాషకూ ఇది అనుశాసనం చేసినట్లే మన యిప్పటి వ్యాకరణం అటు గ్రాంధికాన్ని ఇటు వ్యావహారికాన్ని అనుశాసించవలసి ఉంటుంది.

ఈ సందర్భాన ఒక వాదాన్ని ప్రస్తావించక తప్పదు. భాష అపారం. ప్రవర్ధమానం. అలాంటి దానికి పార్యంతికానుశాసనం అసంభవం – హాస్యాస్పదం. ఇది ఇలా ఉండగా పదాలు లౌకికాలే అయినా కవి తన ప్రతిభా విశేషంతో క్రొత్త కూర్పు కల్పిస్తున్నాడు. క్రొత్త జీవం పోస్తున్నాడు. అట్టి కవిని ''నీవు ఇలా వ్రాయవలెనే కాని అలా వ్రాయరాదు''

అని అనుశాసించటానికి ఎవరికది కారం ఉన్నది? కవులు నిరంకుశులని ప్రాచీనులు అంగీకరించలేదా?

ఈ వాదంలోని అంశాలు పరిశీలనార్హాలే. భాషా అపారం ప్రవర్ధమానం. సందేహంలేదు. కాని మనం పార్యంతిక అనుశాసనం చేయవలెనని చెప్పటంలేదు. తెలిసినంత మేరలో వ్యవస్థ కల్పించుకోవాలని అంటున్నాము విజ్ఞానం అపారం. ఇంతవరకూ తెలుసుకొన్నది తక్కువ. తెలుసుకోవలసింది ఎంతో ఉన్నది. అంతమాత్రాన విజ్ఞానశాస్త్రాలు తాము కనుగొన్న అర్థాలను సంగ్రహించుకొనకమానవు. కనుగొన్నవాటిని క్రోడీకరించుకొని ముందుకు సాగుతున్నవి. భాషా విషయంలో కూడా అంతే. ఇప్పటి వరకూ వచ్చిన ప్రమరణ సుందరప్రయోగాలను వ్యాకరణం నిరూపిస్తుంది.

ఇంక కవుల స్వాతంత్ర్యం సంగతి. అదెప్పుడూ వారికి ఉంటుంది. స్వాతంత్ర్యం అనేది ఒకరిచ్చేది కాదు, పుచ్చుకొనేది కాదు. ఎవరికి వారు సాధించుకొని అనుభవించాలి. మనం అన్యాయమైన పరప్రభుత్వం పై తిరుగుబాటు చేసి అష్టకష్టాలు పడి స్వాతంత్ర్యం సంపాదించుకొన్నాము. అధర్మమని తనకు తోచినప్పుడు, ఆ అధర్మాన్ని తొలగించటానికై తిరుగుబాటు చేసే హక్కు ప్రతివారికీ ఉన్నది. అది పరమ పవిత్రం. అలాగే భాషలో కూడ తాను అనుచితాలనుకొన్న నియమాలను ఉల్లంఘించే హక్కు కవికి ఉన్నది. దీనిని ఎవరూ తీసివేయలేరు. అయితే దానికోసం అతడు ప్రబల అవరోధాల నెదుర్కొని తన మతాన్ని సాధించుకోవలసి ఉంటుంది. వ్యావహారిక భాషోద్యమ చరిత్రే యిందుకుతార్కాణం. 245

కనుక గ్రాంథిక, వ్యావహారిక భాషల రెంటికీ ఏక భాషానుశాసనం అవసరం. వ్యాకరణం వలెనే కోశం కూడా అవసరం. ఈ రెండూ ఏర్పరచుకొనక ఆవేశాభినివేశాలతో వ్యావహారిక భాషను విద్యాసంస్థలలో ప్రవేశపెడితే కొరవితో తల గోకికొన్నట్లవుతుంది. అసలు విద్యా ప్రమాణాలు పడిపోతున్నవని పెద్దలు గోల పెడుతున్నారు. ఈ సందర్భంలో వ్యాకరణ కోశాలు లేకుండా వ్యావహారిక భాషను ప్రవేశపెడితే ఘోర అవ్యవస్థ తప్పదు.

పైగా నేడు కాకపోయినా రేపైనా మాతృభాష విద్యా బోధక భాష కాకతప్పదు. దీనితోబాటు హిందీ రాజభాష కాబోతున్నది. దీనితో తెలుగు మరికొన్ని సమస్యలు ఎదుర్కొనక తప్పదు. ఈ సమస్య లన్నిటిని దృష్టిలో ఉంచుకొని వ్యవహరించవలసి ఉంటుంది.

ఏది ఎలా ఉన్నా గ్రాంధిక వ్యావహారిక, భాషలకు ఏకశబ్దానుశాసనం, కోశము ఆవశ్యకాలు. వీటిని ఎలా సంతరించుకోవాలన్నది ప్రత్యేక సమస్య. దానిని గూర్చి నేనిక్కడ ప్రస్తావించటం అసముచితం కాకపోయినా అధిక ప్రసంగమే అవుతుంది. కనుక దానిని విడిచి ఒక సంగతి మాత్రం మనవిచేస్తాను. శబ్దానుశాసనం అధికారులచేత సంగ్రహింపజేయవలసి ఉంటుంది. అధికారులంటే పదవులలో ఉన్నవారని అర్థంకాదు. శబ్దానుశాసన యోగ్యత ఉన్నవారని అర్థం. అలా తయారుచేయించిన వ్యాకృతిపై కొంతకాలం విజ్ఞులు చర్చించాలి. ఆ చర్చల దృష్టితో సంస్కరింపబడిన శబ్దానుశాసనాన్ని నిఘంటువును మున్నిడుకొని వ్యావహారిక భాషను విద్యాసంస్థలలోను విశ్వవిద్యాలయంలోను ప్రవేశపెట్టటం సముచితం అప్పుడే మనం అభ్యుదయ నిశ్రేయసాలను సాధించగలము.

# నాగార్జునుని కాలంలో ఆంధ్రదేశ స్వరూపం

చక్కని పుటక, మంచి జీర కలిగిన ఆవు కంటబడితే రైతుకు వెంటనే కుతూహలం కలుగుతుంది. దానిజాతి ఏమిటి? ఎక్కడ ననువుతుంది? కాపు పెంపులు ఎలా ఉండాలి? అన్నప్రశ్నలు కలుగుతాయి. ఎదుటివాడు అపోహపడడనుకుంటే వెంటనే అడుగుతాడు.

అలాగే నాగార్జునుని కొండ శిల్పాలు, ఆతాత్త్వికుని వాక్యాలు కన్నవారికి, విన్నవారికి జిజ్ఞాస కలుగుతుంది. నాగార్జునుని కాలంలో ఆంధ్రదేశం ఎలా ఉండేది? ప్రజలు ఎలా జీవించే వాళ్లు? వారి చదువులు – సంధ్యలు, ఆటలు – పాటలు, పెళ్లిళ్లు – పేరంటములు, పండుగలు – పబ్బాలు, ఆచారాలు – వ్యవహారాలు, విద్యలు – వినోదాలు ఎలా ఉండేవి? నాటి పైరుపచ్చలు, మంచి చెడ్డలు ఏతీరుగా ఉండేవి? ఇలాంటి ప్రశ్నలు ఎన్నో అంకురిస్తాయి.

వీటికి నేరుగా సమాధానం చెప్పేప్రాచీనచరిత్రలు లేవు. కాని ఆనాడు అమరావతీ, శ్రీపర్వతాలవద్ద వెలసిన శిల్పాలు శాతవాహన రాజుల శాసనాలు, నాణాలు, సంస్కృ తానువాదంతో నిలిచి ఉన్నబృహత్కథ, హాలుని సప్తశతి, కౌటిల్యుని అర్థశాస్త్రం, వాత్స్యాయనుని కామసూత్ర, న్యాయభాష్యాలు, నాగార్జునుని కృతులు, ఆర్యదేవుని రచనలు ఆధారం చేసుకొని ఆనాటి చరిత్రను వూహించాలి.

ఇలా వూహించటానికి కూడా కొన్ని చిక్కులున్నాయి. అమరావతీ శ్రీపర్వత శిల్పాలు కళాఖండాలు. బృహత్కథా సప్తశతులు భావనాప్రధానరచనలు. అర్థశాస్త్రం, కామసూత్రాలు, '' ఎప్పటివి? ఎవరువ్రాశారు'' అన్న ప్రశ్నలను రేకెత్తిస్తున్నవి. నాగార్జున ఆర్యదేవుల కాలం వివాదగ్రస్తం. దీనికి తోడు చరిత్ర అనేది గణిత శాస్త్రం వంటి శాస్త్రం కాదు. రచయిత ఇష్టానిష్టాలపై విషయసంగ్రహణం ఆధారపడుతుంటుంది. కాబట్టి చారిత్రక స్థితిగతులను యథాతథంగా పేర్కొనటం కష్టం.

ఇలాంటి చిక్కులున్నా నాగార్జునుని నాటి ఆంధ్రదేశం ఎలా ఉండేదో తత్త్వజిజ్ఞాసువులు కొంత వరకూ వూహించవచ్చు. ఈ సందర్భాన ఒక విషయం చెప్పవలసి ఉంది. అర్థశాస్త్రం, కామసూత్రాలు, న్యాయభాష్యం వాత్స్యాయనుడు వ్రాశాడనీ, అతడు నాగార్జునునికి సమకాలికుడని భావించి ప్రకృతవ్యాసం వ్రాస్తున్నాను. నాగార్జునుని విగ్రహవ్యావర్తనికీ, న్యాయభాష్యానికీ పరస్పర సంబంధం ఉన్నది. హేమచంద్రాదులు ''వాత్స్యాయనుడు కౌటిల్యుడు ఒకడే'' నంటున్నారు. రచనలలోను,

భావాలలోను కౌటిల్య వాత్స్యాయనులు ఒకటిగా కన్పిస్తున్నారు. ఈ ఐక్యనిరూపణం ప్రకృతం గాదు. నాగార్జునుని నాటి సామాజిక స్థితి గతుల పరిశీలనమే మనకు ముఖ్యం

## రాజులు - రాజకీయాలు

నాగార్జునుని నాటిరాజా అతిభౌముడని అతని రత్నావలి పేర్కొంటున్నది. వ్యావహారిక భాషలో చెప్పాలంటే అతడు సార్వభౌముడన్నమాట. పెక్కుమంది రాజులు అతనికి కప్పం చెల్లిస్తూ రాజ్యం చేస్తూండేవాళ్లు. నాటి సామ్రాజ్యంలో ఎక్కువభాగం ఇలాంటి సామంతుల ఆధీనంలో ఉండేది. ప్రాగుత్తర భాగంలో మహారథులు, మహాభోగులు, దక్షిణాన నాగులు, కృష్ణాముఖభాగంలో ఇక్ష్వాకులు సామంతులుగా ఉండేవారు. సాధారణంగా రాజ్యం తండ్రి అనంతరం కొడుకునకు సంక్రమిస్తూ ఉండేది. నాటి అతిభౌముడు సర్వస్వతంత్రుడు. అలా సర్వస్వతంత్రంగా ఉండాలనే నాటి కోవిదులు భావించేవారు. అతనికి సలహాలిచ్చేవారు కూడ ఉండేవారు. రాజు నియోగించుకోవలసిన ఉద్యోగులనుగూర్చి నాగార్జునుడు తన రత్నావళిలో ఇలా హెచ్చరించాడు. ''ఉత్థితులు, అలుబ్ధులు, పండితులు, ధర్మపరులు అయిన వారిని ధర్మాధికారులుగను. నీతిజ్ఞులు, ధార్మికులు, స్నిగ్ధులు, శుచులు, భక్తులు, అకాతరులు, కులీనులు, శీలసంపన్నులు అయిన వారిని సచివులు గాను. అక్షుద్రులు, త్యాగులు, శూరులు, స్నిగ్ధులు, సంభోగులు, స్థిరులు, అప్రమత్తులు, ధార్మికులు అయిన వారిని దండనాయకులుగాను. ధర్మశీలులు, శుచులు, దక్షులు, కార్యజ్ఞులు, శాస్త్రకోవిదులు, కృతవృత్తులు, సములు, స్నిగ్ధులు, వృద్ధులు అయిన వారిని అధికృతులుగాను నియోగించునది. మాసాని కొకపరి వారివల్ల ఆదాయవ్యయాలు విని ధర్మాధికారాద్యమైన కార్యం విచారించి స్వయముగా ఆదేశించునది''.



ఇవి సాక్షాత్తుగా ఆచరణలో ఉన్నవో, కేవలం ఆదర్శాలుగా మాత్రమే ఉండేవో చెప్పలేము. కాని నాటి పరిపాలనలో నాలుగు ప్రధాన శాఖలుండేవి. 1. ధర్మాధికారులు, 2. సచివులు, 3. దండనాయకులు, 4. ఆయవ్యయపరిశీలనా నియుక్తులైన అధికృతులు. ఈ శాఖలలో ఆనాడు ఆదరాభిమానాలను పురస్కరించుకొని అసమర్థులను, అవినీతిపరులను రాజు నియమిస్తూ ఉండవచ్చును. అంతేకాక పరిపాలనాధికారం, అధికారులకు వదలి, కొంత ప్రాలుమాలి ఉండవచ్చును. దీనిని నిరోధించటానికి నాగార్జునుడు జోక్యం కలిగించుకొని రాజునకు ఆవిధంగా వ్రాసి ఉంటాడు. ఇలా వ్రాయటంలో మనకు ఈనాడు విడ్డూరం కానీ, గొప్పతనం కానీ ఏ మాత్రం కనిపించదు. కాని నాడు ఇలాంటి దానికి అత్యంత రాజద్రోహం, ఎంతోఘోరమైన నేరముగా పరిగణించేవారో సప్తశతి సువ్యక్తం చేస్తున్నది.

---

జి.వి. కృష్ణరావు

నేరాలకు నాడు దారుణశిక్షలు విధించేవారు. జరిమానాలు, చావుదెబ్బలు, అంగచ్ఛేదం, చిన్ననేరాలకు కూడ మరణదండనం ఉండేవి. గ్రామాలలో జరిగే నేరాలకు గ్రామాధికారులే శిక్షలు విధించేవారు. అనుమానించి ఒకసారి బంధనంలో వేస్తే విచారణ అనేది వెంటనే ఉండేది కాదు. అలా ఎంతకాలం జరిగేదో నిర్దిష్టంగా చెప్పలేం. బందీలకు స్నానాన్న పానవిషయాలలో, మందుమాకులలో, క్షురకర్మసౌకర్య కల్పనలో ఎలాంటి ఆలనా పాలనా ఉండేది కాదు. నాటి శిక్షలు ఎంత దారుణాలో, రాజపురుషుల చర్యలు ఎంతకుటిలాలో అర్థశాస్త్రం చక్కగా చెపుతున్నది. వీటికి నాగార్జునుడు ఎదురు తిరిగి ఇలా వ్రాశాడు.

"పరాతి సంధాన పరాక్షతా దుర్గతి పద్ధతిః
అనర్థవిద్యా దుష్ప్రజ్ఞై రర్థవిద్యా కథం కృతా"

(పరవంచనాత్మకం, క్షతము, దుర్గతి, పద్ధతి అయిన అనర్థ విద్యను దుష్ప్రజ్ఞులు అర్థవిద్యగా ఎలా చేశారో)

అర్థశాస్త్రాన్ని మన శాస్త్రజ్ఞులు పొగడలేక చచ్చిపోతున్నారు. నీతికి పరాకాష్ఠ అంటున్నారు. దీనిని సంస్కారవంతుడైన నాగార్జునుడు ఛీ కొడుతున్నాడు. ఆవేశపరుడై నాటి రాజులకు ఇలా వ్రాస్తున్నాడు.



"రాజ్యం కీర్తి కోసం కాదు. కామం కోసం కాదు. దీనిని నీవు వస్తూ వెంటతేలేదు. పోతూ కొనిపోలేవు. ఇది ధర్మం వల్ల లభించింది. కాబట్టి ధర్మాన్ని పాటించు.

దీనులు, అనాథులు, అంగవికలులు, వ్యాధి పీడితులు, పాపులు లేక, వారిపై దాక్షిణ్యప్రదర్శనం లేక మహాత్ములు ఎలా అవుతారు? అధికారులను నిష్పాక్షికంగా ధర్మం నిర్ణయించనీ. ఆ నిర్ణయంలో నీవు జోక్యం కలిగించుకోవద్దు. నిర్ణీతశిక్షలు విధించేటప్పుడు మాత్రం నీవు కరుణామయుడవై వ్యవహరించు. విచారణలేకుండా ఎవరినీ బంధించవద్దు. ఒకవేళ బంధిస్తే రోజుకో పదిరోజులకో వారిని విడుదల చేయించు. కారాగారంలో శుష్కించేవారి విమోచనం కూడ కర్తవ్యమే. అపరాధులను ప్రతీకార దృష్టితో, ద్వేషబుద్ధితోకాక సంస్కరించే సంకల్పంతో శిక్షించు. కారాగారంలో వారిని బంధించినంత కాలం వారికి స్నానపానాలు, క్షురకర్మాది సౌకర్యాలు కల్పించు.

ఎన్నటికీ విడిచిపెట్టరా దనేభావం నీకు ఎవనియందు కలుగరాదు. ఘోరపాపులైనా దేశం నుంచి వెళ్లగొట్టవలెనే కానీ, చిత్రహింసకు పాల్పరచటం కానీ మరణదండనకు గురిచేయటం కానీ తగదు."

ఆనాడు మతవైషమ్యం లేదనీ, నాటి రాజులు పరమతసహనం కలిగి ఉండేవారనీ

చరిత్రకారులు ముక్త కంఠంతో చెపుతున్నారు. నాగార్జునునకు నాటి శాతవాహన చక్రవర్తి పిలిచి పీటవేసినట్లు పేర్కొంటున్నారు. కాని ''విగ్రాహవ్యావర్తని'' చూస్తే దీనికి విరుద్ధంగా కన్పిస్తున్నది. నాస్తిక మతమని మహాయానాన్ని నాటివైదికులూ, బౌద్ధులూ నిందిస్తూ రాజుమనస్సు విరిచారు. అతడు వారి దేవోత్సవాలను నిషేధించాడు. నాగార్జునుడు తన రత్నావళిలో విమర్శకులకు సమాధానమిచ్చి, రాజునకు నేరుగా ఇలా వ్రాశాడు.

''సామాన్యమానవుని కైనా హితం చెప్పి, వినిపించటం కష్టం. రాజులకు చెప్పి వినిపించటం మరీకష్టం. అందులో నీవు అతిభౌముడవు. నేను కేవలం భిక్షువును. అయినా నీయందలి స్నేహం వల్ల లోకమందలి అనుకంపనవల్ల అప్రియమైన హితం చెపుతున్నాను.''

ఈ వాక్యాలనుబట్టి రాజుకూ, నాగార్జునునకూ ఉన్న సంబంధం అర్థం చేసుకోవచ్చు. నాగార్జునుడు తన మతమందభిమానము చూపవలసినది అని కోరక, మతముపట్ల ఉపేక్షాభావం వహించవలసినదని హెచ్చరించాడు. ద్వేషం పాపం కాని, ఉపేక్ష పాపం కాదని, మతప్రసక్తి లేని పరిపాలనకు దారి చూపాడు.

నాటి రాజులు మద్యం సేవిస్తూ ఉండేవారని రత్నావళి వెల్లడిస్తున్నది. త్రాగుడు నిషిద్ధమైనట్లు కామసూత్రాలు కాని, సప్తశతికాని, అర్థశాస్త్రం కాని పేర్కొనలేదు.  పైగా ఇది వ్యాప్తంగా ఉన్నట్లు కన్పిస్తున్నది. నాటి రాజులకు బహుభార్యాత్వం ఉండేది. భార్యలకు తోడు చేపట్టిన పునర్భువులు, వేశ్యలు, నాటకాలలో వేషం కట్టటానికి అర్హులయిన ఉంపుడు కత్తెలు ఉండేవారు. ఆడవాళ్ల పాత్రను మగవాళ్లు వేసి, నిర్వహించటంలోనే కళావైదగ్ధ్యం ఉన్నదని వాళ్లకు తోచలేదు. రాచనగరుకేంద్రంలో ధర్మపత్నుల ఆవాసాలు, వాని వెలువల పునర్భువుల నివాసాలు, వీనికి వెలువల వేశ్యల గృహాలు, నాటకీయుల నెలవులు ఉండాలని వాత్స్యాయనుడు వ్రాశాడు. అలాంటి నియమాన్ని ఆనాడు పాటించేవారేమో?

బృహత్కథనుబట్టి చూస్తే నాటిప్రజలలో ధైర్య సాహసోత్సాహాలు, సముద్రయానాలు ఉండేవని, నిరాశ, నిస్పృహ, భయం ఏకోశానా లేవనీ స్పష్టమవుతుంది. నాగార్జునుని కొండ, వినుకొండ, కడప, నెల్లూరు మున్నగు చోట్ల దొరికిన రోమకపు నాణాలను బట్టి చూస్తే నాడాంధ్రదేశం విదేశాలతో వ్యాపారం చేసినట్లు కనిపిస్తున్నది. పడమటి తీరాన బరుకచ్చం, సోపార, కల్యాణి, తూర్పుతీరాన ఘంటసాల, కోడూరు, మైసోలియా ఆరోజుల్లో రేవులుగా ఉండేవని చరిత్రజ్ఞులు చెబుతున్నారు. కృష్ణా గోదావరులు నాడు నావ్యాలుగా ఉండేవి. నాసిక, గోవర్ధన, వైజయంతి, తగర, ధనకటకము, వినుకొండ ప్రధాన కేంద్రాలుగా ఉండేవనీ, వీటిని కలిపే రహదారు లేర్పడ్డవనీ పరిశోధకులు చెబుతున్నారు. ఆనాడు బంగారునగలు, నూటబట్టలు, కంబళ్లు, వజ్రాలు ఉత్తరాదికి ఎగుమతి చేసి, గుఱ్ఱాలు, సుగంధద్రవ్యాలు, కొన్ని ఓషధులు ఆంధ్రదేశం దిగుమతి చేసుకుంటూ ఉండేదట.

---

జి.వి. కృష్ణరావు

## నాగరకులు

నాటి ప్రజానీకాన్ని రెండు తెగలుగా విభజింపవచ్చును. 1. నాగరకులు, 2. పల్లీ పక్కణవాసులు. ఈ ఇరు తెగలమధ్య నాడు విశేషవ్యత్యాసం ఉన్నది. నగరపరిపాలన నిగమాలద్వారా జరిగేది. ఒక్కొక్కవృత్తివారు ఒక్కొక్కసంఘంగా ఏర్పడేవారు. ఇలాటి సంఘాలను నికాయాలనీ, శ్రేణులనీ పిలచేవారు.

ధాన్యసంఘం, మాలాకారుల సంఘం, కమ్మరుల సంఘం, పాలెవాండ్ర సంఘం, గానుగవాండ్ర సంఘం, కమ్మరుల సంఘం, చర్మకారుల సంఘం ఇలాటి వృత్తి సంఘాలు పందొమ్మిది శాసనాదులందు పేర్కొనబడ్డవి.

నేడు కాలాన్ని చెప్పవలసి వస్తే క్రీస్తు శకం, ఫలానా సంవత్సరం, ఫలానా నెల, ఫలానా తేదీ అని కానీ, శాలివాహన శకం, ఫలానా సంవత్సరం, ఫలానా మాసం, ఫలానా పక్షం, ఫలానా తిథి అనికాని చెప్తుతాము. ఆనాడు ఏశకమూ లేదు. కాలం చెప్పవలసి వచ్చినప్పుడు నాటిరాజా పరిపాలనా సంవత్సరం, ఋతువుపేరు, పక్షసంఖ్య, దినసంఖ్య పేర్కొనేవారు. నాడు మూడు ఋతువులే లెక్కించేవారు. 1. గ్రీష్మం, 2. వర్ష ఋతువు, 3. హేమంతం. ఋతువుకు పక్షాలు ఎనిమిది. ఈ క్రిందివాక్యం చూస్తే ఆనాడు కాలసూచన ఎలా ఉండేదో బోధపడుతుంది. ''వాసిష్ఠీపుత్ర పులోమావి 24వ రాజ్యసంవత్సరమున హేమంతర్తు తృతీయపక్ష ద్వితీయవాసరము''

స్త్రీ, పురుషులకు నాడు సమానంగా జుట్లు ఉండేవి. ఆసిగలను పువ్వులతో అలంకరించుకొనేవారు. స్త్రీలకు సమాజంలో కొంత ఉన్నతస్థానం ఉండేది. వారు విద్యాసముపార్జనం కూడా చేసేవారు. నాటి దానధర్మాలనుబట్టి చూస్తే వారికి కొంతవరకు ఆర్థిక స్వాతంత్ర్యము కూడా ఉండేదని అనిపిస్తుంది. తిలకరచనం, మాలికారచనం, కేశాలంకరణం కళలుగా నాటివారు భావించేవారు. అందువలననే నాగార్జునుని కొండవద్ద దొరికిన శిల్పాలలో నేమి, అజంతా చిత్రాలలో నేమి బంధనవైచిత్ర్యం ఉట్టిపడుతూ ఉంటుంది. ఈ వైచిత్ర్యం కేవలం శిల్పులకల్పన కాదు.

నాటిస్త్రీలు దశన వసనాంగ రాగాలను వాడేవారు. గోళ్లకు రంగు, పాదాలకు లత్తుక ఉపయోగించేవారు. ఋతుమతి అయినస్త్రీ వర్ణ ఘృతలేపన మొనర్చుకొని స్నానం చేసేది. స్నానసమయంలో పసుపు జంబూకషాయం వాడేవారు. ముఖానికి హరితాళాదికం ఉపయోగించటం కద్దు.

ప్రవ్రజ్యాధికారం బౌద్ధస్త్రీలకు కూడా ఉండేది. ఇలాంటి దీక్షగొన్నవారిని శ్రమణ అనేవారు. క్షపణకలు, కుహకలు (వేడుక పుట్టిస్తూ తిరిగేస్త్రీలు) విప్రశ్నికలు (సోదెలు

చెప్పి జీవించేస్త్రీలు) మూలకారికలు (వేరు వెల్లంకులు కడుతామని జీవనోపాధి సంపాదించుకొనే స్త్రీలు) కూడ ఉన్నట్లు కామసూత్రాల వల్ల తెలుస్తున్నది.

వాత్స్యాయనుడు వివరించిన సంపన్న గృహిణి ధర్మాలనుబట్టి నాటి జీవితం ఎలా ఉండేదో తేలికగా వూహించవచ్చు.

''ఇంటి ఆవరణలో అల్లం, కొతిమేర, చెరకు, జీలకర్ర, ఆవాలు లోనైన వానిని మళ్ల వేయించాలి. ఉసిరిక, మల్లిక, జాజి, విరజాజి, గోరంట, వట్టివేళ్లు మొదలైన వాటిని పెంచి వాటికి దాపున విశ్రామార్థం అందమైన అరుగులు వేయించాలి. ఆ ఉద్యానం నడుమ కూపమో, వాపికో త్రవ్వించాలి. (4-1-6,7,8) ముల్లంగి, సౌర, అందుకు దవనం, అంబాలం, మహోరుకం, దోస, గుమ్మడి, చిన్నసౌర, కంద, అవిసే, దురద గొండి, తిలపర్ణకే, అగ్నిమంథం, వెల్లుల్లి, నీరుల్లి మొదలైనవాటిని తరితెలిసి, నారుపోసి పెంచటం, పైరు చేయటం, విత్తనాలు కట్టటం మొదలైన పనులు నిర్వర్తించాలి.''

''భోజనావశిష్టమైన పాలనుంచి పెరుగు, వెన్న తయారుచేయటం, నువ్వులు ఆవాలు మొదలైన చమురు గింజలనుంచి చమురు తీయటం, బెల్లం తయారుచేసుకోవటం, నూలు వడికి వస్త్రాలు నేసికొనటం అవసరం. ఉట్లు చేత్రాళ్లు, పేసికి వలసిన కట్టుత్రాళ్లు
252 భార్య సంగ్రహించాలి. సజ్జలు మున్నైనవి తొక్కించాలి, బియ్యం దంపించాలి. లేదా వాటిని తానే స్వయంగా నిర్వర్తించాలి. ఇంట బయట పనికి పురమాయించిన భృత్యులవేతనాలు, దినవెచ్చం గృహిణి విచారించుకోవాలి. కృషి, పశుపాలనం విచారిస్తూ, వాహన జాతిజీవాల యోగక్షేమాలు, యజమాని కోరితెచ్చి పెంచే మేష - కుక్కుట - లావక - శారికా - పరభృత - మయూర - వానర మృగాల ఆలన పాలన చూడాలి. ఏ రోజు కారోజు అయిన ఆ యవ్వయాలు లెక్కగట్టి లాభనష్టాలు తేల్చాలి.''

''భర్త అనుభవించి వదలివేసిన పాతగుడ్డలు ఉదికించి, అవసరమైతే రంగు లద్దించి తన ఇంట పనిపాటల్లో మెలిగే వారికి ఇవ్వాలి. అలా ఇవ్వటానికి పనికిరాకపోతే వాటిని కాగడాలకో, వత్తులకో వాడాలే కాని వూరక పారవేయరాదు.''

''సురాకుంభాలు, ఆసవకుంభాలు, ఇంట భద్రపరచి వాడటం, వాని క్రయవిక్రయాలు ఆయవ్యయాలు అవేక్షించటం గృహిణి కర్తవ్యం.'' (4-1-35)

ఆనాడు నాలుగు రకాల గృహోపకరణాలుండేవి. కుండలు, బానలు మొదలైన మృద్భాండాలు, వెదుళ్ల తట్టలు, బుట్టలు మున్నైన విదళభాండాలు, పీఠాలు, ఆసనాలు, అర్ధపర్యంకాలు లోనైన కాష్ఠభాండాలు, నేతిసిద్దెలవంటి చర్మభాండాలు, రాగి వెండి మున్నగు లోహభాండాలు ఇళ్లల్లో వాడుకొనేవారని కామసూత్రాలు చెబుతున్నవి.

సౌవర్చ లవణం, సైంధవ లవణం, బిడా లవణం, అంటుప్పు, సముద్రలవణం అన్న పంచలవణాలు ఎప్పుడు పడితే అప్పుడు ఆరోజుల్లో దొరికేవి కావు. పల్లెటూరి వారికి అవి అపురూపాలేమో. సప్త శతిలోని

''ప్రాప్తమైనంత వఅకె సాపడుము; లవణ
మెట్టు లీపల్లె కొంపలో౦ బుట్టమాకు;
సుభగుఁడా! స్నేహరహిత మౌచోట లవణ
మెంత యున్నను జెప్పు! నీకేమి యొఱగు'' (4-16) అన్న గాథే ఇందుకు నిదర్శనం. ఉప్పుతోపాటు సుంగంధ ద్రవ్యాలు, కొన్ని ఓషధులు తేలికగా లభించేవి గావు. అందువల్లనే వాటిని సంపాదించి గృహిణి ప్రచ్ఛన్నంగా భవనంలోనే భద్రపరచుకోవలసినదని వాత్స్యాయనుడు హెచ్చరించాడు. (41-28).

## నాటి ఆటపాటలు

1. ఆకర్షక్రీడ (Tug-of-war) 2. పట్టికాగ్రథనం, 3. ముష్టిద్యూతం ( ఒడిలో కాయ లుంచుకొని, కొన్ని గుప్తంగా పిడికిటపట్టి వెలికితీసి, చేతిలో ఎన్నికాయలున్నవో చెప్పమనేవారు: చెప్పి నన్నికాయలే చేతిలో ఉంటే చెప్పినవారు గెల్చినట్లు, లేదా ఓడినట్లు), 4. క్షుల్లక ద్యూతం, 5. అంగులీగ్రహణం, 6. షట్పాషాణకం (అచ్చన గాయలు), 7. సునీమీలితిక (దాగుడుమూతలు), 8. ఆరబ్ధిక (పిల్ల లొకచోట చేరి ఉండగా, వీరిలో ఒకడు మరొకరిని మొట్టిపారిపోతాడు. తక్కినవారుకూడా చిక్కకుండా పారిపోతారు. మొట్టికాయ తిన్నవాడు ఎవరినో ఒకరిని పట్టుకోవాలి. అలా పట్టుపడినవాడు దొంగ అవుతాడు), 9. లవణ వీథిక (పిల్లలు ఒకరిచేత నొకరు పట్టుకొని గుండ్రంగా నిలబడి మధ్యలో మరొకరిని నిలుపుతారు. నడుమ నిలిచినవాడు అంటువడక వలయంవెలికి రావాలి. అతడు తనచుట్టూ గుడుసుకట్టిన పిల్లలను ''ఇదేదొడ్డి'' ''ఇదేదొడ్డి'' అని అడుగుచూ, తప్పించుకొని బయటపడటానికి ప్రయత్నిస్తాడు. ''ఇది మురుగుదొడ్డి'' ''ఇది మరుగుదొడ్డి'' అని అతనిని వెలికిపోనీక వలయంలోనివారు అడ్డుపడతారు. గుడుసులో నిలిచినవాడు తనచుట్టూ నిలిచినవారిని పాలుమాలించి బయటపడాలి. అలా బయటపడినప్పుడు, బయటపడటానికి కారణమైనవాడు దొంగ అవుతాడు), 10. గోదుమ పుంజికీ, 11. అంగుళీ తాడితిక (పిల్లలు చేరి ఒకని కన్నులకు గంతకట్టి, ఒక్కొక్కడే వేలితో అతనిముఖం తాకుతూ, ఆతాకిన వానిపేరు చెప్పమని యితరులు అడుగుతారు. తాకినవాడిని అతడు గుర్తిస్తే, గుర్తింపబడ్డవాడు దొంగ అవుతాడు). ఇలాంటి ఆటలు ఆడుతూ బాలలు వినోదించేవారు.

దారము, కొయ్య, కొమ్ము, దంతము, మైనము, పిండి, మట్టి వీనితో చేసిన బొమ్మలు, రంగు రంగుల చిత్రాలు, బంతులు, దేవకుల ప్రతిమలు, శుకశారికాది

పంజరకాలు, యంత్రపు బొమ్మలు (తమకు తాముగా నడిచేవి, మ్రోగేవి) ఆనాడు ఉండేవి. ఈ విషయాన్ని ౭వ శతాబ్దంవాడైన చంద్రకీర్తి ప్రాచీనోక్తిగా ఉదాహరించిన

''యథా యంత్రకృతం తూర్యం
వాద్యతే పవనేరితమ్
స చాత్ర వాదకః కశ్చిత్
నిస్వరం త్వథచ స్వరాః''

అన్న శ్లోకం బలపరుస్తూ వుంది. పిల్లలు వేడుకగా వాయించుకునే వీణికలు, చిత్రవిచిత్రములైన పిండోలికలు, (బొమ్మల పీటలు, కుర్చీలు, పరుపులు మొన్నైనవి) పటోలికలు, (అలంకరణాన్ని సిద్ధపరుచుకోటానికి ఉపయోగించేవి) నాటి బాలబాలికల ఆటవస్తువులు. ఆడపిల్లలు ఉత్పుల్లికా క్రీడతో కూడ వినోదించేవారు.

నాడు రకరకాల ఆభరణాలుండేవి. చూడామణి వంటి శిరోభూషణాలు, మకరిక మృష్టి కుండలాలు, కాంచన తాలపత్రాలు, కర్ణికలు, త్రికంటకలు, బాలికలు మున్నైన కర్ణభూషణాలు, ఏకావలి – యష్టి – శ్రీర్షకం – అపవర్తకం – రత్నావళి – ప్రకాండకం – ఫ లకహారం – మణిబంధం – రత్నవలయం – కనకదోరం – జాలవలయం మొదలైన
254 రక్షా బంధాలు, ఉంగరాల వంటి వేలి భూషణాలు, కాంచి – రత్నమేఖల – మణి మేఖల – కాయబంధం – వేలినం మున్నైన కటిభూషలు, మంజీరం – నూపురం – కింకిణి వంటి పాదాలంకారాలు, ముక్తా యజ్ఞోపవీతం, ఉదరబంధం, వైకక్షకం మొదలైన యితర భూషణాలు ప్రజలు ధరించేవారు.

## చదువు సంధ్యలు

వాత్స్యాయనుడు తనకామసూత్రాలలో చతుష్షష్టి కళలను పేర్కొన్నాడు. వీనిని బట్టి చూస్తే నాటివారి విజ్ఞాన విస్తృతి, సంస్కారోదాత్తత స్పష్టమవుతాయి. గీత వాద్య నృత్యాలు ఆనాటివారు అభ్యసిస్తూ ఉండేవారు. తిలకం దిద్దటం ఒక ప్రత్యేకకళ. రంగు రంగుల బియ్యపు గింజలతోను, పువ్వులతోను వివిధాకారాలు తీర్చేవారు. ఈకళను తండులకుసుమవళీ వికార మనేవారు. దంతాలకు, వస్త్రాలకు శరీర అంగాలకు రంగులు తీర్చుట ఒక కళ. భూమిని నానావర్ణమణులతో అలంకరించటాన్ని మణిభూమికాకర్మ అని పిలిచేవారు. ఆలేఖ్యం, శయనరచన, ఉదకవాద్యం, ఉదకాఘాతం, చిత్రయోగం, ( ఉన్న చిత్రాలను, వివిధ భావాలను అవస్థలను స్ఫురింపజేసేటట్లు ఏర్పరచటం) శేఖరికా పీడయోజనం, (సిగలలో అనేక ఆకృతముల చక్రములను అమర్చడం) నేపథ్య ప్రయోగం, (వస్త్రమాల్య భూషణాదులతో వ్యక్తులలంకరించడం) సూచీవానికర్మ (కుట్టుపని) వీణాడమరకవాదనం, నాటకాఖ్యాయికా ప్రదర్శనం, కావ్య సమస్యాపూరణం,

కావ్యక్రియ, అభిదానకోశం, ఛందోజ్ఞానం, కావ్యాలంకారం, వృక్షాయుర్వేదం, ఉత్పాదన సంవాహన కేశమర్దన కౌశలం, వైనకీయం, వైజయకీయం, కామశాస్త్రం మున్నైనవి విద్యలుగా ఉండేవి. వివిధ శాస్త్రాలు చదివిన విదుషీమణులు కూడా లేక పోలేదు. ముఖ్యంగా గణికలు, రాజపుత్రికలు మహామాత్యుల కుమార్తెలు శాస్త్రకృషి చేసేవారు. ఏది ఎలా వున్నా నాడు చదువు కొన్నవారి సంఖ్య అధికంగా ఉండేదని చెప్పటానికి ఆధారాలు లేవు. సప్తశతిలో ఒక గాధలో ఇలా ఉన్నది.

''కాళ్లవ్రేళ్లతోఁ, జేతులవ్రేళ్లతోడఁ
గడఁగి లెక్కింప, లెక్కింపఁ గడచి చన్న
విన్న నాళ్లను, వేనితో నింక లెక్క
పెట్టఁగల నని ముద్దరాల్ బిట్టు వనరె. (4-7) దీనిని బట్టి ఇరవైకి పైబడ్డ సంఖ్య లెక్కించలేని లలనామణులు గ్రామసీమలలో చాలామంది ఉండేవారని నిరాఘాటంగా వూహించవచ్చు.

అమరావతి వద్ద, నాగార్జునుని కొండవద్ద సుప్రసిద్ధ విద్యాలయాలుండేవి. ధాన్యకటకం (అమరావతి)లోని విశ్వవిద్యాలయం ప్రఖ్యాతమై విదేశాయులను పండితులను విద్యార్థులను అకర్షిస్తూ ఉండేదని చరిత్రకారులు వ్రాస్తున్నారు. నాడు వృత్తి విద్యలకు ప్రత్యేక పాఠశాలలు లేవుకాని విద్యార్థులు ఆయావృత్తి విద్యలందు శ్రేష్ఠులైనవారి వద్ద చేరి వారి కర్మ శాలలలో విద్య నేర్చుకునేవారట. ఇక్కడ నాగార్జునుని రత్నావళి చతుర్థపరిచ్ఛేదంలోని యాక్రింది శ్లోకం పరిశీలినాల్లం.



''యధైవ వైయాకరణో మాతృకా మపి పాఠయేత్
బుద్ధోఽవదత్తథా ధర్మం వినేయానాం యధాక్షమమ్''

(వైయాకరణుడు అక్షరాలనుగూడ చదివించునట్లు బుద్ధుడు వినియేజనులకు వారి శక్తి ననుసరించి ధర్మము బోధించెను.)

ఈ దృష్టాంతమువల్ల ఒకేగురువు ఇటు చిన్న పిల్లలకు అక్షరాలు నేర్పుతూ, అటు పెద్దవారికి శాస్త్రపాఠం నేర్పేవాడని తెలుతున్నది. ఈ పద్ధతే నాగార్జునుని కాలంలో ఆచరణయందు ఉండాలి. లేకున్న అతడు ఈ దృష్టాంతం ఇచ్చి ఉండేవాడు కాడు. దీనిని బట్టి యీనాటి విశ్వవిద్యాలయ విధానం కాని, ప్రకృత విద్యా విధానం వంటి విధానం కాని నాగార్జునుని కాలంలో కానీ ఆనాటి వారి ఎరుకలో కానీ ఉన్నట్టు ఊహించటానికి అవకాశం లేదు. కాకున్న పెక్కురు విద్వాంసులు ఒకేపట్టణంలోనో, విహారంలోనో ఉండవచ్చును. అయితే ఏ గురువు శిష్యులు ఆ గురువు వద్దనే చదువుకొనేవారు. కాని ఒకేపరి ఒక శాస్త్ర భాగం ఒక గురువునొద్ద, వేరొక శాస్త్ర

భాగం వేరొక గురువువద్ద చదివేవారని చెప్పటానికి అవకాశం కనిపించడం లేదు. కాబట్టి అమరావతి వద్ద కాని, నాగార్జునుని కొండ వద్దకాని నాగార్జునుని కాలంలో కాని, అంతకుముందు కాని, విశ్వవిద్యాలయం లేదనిపిస్తుంది. కాకపోతే విఖ్యాతపండితులు అనేకులు అక్కడ ఉంటే ఉండవచ్చును. వారు ప్రపంచఖ్యాతి గడించి ఉండవచ్చును.

(18–7–1965 " ఆంధ్రప్రభ" ఆదివారం సంచిక)

సభలు, సమావేశాలు, ఉత్సవాలు, వూరేగింపులు లేని జీవితం ఒక జీవితమని చెప్పలేము. నాగార్జునుని కాలంలో సారవంతమైన జీవితాన్ని ప్రజలు సాగించారు. వారు పండుగలు–పబ్బాలు అనేకం చేసుకొనేవారు. కామ సూత్రాలు ఇలాంటి వాటిని ఇరవైదాకా పేర్కొన్నది.

1. ఘటానిబంధనం :– దేవతల నుద్దేశించి నాగరకులు ఒకచోట చేరి మాసాంతం గాని, పక్షాంతం గాని గణేశచతుర్థి, సరస్వతీ పంచమి, శివాష్టమి – మున్నగు పర్వదినములలో గాని ఉత్సవం చేసేవారు. దీనినే ఘట అంటారు. ఉత్సవంలో నటులు, నర్తకులు తమ తమ విద్యలను ప్రదర్శించేవారు.

2. గోష్ఠీసమవాయం :– సమాన వయోవిద్యా బుద్ధి శీలవిత్తవంతు లైన నాగరకులు మిత్రుని యింటగాని, విద్యావంతురాలైన వేశ్యయింటగాని సమావేశమై భరత శాస్త్రాన్నిగూర్చి, కావ్యాలనుగూర్చి చర్చించేవారు. సమస్యలిచ్చేవారు – పూరించేవారు. ఇలా గోష్ఠి నిర్వహించి అంతంలో ఒకరినొకరు గౌరవించుకొనేవారు.



3. సమాపానం :– మాసానికో, పక్షానికో ఒకసారి, తడవకొక మిత్రుని యింట సమావేశమై మధు – మైరేయ – ఆసవాదులతో, విద్యా వినోదాలతో క్రీడించేవారు.

4. ఉద్యానగమనం :– మిత్రులైనవారు ఉదయాననే ఉద్యానవనానికి పోయి, అక్కడ కుక్కుట–లావక–మేషయుద్ధ–ద్యూతాలతో వినోదించి సాయంకాలానికి ఇండ్లకు చేరుకొనేవారు.

5. యక్షరాత్రి :– దీనికి పక్షరాత్రి, సుఖరాత్రి యన్నవి పర్యాపదాలు. దీనిని మాఘశుక్ల పంచమినాడు, కార్తిక పౌర్ణమినాడు జరుపుకొనేవారు. ఇది ద్యూతప్రధానం.

6. కౌముదీజాగరం :– ఈ పండుగ ఆశ్వయుజపౌర్ణమి నాడు వచ్చేది. ప్రజలు నాటిరాత్రి అంతా జాగరణచేసి, డోలావిహారం, ద్యూతక్రీడ, దేవతాపూజమున్నైన కార్యకలాపాలతో వినోదించేవారు.

7. సువసంతకం :– దీనిని మదనోత్సవం అనికూడా అంటారు. పల్లీపట్టణవాసు లందరికీ ఇది పండుగ, నాడు నృత్య వాద్యగీతాలు, శాస్త్రచర్చలు, పండితగోష్ఠులు, నాటకప్రదర్శనలు కొనసాగేవి.

---

జి.వి. కృష్ణరావు

ఈ పేర్కొన్నవే కాక సహకారభంజిక, బిసఖాదిక, నవపత్రిక – అన్న ఉత్సవాలు ఉండేవి. నాగరకులు సఖీజన పరివృతులై మామిడితోటలకు పోయి ఎగిరి నోటితో కాయలు కోసుకొనేవారు. ఈ ఉత్సవానికే సహకార భంజిక అనిపేరు. నగరం వెలుపలి పొలాలకు పోయి సెనగకాయలు, జొన్నకంకులు కోసి తంపటపెట్టి తినేవారు. దీనినే అభ్యూషఖాదిక అనేవారు. సరస్సులో దిగి నోటితో తామరతూళ్లు కోసే ఉత్సవాన్ని బిసఖాదిక అనేవారు. ఉదకక్ష్వేడిక అన్న పర్వదినాన నాగరికులు వెదురుగొట్టాలతో ఒకరిపై నొకరు నీరు చిమ్ముకునేవారు. బొమ్మలపెండ్లి చేయడం కూడా ఒక ఉత్సవంగా ఉండేది. దానిని పాంచాలయానం అనేవారు. యవచతుర్థి అన్న పండుగ వైశాఖశుద్ధ చతుర్థినాడు వచ్చేది. నాడు నాగరకులంతా ఒకచోట చేరి, సుగంధి ద్రవ్యసమ్మిశ్రితమైన యవచూర్ణం ఒకరిపై నొకరు చల్లుకొనేవారు. శ్రావణ శుద్ధ తృతీయ నాటి ప్రజలకు ఆలోలచతుర్థి. నాడు ఉయ్యాల లూగేవారు. దమనీభంజిక, హోలాక, అశోకోత్తంసిక, పుష్పావ చాయిక, ఇక్షు భంజిక, చూతలతిక, కదంబ యుద్ధం అన్న ఉత్సవాలు కూడ ఉండేవి.

ఆనాటి పెండ్లిపేరంటముల గూర్చి కామసూత్రాలు కొంత తెలుపుతున్నవి. నాటి సమాజంలో భిన్న భిన్నమతాలు ఉండేవి. వివాహాలలో వ్యత్యాసాలుండేవో లేవో సరిగా తెలియదు. వాత్స్యాయనుడు సవర్ణ వివాహాలు ప్రాశస్త్యాలని వ్రాశాడు. కాగా నాడు వర్ణాంతర వివాహాలు కూడా లేకపోలేదని చెప్పవచ్చును. మేనగోడలిని పెండ్లాడే ఆచారం నాడుకూడ ఆంధ్రదేశంలో ఉండేది. రాజులలో, భాగ్యవంతులలో బహుభార్యాత్వం కనిపిస్తున్నది. పురుషులలోని బహుభార్యాత్వానికి కారణం మొదటి భార్య శార్యం, దౌశ్శీల్యం, గొడ్రాలితనం, ఆడపిల్లలను మాత్రమే కనటం, చాపలం – అని వాత్స్యాయనుడు పేర్కొన్నాడు. విధవా వివాహాలు కూడ నాడు ఉండేవి. మొదటి పెండ్లాడిన భర్తను త్యజించి, రెండవ పెండ్లి చేసికొన్న స్త్రీని పునర్భువు అనేవారు. స్త్రీ తనకు తానై తిరిగి పెండ్లాడినపుడు తొలిమగడు ప్రతిమూల్యంగా ఇచ్చినవస్తువులు తప్ప తక్కిన నగలు నాణాలు అతనికి ఇచ్చివేయాలి. సహగమనం కూడ నాడు ఉండేదని సప్తశతిలోని ఈ క్రింది గాథ చాటుతున్నది.

''అనుమరణ దీక్షఁ బ్రస్థాన మన కులీన
మానినికిఁ జేయువైధవ్యమండనంబు
పతిఁ బునర్జీవితుం జూడఁ బడయ నదియె
మఱల మాఱెను సుభగతామండనముగ'' (7–33)

నాటి వివాహవిధి మంగళాచరణంతో ప్రారంభమై నాగవల్లితో సమాప్తమయ్యేది. (సప్తశతి 7–44) ప్రథమ సమాగమ సందర్భాన వధువుకు తెల్లని వస్త్రం కట్టబెట్టేవారు.

వారు దీనిని ఆనందపటమని పిలిచేవారు. ఉపభుక్తమైన ఆనందపటాన్ని వధువు చెలులు మరునాడు చూచి ఆనందించారని సప్తశతిగాథ చాటుతున్నది.

నాటి సమాజంలో వేశ్యలు ఉండేవారు. వీరి ఉనికి పట్టణాల్లోనే కాక గ్రామసీమల్లో కూడ కనిపిస్తుంది. గణికలు కేవలం రూపాజీవలే కాక నృత్యగీత వాద్య వైదగ్ధ్యం, చిత్ర లేఖన కావ్యక్రియా పాటవం, శాస్త్ర విచార దక్షత కలిగి నాటికళలకు, గోష్ఠులకు, సంస్కృతికి పట్టుగొమ్మలుగా ఉండేవారు. వేశ్యలలో కొందరు ఏకచారిణీత్వం వహించేవారు. కొందరు తాము సంపాదించిన ధనాన్ని బౌద్ధ విహారనిర్మాణాలకు, ఆరామతటాకాది పుణ్యకార్య నిర్వహణకు వినియోగించేవారు.

నాటి ప్రజలలో- నాగరికులైనా పల్లీయులైనా – వెలిచవులు కనిపిస్తున్నవి.

''ఇచట నిదురించు నత్తగా; రిట పరుందు
నేను; పరవులెల్లరు శయనింతురిచట;
వలదు, రాత్ర్యంధకుఁడ వీవు వలదు పథిక!
పడుదు వేమొ పొరపడి మాప్రక్కపైని'' (7-67)

''కొప్పులోఁ బెద్ద వెదురాకు లిప్పురుసున
గ్రుచ్చుకొన్నవి దులుపుకో! కోడల యనఁ;
బట్టుకొన్నది మీవీపు పయిని వెల్ల
పాటిదు మ్మత్తయా! యని వధువు పలికె. (7-74)

తన ప్రియునకు జాణ ఎలా ఆహ్వానం పంపుతున్నదో యీగాథ చిత్రిస్తున్నది.

''జబ్బువడె, మే నెఱుంగదు జాగిలమ్మ;
మతి చెడిన, దత్తకును; వీట మగఁడు లేఁడు;
దున్న పడి ప్రత్తిచే నల్లఁ ద్రొక్కివైచె;
వానికిం జెప్పి రప్పించువారు లేరు'' (6-49) దేవర ప్రణయాలు, హితబోధలు నాడు లేకపోలేదు. ఆనాటి అతిచారాలకు కారణాలను వాత్స్యాయనుడు పేర్కొన్నాడు. వాటిని బట్టి చూస్తే నాటిసమాజం అసిధారావ్రతం చేసేదని ప్రశంసించటానికి, నేటి సమాజం అవినీతి పంకిలమైపోయిందని గర్హించటానికి అవకాశాలు కన్పించటం లేదు.

నాడు వైదికమతానుయాయులు సర్వసాధారణంగా వర్ణభేదంతో నిమిత్తం లేకుండా సురాపానం చేసేవారని వూహించవలసి వస్తున్నది. గౌతమీపుత్ర శాతకర్ణి తాను ఏకబ్రాహ్మణుడనని చెప్పుకొన్నాడు. వ్రాయించుకొన్నాడు. నాగార్జునుడు ఎప్పటివాడైనా తనకాలపు శాతవాహన చక్రవర్తిని త్రాగవలదనీ, దానివలన ధనక్షయం, కీర్తిక్షయం,

కార్యహాని, అనర్థహేతువు కలుగుతాయని గట్టిగా మందలించవలసివచ్చింది. వాత్స్యాయనుడు గూడ గృహిణి సురాభాండాలను, ఆసవ భాండాలను భద్రపరచి, వాటికి సంబంధించిన ఆయవ్యయాలను అవేక్షిస్తూ ఉండాలని అన్నాడు. ఎదటివాణ్ణి తప్పతాగించి రహస్యాలను తెలుసుకోవలసిందని అర్థశాస్త్రం ఆదేశిస్తున్నది.

## పల్లీ పక్కణాలు

ఈనాటివలెనే నాడు పల్లెపట్టులు మెండు. అడవులు చాల అధికం. ఆటవికులపల్లె లెన్నో ఉండేవి. పల్లీ పక్కణ జీవితాన్ని సప్తశతి చిత్రిస్తున్నంత విశదంగా నాటిరచన మరొకటి చిత్రించటం లేదు. ఒక వూరు నుంచి మరియొక వూరికి సరిగా రోడ్డున్నట్లు కాన్పించదు. వానకాలంలో ఈ మార్గాలు ఎలా వుండేవో సప్తశతిలోని ఈ గాథ బొమ్మగీసి చూపుతున్నది.

''మధ్యలో స్వల్పముగఁ గర్దమంబు; రెండు
కడల నడచుటచే గట్టివడిన బురదఁ
గ్రాలు రథ్యాముఖం బొప్పె గ్రామశీర్ష
మండనీ భూతమైన సీమంత మట్లు'' (7-82) మార్గాలు ఇలా వున్నప్పుడు ప్రయాణాలు ఎలా ఉండేవో వూహించుకోవచ్చు. గుర్ర మనేది నాటి పల్లెటూరి వారికి తెలియని క్రొత్త జంతువు. ప్రసక్తానుప్రసక్తంగా నైనా సప్తశతిలో అశ్వం పేరెచ్చటా వినిపించదు. నాడు కాలినడకనే ప్రయాణం సాగించేవారు. సరకులు ఎడ్లనడుములపై కట్టి అన్యస్థలాలకు చేరవేసుకొనేవారు. దీనికి సప్తశతిలోని ఈ క్రింది గాథే నిదర్శనం. 259

''ప్రేయసీ సహితుని నిన్ను మోయు; నన్ను
సగమయితి వేలయని సాగి తవుర!
పసరమునకైన బరువు పైఁబడిన కొలఁది
మేను చిక్కదే! ఇంగితజ్ఞాన శూన్య!'' (3-75) వర్తకులు మున్నెనవారు భృత్యులచేత సరకులు చేరవేయించేవారని రత్నావళిలోని ఈ క్రింది శ్లోకాన్నిబట్టి వూహించుకోవచ్చు.

''ఇహ పథ్యధనం లోకే నవహ త్యభృతో భృతః
యాచకత్వభృతోఽ ముత్యహీనః శతగుణోద్వహం''

సరియైన రోడ్లు లేకపోవుట, అశ్వములు తక్కువగావటం, కాలినడకన పయనాలు సాగించడం, నాటి సామ్రాజ్యం అతివిస్తీర్ణం గావటం – మున్నెన్న కారణాలవల్ల ప్రయాణాలు దీర్ఘకాలికాలుగా ఉండేవి. ఒక్కొక్కప్పుడు నెలలు తీసుకొనేవి. అందువల్ల నాటి ప్రయాణాలు స్నిగ్ధహృదయులకు, ఆప్తులకు, ప్రేయసీ ప్రియులకు ఎంతో కష్టం

కలిగించేవి. సప్తశతిలో దాదాపు నాలుగోవంతుకు పైగా ప్రోషితభర్తృకల గాథలు, ప్రోషితుల గాథలు, ప్రవాస గాథలు కనిపిస్తున్నవి. తరువాతి కాలంలో ఇలాంటి దీర్ఘవియోగాలకు అవకాశం లేకపోయినా ప్రవాసవర్ణన, ప్రోషిత భర్తృకల విరహవర్ణన కవుల కొకసంప్రదాయమైపోయింది.

ఆనాడు బండ్లు అనేవేలేవని అర్థం చేసుకోరాదు. బండ్లు ఉండేవి. అవి సుదూరగ్రామాలకు అంతగా వినియోగపడేవి కావు. నాటి బండ్లను రథాలనే వారని విగ్రహవ్యావర్తనీ వాక్యం వల్ల తెలుస్తున్నది.

(25-7-1965 '' ఆంధ్రప్రభ'' ఆదివారం సంచిక)

## పైరుపచ్చలు

నాడు వరి, చెరకు, కంది, సెనగ, ప్రత్తి, జనుము, నువ్వు వేసేవారని సప్తశతివల్ల తెలుస్తున్నది. అరటి తోటలు కూడ ఉండేవి. చేలల్లో పనిచేసేరైతులకు వారి భార్యలు అన్నం తీసికొని వెళ్లేవారు. బెల్లపుగానుగలు, నూనెగానుగలు ఉండేవి. వాటివద్ద స్త్రీ పురుషులు కలిసి పనిచేసేవారు. నాడు ఏతాలు కూడ ఉండేవి. వరిచేలో నాడు రైతు ఎలా ఎముకలు విరుచుకొనేవాడో క్రింది గాథ చక్కగా వివరిస్తున్నది.



''అడుసులోఁ గూరి కొనిపోవు హలములాగి
దున్ని దున్ని శ్రమం పడియున్న మగఁడు
బిట్టు గుబ్బున నిద్రవోఁ దిట్టఁ దొడఁగె
నిండు వానకారును వానినెలఁతమిన్న'' (4-24)

రైతులు గోవులను, మహిషాలను పెంచేవారు. గిత్తలకు ముకుదాళ్లు పోసే ఆచారం ఉండేదని ఈ క్రిందిగాథ చాటుతున్నది.

''నాగలికిఁ గ్రొత్తగాఁ బోయి, యోగిరంబు
మోసికొని తెచ్చు నిల్లాలిఁ జూచి, హాలిక
సుతుఁడు మెడపట్టెడను విప్పఁజొచ్చి, యూడ్చి
వైచె నదె! గిత్త ముకుఁద్రాడు చూచినావె!'' (7-92)

ముఖ్యంగా ఈ క్రింది గాథ పరిశీలనార్హం.

''మాఘమాసంబునందుఁ బామరుఁడుమేని
దుప్పటి నొసంగి, యొకగిత్తదూడఁగొనియే;
పొగలు గ్రమ్మని కుంపట్లువోని కొమిరె
ప్రాయవుం దనజాయచందోయి గనుచు'' (3-38)

దుప్పటితో గిత్తను కొన్నాడంటే వస్త్రాలు నాడెంత ప్రియమో లేక గిత్తలే నాడంత కారుచవుకో అర్థశాస్త్ర వేత్తలే నిర్ణయించాలి.

గ్రామానికి నాడు గ్రామణి అధిపతి. ప్రజలో ఆటోపం లేనిజీవితం సాగించేవారు. దేవకులాలు ఉండేవి. నాటివైదిక మతానుయాయులకు పార్వతీపరమేశ్వరులు – గణపతి, సరస్వతి, హరి, కృష్ణుడు – ఆరాధ్యదైవతాలు. బౌద్ధులను గూడ సప్తశతి పేర్కొన్నది. కాని వారి ఆచార వ్యవహారాలను గూర్చి ప్రస్తావించలేదు. ఒకటి రెండుచోట్ల పూవులను కోసేధార్మికుడు ఉదాహృతుడయ్యాడు. ఇతడు బౌద్ధుడయి ఉంటాడని వూహించడానికి అవకాశం లేకపోలేదు. బౌద్ధభిక్షువు ఎదురుపడితే అపశకునంగా భావించేవారు. ఈ భావం ముద్రారాక్షసరచనాకాలం నాటికి గూడ కొనసాగుతూనే ఉన్నది. సప్తశతిని బట్టి చూస్తే నాడు బౌద్ధం పరిగణనీయమా అన్న ఆలోచన కలుగుతుంది.

ఆనాటి కలవారియిండ్ల గోడలమీద రామాయణ గాథలు చిత్రించపబడి యుండేవి. ముంగలి వరండాలకు తెరలు వాడేవారు. ఇలాంటి సంపన్న గృహాలే కాక పూరిండ్లు ఎన్నో ఉండేవి. జడిపట్టి కురిసే రోజులలో అవి ఇల్లాండ్రను ఎంత అవస్థపెట్టేవో సప్తశతి కన్నులకు కట్టేటట్లు వర్ణించింది.

పల్లె పడుచులకు పూలంటే ఎంతో ఇష్టం. వానికోసం ఎంతదూరం వెళ్లవలసి వచ్చినా 261
వెనుకముందులు ఆలోచించేవారుకారు. ఎఱ్ఱని చీరలంటే నాటి పల్లెపడుచుల కెంతో మోజు. వసంతోత్సవాలు జరుపుకొనేవారు. నృత్యవాద్యాలు వారికి అచుంబిత విషయాలని చెప్పలేము. ఇరుగు పొరుగులమీద సానుభూతి ఉండేది. కుటుంబాలప్పుడు ఉమ్మడిగానే ఉండేవి. చిలుకలు, గోరువంకలు మున్నైన పిట్టలను పంజరాలలో పెంచేవారు.

నాడు పల్లెలకు దొంగభయం మెండు (సప్తశతి). చోరులు ధనమేకాక స్త్రీ జనాన్ని కూడ అపహరించుకొని పోయేవారు. గ్రామస్థులు ధైర్యసాహసాలు ప్రదర్శించి అలా బంధింపడ్డ స్త్రీలను విడిపించి పేరుప్రఖ్యాతులు సంపాదించేవారు. చేతికి చిక్కిన దొంగను ఆగ్రామమే విచారించి, దోషాన్ని చాటించుకొంటూ పోయి, వూరివెలుపలి శ్మశానవాటిక లోని చెట్టుకు ఉరితీసేవారు. పూరిళ్లు మెండు కావటంవల్లనేమో అగ్నిప్రమాదాలు బయలు దేరగానే పటహాదులు మ్రోయించేవారు. ఎవరికి చిక్కిన పాత్ర వారు పట్టుకొని స్త్రీ పురుషులు వచ్చి అగ్ని చల్లార్చటానికి పూనుకొనేవారని సప్తశతిలోని ఈ గాథచాటుతున్నది.

''అరగడియలోన సర్వస్వ మంటులేక
మంటఁ గలిసిన నేమాయె? మదికిఁబ్రియమె;
తగులఁబడుచుండ నూరెల్లి, దయితుఁడు తన
చేతితోఁ గొనె ఘటము నాచేతి నుండి'' (3–29)

వేసవిలో బాటసారుల కోసం చలివేంద్రాలుండేవని ఈ క్రింది గాథ వ్యక్తం చేస్తున్నది.

''కన్ను లెత్తి మీదు గనుచుఁ బాంథుఁడు నీరు
వ్రేళు లెడముచేసి క్రోలఁ గాల
యాపనమ్ముకై ప్రపాపాలికయు సన్న
సన్నధార మఱియు సన్నపఱిచె'' (2-61)

మల్లుల కుస్తీలు కూడ నాటి గ్రామసీమలలో తరచు జరుగుచుండే వని ఈ క్రింది గాథనుబట్టి వూహించుకోవచ్చు.

''మల్లయుద్ధ చపేటావ మర్దితాభి
శిదిలిత శ్రవణుం డైన జీర్ణముల్లు
కటిత టాబద్ధమై యున్న కచ్చుడంబె
పిటికి మల్లుల గుండెలు వ్రీలఁజేసె''. (7-84)

ఆనాటి సామాజిక జీవనంలో మతానికి ఎంతో ప్రాముఖ్యం ఉండేది. నాటి సాంఘిక ఆర్థిక రాజకీయాలు నేటికాలంలో వలె విడివిడి ప్రత్యేకత పొందిలేవు. మతానికి వీనికి నాడు అవినాభావ సంబంధం ఉండేదని చెప్పవచ్చు. ఆనాడు వైదికం, జైనం, బౌద్ధం
262 ప్రధాన మతాలు. నాగార్జునుని రత్నావళి సాంఖ్యులను, వైశేషికులను జైనులను, పుద్గల వాదులను (బౌద్ధులలో ఆత్మను అంగీకరించే తెగ) పేర్కొన్నది. నాగార్జునుని శిష్యుడైన ఆర్యదేవుడు తన శత శాస్త్రంలో పూర్వ మీమాంసకులను పేర్కొని తీవ్రంగా ఎదుర్కొన్నట్లు గుర్తు. శైవులలో నాడు పాశుపతులు, కాపాలికులు ఉన్నారు. జైనం ఏస్థితిలో ఉండేదో తెలియదు. బౌద్ధంలో ఎన్నితెగలున్నా మూడు యానాలు ఉండేవి. 1. శ్రావక యానం, 2. ప్రత్యేక బుద్ధ యానం, 3. మహాయానం.

నాడు శాతవాహన చక్రవర్తులు వైదికక్రతువులెన్నో చేశారు. అరణ్యాలకు పోయి తపస్సు చేసుకునే ఆచారం వైదికులకు ఉండేది. వైదిక మతంలో వర్ణవ్యవస్థ ఉండేది. అప్పుడప్పుడు విదేశదండయాత్రల వల్ల ఇతర కారణాలవల్ల ఈ వ్యవస్థకు విఘాతం కలుగుతుండేది. చక్రవర్తులు తన్నివారణకు ప్రయత్నం చేసేవారు. మదిరాపానం, మాంసభోజనం, నేటి కాలంలో వలెనాటి హిందువులకు నిషిద్ధంగా కన్పించవు.

బౌద్ధుల కివి పూర్తిగా నిషిద్ధాలు. ఇది యిలా ఉండగా జంతుబలులతో కూడిన అశ్వమేధాలవంటి క్రతువులు నాడు జరుగుతుండేవి. ఇవి బౌద్ధులకు కంటకాలుగా ఉండేవి. బౌద్ధులకు వేదాలలో ప్రమాణ బుద్ధి లేకపోవటం, వైదిక దైవతాలను పూజించకపోవటం ఆర్షమతాను యాయులకు దుస్సహాలుగా వుండేవి. అందువల్లనే గౌతమన్యాయసూత్రాలు, వాత్స్యాయన న్యాయభాష్యం మహాయానాన్ని ఎదుర్కొన్నవి.

మాధ్యమికవాదాన్ని కేవలం నాస్తికవాదమని బాహాటంగా వైదికులు నిందించసాగారు. మహాయానేతర బౌద్ధశాఖలు, జైనులు వారికి వంతపలుకసాగారు. రాజుకూడ నాగార్జునుని కాలంలో స్వమత పక్షపాతంతో బౌద్ధుల దేవద్రోణ్యాది ఉత్సవాలను నిషేధించాడు.

నాటి మహాయానాచార్యుడైన నాగార్జునునకిది దుస్సహమై పోయింది. అతడు గౌతమ వాత్స్యాయనులకు, అర్హశాఖీయులయిన బౌద్ధులకు విగ్రహవ్యావర్తనిలో సమాధానం చెప్పుకొన్నాడు. పక్షపాత దృష్టితో ప్రవర్తిస్తున్న రాజునకు రత్నావళి పరికథను బోధించాడు. నాస్తికతాస్వరూపాన్ని నిర్ధరించి, మాధ్యమకం నాస్తికవాదం కాదని నిరాకరించాడు. నాగార్జునుని శిష్యుడైన ఆర్యదేవుడు గురువుల కాలంలో బయలుదేరిన తాత్త్విక వాదాలను నిశితంగా కొనసాగించాడు. వ్యక్తిగత దూషణ రహితమైన ఇతని వాక్కులు బాకులు, ఆ పోటులకు సహించలేని నాటి లోకం ఇతనిని హత్య చేసిందని చైనా జపానులలో లభిస్తున్న చరిత్రలు చాటుతున్నవి. ఎంతవరకు సత్యమో తెలియదు.

ఏది ఎలాగున్నా శాతవాహనుల కాలంలో ఎలాంటి మత వివాదాలు లేకసమాజం తపోవనం వలె ఉన్న దనుకోవటానికి వీలులేదు. కాకున్న మతాలను పురస్కరించుకొని యుద్ధాలు సాగలేదని చెబితే చెప్పవచ్చును.



అర్థశాస్త్రం కాని, కామసూత్రాలు కాని, సప్తశతి కాని, బృహత్కథగాని నాటిబౌద్ధాచారాలను పేర్కొనటం లేదు. నాటిసమాజ మంతా బౌద్ధ మతావలంబి కాకపోయినా బౌద్ధులు అనల్పంగా ఉండేవారు. వారి ఆచారాలు ఎలా ఉండేవో చెప్పకపోవట మంటే నాటి సాంఘిక చరిత్రలో ఒక ముఖ్యభాగాన్ని విస్మరించటమవుతుంది. అందువల్ల నాటి బౌద్ధుల ఆచారాలు, లక్ష్యాలు స్థూలంగా ఇక్కడ పేర్కొనబడుతున్నవి.

## మహాయానం

మహాయానం రాకముందు బౌద్ధం కేవలం వైరాగ్య ప్రధానంగా ఉండేది. భిక్షుత్వం స్వీకరిస్తే తప్ప నిర్వాణం లభించదని భావించేవారు. మహాయానంతో ఈ దృష్టి సన్నగిల్లింది. గృహి అయినా, భిక్షువైనా ధర్మం అనుష్ఠిస్తే నిర్వాణం లభిస్తుందని మహాయానం బోధించసాగింది. జన్మపరంపర, స్వర్గనరకాలు, దేవతలు లౌకికంగా ఉన్నారని అంగీకరించింది. అయితే ఈ విషయాలలో బౌద్ధులకు, వైదికులకు కొన్ని భేదాలున్నవి.

నిష్ఠాపరులైన బౌద్ధులు రెండే తెగలుగా ఉండేవారు. 1. గృహిబోధిసత్త్వులు. వీరు గృహస్థులుగానే ఉండి, లౌకిక వ్యవహారాలను విడనాడక, పారమార్థిక చింతను కొనసాగిస్తూ ఉండేవారు. 2. ప్రవ్రజితబోధిసత్త్వులు. వీరు సంసారాన్ని పరిత్యజించి భిక్షుత్వం నిర్వహిస్తూ ఉండేవారు.

గృహిబోధిసత్త్వుల ధర్మాలు : అబ్రహ్మచర్యం, అదత్తదానం, ఉత్తర మనుష్యధర్మాలాపం, సురాదిమాదక ద్రవ్యవ్యాపారం, గృహి శ్రమణ భిక్షుదోషకథనం, త్రిరత్న దూషణం, క్షమభిక్షా నిరాకరణం, గృహస్థులైన బౌద్ధులకు నిషిద్ధాలు. అంటే సింద్యాలగు జీవికలను పరిత్యజించి సమ్యగ్జీవనం సాగించాలి. దొంగతనం కూడదు. సురాపానం, ఆసవసేవనం తగదు. అట్టి వస్తువులతో గూడిన వాణిజ్యం గూడ పనికిరాదు. తమకు దివ్యశక్తులు, మహిమలు ఉన్నవని చెప్పుకోరాదు. దానం, శీలం, క్షమ, వీర్యం, ధ్యానం, ప్రజ్ఞ, కరుణ ఎల్లరకు అనుష్ఠేయాలు, కీర్త్య పకీర్తులు, సుఖదుఃఖాలు, నిందాప్రశంసలు వీనియందు సమచిత్తం వహించాలి. చేసిన కర్మకు ఫలం కలుగదని చెప్పరాదు. అతిచారం పరిహరించాలి. పానగోష్ఠులు, రాగద్వేషవర్ధకాలైనవినోదాలను దర్శించరాదు. స్తూపపూజనం, బౌద్ధపవిత్ర గ్రంథపఠనం ఆవశ్యకాలు. ప్రవ్రజ్య (బౌద్ధసన్యాసం) స్వీకరించేవారిని నిరోధించరాదు. రాజ బోధిసత్త్వుల ధర్మాలను రత్నావళి విశదంగా నిర్దేశించింది.

ప్రవ్యజిత బోధిసత్త్వులు :- ఆచార్యుని, ఉపాధ్యాయుని వరించి, వారివలన భిక్షువు కాగోరువాడు ప్రవ్యజ్యోప సంపదలను పొందాలి. అతడు ముండితమస్తకుడై, చేతను పాత్రను ధరించి, పసుపుపచ్చని చీవర మొకటి మొలను ధరించి, మరొకటి కుడిచేతి క్రిందుగా వుండి వల్లెవాటుగా ఎడమభుజంమీదికి వేసుకొని ఫలానివారిని
264 ఉపాధ్యాయులనుగా పడయుటకు అనుమతిని దయచేయవలసినదని భిక్షుసంఘాన్ని అర్థిస్తూ పాత్ర, చీవరాల పావిత్ర్యానికి ఎప్పుడు భంగం వాటిల్లనీ నను మంత్రాలతో ప్రవ్రజ్యను స్వీకరిస్తాడు. నికాయాన్నిబట్టి అతనికి కొత్తపేరు పెడతారు. ప్రతి ప్రవ్యజితబోధి-సత్త్వునికి కల్యాణమిత్రుడు ఉంటాడు. ఈ కల్యాణమిత్రుడు ఆచార్యుడై, ఉపాధ్యాయుడై తత్త్వం తెలుపుతూ అతనిని దుర్గతిపాలు కాకుండా కాపాడుతాడు.

ప్రవ్యజ్యిత బోధిసత్త్వులు బుద్ధులకు చైత్యాలకు నమస్కరించేవారు. వైదిక మతంలో వలెనే వారుకూడ సమంతభద్ర-అజిత-మంజా ఘోషాదిదైవతాలకు సుగంధి జల స్నానాలు, మంగళ తూర్యధ్వనుల తోడి ధూపాది సమర్పణం, దీపపూజ, చైత్యాలకు బుద్ధవిగ్రహాలకు బోధిసత్త్వుల ప్రతిమలకు పూజ కావించేవారు. తరువాత బుద్ధుణ్ణీ, ధర్మాన్నీ, సంఘాన్నీ, తథాగతస్తూపాలను పేర్కొని ప్రణామపూజ కావించేవారు. ఇలాంటి పవిత్ర సందర్భాలలో భిక్షువులకు చీవరాలు, పాత్రలు, ఆహార పదార్థాలు సమర్పించేవారు.

భిక్షువులకు ఈ నమస్కరణ పూజనలే కాక శరణ గమనం, పాపదేశనం, పుణ్యానుమోదనం, బుద్ధాధ్యేషణ, బోధపరిణామనం అన్నవి కూడ విహితాలు. అంటే భిక్షువు తను చేసిన పాపాన్ని కల్యాణ మిత్రునకు చెప్పి పశ్చాత్తాపం పొందాలి. ఇతరులు చేసినపుణ్య కార్యాలను పేర్కొని ప్రశంసించాలి. అజ్ఞానులైన సర్వజీవులకు మార్గం జూపి

జి.వి. కృష్ణరావు

కాపాడవలెనని బుద్ధులను ప్రార్థించాలి. బోధి సిద్ధికై భిక్షువు తను కావించిన పుణ్యం లోకానికి సమర్పించాలి. ఈ విషయాన్ని నాగార్జునుని చతుస్తవంలోని స్తవాంతశ్లోకాలు వ్యక్తం చేస్తున్నవి.

ప్రవ్రజ్యకు స్త్రీ పురుషులంతా అధికారులే. నాటి భిక్షువులలో అనేక శాఖలవారుండే వారు. 1. వైయాత్యభిక్షువులు. వీరు భిక్షుసంఘాలను సేవించే బాధ్యతను వహించేవారు. 2. ఆరణ్యక భిక్షువులు. భిక్షాటనానికి అనుకూలురు. మధుర జల సంపన్నాలు, సుపుష్పఫలాలు, క్రూర మృగ వర్జితాలు, ప్రశాంత గుహా కలితాలు అయిన అరణ్యప్రదేశాలలో నివసించేవారు. 3. అభ్యవకాశిక భిక్షువులు. కుటీరాదులు వర్జించి ఆచ్ఛాదనలేని ప్రదేశాలలో నివసించేవారు. 4. పిండచారికులు. భిక్షాటన చేస్తూ దేశసంచారం కావించేవారు. 5. యోగాచారులు. యోగమభ్యసిస్తూ ఉండేవారు. 6. బాహుశ్రుత్యులు. విశేషజ్ఞాన సముపార్జన పరులుగా ఉండేవారు. 7. ధర్మకథకులు. ప్రజలకు ధర్మం బోధిస్తూ ఉండేవారు.

భిక్షువుల నియమాలు :- భిక్షువు ముండియై పసుపుపచ్చని చీవరాలు ధరించాలి అతడెట్టి దోషియైనా గృహస్థులకు అభినంద్యుడు. రాజులకు అదండ్యుడు. భిక్షువు గురువకు గౌరవిస్తూ తన వర్తనంతో సంఘానికి సంతృప్తిని కలిగించాలి. అతనికి మూడు చీవరాలు, ఒక పాత్ర వీనికి మించి మరొక వస్తువు అనేది వుండరాదు -వీనిని మాత్రం అతడు ఎవ్వరికీ ఇవ్వరాదు. భిక్షకు బయలు దేరినప్పుడు అనుచిత స్థలాలు, వినోదదృశ్యాలు, అసంతోషకర దృశ్యాలు పరిహరించి, కాడిమేరకంటె ఎక్కువ దూరం చూపు ప్రసరింపనీయక, ఎదుటపడిన వారి కందిరికీ శుభం ఆకాంక్షిస్తూ పోయి పదియిళ్లవద్ద మాత్రమే భిక్షాటనం చేయాలి. నిరంతర ధారాపాతంగా వర్షం కురుస్తున్నప్పుడు రెండు మూడు రోజులవరకు భిక్షాటనం మానాలి. 

లభించిన భిక్షలో ఒకపాలు తోడిభిక్షువులకు, రెండుపాళ్లు నిఱుపేదలు మున్నైన వారికి, మిగిలిన నాలుగవపాలు తనకోసం వినియోగించాలి. భిక్ష అధికంగా లభిస్తేమితం తప్పి భుజింపక, మిగిలన దానిని కొండమీద జంతువులకోసం విడిచిపెట్టాలి. ఏ కుటుంబమైనా భిక్షకు పిలిచి అపవిత్రాహారము పెట్టినప్పుడు, మాటాడక లేచి రావలెనే కాని వడ్డించిన పదార్థాలను గూర్చి వ్యాఖ్యానించరాదు.

ఎలాంటి రోగానికి పాల్పడినా, ఏ పరిస్థితులలోనైనా భిక్షువు మత్స్యమాంసాదులు భుజించరాదు. దేశకాలలో తెలిసి తన నడవడిని నలుగురికీ మెచ్చొదవించేరీతిగా మలుచుకోవాలి. ధర్మం వినాలన్నా, గురువును సందర్శించాలన్నా, మందుమాకులు తెచ్చుకోవాలన్నా అతడు సాయంతనవేళ మాత్రమే గ్రామానికి పోవాలి.

ఇంకా నాటి వ్రాత కోతల సంగతి చూడవలసి ఉంది. నాగార్జునుని కాలంలో వైదికమతానుయాయులే కాక బౌద్ధులు కూడ శాస్త్రగ్రంధాలను సంస్కృతంలో వ్రాసేవారు. అప్పటివరకు శాస్త్ర విషయాలను సూత్రబద్ధం కావించేవారు. వాని అర్థాలను సుబోధం చేయటానికి భాష్యాలు వ్రాసేవారు. నాగార్జునుడు శాస్త్రరచనలో కొత్త పద్ధతి ప్రవేశపెట్టాడు. సూత్రపద్ధతిలోని లాఘవం, బాష్య పద్ధతిలోని విస్పష్టత కలిసి వచ్చేటట్లుగా కారికారచనం ప్రారంభించాడు. వాటి విచారధారలో వ్యక్తి ద్వేషాలకు, దూషణలకు అణుమాత్రం కూడ తావులేదు. పరపక్షాలను జాగ్రత్తగా అనువదించి యుక్తి యుక్తంగా ఖండించేవారు. ఇందుకు మూల్మమాధ్యమక కారికలు, విగ్రహవ్యావర్తని, న్యాయసూత్రాలు, న్యాయభాష్యం తార్కాణాలు. ఈ విషయంలో ఆధునిక యుగం ఆనాటివారినుంచి చాలా నేర్చుకోవాలి. నాటి కావ్యాలు, గాథలు, శాసనాలు ప్రాకృతంలో ఉండేవి. గుణాఢ్యుడు బృహత్కథను పైశాచికంలో వ్రాశాడు.

## సంస్కృతిభావాలు

తరుచుగా సమావేశాలు, గోష్ఠులు జరుగుతుండేవని ఆనాటిపండుగలు, పబ్బాలు చాటుతున్నవి. ఆనాడు అద్వైకి పైగా స్వతంత్రాలైన దర్శనాలుండేవి. నాటి సంస్కృతిని అర్థం చేసుకోవాలంటే వాటి పరిశీలనం ఆవశ్యకం. అయినా ఇక్కడ వాటిని పేర్కొనటానికి అవకాశం లేదు.

మొత్తం మీద నాగార్జునునికాలంలో శిక్షలు ఘోరంగా ఉన్నా, రాజకీయస్వాతంత్ర్యం లేకపోయినా, ప్రజలు అర్థవంతమైన జీవితం సాగించి, శాస్త్రసాహిత్యాలలో శిల్పాదికళలలో ఉన్నత శిఖరాలు అందుకున్నారు.

(1-8-1965 '' ఆంధ్రప్రభ'' ఆదివారం సంచిక)